# నూరేళ్ళ తెలుగునాడు

(1857 నుండి 1956 వరకు)

(1982 అక్టోబరు నుండి 1983 సెప్టెంబరు వరకు
జరిగిన సారస్వత వేదిక ఉపన్యాసవ్యాసాల సంకలనం)

సంపాదకుడు :
కె. కె. రంగనాథాచార్యులు



ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాద్

ప్రథమ ముద్రణ : 1984

ప్రతులు : 1000

వెల : 12 రూపాయలు

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదరగూడ, హైదరాబాదు-500 001.

ఇంతకు ముందు సాంస్కృతిక సంపుటాల్లాగే ఈ సంపుటాన్ని కూడా పాఠకులు సహృదయంతో ఆదరిస్తారని ఆశిస్తూ....

భవదీయుడు
**కె. కె. రంగనాథాచార్యులు**
సంచాలకుడు, సాంస్కృతిక వేదిక,
కార్యదర్శి
ఆంధ్ర సాంస్కృతిక పరిషత్తు.

# ఇందులో . . .

# ఇందులోని రచయితలు

**కె. కె. రంగనాథాచార్యులు** — ఎమ్.ఏ. (సంస్కృతం), ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (లింగ్విస్టిక్స్), పిహెచ్.డి. (లింగ్విస్టిక్స్). ప్రిన్సిపాల్, ఆంధ్ర సారస్వత పరిషత్తు ఓరియంటల్ కళాశాల, హైదరాబాదు; కార్యదర్శి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

**ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావు** — హైదరాబాదు విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్రంలో ఆచార్యులుగా, స్కూల్ ఆఫ్ సోషల్ సైన్సెస్‌కి డీన్‌గా ఉన్నారు. మంచి వక్త. దేశంలోని సామాజికశాస్త్ర రంగంలోని ప్రముఖులలో ఒకరు.

**చుండి జగన్నాథం**— కీర్తిశేషులు. అనేక రాజకీయోద్యమాలలో పాల్గొన్నవారుగా ప్రసిద్ధులు. సోషలిస్టు, సంస్కర్త. చాలాకాలం కేంద్ర ఖాదీబోర్డు సభ్యులుగా ఉన్నారు.

**ఏటుకూరి ప్రసాద్** — ఎమ్.ఏ., పిహెచ్.డి. (తెలుగు). హైదరాబాదులోని సింహాడియా డిగ్రీ కళాశాలలో లెక్చరర్. అభ్యుదయ రచయితల సంఘం ప్రముఖ కార్యకర్త.

**కేతవరపు రామకోటిశాస్త్రి** — వరంగల్లు కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఆచార్యులు, తెలుగుశాఖాధ్యక్షులు. ప్రముఖ పరిశోధకులు.

**చేకూరి రామారావు** — ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషాశాస్త్ర శాఖలో ఆచార్యులు. ప్రఖ్యాత విమర్శకులు.

**డి. రామలింగం** — కేంద్ర సమాచార శాఖలో, సెక్రటేరియట్‌లో పనిచేసి పదవీ విరమణ చేశారు. రచయిత, విమర్శకులు.

**యం. సుధ** — అనంతపురం సత్యసాయిబాబా మహిళా కళాశాలలో చరిత్రాధ్యాపకురాలు.

సంపాదకీయ వ్యాసం

# నూరేళ్ల తెలుగునాడు

కె. కె. రంగనాథాచార్యులు

1857 నుంచి నూరు సంవత్సరాలకాలం భారతదేశ చరిత్రలో, అందులో భాగంగా తెలుగువారి చరిత్రలో చాలా ముఖ్యమైన కాలం. 1857కు ముందు రెండు శతాబ్దాల కాలంలో దేశంలో విదేశీయుల ప్రవేశం, 1757 తరువాత ఈస్టిండియా కంపెనీ దేశంలోని వివిధ ప్రాంతాలపైన క్రమంగా రాజకీయాధికారాన్ని సంపాదించటం, బ్రిటిష్‌వారి వలస ఆర్థిక విధానంవల్ల 1857 తరువాత దేశరాజకీయ, సామాజిక సాంస్కృతిక రంగాలలో చాలా మార్పులు రావటం జరిగాయి. జాతి, దేశభక్తి, జాతీయత అన్న భావాలు ఈ కాలంలోనే మన ఆలోచనా విధానంలో చోటు చేసుకున్నాయి. ఒక పద్ధతిలోకాక పోయినా చాలా మంది అనుకుంటున్న ఆధునికత ఒక రూపాన్ని తీసుకున్నకాలం ఇది. ప్రస్తుతం మన దేశ రాజకీయ, సామాజిక స్వరూప స్వభావాలను నిర్ణయించిన చరిత్ర ఈ నూరేళ్లలో మనకు కనిపిస్తుంది. ప్రస్తుత సామాజిక జీవితంలోని వైరుధ్యాలు ఈ కాలంలోనే ప్రతిఫలించాయి. వర్తమానాన్ని అర్థం చేసుకోవటానికి కీలకంగా ఉపయోగించే చరిత్ర ఈనాటిది. ఈ రోజు మనం చూస్తున్న చాలా మంది ఉద్యమ నాయకులు బయటకు రావటానికి ప్రేరకమైన పరిస్థితులు ఈ నూరేళ్ల చరిత్రలో ప్రోత్సాహం వహించాయి. ఈ కాలపు చారిత్రక స్థితిగతులను అధ్యయనం చేయటం కేవలం గతాన్ని కీర్తించటానికి, ప్రేరణ పొందటానికి మాత్రమే కాదు, గుణపాఠాలను నేర్చుకోవటానికి, గతంతో పోల్చి వర్తమానాన్ని అవగాహన చేసుకోవటానికి, భవిష్యత్తును తీర్చిదిద్దుకోవటానికి కూడా అది ఉపయోగించాలి.

దేశచరిత్ర అంటే కొందరి వ్యక్తుల మహానుభావుల చరిత్రగా మాత్రమే ఇంతా మనం అధ్యయనం చేస్తున్నాం. వ్యక్తులను, మహానుభావులను కారణజన్ములుగా భావించటం జరుగుతున్నది. చరిత్రలో జరుగుతున్న ప్రతి మార్పు

కొందరి మెదళ్ళలో మెదలిన లేక ఒకసారి పుట్టిన ఉదాత్త భావసంపదవల్ల జరుగుతుందన్న విశ్వాసం చాలా మందిలో ఉంది. ప్రతి యుగంలోను కొందరు మహానుభావులు జన్మిస్తారు. వారి బుర్రలలో కొన్ని అతీతశక్తులవల్ల కొత్త ఆలోచనలు ప్రవేశిస్తాయి. మానవ సమాజంపై వారికి గలిగిన కరుణా భావంతో వారు సమాజాన్ని మార్చటానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రేరక పరిణామానికి కారకులు అవుతారు. సమాజంలో జరిగే ఏ మార్పులకైనా కొందరు మహాపురుషులు, చదువుకున్న వారు మాత్రమే బాధ్యత వహిస్తారు. చరిత్రలో ప్రధాన ఘట్టాలను సృష్టిస్తారు: ఇదీ చరిత్రను గురించి చాలా మందికి ఉన్న అవగాహన. కాని మహానుభావులుగాని, వారి బుర్రలలోని ఆలోచనలుగాని ఆర్థికపరిస్థితులతో, సామాజిక వాస్తవంతో సంబంధం లేకుండా ఆకాశంనుంచి ఊడి పడరు, ఊడిపడవు. ఏ దేశచరిత్ర అయినా కొందరు వ్యక్తుల, పాలకుల, చదువుకున్నవారి చరిత్ర మాత్రమేకాదు, వస్తూత్పత్తి క్రమంలో ఆర్థిక పరిస్థితులు ఆధారంగాగల సంఘ, వర్గ, జాతి ప్రజాసమూహాల చరిత్ర, వైరుధ్యాల చరిత్ర. దేశ ఆర్థిక వ్యవస్థలో వచ్చిన మార్పులు రాజకీయ, సాంఘిక వ్యవస్థలో మార్పులకి, అవి ప్రతిఫలించే సాహిత్య సాంస్కృతిక రంగాలలో మార్పులకి కారణమవుతాయి. కొందరు వ్యక్తుల జీవితంలో భాగంగా, వారు సాధించిన అంశాలుగా, విజయాలుగా కొన్నిటిని మనం పేర్కొంటున్నా, సమకాలీన ఆర్థిక, సమాజిక పరిస్థితుల పరిణామంగా, ప్రతిఫలనంగా మాత్రమే దాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది.

ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న నూటేళ్లచరిత్ర వలస దేశంగా భారతదేశ చరిత్రలోని రెండవ ఘట్టం వలసవాదంబలపడుతూ, ప్రతిఘటనను కూడా ఎదుర్కొంటున్నకాలం. వర్తకులుగా ప్రవేశించి భారతదేశాన్ని తమ ఆర్థిక వలసగా చేసుకోవటంలో బ్రిటిషువారికి, భారతీయులకు ఆర్థిక పరమైన వైరుధ్యం ఏర్పడింది. బ్రిటన్‌లో అభివృద్ధి చెందుతున్న పారిశ్రామిక వేత్తలకు, భారత దేశంలో తమ వ్యాపారాన్ని పెంచుకుంటున్న ఈస్టిండియా కంపెనీవారికి మధ్యగల వైరుధ్యంవల్ల దేశంలో ప్రత్యక్ష బ్రిటిష్ పాలన ఏర్పడటంతో వలసవాదం బలాన్ని పుంజుకుంది. బ్రిటిష్ పారిశ్రామికుల పెట్టుబడిపైన ఆధారపడిన బ్రిటిష పాలనకు, అప్పుడే మొదలవుతున్న స్థానిక పారిశ్రామికులు, విద్యావంతులు, మధ్యతరగతి వారికి మధ్యగల వైరుధ్యం జాతీయవాదా పరిణామానికి దారి తీసింది. సుమారు క్రీ. శ. 1860 వరకు భారతదేశ ఉత్పత్తులను, వస్తువులను ప్రపంచ

దేశంలో అమ్మి లాభంగడించటంగా ప్రారంభమైన వలసవాదం, భారతదేశాన్ని తమ పారిశ్రామిక ఉత్పత్తులకు మార్కెట్‌గా చేసుకోవటంతో మన రాజకీయ, సాంఘిక రంగాలలో వచ్చిన మార్పులను గుర్తించవలసి ఉంటుంది. బ్రిటిష్ పాలనలో కొందరు మేధావులతో ప్రారంభమైందని అంటున్న సంఘసంస్కరణోద్యమాలకు మాత్రమే ప్రాధాన్యం ఉన్నదనుకుంటే, దేశం ఆధునికత్వపు దిశగా పరివర్తనచెందటం బ్రిటిష్‌వారి ఆర్థిక దోపిడీ బలపడుతూ ఉండటంవల్లనే అని దీనివల్ల అవగాహన అవుతుంది. వలస పాలన ప్రాంతీయ, దేశీయభాషలను నేర్చుకోవటం, అధ్యయనంచేయటం, ప్రోత్సహించటం దగ్గరనుంచి, తమ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టటం అనేదాకా మార్పుచెందటం యాదృచ్ఛికం కాదనికూడా తెలుస్తుంది.

సాహిత్య, నైతిక రంగాలలో వచ్చిన సంస్కరణలను, ఆర్థికరంగంలో, దాన్ని అనుసరించి రాజకీయరంగంలో వచ్చిన మార్పులతో ముడిపెట్టకుండా అర్థం చేసుకోలేము. నేడు బెంగాల్ ఆలోచించినదాన్ని మర్నాడు తక్కిన భారత దేశం ఆలోచిస్తుందని ఒకప్పుడు వాడుకలోకి వచ్చిన మాటను 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధంతో ఈస్టిండియా కంపెనీ తన ఆర్థిక ప్రయోజనాలను బలపరచుకోవటంకోసం, తమ వ్యాపార ప్రయోజనాలకోసం బెంగాల్ ఆక్రమణతో ప్రారంభించి ఆ తరువాత క్రమంగా భారతదేశాన్నంతా తమ అధీనంలోకి తెచ్చుకోవటంతో సమన్వయించకుండా కొందరు మహానుభావుల మాత్రమే దానికి నిర్ణాయక శక్తిగా నిరూపించలేం. బెంగాల్ తరువాత తెలుగుదేశంలో మార్పులు రావటం, తెలుగుదేశ ప్రాంతంలో సంఘ సంస్కరణోద్యమాలు బయలుదేరటం బెంగాల్‌లో తమకు లభించిన రాజకీయాధికారంతో ఈ ప్రాంతంలో కూడా తమ ఆధిపత్యాన్ని విస్తరించుకోవటంవల్ల వచ్చిన ప్రతిస్పందన మాత్రమే. తూర్పు పశ్చిమ తీర ప్రాంతాలలో మార్పులు వచ్చినంతగా భారతదేశం మధ్యభాగంలో రాకపోవటానికి కారణం బ్రిటిష్‌వారి వ్యాపార సంబంధాలు, ప్రయోజనాలు మొదటినుంచీ ఎక్కువగా తీరప్రాంతాలతో ముడిపడి ఉండటమే. తమ ప్రయోజనాలకోసం బ్రిటిష్ వలసవాదం ఈ దేశంలో ఆధునిక సాధనాలను, యంత్ర పరిశ్రమలను ప్రవేశపెట్టటానికి కారణం అవుతూకూడా, భూస్వాములతో, సంస్థానాధిపతులతో సమాధానపడి వాళ్ళ కనుకూలమైన విధానాలను అవలంబించటం వల్లనే పెట్టుబడి

దారీ, భూస్వామ్య సంస్కృతుల కలయికగా మన సంస్కృతి ఈ రోజుకీ ఈ దేశంలో కొనసాగుతున్నది.

సమకాలీన రాజకీయ, సామాజిక రంగాలలోని వైరుధ్యాలను, అస్తవ్యస్త స్థితికి కారణాలను కూడా ఈ మూలాల్లోనే మనం చూడవచ్చు. మత కుల తత్వాలు ఈ రోజు ఇంత భయంకరంగా విజృంభించటానికి బీజాలు ఇక్కడే ఉన్నాయి. బ్రిటిష్ పాలకులు తమ ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా మాత్రమే ఈ దేశాన్ని పాలించారు. వారి కాలంలో దేశంలో జరిగిన నామమాత్రపు అభివృద్ధి ఏదైనా ఉంటే అది చాలా అసమానంగా జరిగింది. ఆర్థికంగా దేశం చితికి పోయింది. సమాజంలో భిన్న జాతులు, భిన్నమత వర్గాలు ఉన్నప్పుడు, పరిమిత ఆర్థిక వనరులతో వాటన్నిటికీ సమానంగా అభివృద్ధి చెందే అవకాశం లేనప్పుడు మత, కులతత్వాలు బలపడతాయి. పరిమిత అవకాశాలను చేజిక్కించు కోవటానికి ఆ మత, కులవర్గాలు సంఘర్షిస్తాయి. ఆర్థికంగా అన్ని మత, కుల వర్గాలకు సమాన ప్రయోజనాలు ఉంటాయి. కాని ఆర్థిక వనరులు, పరిస్థితులు పరిమితంగా ఉండి అవకాశాలు తక్కువగా ఉన్నప్పుడు కుల, మతవర్గాలు తమ ప్రయోజనాలకు అనుగుణంగా ప్రవర్తిస్తాయి. ఆ కాలంలో మన పాలకుల ఆర్థిక ప్రయోజనాల కనుగుణంగా జరిగిన అసమ అభివృద్ధి కారణంగా ఆర్థిక వనరుల పరిమితి ఏర్పడింది. మొదటినుంచీ భారతదేశంలో సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థలో భాగంగా మతభేదాలు, కులభేదాలు ఉన్నా అవి మత, కుల తత్వరూపంగా ఆధునిక కాలంలోనే తీవ్రరూపాన్ని ధరించాయి.

ఒక సామాజిక వ్యవస్థ నిర్మాణం ఆ సమాజ అదనపు ఉత్పత్తి, దాన్ని పంచుకునే వర్గాలపైన ఆధారపడి ఉంటుంది. చారిత్రకంగా పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించిన వర్గ నిర్మాణానికి అనుకూలమైన పరిస్థితులు బ్రిటన్‌లో కనిపిస్తాయి. అవసరమైన వనరులు, పెట్టుబడి దానికి వలస దేశాలనుంచి లభించింది. వలస పెట్టుబడితో, తక్కువ రేటు శ్రమతో, శక్తితో అక్కడ పరిశ్రమలు విజృంభించి అధిక లాభాలు, మరింత పెట్టుబడిని సమకూర్చి పెట్టాయి. వలస దేశాలే వారి పారిశ్రామిక ఉత్పత్తులకు మార్కెట్లు అయ్యాయి. వలసదేశంగా భారతదేశంలో దీనికి భిన్నమైన పరిస్థితులున్నాయి. తక్కువ రేటుకు శ్రమ విలువైన ముడి పదార్థాలను అందజేసి, విదేశీయ ఉత్పత్తులను కొనుక్కొనే దేశంగా మాత్రమే

భారతదేశం ఈ కాలంలో కనిపిస్తుంది. బ్రిటన్‌కి పెట్టుబడులు సమకూర్చే దేశంగా మాత్రమే ఈ దేశం మిగిలిపోయింది. తమ దేశాలలో జరిగిన ఆర్థిక రంగంలో మార్పులు, అభివృద్ధి కారణంగా యూరప్‌దేశాలు భూస్వామ్యదశను, బహుళజాతి, సాంస్కృతిక పరిస్థితులను అధిగమించి జాతులుగా నిలదొక్కుకోగలిగాయని చారిత్రకుల అభిప్రాయం. కేంద్రీకృతమైన బ్రిటిష్ పాలనలో ఏ మాత్రం అభివృద్ధి చెందని ఆర్థిక వ్యవస్థలో భారతదేశం ఈ పరిస్థితిని అధిగమించలేక పోయింది. 19 వ శతాబ్ది మధ్యకాలానికి కూడా స్పష్టమైన జీవన విధానాన్ని నిర్దేశించే ఆర్థిక వర్గాలు భారతదేశంలో లేవు. బ్రిటిష్ పాలనలో పెట్టుబడిదారీ విధానం పరిమిత పరిధిలో ప్రవేశిస్తున్నా సాంప్రదాయిక భావజాలం, చైతన్యమే విభిన్న వర్గాలకు ఆలంబనం అయింది. సాంప్రదాయిక మత దృక్పథం స్థానాన్ని ఆధునిక లౌకికతా భావం పూర్తిగా ఆక్రమించే అవకాశం, నూతన భావజాలం, లౌకిక దృక్పథం ఈ దేశంలో కనిపించదు. దానికి కారణం ఆర్థిక రంగంలో విప్లవాత్మకమైన మార్పులు ఒక రూపంలో రాకపోవటమే. ఇక్కడ మతంతో, పునరుద్ధరణ భావాలతో ముడిపడిన జాతీయభావన ఏర్పడటానికి కారణం వలస ఆర్థిక వ్యవస్థ. దేశంలో వచ్చిన మత సంస్కరణలకు, సంప్రదాయ వ్యతిరేకతకు ఆంగ్లేయులే కారణమన్న భావన ఇక్కడ సర్వసమానమైన సామాజిక పరిణామంగా ఆధునిక లౌకిక భావధోరణి ఏర్పడకుండా ఉండటానికి కారణమైంది. లౌకిక దృక్పథం పాశ్చాత్యం, విదేశీయం అన్న భావన ఆధునికతనంతా వ్యతిరేకించే సంప్రదాయ వర్గం బలపడటానికి కూడా దారితీసింది.

సంప్రదాయవాదం బలపడటానికి కారణం కొత్త ఆర్థిక వ్యవస్థ నిర్మాణం కాకుండానే అంతవరకు భారత ఆర్థిక, సామాజిక వ్యవస్థకు ఆధారభూతమైన గ్రామీణ వ్యవస్థ బ్రిటిష్ పాలనలో శిథిలం కావటం. అంతకుముందు సామ్రాజ్యాలు మారినా, రాచరికాలు మారినా, విదేశీయుల దండయాత్రలు వచ్చినా గ్రామీణ వ్యవస్థపైన వాటి ప్రభావం అంతగా లేదు. అఫ్ఘన్, ఇరాన్, టర్కీ మొదలైన వారి పరిపాలనా కాలంలో కూడా గ్రామీణ వ్యవస్థ చెక్కు చెదరలేదు. తొలిదశలో కొందరు తప్ప వారు ఈ దేశాన్నే తమ దేశంగా పాలించారు. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో మతంతో సంబంధం లేకుండా మొఘల్ వంశానికి చెందిన బహదూర్ షాను తమ చక్రవర్తిగా ప్రకటించటానికి కూడా కారణం అదే. బ్రిటిష్ వారు తమ ఆర్థిక ప్రయోజనాల కోసం గ్రామీణ

వ్యవస్థలోకి కూడా చొచ్చుకుపోయారు. దానివల్ల సంప్రదాయ జీవన విధానం ఛిన్నాభిన్నమైంది. ఈ పరిస్థితి ఈ దేశంలో వచ్చిన ఆర్థిక, సాంఘిక పరిణామంలో భాగంగా కాకుండా బ్రిటిషు పాలనలో రావటంవల్ల దాన్ని మన మత విశ్వాసాలకు భంగకరమైన పరిణామంగా భారతీయులు చాలామంది భావించటానికి అవకాశం కలిగి ఉంటుంది. ఈ పరిణామంవల్ల భూస్వామ్య వ్యవస్థనాటి సాంఘిక సంబంధాలు, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ దెబ్బతిన్నాయి. కాని నూతన సాంఘిక వ్యవస్థ నిర్మించే ప్రయత్నం, దానికి అనుగుణమైన ఆర్థిక విధానాన్ని అనుసరించటం వలన పాలకులుచేసే అవకాశం లేదు. ఈ పరిస్థితుల ప్రతిఫలనమే విశ్వనాథ సత్యనారాయణ 'వేయి పడగలు' నవలలో కనిపిస్తుంది.

భిన్న దేశాల్లో ఆయా ప్రకృతి భౌగోళిక పరిస్థితులు ఆర్థిక చరిత్ర ఆధారంగా భిన్న పద్ధతుల్లో మార్పులు వస్తాయి. మన దేశంలోని పూర్వ వ్యవస్థతో సంఘర్షించటంగా ప్రపంచదేశాలు చాలావాటిలో ఆధునికతా చరిత్ర ప్రారంభమవుతుంది. ఆధునికతా పరిణామ విషయంలో పశ్చిమ యూరప్ దేశాలకు భేదం కనిపిస్తుంది. యూరప్ దేశాలకు ఆసియాదేశాలకు మరింత భేదం కనిపిస్తుంది. పశ్చిమ యూరప్ దేశాలలోని పరిణామాలు కూడా బ్రిటన్, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సులలో భిన్న భిన్నంగా కనిపిస్తాయి. 18 వ శతాబ్దంలో బ్రిటన్‌లోని పారిశ్రామిక విప్లవం ఉత్పత్తి శక్తులలో మార్పులను తెచ్చి అక్కడ నూతన వర్గాలు ఏర్పడటానికి కారణం అయింది. ఫ్రాన్స్‌లో వచ్చిన రాజకీయ విప్లవం ఫ్రెంచివారు ఒక జాతిగా నిలబడి జాతీయత అభివృద్ధి చెందటానికి కారణం అయింది. ఆ దేశాలలో పాత శక్తులను ఓడించి కొత్త శక్తులు అధికారాన్ని సంపాదించాయి. పశ్చిమ యూరప్‌లోని పారిశ్రామిక, రాజకీయ, సాంఘిక విప్లవాలు. ముఖ్యంగా ఫ్రెంచి విప్లవం రాజ్యాంగంపైనా, ప్రజలపైన మతం ప్రభావాన్ని బద్దలు చేసింది. తత్ఫలితంగా లౌకిక రాజ్యాలుగా, లౌకిక సమాజాలుగా ఆదేశాలు రూపొందాయి. భారతదేశంలో ఇలాంటి మార్పులు ఒక రాజకీయ శక్తిగా కాక ఉపరితల సంస్కరణలుగా ప్రవేశించాయి. ఈ దేశంలో మొదటితరపు సంస్కర్తలు నిరీశ్వర వాదులు కాకపోయినా మతపరమైన ప్రాధాన్యాన్ని వ్యతిరేకించారు. తరువాత తరం సంస్కర్తలలో కొందరు అజ్ఞేయవాదులు (agnosticists) కూడా.

ప్రపంచంలోని పెట్టుబడిదారీ దేశాలలోని పెట్టుబడిదారీ విధానం ముందున్న ఆర్థిక సాంఘిక వ్యవస్థను బద్దలు కొడుతుంది. ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ

భూస్వామ్య వ్యవస్థలోని పరిమితులను ఛేదిస్తుంది. పల్లెలనుంచి ప్రజలను పారి శ్రామిక కేంద్రాలవైపు సమీకరింపజేస్తుంది. గ్రామాలను పట్టణాలను కలుపుతుంది. ఈ విధానంలోనే జాతులనే భావానికి ప్రాతినిధ్యం వహించి, జాతీయ భావనను పెంచే మధ్య తరగతి వర్గం తల ఎత్తుతుంది. అది సమాజాన్ని ఆధునికీకరిస్తుంది. పశ్చిమ యూరప్‌లో జరిగిన పరిణామాలనెంత భిన్నమైన పరిస్థితులు భారతదేశంలో ఉన్నాయి. ఈ దేశంలోనే ఒక వ్యవస్థకు, వర్గానికి వ్యతిరేకంగా పోరాడివచ్చిన అంశాలు ఇక్కడలేవు. పాలకవర్గాలు మారటం, పాలనా విధానం మారటం, సామాజిక వ్యవస్థలో మార్పును తీసుకొనివచ్చిన విప్లవాలు భారత దేశంలో లేవు. ఈ దేశంలో గ్రామీణ వ్యవస్థమీద ఏర్పడిన సాంప్రదాయక ఆర్థిక, సామాజిక వ్యవస్థను శిథిలం చేసింది స్థానికమైన వర్తక, పెట్టుబడిదారీ వర్గాలు కావు. పోర్చుగీసు, డచ్, ఫ్రెంచి, బ్రిటిష్ వాణిజ్య వర్గాలవారు, వలసపాలన. భారతదేశంలో భూస్వామ్యవర్గాలను తమ చెప్పుచేతలలోకి తెచ్చుకొని తమ ప్రయోజనాలకు అనువైన ఆర్థిక వ్యవస్థను రూపొందించారు. భారతదేశంలో కేంద్రీకృత పాలనాధికారాన్ని రూపొందించి భౌగోళికంగా దేశాన్ని ఏకంచేశారు. ఆధునిక భారతదేశచరిత్రలో వచ్చిన ముఖ్యమైన పోరాటం విదేశీయులకు, వలసపాలనకు వ్యతిరేకంగా వచ్చిన పోరాటం. అందుకే 1857 తిరుగుబాటు మొదలుకొని అన్నిరకాల ఉద్యమాలలో జమీందారులు, సంస్థానాధీశ్వరులతో పాటు, చదువుకున్న మధ్యతరగతి వర్గం, రైతాంగంకూడా పాల్గొన్నారు. యూరోపులో తప్ప ఆసియా దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేకత జాతీయతా భావానికి దోహదంచేసింది. సమాజాన్ని ఆధునీకరించటానికి దోహదంచేసిన ఆర్థిక విప్లవాలు ఇక్కడ బలంగాలేవు. పెట్టుబడిదారీ విధానం అనంతరదశలో భూస్వామ్య విధానంలోని కొన్ని అంశాలతో అవసరమైతే రాజీకూడా పడుతుంది. మన దేశంలో బ్రిటిషుపాలన, వలస ఆర్థిక విధానం ఈ కర్తవ్యాన్ని అతిభయంకరంగా నిర్వహించింది.

ఉత్పత్తిశక్తులు, ఆర్థిక సంబంధాలు సమాజ స్వరూపాన్ని, రాజకీయ స్వరూపాన్ని నిర్ణయిస్తాయి. అవి మానవ సంబంధాలను, విలువలను, నీతులను నిర్దేశిస్తాయి. వాటివ్యక్తరూపమే మానవ ప్రవర్తనలు; సమాజంలో మానవ సంబంధాలు. సాహిత్య, సాంస్కృతికరంగాలు వాటినే ప్రతిబింబిస్తాయి. కాబట్టి ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో జరిగిన పరిశోధనలనే మొదిసరుకులు ఆధారంగా

కళా, సాంస్కృతిక రంగాలలో ఏర్పడిన మార్పులను సూచించి, వాటిని సమ న్వయించినప్పుడు దేశంలోని సామాజిక పరిణామం బోధపడుతుంది.

భారతదేశంలోని సామాజిక పరివర్తనలో ఆధునికతా, జాతీయతా పరిణా మానికి కింది స్థాయిలో జరిగే ఉద్యమాలు, ముఖ్యంగా గిరిజనుల, ఆదివాసుల, రైతాంగాలపాత్ర, వారిపోరాటాలపాత్ర తప్పనిసరిగా ఉంటుందని, ఆ దృష్టితో కూడా ఆధునిక చరిత్రను పరిశీలించవలసి ఉంటుందన్న అభిప్రాయాన్ని కొందరు చారిత్రకులు వెలుబుచ్చుతున్నారు. ఆదివాసులు, గిరిజనుల పోరాటాలు, రైతుల వన్నుల వ్యతిరేక ఉద్యమాలు పాలకవర్గం విధానాలను నిర్దేశిస్తాయి. భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో బ్రిటిష్‌పాలన జమీందారీశిస్తు వసూలు విధానం స్థానంలో, రైత్వారీవిధానాన్ని ప్రవేశపెట్టటానికి కారణమైన రైతాంగ పోరాటాలు, దానిఫలి తంగా విధానాలలో మార్పులవల్ల దేశఆర్థిక, పాలనా రంగంపైన కలిగే ప్రభావం-వీటిని సంపదించి సామాజిక పరిణామాన్ని పరిశీలించవలసి ఉంటుదన్నమాట. కిందిస్థాయిలోని అంటే ఉత్పాదక వర్గం స్థాయిలోని ఉద్యమాలు ఒత్తిడివల్ల ఆర్థిక పాలనా విధానాలలో వచ్చే మార్పులు పైస్థాయిలోని సామాజిక పరివర్తనకు ముఖ్యంగా ఆధునికత, జాతీయతల పరిణామానికి కారణమవుతాయి. దేశ ఆధునిక చరిత్రను ఈ దృష్టితో పరిశీలించకపోతే అది పాక్షికమైన, అసమగ్రమైన అధ్య యనం అవుతుంది. ఇటువంటి అధ్యయనంవల్ల దేశంలో పైస్థాయిలో జరిగే పరి ణామాలపైన, కింది స్థాయిలో జరిగే పరిణామాల ప్రభావం స్పష్టమవుతుంది. చరిత్ర పైస్థాయిలోని కొందరు మేధావుల సృష్టి మాత్రమే కాదన్న విషయం స్పష్టపడుతుంది. ఈ పద్ధతిలో పరిశోధనలు ఇంకా జరుగవలసి ఉంది.

## వలస ఆర్థిక వ్యవస్థ

భారత దేశంలో యూరప్ వర్తక స్థావరాలు ఏర్పడటం ప్రపంచ ఆర్థిక చరిత్రలో గొప్పమార్పులు తెచ్చిందని చారిత్రకుల,ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం. 1494లో స్పెయిన్ దేశానికి చెందిన కొలంబస్ భారతదేశంకోసం బయలుదేరి అమెరికా ఖండాన్ని కనిపెట్టాడు. 1498లో పోర్చుగల్‌కి చెందిన వాస్కోడిగామా యూరప్ నుండి ఆఫ్రికా ద్వారా భారత దేశానికి కొత్త సముద్ర మార్గాన్ని కనిపెట్టి భారత పశ్చిమ తీరం చేరాడు. ఈ రెండూ మానవజాతి చరిత్రలో, ప్రపంచ

వ్యాపార చరిత్రలోనే గొప్ప సంఘటన అంటాను. ఈ సంఘటనల పరిణామంగానే యూరప్ దేశాలు వ్యాపారంలో, పరిశ్రమల్లో, విజ్ఞానసాంకేతికరంగంలో అభివృద్ధిని సాధించాయి. భారతదేశం యూరప్ దేశాల వర్తకస్థావరంగా మారింది. బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం రావటానికి దోహదం చేసిన కారణాలలో భారత దేశం సమకూర్చిన పెట్టుబడి ఒకటి. దీనివల్ల ఇలస గ్రామీణ చేతివృత్తులు క్షీణించాయి.

దక్షిణ దేశంలో ఇంగ్లీషువారు మొట్టమొదట 1611 లో మచిలీపట్నంలో స్థావరం ఏర్పాటు చేసుకొని, తరువాత 1639 నాటికి మద్రాసుకి వచ్చారు. చంద్రగిరిరాజా దగ్గర మద్రాసును గుత్తకు తీసుకొని అక్కడ ఒక ఫ్యాక్టరీని ఏర్పాటు చేసుకున్నారు. అక్కడ రేవుమీద సుంకాల ద్వారా వచ్చే రాబడిలో సగ భాగం చంద్రగిరి రాజాకు ఇవ్వటానికి ఒప్పందం చేసుకొని, స్వంతంగా నాణాలు ముద్రించుకోవటానికి కూడా అధికారం సంపాదించారు. ఫ్యాక్టరీ చుట్టూ కోట కట్టారు. అదే సెయింట్ జార్జి ఫోర్టు. రమ్మకాల కాలంలోనే అది అద్దరం, నేర పని వారికి, వర్తకులకు కేంద్రంగా, ఈస్టిండియా కంపెనీ వారికి అధి కార కేంద్రంగా రూపొందింది.

విశాలమైన దేశంగా భారతదేశం బ్రిటిష్ పాలనలో వలస ఆర్థిక వ్యవస్థకు ప్రధానకేంద్రం అయింది. బ్రిటిష్ పరిశ్రమల పెట్టుబడికి ఆధారం అయింది. బ్రిటన్‌కు ఎక్కువ పెట్టుబడిని సమకూర్చిపెట్టటమే కాకుండా, పారిశ్రామిక ఉత్పత్తులకు మార్కెట్ కూడా అయింది. 1757 మొదలు 1900 వరకు భారత దేశ ఆర్థిక వ్యవస్థ వలస ఆర్థిక వ్యవస్థగా రూపొందింది. ఇందులోని క్రమపరిణా మానికి భారతదేశంలో ఇతర రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రంగాలలోని పరిణామానికి స్పష్టమైన సంబంధం ఉంది. బ్రిటిష్‌వారు రాజకీయాధికారాన్ని సంపాదించటానికిముందు భారతదేశంలో భూమిశిస్తురూపంలో అదనపు ఆదా యాన్ని సమీకరించటం జరిగేది. అదే అప్పటి ముఖ్యమైన ఆదాయం. పట్టణాల్లో చేతి ఉత్పత్తుల కొనుగోళ్ళు, వాణిజ్యం, వాణిజ్య పెట్టుబడులమీద ఈ అదనపు ఆదాయాన్ని ఉపయోగించటం జరిగేది. అనాటి గ్రామీణ వ్యవస్థ స్వయం సంపూర్ణమే కాని పూర్తిగా ఆదర్శవ్యవస్థ మాత్రం కాదు. చిన్న జమీందారులు, పెద్దరైతులు, భూమిలేని సేద్యగాళ్ళను పీడించటం, అస్పృశ్యులతో చాకిరీ

చేయించుకోవటం ఉండేది. అంటే పై వర్గంవారు కిందివర్గం వారిని ఏదో ఒక రూపంలో దోపిడీ చేసేవారన్నమాట, దక్షిణ భారతంలో ఏదో ఒక రూపంలో వెట్టిచాకిరీ కూడా ఉండేదని చారిత్రకులు భావిస్తున్నారు. ఇలాంటి ఆర్థిక వ్యవస్థలో బెంగాల్‌లోను, దక్షిణ భారతంలోను బ్రిటిషువారు అధికారాన్ని సంపాదించ యత్నమానులయ్యారు. పాలకులైన రాజుల స్థానాన్ని ఇంగ్లీషువారు ఆక్రమించారు. ఈ అధికారం సంపాదించిన ఈస్టిండియా కంపెనీ లండనులోని పెట్టుబడిదారుల అధీనంలో ఉండేది. పారిశ్రామిక ఉత్పత్తి దశ సమయంలో వలస వేగం ఉత్పత్తులతో ప్రపంచాన్ని మార్కెట్‌గా చేసుకోవటానికి పోటీ ఉండేది. 1757 వరకు ఈస్టిండియా కంపెనీ ఒక వ్యాపారసంస్థ మాత్రమే. భారత దేశంలోని సరకులు, చేనేతవస్త్రాలు ఇతర విలాస సరుకులను విదేశాల్లో అమ్ముకొని కంపెనీవారు లాభాలు సంపాదించేవారు. దీనివల్ల ముడట వృత్తి దారులకు కూడా ప్రోత్సాహం ఉండేది. 1757 లో బెంగాల్ ఆక్రమణ తరువాత కంపెనీ వ్యాపారం పెరిగింది. తమకున్న రాజకీయాధికారంతో నేతపనివారికి, ఇతర చేతివృత్తుల వారికి కూలిలిచ్చి తమకోసం మాత్రమే ఉత్పత్తి చేయించటం ప్రారంభించారు ఇంగ్లీషువారు. భారతదేశ వర్తకులకోసం ఉత్పత్తి చేయటానికి వీల్లేకుండా చేశారు. భారత వాణిజ్యవర్గం దీనివల్ల దెబ్బతిన్నది. బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం తరువాత పరిశ్రమలు అభివృద్ధిచెంది వాటి ఉత్పత్తికి మార్కెట్ అవసరం అయింది. డబ్బులేకుండానే భారతదేశంలోని వ్యవసాయ ఆదాయంతోనే భారతదేశంలోని ముడిసరుకులు కొని, అక్కడే తమ ఉత్పత్తులను అమ్ముకునే దశకు వారు చేరుకున్నారు. ఇతర వలస దేశాలతోపాటు భారతదేశం చవకధరకు ముడిసరకులను ఉత్పత్తిచేసే దేశంగా, బ్రిటిష్ పరిశ్రమలకు పెట్టుబడి సమకూర్చేదేశంగా మారింది. అది బ్రిటిష్ సమాజ స్వరూపాన్ని పూర్తిగా మార్చివేసింది. వలసదేశాల స్థితిగతుల్ని అది దిగజార్చివేసింది. భారతదేశంలోని బట్టల ఎగుమతి దెబ్బతిన్నది. దానిమీద ఆధారపడ్డ వారి వృత్తులు, ఉద్యోగాలు దెబ్బతిన్నాయి. పత్తి మొదలైన ముడి సరుకుల విషయంలో కూడా ఒక దశలో అమెరికా మొదలైన దేశాలతో పోటీ ఏర్పడింది. పారిశ్రామిక ఉత్పత్తుల అమ్మ కాలలో జర్మనీ, అమెరికాలతో బ్రిటన్‌కి పోటీ ఏర్పడింది. అందువల్ల వలస దేశాలే బ్రిటన్‌కి మార్కెట్ కావలసివచ్చింది. 1856 నాటికి భారతదేశంలోని పత్తి ఉత్పత్తుల ఎగుమతి తగ్గి దిగుమతులు ఎక్కువయ్యాయి. బట్టలేకాదు దారాలు కూడా ఎగుమతి అయ్యేవి. ఉక్కు, ఇనుపసామానులు, గాజు వస్తువులు కూడా

విరుగుడు అయ్యేవి. దానికి సంబంధించిన పరిశ్రమలు మొదలైన వృత్తులు, ఉత్పత్తులు దెబ్బతిన్నాయి. తమ ఉత్పత్తుల మార్కెట్‌గా భారతదేశాన్ని మార్చటం కోసం బ్రిటిష్ పారిశ్రామికులు ఈస్టిండియా కంపెనీ ప్రాబల్యాన్ని తగ్గించారు. భారత దేశం పరిపాలన బ్రిటిష్‌రాణి ప్రత్యక్ష పరిపాలనలోకి వెళ్ళటానికి గల కారణాలలో ఒకటి బ్రిటిష్ పారిశ్రామికుల ప్రయోజనాలను కాపాడటం కూడా. భారత దేశంలోని రైల్వేలు వలస ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి దోహదం చేసింది. స్వేచ్ఛా వాణిజ్యం పేరిట బ్రిటిష్ పారిశ్రామిక ఉత్పత్తులమీద తక్కువ పన్నులు వసూలు చేయటం కూడా భారత ఉత్పత్తులను మరింత క్షీణింపజేసింది.

వ్యవసాయ రంగంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన కొత్త భూమి శిస్తు వసూలు విధానాలు రైతాంగంలో సంక్షోభాన్ని తీసుకొని వచ్చాయి. జమీందారీ పద్ధతి ద్వారా పాతవైన శిస్తు విధానాన్ని, శిస్తులో వసూలు చేసే దళారీ పద్ధతిని బ్రిటిష్ వారు సుస్థిరపరిచింది. వేలం పాటల ద్వారా శిస్తు వసూలు చేసే కొత్త జమీందారీ వర్గాన్ని తయారు చేసింది. రైత్వారీ విధానంలో రైతు నుంచే ప్రత్యక్షంగా ప్రభుత్వం శిస్తు వసూలు చేస్తూ భూమిపైన వారికి హక్కు లను ఇచ్చింది. రైతులు ప్రభుత్వానికి పన్నులు కట్టలేక వడ్డీ వ్యాపారుల దోపిడికి గురి కావటం, చివరికి భూమిని అమ్ముకోవటం జరుగుతుండేది. జమీందారీ రైత్వారీ విధానాలు రెండూ ప్రభుత్వం ఎక్కువ పన్నులు వసూలు చేయటానికి అనుకూలంగా రూపొందాయి. ఈ రెండు విధానాలు రైతుల వినాశనానికే దారితీశాయి.

### తెలుగునాడు

దక్కను పీఠభూమి మధ్య భాగానికి తెలుగు దేశం పేరుకి మొఘల్ సామ్రాజ్యంలో భాగమేగాని నిజాముల్ ముల్క్ సర్వస్వతంత్రుడుగా రాజ్యం చేశాడు. 1748 నాటికి కేంద్ర పాలనకు వ్యతిరేకంగా స్థానిక నవాబులు, పాలెగాండ్రు, అమీన్‌దారుల తిరుగుబాట్లు ఎక్కువ అయ్యాయి. స్థానికంగా కూడా కేంద్రీకృత అధికారం దెబ్బతిన్నది. అదే కాలంలో వర్తకం కోసం వచ్చిన ఫ్రెంచి, బ్రిటిష్‌వారి మధ్య పోటీలు ఏర్పడ్డాయి. ఫ్రెంచివారి నుంచి బ్రిటిష్‌వారు పూర్తిగా అధికారాన్ని స్వాధీనం చేసుకొని స్థిరపడ్డారు. తమకున్న బలంతో రాజకీయాధికారాన్ని కూడా సంపాదించారు. స్థానిక నవాబులు, జమీందారులు,

సంస్థానాధీశ్వరులు, రాజులు తమతమ అవసరానుసారం ఫ్రెంచివారితోటి, బ్రిటిషు వారితోనో సహకరించారు. సహాయ సహకారాల కోసమే, రాజకీయాలుగానీ గ్రామాలను, పట్టణాలను, ప్రాంతాలను ఫ్రెంచివారికి, బ్రిటిషు వారికి దత్తత ఇస్తుండేవారు. 1757 లో బెంగాల్‌లో సాధించిన విజయంతో దక్షిణ భారతాన్ని కూడా బ్రిటిష్ వారు జయించ గలిగారు. బెంగాల్ విజయం వల్ల అబ్బిన సంపదను బ్రిటిష్ వారు దీనికి ఉపయోగించారు. అంతకుముందు తెలుగు దేశంలో గంజాం నుండి గుంటూరు వరకు ఫ్రెంచివారి అధీనంలో ఉండేది. 1750 లో ఫ్రెంచివారి ప్రధాన కేంద్రమైన మచిలీపట్టణం కోటను ఈస్టిండియా కంపెనీ వశపరచుకుంది. నిజాంపట్నం, మచిలీపట్నం, కొండపల్లి సర్కారులలో కొంత భాగం బ్రిటిష్ వారికి దత్తతగా లభించింది. 1766 నాటికి సుమారుగా కోస్తా జిల్లాలన్నీ బ్రిటిషువారి వశం అయినాయి. 1788 లో గుంటూరు చేతికి చిక్కింది. 1801 లో నెల్లూరు, చిత్తూరు జిల్లాలు వశమయ్యాయి. 1800 లో బ్రిటిషు వారి సైనిక సహకార విధానానికి బదులుగా నిజాం రాయలసీమ ప్రాంతాన్ని బ్రిటిష దత్తత ఇచ్చాడు. తమ అధికారానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన చిల్లర రాజులు, జమీందార్లు, పాలెగాండ్రను బ్రిటిషు ప్రభుత్వం అణచివేసింది. పన్నులు వసూలు చేయని జమీందార్లపైన నిర్బంధకాంత కారణంగా కొందరు జమీందార్లు తిరుగుబాటు చేశారు. పిఠాపురం, పెద్దాపురం, పోలవరం జమీందార్లు వీరిలో ఉన్నారు. తెలంగాణా ప్రాంతం స్వతంత్ర నిజాం అధికారంలో ఉన్నా బ్రిటిష వారికి దానిపై కూడా పరోక్షాధికారం ఉంది.

1759లో ఈస్టిండియా కంపెనీ మచిలీపట్టణాన్ని స్వాధీనం చేసుకోవ టంతో తెలుగుదేశంలో ఆర్థికస్థితిగతులు అస్తవ్యస్తస్థితికి చేరుకున్నాయి. కంపెనీ చేతివృత్తుల పనివారికి పెట్టుబడిపెట్టి అపారమైన లాభాలు గడించింది. వృత్తి కారులు స్వేచ్ఛను కోల్పోయి కంపెనీకోసం ఉత్పత్తులుచేసే కూలీలుగా మిగిలి పోయారు. మచిలీపట్టణం అద్దకపు వస్త్రాలకు ప్రసిద్ధి, ఉత్తర సర్కారులు చేతి పరిశ్రమలకు ప్రసిద్ధి. 19వ శతాబ్దం ప్రారంభకాలానికి కోస్తాంధ్రలో వరి, చెరకు, పసుపు, పప్పుదినుసులు, దత్తమండలాలలో పత్తి, వేరుసెనగ, నెల్లూరు, గుంటూరులలో పొగాకు ఉత్పత్తి అయ్యేవి. ఈస్టిండియా కంపెనీ వాణిజ్యపంట లైన పత్తి, చెరకు, నీలిమందు ఉత్పత్తులను ప్రోత్సహించింది. దీనివల్ల దేశంలో ఆహారకొరత ఏర్పడింది.

బ్రిటిషువారు తమ ఆధీనంలో ఉండే ప్రాంతాలలో భూమిశిస్తు వసూలుకు రెండు విధానాలు అవలంబించారు. అవి జమీందారీ, రైత్వారీ విధానాలు. వేలం పాటలో హెచ్చురేటుకు పాటపాడినవారికి భూమిశిస్తు వసూలుచేసే అధికారం ఉంటుంది. ప్రభుత్వానికి, రైతులకు మధ్యదళారీలుగా, జమీందారులుగా వీరుంటారు. బ్రిటిష్‌వారి పక్షంతోగా పాతజమీందారీ వర్గంకాక కొత్తజమీందారీ వర్గం ఒకటి ఏర్పడింది. ఇందులో జమీందారు యజమానిలాంటి వాడైతే రైతు హక్కులు స్పష్టంగా ఉండవు. జమీందారుల శాశ్వత ప్రాతిపదికమీద ప్రభుత్వానికి చెల్లించ వలసిన శిస్తుమ్మనిర్ధారణ చేసి ఉంటుంది. దక్షిణ భారతంలో జమీందార్ల పద్ధతి. 19వ శతాబ్ది ప్రారంభానికి అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలో రైత్వారీ విధానం ప్రవేశించింది. దీనివల్ల వ్యవసాయం చేసుకొనేవారికి భూమిమీద హక్కు లభించింది. అయితే ఆ హక్కు పన్నులు సక్రమంగా చెల్లిస్తున్నంతవరకే ఉంటుంది. ప్రభుత్వానికి అవసరమైన పద్ధతిలో శిస్తు పెంచవచ్చు. పండినా పండకపోయినా, ప్రకృతి వైపరీత్యాలవల్ల నష్టంవచ్చినా పన్ను చెల్లించవలసిందే. రైతుకు భూమిని అమ్ముకోవటానికి, తాకట్టు పెట్టుకోవటానికి కూడా హక్కు ఉంటుంది. అవసరమైతే అమ్మి కొని శిస్తుకట్టటానికి ఈ అధికారం ఇవ్వటం జరిగింది. సంప్రదాయ గ్రామీణ వ్యవస్థలో అనుభవానికుండిన భూమి అమ్మకపు సరకుగా మారింది. జమీందారీ, రైత్వారీ విధానాలు రెండూ బ్రిటిషు పాలకులు తమ ఆదాయాన్ని పెంచుకోవటానికి అనుసరించినవే. రెండూ రైతులకు నష్టాలను కలిగించేవే. రైత్వారీ విధానంలో రైతులు వడ్డీవ్యాపారుల బాధలకు లోనయ్యేవారు. థామస్ మన్రో 1802లో రాయలసీమలో రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టాడు 1804 ప్రాంతాలలో రాయలసీమలో, నెల్లూరులో, సర్కారుజిల్లాలలోని కొన్ని ప్రాంతాలలో గ్రామవారీ శిస్తుపద్ధతికూడా ఉండేది. 1880లలో సర్వే సెటిల్‌మెంట్ డిపార్టుమెంటు ఏర్పడింది. ఖర్చులుపోగా మిగిలిన ఆదాయంలో సగంకంటే ఎక్కువ పన్ను ఉండకూడదనే నియమం ఏర్పడింది. నిజాం సంస్థానంలో భాగమైన తెలంగాణాలో భూమి సర్‌ఫేకాస్, ఖాల్సాఅని రెండు రకాలుగా ఉండేది. సర్‌ఫేకాస్ భూములపైన ఆదాయం ప్రత్యక్షంగా నిజాంకు సంబంధించింది. ఖాల్సాభూములు జాగీర్దార్లు, దేశముఖ్‌లు సంస్థానాధిపతుల ఆధీనంలో ఉండేవి. తమ ప్రాంతాల పైన వీరికి పూర్తిగా అధికారం ఉండేది. బ్రాహ్మణ పురోహితులు మొదలుకొని వృత్తికారులవరకు ఈ దొరలకింద వెట్టిచాకిరీ చేయవలసిందే. రైతులకు భూముల

పైన పట్టాహక్కులున్నా వాటిని గుర్తించేవారు కారు. రైతులు ముందట పరంభూమి దున్ని తమ భూములను దున్నుకోవాలి. 1875లో ఈ ప్రాంతంలో సర్వే సెటిల్‌మెంట్ విధానం ప్రవేశ పెట్టారు. బ్రిటిష్‌వారి కాలంలో గుంటూరు, బెంగాల్ వీర ప్రాంతాలలో కొన్నైనా పరిశ్రమలు ప్రారంభమయ్యాయి. ఆంధ్రప్రాంతంలో పరిశ్రమలు తక్కువ. అది వ్యవసాయ దేశంగానే మిగిలిపోయింది.

**జాతీయత**

బ్రిటిష్ వలస అయిన భారతదేశంలో అభివృద్ధిలో భాగంగా, ఒక భావంగా ఆర్థిక, రాజకీయ సంఘటనల పరిణామ కారణంగా జాతీయత రూపు తొడిగిందని చారిత్రకులు భావిస్తున్నారు. ప్రపంచంలో అభివృద్ధి చెందుతున్న పారిశ్రామిక పెట్టుబడిదారీ యుగంలో భారతదేశంలోని వలస ఆర్థిక వ్యవస్థకు ప్రతిస్పందనగా భారత జాతీయవాదం రూపు దిద్దుకుందని భావించవచ్చు. పెరుగుతున్న పెట్టుబడిదారీ సంబంధాల దశలో తెగల పరిమితులను దాటిన ఆధునిక రూపమైన రాజకీయ సిద్ధాంతంగా, భావంగా భారతదేశంలో జాతీయత రూపొందిందా ? అన్న విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా పశ్చిమ యూరప్ దేశాలలో భూస్వామ్య వ్యవస్థ బంధనాలను ఛేదించుకొని వర్తక వాణిజ్యాలు, పెట్టుబడి దారీ విధానం అభివృద్ధిపట్ల పరస్పర సంబంధాలు ఏర్పడి స్పష్టమైన ఎల్లలతో భాషా ప్రాతిపదికమైన జాతీయ రాజ్యాలు, జాతీయ భావన ఏర్పడ్డాయని అలాంటి పరిస్థితి భారతదేశంలో లేనందున అలాంటి భావన ఇక్కడ సమగ్రంగా ప్రస్ఫుటం కాలేదని కొందరు భావిస్తున్నారు. 1885 లో భారతజాతీయ కాంగ్రెస్ ఏర్పడటం స్థూలంగా భారత జాతీయతకు ప్రారంభదశ అన్న భావమూ ఉంది. భారతీయులకు సాంస్కృతిక ఏకరూపత, భౌగోళిక ఐక్యత ఉన్నాయని, ఇవి భారతీయులందరినీ ఒక జాతికి చెందిన వారుగా చెప్పటానికి కారణాలవుతున్నాయని, కాబట్టి జాతీయ భావన చాలా ప్రాచీనమైనదని సంప్రదాయ వాదులంటారు. ప్రాంతీయంగా ఒకే భాష మాట్లాడేవారిలో ఏకరూపత, ఐక్యత ఉందని భాషను ఆధారంగా చేసుకున్న జాతీయతగా దాన్ని గుర్తించవచ్చని కొందరంటున్నారు. కింది స్థాయిలో భాషను, తెగను, మతాన్ని ఆధారం చేసుకున్న జాతీయత, పై స్థాయిలో సామ్రాజ్యవాద వ్యతిరేకత రూపంలో ఏర్పడిన అఖిల భారత స్థాయి జాతీయత—రూపంలో ద్వంద్వ జాతీయ చైతన్యం భారతదేశంలో ఉందని ప్రతిపాదిస్తున్నవారూ ఉన్నారు.

భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా అభివృద్ధి చెందే పెట్టుబడిదారీ వ్యవస్థ ఆధునిక జాతీయ వాదానికి కారణం అవుతుందని, పశ్చిమ యూరప్ దేశాల్లో జాతీయ మార్కెట్, భాషా సమానత ఆధారంగా జాతీయ రాజ్యాలు రూపొందాయని, ఈ పరిస్థితి మత సంస్కరణ రూపంలో ప్రాంతీయ భాషలలో భక్తి సాహిత్యం ప్రచారంలోకి రావటంలో భారతదేశంలో కూడా కనిపిస్తుందని కొందరు అభిప్రాయపడుతున్నారు. భక్తి, మత సంస్కరణోద్యమాలకు ప్రాంతీయ భాషా సాహిత్యాలు సాధనమైనాయి. ఈ ఉద్యమంలో కింది తరగతి వారు, వృత్తికారులు, చిన్న వ్యాపారులు, రైతులు ఉన్నారు. ఇందులో భూస్వామ్య ఆధిపత్యానికి వ్యతిరేకత, వాటికి అండదండలనిచ్చే మత, మతాధిపతులకు వ్యతిరేకత వుంది. గ్రామాలలోని ఉత్పత్తికి పట్టణాలలో మార్కెట్‌ని అన్వేషించే స్థితికి పరిమిత వాణిజ్యం విస్తరిస్తున్న దశలో ఈ ఉద్యమాలు వచ్చాయి. కాని భక్తి ఉద్యమం ఒక్క భూస్వామ్య వ్యవస్థ వ్యతిరేకత నిరసన రూపంలోనే ఉండిగాని ఆ వ్యవస్థను పెళ్ళగింపజేసే స్థితిలో లేదని, అది రాజకీయ చైతన్య రూపాన్ని పొందలేదని, పదహారవ శతాబ్దం నుంచి కనిపించే భారతీయ వాణిజ్య పెట్టుబడులు భూస్వామ్య విధానానికి ఏ రూపంలోను వ్యతిరేకం కాదని, అవి పారిశ్రామిక పెట్టుబడిగా పరిణామం చెందలేదని, భాషా ప్రాంతాల ఎల్లలు స్పష్టం కాలేదని, కాబట్టి దాన్ని జాతి చైతన్యంగా భావించనవసరం లేదని కొందరు భావిస్తున్నారు. భారత దేశంలో జాతుల పరిణామంలో బ్రిటిష్ వారు రాక పూర్వం రూపొందిన ప్రాంతీయ భాషా తెగలు ప్రధాన స్థానాన్ని వహిస్తున్నాయని, సంప్రదాయ గ్రామీణ వ్యవస్థలో కంటే విస్తృతమైన మార్కెట్ కావలసిన అవసరాన్ని బట్టి అవి ఏర్పడినవని, భారతదేశంలోని జాతీయ భావనను పూర్తిగా యూరప్ దేశాల్లోని జాతీయ భావనా చట్రంలో పొదగవలసిన అవసరం లేదని మరికొందరు భావిస్తున్నారు.

భారతదేశంలో జాతి అన్న భావన ఎట్లా ఉన్నా భాష పేరిట గుర్తింపు మధ్య యుగాలనుంచీ కనిపిస్తుంది. క్రీస్తు శకం పదవ శతాబ్దం నాటికే సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై చిన్నచిన్న రాజ్యాలు ఏర్పడటంతో భాషా పరమైన గుర్తింపు, ప్రాంతీయ లిఖిత భాషా సాహిత్యాలు ప్రారంభం అయ్యాయి. ఉత్తర భారతంలో ఆర్య భాషా జాతులు, దక్షిణ భారతంలో ద్రావిడ భాషా జాతులు ఉన్నాయి. సంస్కృతంపై స్థాయితో సాంస్కృతికంగా అభివృద్ధి చెందిన భాషగా, రాజుల

ఆశ్రయంలో అధికార భాషగా, సాహిత్య, బోధన భాషగా అభివృద్ధి చెందింది. దక్షిణ దేశంలోని రాజవంశాలు కూడా సంస్కృతాన్ని పై స్థాయిలో పోషించాయి. ఈ కాలంలో భిన్న ప్రాంతాలలో ప్రాంతీయ భాషా సాంస్కృతిక సంప్రదాయాలు ఏర్పడ్డాయి. తమిళ దేశంలో మొదటినుంచే స్వతంత్రమైన భాషా, సాంస్కృతిక సంప్రదాయాలున్నాయి. పై వర్గం భాషగా సంస్కృతానికి ఉన్న సాంస్కృతిక స్థాయిని వ్యతిరేకించకుండానే ఇతర భాషా సాహిత్యాలు మౌఖిక స్థాయినుండి లిఖిత స్థాయిలోకి అభివృద్ధి చెందాయి. అంతకు ముందు ఈ భాషలలో ప్రజా సాహిత్యం మౌఖిక సాహిత్యం ఉండగా ప్రాంతీయ పాలనా, సాహిత్య భాషలుగా పదవ శతాబ్దం నుండి అవి అభివృద్ధి చెందాయి. ప్రాంతీయ రాజ్యాలు కళలను, సాహిత్యాన్ని, సంగీతాన్ని పోషించాయి. యూరప్ ఖండంలోని భాషా జాతి రాజ్యాలలాగా ఇక్కడ దేశభాషల ఆధారంగా చేసుకుని స్పష్టమైన సరిహద్దులతో రాజ్యాలు ఏర్పడలేదు కాని భాషా రూపంలో తమను తాము గుర్తింపజేసుకోవటం మాత్రం ప్రారంభమైంది. చాలా ప్రాంతీయ భాషలలో కింది వర్గాలకు సంబంధించిన భక్తి, మత సంస్కరణ సాహిత్య రూపంలో భాషకు సంబంధించిన గుర్తింపు ప్రారంభమైంది. కొన్ని ప్రాంతాలలో భూస్వామ్య వ్యవస్థకు ప్రాతినిధ్యం వహించిన పాలకుల ద్వారా ఈ గుర్తింపు ప్రారంభమైంది. తెలుగులో ఇలాంటి పరిస్థితే కనిపిస్తుంది. రాజ రాజ నరేంద్రుడు '.... ...మహాభారత బద్ధ, నిరూపితార్థమేర్పడ తెనుంగున రచియింపుము'ని నన్నయతో చెప్పినట్టుగా భారతంలో ఉంది. ఉభయభాషల బహుళ వినయుల రచనలను వినాలనే స్పృహ ఆనాటికి పండితులలో, పాలకులలో ప్రారంభమైంది. నన్నెచోడుడు తన కుమార సంభవంలో సంస్కృత కవులను స్తోత్రం చేసిన క్రమంలో 'మును మార్గ కవిత లోకం బున వెలయగ దేశి కవిత పుట్టించి తెనుం, గున నిలిపి రంధ్ర విషయమున జన చాళుక్య రాజు మొదలుగ చలువురు, అని సంస్కృత కవిత్వం దేశంలో వ్యాపించి ఉండగా తెలుగు కవిత్వం నిలిపిన చాళుక్య రాజుల్ని పేర్కొన్నాడు. 'అనిన సంస్కృతంబు సకల భాషలకును, దేశ భాషలందు తెనుగు లెస్స, జగతి వల్లికం బై సౌభాగ్య సంపద, మెచ్చుటాడు బిడ్డ మేలుగాదె' అన్న క్రీడాభిరామ కర్త మాటలలో తెలుగు భాషా చైతన్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. విన్నకోట పెద్దన తెలుగు కవితను 'విలసద్భావ రసాద్యలంకృతులలో నెప్పారి గీర్వాణ భాషల శబ్దాలెన్నొకొన్ని మంచి తనమూల్' సంధిల్లినా.... తెలుగంచు చెవి బెట్టి సేరని స్థితిని

నుంచి బాధపడ్డారు. సంస్కృతాధ్యయనాన్ని, ఆధిక్యతను తిరస్కరించకుండానే తెలుగు భాషా చైతన్యం వ్యాపించిన దశను ఇందులో చూడవచ్చు. ఇంచుమించు సమకాలంలోనే భాషా ప్రాతిపదికపైన ఆధునిక బ్రిటిష్, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ జాతుల రాజ్యాలు ఏర్పడ్డాయి. భారతదేశంలో ఆ విధమైన పరిణామం జరగలేదు. భారతదేశంలో కింది స్థాయిలో గ్రామీణ వ్యవస్థ పైస్థాయితో సంబంధం లేకుండా చాలా శతాబ్దాలు మార్పు లేకుండా స్థిరంగా ఉంది. వర్తక, వాణిజ్య వర్గాలవారు ఒక్కటి పరిమిత స్థాయిలో మాత్రమే అభివృద్ధి చెందారు. కాబట్టి విభిన్న భాషలవారిలో భాషా చైతన్యం పది, పదకొండు శతాబ్దాలలోనే ప్రారంభం అయినా బాగ సమగ్ర జాతులుగా రూపొందలేదు. ఆర్థికంగా భూస్వామ్య దశ బలపడటం, భౌగోళికంగా ఒకే భాషా ప్రాంతంలో అనేక చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడటం జరిగింది. వృత్తికారులు, చిన్న వ్యాపారులైన శ్రమజీవులు వర్ణాశ్రమ ధర్మాల్ని, కుల భేదాల్ని, పై వర్గం మతకర్మకాండల్ని ఖండించటం, మతాధిపతుల్ని వ్యతిరేకించటం గ్రామాలలోని వ్యాపార ఉత్పత్తికి పట్టణాలలో మార్కెట్‌ను విస్తరించుకోవటంలో భాగంగా,పరిమిత రూపంలో వాణిజ్య విస్తరణావసరాలతో ముడిపడి ఉండి ఉంటుంది. గ్రామాలకు, పట్టణాలకు సంబంధం ఏర్పడి దేశీయ వ్యాపారం అభివృద్ధి చెందుతున్న దశలో కులమత భేదాలు పోయి జాతులుగా భాషా ప్రాంతాల వాళ్ళు రూపొందే పరిస్థితులు అభివృద్ధి చెందుతున్న దశలో భారతదేశంలో సామ్రాజ్యవాదం ప్రవేశించింది. పెట్టుబడిదారీ విధానం పూర్వదశలోని సాంప్రదాయక ఆర్థిక విధానాన్ని స్థానిక వాణిజ్య పెట్టుబడిదారులు కాక ఇతర దేశాలకు చెందిన వాణిజ్య పెట్టుబడిదారులు ఛేదించారు. అందుకే జాతీయోద్యమ కాలంలో జాతీయ చైతన్యాన్ని రగల్చటానికి సాంప్రదాయిక వ్యవస్థలోని ఔన్నత్యం, సాత్విక భావజాలం ప్రేరకాలయ్యాయి.

బ్రిటిష్ సామ్రాజ్యం భాషాజాతుల అభివృద్ధిని కుంటుపరిచింది. భారత దేశాన్నంతా తన కేంద్రీకృత అధికారంలోకి తీసుకొనివచ్చిన బ్రిటిష్ ప్రభుత్వం దేశాన్ని భాషాప్రాంతాలుగా కాక తమ పరిపాలనావసరాలకు, సౌలభ్యానికి అనుగుణంగా భిన్నభాషా ప్రాంతాలను కలిపి పాలనా ప్రాంతాలను ఏర్పాటుచేసింది. హైదరాబాదులాంటి సంస్థానాలలో పాలకులు ప్రాంతీయ భాషకు సంబంధించిన వారుకారు. అందులో మూడు భాషా ప్రాంతాల భాగాలు కలసిఉన్నాయి. 1905లో బెంగాల్ విభజనతో బెంగాల్ భాషాభిమానం పెరిగింది. భిన్నభాషా ప్రాంతాలలో

ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోనే గొప్ప మార్పు వచ్చిందని అది ఆధునికయుగ పరిణామానికి దారితీసిందని కొందరు భావిస్తున్నారు. ఫ్రెంచి విప్లవంతో ఆధునిక ఆలోచనా విధానం ప్రారంభమైందని మరికొందరి అభిప్రాయం. భారతదేశానికి సంబంధించినంతవరకు ఆధునికత సుమారుగా పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్థంలో ప్రారంభమైందని భారతదేశపు ఆధునికయుగ చరిత్రకారులు భావిస్తున్నారు.

పునరుజ్జీవనం, సంస్కరణ, మానవతావాదం, భౌగోళికంగా కొత్త ప్రాంతాలను, దేశాలను కనుక్కోవటం, కొత్తమార్కెట్లను వెతుక్కోవటం యంత్ర పరిశ్రమలు, మధ్యయుగనుతాలను, మతభావాలను బద్దలుకొట్టటం- ఈ క్రమంలో యూరప్‌లో ఆధునికత రూపుదిద్దుకుందని భావిస్తే ఈ పరిణామం భారతదేశానికి ఎంతవరకు అన్వయిస్తుందో పరిశీలించవలసి ఉంటుంది. యూరప్ దేశాల చారిత్రక పరిణామ చక్రంలోనే భారతదేశంలోని ఆధునికత పరిణామాన్ని నిరూపించే అవకాశం ఉందాఅన్న విషయాన్ని సమగ్రపరిశీలన చేయవలసిఉంది. ఆర్థికరంగంలో పరిణతి చెందిన యూరప్ దేశాలకు, ఇదేకాలంలో వలస దేశమైన భారతదేశానికి ఆధునికత విషయంలో గల భేదాన్ని గుర్తించవలసి ఉంటుంది. వలస విధానం కారణంగా సామాజిక, సాంస్కృతికరంగాలలో వలసపాలన ప్రభావం కనిపిస్తుంది. ప్రస్తుతం చదువుకున్నవారిలో, పై వర్గంవారిలో భౌతిక జీవన విధానానికి సంబంధించి అనుకరణగా కనిపిస్తున్న అంశాలను ఆధునిక సంస్కృతిగా పేర్కొనటం జరుగుతున్నది. భిన్నవర్గాల ప్రయోజనాలు అవసరాలు భారతదేశం ఆధునికతా దిశగానడవటానికి ఎట్లా కారణమయ్యాయో చూడకుండా పాశ్చాత్యప్రభావం అన్న దృష్టితోనే భారతదేశంలోని ఆధునికతను నిరూపించటం జరుగుతున్నది. యూరప్‌లోని బూర్జువావర్గం ప్రయోజనాలు, అవసరాలు, ఆదేశాల అభ్యుదయం, ఆధునికతలతో ముడిపడిఉన్నాయి. అక్కడ ఆధునికత, అభ్యుదయం పెట్టుబడిదారీ విధానఫలితం. భారతదేశంలోని పరిణామాలు చాలావరకు వలసపాలకుల ప్రయోజనాలతో ముడిపడిఉన్నాయి. భారతదేశపువిశాల భౌగోళిక స్వరూపం, చారిత్రకంగా భిన్నజాతీయుల, భిన్నభాషీయుల, భిన్నదేశీయుల, భిన్నతెగల, భిన్నమతాల సమ్మేళనం, వాటిఫలితమైన వైరుధ్యాలు భారతదేశం సులభంగా వలస దేశంకావటానికి కారణమయ్యాయి. విడిపోని విశాల భూభాగంగా ఉన్న భారతదేశం చరిత్రలో విదేశాలనుండి విభిన్న జాతులవారు

ఎప్పటికప్పుడు భారతదేశంలోకి వచ్చి కలిసిపోయి ఉండటంవల్ల కొత్త వర్గాలు, వర్ణాలు, కులాలు, మతాలు ఇక్కడ ఏర్పాటుచేసుకున్నాయి. ఏ కారణాలవల్ల భారత దేశం వలసదేశం అయిందో ఆ కారణాలను తొలగించి నూతన ఆర్థిక వ్యవస్థ నిర్మాణం చేసుకోవటమే భారతదేశంలో నిజమైన ఆధునికత అవుతుంది. వలస పాలన ఫలితమైన సంస్కృతి వలస సంస్కృతి కాగలుగుతుందేగాని ఆధునిక సంస్కృతి కాజాలదు.

యూరప్‌లో భూస్వామ్య వర్గాన్ని జయించి ఆధునిక బూర్జువావర్గం నిల దొక్కుకుంది. భారతదేశంలో స్థానికులైన రెండువర్గాల మధ్య వైరుధ్యంగా ఆధు నిక చరిత్ర ప్రారంభంకాలేదు. 1857 తిరుగుబాటులో సిపాయిలతోపాటు, భూస్వామ్య ప్రభువులు, రైతులు అందరూ పాల్గొన్నారు. అక్కడ ప్రధాన వైరుధ్యం సామ్రాజ్యవాదులకు, స్థానికులైనవారందరికీ మధ్య ఉంది. బ్రిటిష పారిశ్రామికులకు, దాని అనుబంధమైన బ్రిటిష్‌పాలనకు వ్యతిరేకంగా అప్పుడప్పుడే రంగంలో ప్రవేశిస్తున్న స్థానిక పారిశ్రామికులు, చదువుకున్న మధ్యతరగతి వర్గం సహాయంతో పోరాటాన్ని ప్రారంభించటంతో భారతదేశంలో ఆధునిక బూర్జువా వర్గం తల ఎత్తింది. స్వాతంత్ర్యోద్యమంగా పరిణమించిన ఈ పోరాటంలో మధ్య తరగతి మేధావులు, స్థానిక పారిశ్రామికులతో పాటు కొందరు జమీందార్లు కూడా ఉన్నారు. వీరు వలస పాలనకు వ్యతిరేకంగా పోరాడారు. వలస సంస్కృతికి వ్యతిరేకంగా కాదు. దేశం భౌతిక ప్రగతిని కోరారే కాని భూస్వామ్య భావ జాలాన్ని కాదనలేదు. బ్రిటిష పాలకులు తమ అవసరాలకు ఈ దేశంలో యాంత్రిక నాగరికతను ప్రవేశపెడుతూనే, సాంస్కృతికంగా భూస్వామ్య భావ జాలాన్ని కాపాడే ప్రయత్నం చేశారు. ఈ వైరుధ్యం నవజాగరణ సందర్భంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

సాధారణంగా పై వర్గంలో మేధావి వర్గంలోని పరిణామాలను మాత్రమే ఆధునికతగా చూపటం జరుగుతున్నది. మేధావులలో ఆలోచనా విధానంగా వచ్చి నప్పుడే దాన్ని ఆధునికత అంటున్నాం. సమాజంలోని కింది వర్గాలలోని పరి ణామాలు పై వర్గంలోని పరిణామాలకు దోహదం చేస్తున్న విధానాన్ని సమన్వయం చేయటం ద్వారా ఆధునికతా పరిణామాన్ని నిరూపించటం ఇంకా జరగటం లేదు. ఇందువల్ల ఆధునికతా నిర్వచనం కూడా సాపేక్షం అని తెలుస్తుంది. పాలకుల

విధానాలను రూపొందించేవి ఆర్థిక పరిస్థితులు. ఆర్థిక పరిస్థితులను తమ కను కూలంగా మలచుకోవటానికి ప్రయత్నం చేయటం ద్వారా వారు తమ అధి కారాన్ని నిలబెట్టుకుంటారు. దాన్ని బట్టి సామాజిక సంబంధాలు రూపొందుతాయి పాలకులు చేసే ఏ ఆర్థిక సూత్రాలయినా అవి వెంటనే ప్రభావితం చేసేది రైతాంగాన్ని, వర్తకులను, శ్రామికులను. అందువల్ల మొదట వ్యతిరేకత, తిరుగు బాట్లు అక్కడినుంచే వస్తాయి. నేడు భారతదేశంలో ఆధునికత అనుకుంటున్న దానికి మూలం అక్కడే ఉంది. శాశ్వతశిస్తులోంచి వచ్చే ఒత్తిడి రైత్వారీ శిస్తులో మార్పులకు కారణం అవుతుంది. జమీందారీ, రైత్వారీ విధానాలు రెండూ ముఖ్యంగా రైతులను ప్రభావితం చేయటంవల్ల రైతులలో తిరుగుబాట్లు వచ్చాయి. ఆదివాసులు, గిరి జనులనుంచి వచ్చిన తిరుగుబాట్లు నేరుగా ఆర్థిక, రాజకీయ రంగాలను ప్రభా వితం చేశాయి. బ్రిటిష్ వారి విధానాలతో మార్పులను తీసుకొనివచ్చాయి. ఆహారో త్పత్తులను కాక వాణిజ్య ఉత్పత్తులను ప్రోత్సహించే విధానాన్ని వలస పాలకులు అవలంబించటంవల్ల వచ్చిన మార్పులు నేల ఆర్థిక, సామాజిక రంగాల స్వరూప స్వభావాలను మార్చివేసింది. వర్తక వాణిజ్యాల్లో దేశీయులంతగా చేరలేకపోవటంవల్ల భారతదేశపు అదనపు ఉత్పత్తి బ్రిటన్‌లోని పారిశ్రామికరంగంలో పెట్టుబడిగా మారటం వల్ల ఈ దేశంలో బలవత్తరమైన పెట్టుబడిదారీ వ్యవస్థ రూపుదిద్దుకోలేదు. అందు వల్ల యూరప్ దేశాలలో అభివృద్ధిచెందిన అనేక ఆధునిక జీవితాంశాలను సంస్క రణ రూపంలో ఉపరితల అంశాలుగా మొదట దశలో తీసుకొని రావలసి వచ్చింది. తరువాత మారిన ఆర్థిక పరిస్థితులలో, పారిశ్రామిక సమాజం పుంజుకుంటున్న దశలో సంస్కరణల రూపంలో ఉన్న ఆధునిక జీవన విధానానికి సంబంధించిన అంశాలు స్వరస్వభావంగానే వ్యాపించాయి. ఈ కారణంవల్లనే మొదటి దశలోని సంస్కర్తలు ఆంగ్లేయులవల్లనే మనం కళ్ళు తెరిచాం అని చెప్పుకోవలసి వచ్చింది. ఒకప్పుడు భూస్వామ్య వ్యవస్థతో పాలకులను ఆశ్రయించి జీవించిన చదువుకున్న మధ్యతరగతి వర్గ ప్రయోజనాలు కూడా మారిన పరిస్థితుల్లో ఈ సంస్కరణలకు కారణం అయ్యాయి. ఈ దశనే ఈ దేశంలో ఆధునికతకు ప్రారంభదశగా భావించటం జరుగుతున్నది. అయితే మొదటి బ్రిటిష్ పాలకుల ద్వారా ఈ దేశంలో ప్రవేశించిన రవాణా, ప్రయాణ, వార్తా, తంత్రీసౌకర్యాలు, నిదానంగా అయినా అభివృద్ధి చెందిన పరిశ్రమలు, ఆధునిక విద్యావిధానం కాలక్రమంలో విస్తరించిన తరువాత మానవ సంబంధాలలో, జీవన విధానాలలో వచ్చిన మార్పులనే ఇక్కడి ఆధునికతా పరిణామంగా భావించవచ్చు.

పశ్చిమ యూరప్‌లో 1453-1517 మధ్య కాలాన్ని పునరుజ్జీవన యుగం అంటారు. చారిత్రక పరిణామక్రమంలో యూరప్ ఖండానికే ఒక ప్రత్యేక ప్రాధాన్యం తెచ్చిన మహోన్నత సాంస్కృతిక అభివృద్ధే పునరుజ్జీవనం. అది మానవతావాదంగా అక్కడ ప్రారంభమయింది. మధ్యయుగ సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడటం, మానవుడే సర్వస్వం అని భావించటం మానవతావాద ముఖ్య లక్షణం. పునరుజ్జీవనకాలంలోనే యూరప్‌లో ఆధునిక రాజ్యాలు ఏర్పడ్డాయి.

మతాడంబరాలు, బహిరంగ కర్మకాండలు, సాంప్రదాయిక పద్ధతులు, పురోహితుల ఆధిపత్యం మొదలైన లక్షణాలుగల మతవ్యవస్థపైన 16వ శతాబ్దిలో జర్మనీ మొదలైన దేశాలలో జరిగిన తిరుగుబాటే ప్రొటెస్టాంటిజం. ఈ మతవ్య వ్యవస్థను నమ్మనవద్దని, దానికి బద్ధులు కావద్దని ఒక చెప్పుతుంది. నిజమైన జీసస్ బోధనలను మాత్రమే అది నమ్ముతుంది. దేవుడికీ, మనిషికి మధ్య పురోహితుడు అనవసరం. అలాంటి అర్థాన్నిటినీ వ్యతిరేకించాలి, తొలగించాలి. మనిషి తనకు తానే పురోహితుడు. కావలసినవన్నీ బైబిల్‌లోనే ఉన్నాయి. అవి అందరికీ అర్థమవుతాయి. ప్రొటెస్టాంట్స్ తాము కొత్తదేమీ చెప్పటంలేదనీ నిజమైన జీసస్ బోధనలను, బైబిల్‌నీ, ప్రాచీన చర్చినీ నమ్మమని చెప్పారు. నిజమైన క్రిష్టియన్ సంప్రదాయాన్ని క్యాథలిక్ చర్చి మార్చిందని వారంటారు. అందువల్లనే రోమన్ క్యాథలిక్ చర్చి అధికారానికి వ్యతిరేకంగా ప్రొటెస్టాంటిజం పోరాడింది. వేదాలలోని మౌలికమైన సంస్కృతిని పునరుద్ధరించాలనుకున్న ఆర్య సమాజీయులకు ఈ విషయంలో కొంత పోలిక కనిపిస్తుంది. ప్రాచీన భూస్వామ్య పాలక వర్గం చర్చికి సంబంధించిన ఆర్థిక వనరులనుండి లాభాలు పొందారని, భూస్వామ్య వర్గం వ్యాపారవర్గాలపైన అధికమైన పన్నులు విధించి పీడిస్తూ వచ్చిన దాని కనుగుణమైన వర్గనీతులను బోధించటాన్ని వ్యతిరేకిస్తున్నారని, నాటి అభివృద్ధి చెందుతున్న వాణిజ్య ఆర్థిక విధానంలో భాగంగా ప్రొటెస్టాంట్ ఉద్యమం వచ్చిందని మార్క్సిస్టులంటారు. కొత్తగా వాణిజ్యవర్గం రూపొందిన ఇంగ్లాండ్, హాలెండ్, అమెరికాలలో ప్రొటెస్టాంటిజం విస్తరించటం దీనికి నిదర్శనం. అభివృద్ధిచెందుతున్న మధ్యతరగతి మేధావివర్గం దీన్ని ఉపయోగించుకుంది. క్యాథలిక్ మూఢనమ్మకాలను దూరంచేయగల హేతువాదమార్గంగా ప్రొటెస్టాంటిజాన్ని గుర్తించి [illegible] భావించారు. మార్టిన్ లూథర్ ప్రొటెస్టాంటిజం ఉద్యమంలో ముఖ్యుడు. ఇదే మార్గానికి చెందిన ఫ్రాన్స్ దేశీయుడు కాల్విన్

శ్రమకు గౌరవాన్ని ఇచ్చింది. ప్రతివానిమీద దేవునిదయ ఉంటుందని, దేవుడి ఋణం తీర్చుకోవటంలో శ్రమించటానికి, దానధర్మానికి ప్రాధాన్యం ఉందని బోధించాడు. 'కాయకవే కైలాస' అన్న వీరశైవ భక్తి మార్గానికి చెందిన బసవన్నకు ఈ విషయంలో పోలిక ఉంది. ప్రొటెస్టాంటిజం వ్యక్తిస్వేచ్ఛను, ప్రజా స్వామ్య స్వయంపాలనను దోహదం చేసిందంటారు. ఈ దృష్టిలో ప్రొటెస్టాంటిజం 16వ శతాబ్దంలో చాలా మార్పుల్ని తెచ్చింది. వర్తకం పెరగటానికి బాటవేసింది. పెట్టుబడిదారీ విధానానికి దోహదం చేసింది. సాధారణ భాషా సాహిత్యాలను ప్రచారానికి తెచ్చింది.

దాదాపు సమకాలంలో భారతదేశంలో వచ్చిన భక్తిఉద్యమాలను, ప్రొటె స్టాంటిజానికి చాలా పోలికలున్నాయి. ఈ విషయాన్ని 1830లలోనే ఏనుగుల వీరాస్వామి గుర్తించటం 'కాశీయాత్ర చరిత్ర'లో కనిపిస్తుంది. ఇంచుమించు యూరప్‌లో ప్రొటెస్టాంటిజం మొదలైన కాలానికే భక్తి ఉద్యమం సుమారు భారత దేశం అంతా వ్యాపించింది. అంతకుముందు శతాబ్దాలకు ముందే దక్షిణదేశంలో అది ప్రారంభమైంది. భక్తి ఉద్యమ రూపంలో నిమ్నవర్గాలవారు, వృత్తికారులు భూస్వామ్య పాలకులను నిరసించారు. వైదిక కర్మకాండలు, పురోహితవర్గం ఆధి క్యత, విగ్రహారాధన, అగ్రవర్ణాలలో నిరంకుశత్వం, ఛాందసత్వం, మౌఢ్యం, వర్ణవిధానం, కులాలు-మతాలు వ్యతిరేకంగా పోరాడారు. భగవంతుడొక్కడే. అతడి ముందు అందరూ సమానమే అని బోధించారు. పంచములు, మహమ్మదీయులతో పాటు కుల, మత భేదాలు లేకుండా అందరూ ఈ ఉద్యమాలలో ఉన్నారు. వృత్తి కారుల పరిమిత వాణిజ్యం అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో కుల, వర్ణ భేదాల హద్దులను చెరిపే ఈ ధోరణులు వచ్చాయి. వ్యాపారం విస్తరిస్తున్నదశలో సంచారాలు చేయవలసిన పరిస్థితిలో భక్తకవులు విగ్రహారాధనను నిరాకరించారు. స్థిరమైన ఆర్థిక వ్యవస్థ, కదలని గ్రామీణ వ్యవస్థ ఉన్న సమాజాలలో విగ్రహా రాధన ఉంది. సంచార జాతులలో పుట్టిన మతాలలోనే విగ్రహారాధన ఉన్నట్టు కనిపించదు. అందువల్ల విగ్రహారాధన నిరాకరణలాంటి వాటిని కేవలం మహమ్మ దీయ మత ప్రభావానికి సంబంధించినవిగా సమన్వయం చేయలేం. తెలుగులో సర్వకులసమానత్వం మొదలైన భావాలు అన్నమయ్యవంటి భక్త కవులలోనూ కనిపిస్తాయి. కులంతో ఆధిపత్య వ్యవస్థను, కులభేదాలను, మత కర్మకాండల్ని ఖండించటం వేమన, వీరబ్రహ్మం మొదలైన కవులు, వృత్తి

కారణమైన వర్ణవ్యవస్థనుంచి మొదలయ్యాయి. పాతవ్యవస్థ శిథిలంలో నూతన వ్యవస్థ ఆవిర్భావానికి మూలాలు ఉంటాయి. వేమనాదులు పాతవ్యవస్థలోని అనుచితాలను ప్రశ్నించారు. కాని వారిలో నిర్మాణాత్మకతలేదు. పందొమ్మిదవ శతాబ్దం మధ్య భాగం నాటికి నిర్మాణాత్మకమైన సంఘసంస్కరణోద్యమాలు యూరోపులో అభివృద్ధి చెందిన సామాజిక వ్యవస్థలు ఆదర్శంగా వచ్చాయి. మారుతున్న ఆర్థికవ్యవస్థ పూర్తిగా ఏర్పడకపోయినా శతాబ్దం పూర్వభాగంనాటికి ఈ దేశంలో ఆధునికతా లక్షణాలు విస్తరించాయి.

ప్రొటెస్టెంటిజంకు, భక్తి ఉద్యమాలకు సాన్నిహిత్యంతోపాటు తేడాలు కూడా ఉన్నాయి. దాదాపు యూరోప్‌లో పునరుజ్జీవనం, సంస్కరణలు, ప్రొటెస్టెంటిజం మొదలైనవాటి సమకాలంలోనే ఇక్కడ భక్తి ఉద్యమాలు వచ్చాయి. అక్కడి ఉద్యమాలు మేధావివర్గంనుంచి వచ్చాయి. ఇక్కడ కింది వర్ణాలనుంచి, వృత్తికారులనుంచి వచ్చాయి. అక్కడ మతాధిపతుల ఆధిపత్యాన్ని ఖండించాయి వాటి సహకారం ఉన్న ఫ్యూడలిజాన్ని వ్యతిరేకించాయి. ప్రొటెస్టెంటిజం మౌలిక జీసస్ సూక్తులనే మూలానికి వెళ్ళాయి. భక్తిమార్గం వేదాలజోలికిగాని, భగవద్గీత జోలికిగాని పోలేదు. ఆధునిక కాలంలో మంత్రతంత్ర అర్చనలను, వివేకానందమార్గం వేదాల మౌలిక స్వరూపం అనే భావాన్ని ప్రవేశపెట్టాయి. జాతీయోద్యమ కాలంలో కొంతవరకు ఈ భావాల పునరుద్ధరణ జరిగింది. భక్తి తత్త్వకవుల భావాలలో తాత్త్వికస్థాయిలో వైరాగ్యం భావాల ప్రభావం వున్నా, సామాజిక స్థాయిలో వారి భావాలు భౌతిక జీవనానికి సంబంధించినవి; మానవతా వాదానికి, మానవులలో సర్వసమానత్వానికి సంబంధించినవి. వారు ప్రచారం చేసిన సామాజిక తత్త్వానికి సమకాలీన చరిత్రలో ఆర్థిక పునాదులున్నాయి. అందులో ఆధునికతా ఛాయలు వున్నాయి.

ప్రొటెస్టెంటిజంతో పోలిస్తే భక్త, తత్త్వకవుల వాణి నిమ్నమైన ప్రజావాణి. కింది వర్ణాలకు సంబంధించినవారుగా ఛాందసాన్ని వారు చాలా తీవ్రంగా ఎదుర్కోవలసివచ్చింది. ఆర్థిక రంగంలో పరిమిత రీతిలో గ్రామాలను, పట్టణాలను కలిపే స్థితిలో ప్రారంభమైన వర్తకవ్యవస్థ అంతకంటే ముందుకుపోలేదు. అదనపు ఆదాయాన్ని పెట్టుబడులుగా ఉపయోగించే పెట్టుబడిదారీ వ్యవస్థగా అది అభివృద్ధి చెందలేదు. బలమైన వ్యాపారవర్గంగా అభివృద్ధి చెందలేకపోవటంవల్లనే బలమైన

భూస్వామ్య విలువను ఎదురొడ్డలేకపోయారు. మధ్యయుగపు నిరంకుశత్వానికి నిరసన మాత్రమే కాక తెలియజేయగలిగారు. సాంప్రదాయిక గ్రామీణ వ్యవస్థ లోని మారలేని గుణం, సముద్రయానాల నిషేధాలు కూడా ఈ దేశంలో బలమైన వ్యాపారవర్గం రూపొందలేకపోవటానికి కారణాలు అయివుంటాయి. ఈ దేశంలో వ్యాపార వ్యవస్థ వుంటూ వుంటున్న దశలోనే బలమైన విదేశీయులు భారత వ్యాపార రంగంలో ప్రవేశించారు. అందువల్ల భూస్వామ్యవర్గం, విదేశీయ వ్యాపార వర్గం అనే రెండు చక్రాల కింద వృత్తికారులు, చిన్న వ్యాపారులు దెబ్బతిన్నారు. అది పలాయనవాదంలోకి, నిరాశావాదంలోకి దారితీసింది. వ్యక్తి ముక్తిలోకి మళ్లింది. ఆత్మవిశ్వాసంలోంచి పుట్టిన వ్యక్తిస్వాతంత్ర్యవాదానికి బదులుగా చాలామంది మోక్షమార్గాలలోకి ప్రవేశించారు. ఆధ్యాత్మికంగా ఈ సమాజంలో స్త్రీ స్వతంత్రత లేకుండా కనిపిస్తుంది. ఈ నిరాశావాదమంతా పరబ్రహ్మం అనే వారి భవిష్య ద్దానం, అనిశ్చితమైన ఈ సమాజాన్ని ఉద్ధరించే దారిలో పుట్టుకొచ్చే భావాలు బయలుదేరాయి. భక్తి, తత్త్వచింతన ఉద్యమాలు విప్లవానికి పెద్దగా దెబ్బ తీయలేదు. దీనికి కారణం ఆర్థిక పునాదిలో దానికి తగిన బలమైన మార్పులు రాక పోవటమే. భూస్వామ్య వ్యవస్థ శిథిలమౌతున్న దశలో అగ్రవర్ణాల ప్రాధాన్యం సహజంగానే క్షీణించింది. సాంప్రదాయిక విద్యమీద, మత వృత్తులమీద ఆధార పడిన అగ్రవర్ణంలో సంప్రదాయ మౌఢ్యాలను, స్త్రీ విషయకమైన దురాచారాలను దారితీసింది. అందువల్లనే ఆధునిక యుగంలో మొదటిదశలో సంస్కరణలను అగ్ర వర్ణంలో మౌఢ్యాలను రూపుమాపటం, స్త్రీ సమానత్వం మాత్రమే ముఖ్య లక్ష్యాలుగా ఉన్నాయి. ఏ కారణాలవల్ల మొదటి దశలో సంఘ సంస్కరణలు వచ్చాయో ఆ కారణాలు కింది కులాలలో లేవు. వారి సమస్యలు పూర్తిగా భిన్నమైనవి. ప్రధానంగా ఆర్థికమైనవి.

భారత దేశంలో సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థను భేదించింది వలస ఆర్థిక వ్యవస్థ. వలస ఆర్థిక ప్రయోజనాలు ఈ దేశంలో యంత్ర పరిశ్రమలు, రైల్వే మొదలైన రవాణా సౌకర్యాలు, తంతి, తపాలా సౌకర్యాలు, వలస విద్యావిధానం ప్రవేశించటానికి కారణం అయ్యాయి. ఉపరితల సంస్కరణల ద్వారా ఆధునికత ఇక్కడ ప్రవేశించినా ఆర్థిక పరిస్థితులలో వచ్చిన మార్పులనుబట్టి ఇక్కడ ప్రస్తుతం మనం పేర్కొంటున్న ఆధునికత రూపొందింది. ఆర్థికరంగంలో, విధా

నాలుగోది వైరుధ్యాలు సామాజిక రంగంలో కనిపిస్తాయి. అందువల్లనే పై స్థాయిలో ఆధునిక జీవనం, ఆధునిక భావాలతోపాటు భూస్వామ్య వ్యవస్థ భావ ప్రతిబింబాలైన ఆలోచనా ధోరణులు కూడా చాలా యాంత్రికంగా ఒకే చోటలో కని పిస్తాయి.

ఆధునికతా పరిణామంలో ముఖ్యమైన లక్షణం మారుతున్న ఆర్థిక పరిస్థితులు ఆధారంగా స్త్రీల పరిస్థితి మారుతుంటే కొంత మెరుగు పడటం. మన ఆర్థిక వ్యవస్థ సాంప్రదాయకుల వ్యవస్థకి సంబంధించిన ఆర్థిక పునాదిని దెబ్బ తీసింది. ఆధునిక పరిశ్రమలు, ప్రయాణ సౌకర్యాలు వ్యాప్తి, కులానికి ఉన్న సంబంధాన్ని శిథిలం చేశాయి. మన ఆర్థిక వ్యవస్థ కారణంగా చాలా వృత్తులకు సంబంధించిన కులాలవాళ్ళు ఆ పనులని వృత్తిపరంగా మానివేశారు. కొత్త ఆర్థిక వ్యవస్థలో భిన్న కులాలవారి మధ్య ఒక స్థాయిలో సామాజిక దూరం పోయింది. ఆచరణలో ఈ దూరం ఇంకా కొన్ని స్థాయిలలో కొనసాగుతున్నా, ఆ దూరాన్ని కాదనే ఆలోచనా ధోరణులు ఆధునికతను, నాగరికతను ప్రబల మయ్యాయి. మతం పాత రూపంలో పోయినా కొత్త రూపంలో మత వ్యవస్థలో భాగంగా భిన్న కులాలవారిలో ఆత్మ చైతన్యం పెరిగింది. ప్రయాణ సౌకర్యాలు భిన్న ప్రాంతాలను సంబంధించిన కులాలవారిలో పరస్పరం గుర్తింపును పెంచి ఒక కులానికి సంబంధించిన వారిమనే చైతన్యాన్ని పెంచింది. శాఖా భేదాలు పోయి ప్రధాన కులకు సంబంధించినవారు ఒకటి కావటానికి ప్రయత్నాలు జరిగాయి. ఈ రూపంలో పునరుద్ధరణ పొందిన కుల చైతన్యం స్వాతంత్ర్యానంతరం రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రూపంలోకి పరిణమించింది. రాజకీయరంగంలోని పోటీ లలో కులాలు మరింత గట్టిపడ్డాయి. భిన్న రంగాలలోని ఆధునికీకరణ సంస్కృతీ కరణకు దారితీసింది. సర్వసమానత్వం అన్న ఆధునిక ఆలోచనా ధోరణి భిన్న కులాలవారు పై కులాల వారితో సమానంగా గుర్తింపు కోసం ప్రయత్నం చేయటానికి దారి తీసింది. పైకులాల వారిని సాంస్కృతికంగా అనుకరించటం సమానతకు చిహ్నం భావించటం జరిగింది. ఆధునికీకరణ కులాలను ఒక రూపంలో పోగొట్టి మరో రూపంలోకి తీసుకొని వచ్చింది. అన్నిరంగాలలోను పునరుద్ధరణ ధోరణులు బయలుదేరటానికిగల కారణాలలో మొదటిది వలస ఆర్థిక వ్యవస్థ, ఆ తరువాత వివిధ్న వర్గాల ఆర్థిక ప్రయోజనాలు.

1857

సురేశ్ తెలుగునాటి చరిత్రకు 187[illegible]ను సరిహద్దుగా గ్రహించటం స్థూల దృష్టితో చేసింది మాత్రమే. సుమారుగా ఈ కాలంలోనే ఆర్థిక విధానాలలో, సాంస్కృతిక వైఖరిలో, సామాజిక రంగంలో వలస పాలకుల విధానాలలో ముఖ్యమైన మార్పులు వచ్చాయి. భారతీయుల, ముఖ్యంగా మధ్యతరగతి మేధావుల ఆలోచనలలో చాలా మార్పులు వచ్చాయి. ఉత్తర, మధ్యభారత ప్రాంతాలలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకమైన తిరుగుబాటు 1857లోనే వచ్చింది. వలస పాలనలో మార్పులు రావటానికి అది ఒక ముఖ్య కారణం. దీని ఫలితంగా విధానాలలోని మార్పుల ప్రభావం మొత్తం భారతదేశం అంతా కనిపిస్తుంది.

1857లో వచ్చిన తిరుగుబాటు కేవలం సిపాయిలు మాత్రమే కాదు. రైతాంగం, వృత్తికారులు కూడా ఈ తిరుగుబాటులో ఉన్నారు. భారతదేశంలో చాలా ప్రాంతాలలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఒకేసారి చెలరేగిన ఈ తిరుగుబాటునే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అంటున్నారు. తుపాకి తూటాకు ఆవు మాంసం, పందిమాంసం పెట్టారన్న అనుమానం, మతదృష్టి ఈ తిరుగుబాటుకు కారణంగా కనిపించినా దీనివెనుక ఆర్థిక కారణాలున్నాయి. సిపాయీలలో చాలా మంది చిన్నచిన్న రైతుకుటుంబాలనుంచి వచ్చినవారున్నారు. బ్రాహ్మణులు మొదలుకొని అన్నికులాలవారు, మహమ్మదీయులు ఇందులో ఉన్నారు. వారి భూమిపైన బ్రిటిష ప్రభుత్వం విపరీతమైన పన్నును వసూలు చేస్తున్నది. చాలా మంది సంస్థానాధీశులలో కూడా బ్రిటిష పాలకుల విషయంలో అసంతృప్తి పెరిగింది. రాచరికం కాలంలో చదువుమీద ఆధారపడ్డ కులాలవారి వృత్తులు క్షీణించాయి. వారి జీవనవిధానం కృశించింది. క్రైస్తవమత వ్యాప్తి కారణంగా హిందూ, మహమ్మదీయమతాలు దెబ్బతింటున్నాయన్న భావం కూడా ఏర్పడింది. అందువల్ల సంప్రదాయ విద్యపైన ఆధారపడ్డ కులాలవారు, రైతులు, మత భేదం లేకుండా వృత్తికారులు మొదలైనవారిలో అసంతృప్తి రాజుకుంది. అంతకుముందే సిపాయిలు చాలాచోట్ల తమ జీతాల పెంపుకోసం పోరాడారు. జమీందార్లకు, వడ్డీ వ్యాపారస్తులకు వ్యతిరేకంగా అనేక రైతుల తిరుగుబాట్లు వచ్చాయి. బ్రిటిష్‌వారి వ్యవసాయ,

ఆర్థిక విధానాల ఫలితంగా ఈ తిరుగుబాట్లు వచ్చాయి. ఆస్తులుపోయిన పాత జమీందారులు, సన్యాసులు, ఫకీర్లు కూడా ఈ తిరుగుబాట్లకు నాయకత్వం వహించారు. బ్రిటిష్ పాలకులపై వ్యతిరేకతకు, తిరుగుబాట్లకు ఉపరితలంలో సంప్రదాయం మీద అభిమానం, విదేశీయ సంస్కృతి, సంప్రదాయాల వ్యతిరేకత కారణాలుగా కనిపిస్తాయి. తరువాత జాతీయోద్యమం కూడా సంప్రదాయమే ప్రధాన ప్రేరణగా నడిచింది. కాని 1857 లో వచ్చిన తిరుగుబాటుకు ముందు ఆర్థికపరంగా వచ్చిన తిరుగుబాట్లెన్నో కనిపిస్తాయి. దేశంలో బ్రిటిష్ పాలన మొదలైన నాటి నుంచీ రైతుల, గిరిజన, ఆదివాసీల పోరాటాలెన్నో జరిగాయి. ఆ పోరాటాలన్నిటికీ ఆర్థిక స్వభావం ఉంది. వాటి పరిణామంగా ఒక స్థాయికి ఎదిగిన పోరాటమే 1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం. అయితే భారతదేశం అంతా ఒకజాతి అన్న భావం ఆనాటికి ఇంకా రూపొందలేదు. కులాల, ప్రాంతాల జాతీయ భావనే ఆనాటికి ఉంది. కేంద్రీకృతమైన బ్రిటిష్ అధికారం ముందు తిరుగుబాట్లు విఫలం అయ్యాయి. బ్రిటిష్ పాలనలో చెప్పుకోదగ్గ మార్పులు రావటానికి మాత్రం అవి కారణాలయ్యాయి.

తెలుగునాడులో 1857 సిపాయి తిరుగుబాటు ప్రభావం ప్రత్యక్షంగా కనిపించకపోయినా సుదీర్ఘమైన పోరాటాల చరిత్ర అంతకుముందు నుంచీ ఉంది. 1802 లో తూర్పు గోదావరిజిల్లాలో చోడవరం తాలూకాలోని రంపప్రాంతంలో రామభూపతి నాయకత్వాన కోయల తిరుగుబాటు జరిగింది. రామభూపతి కొండ రెడ్లు, కోయలు నివసించే స్వతంత్ర పరిపాలన గల ప్రాంతానికి జమీందారు, మునసబుదారు. 1846 లో కోయిలకుంటకు చెందిన పాలెగార్ ఉయ్యాలవాడ నరసింహారెడ్డి నాయకత్వంలో ఇనాం చట్టాలతో విసిగిపోయిన పేద రైతులు వలస పాలకుల సైన్యంతో సాయుధంగా పోరాడారు. ఇది ఒక వీర గాథగా గేయాలరూపంలో నేటికి రాయలసీమలో ప్రచారంలో ఉంది. బ్రిటిషవారు తెలుగు దేశాన్ని ఆక్రమించిన మొదటి దశలోనే కోస్తాప్రాంతంలోని దేశీయరాజులు, జమీందార్లు, పాలెగాళ్లు, మన్నెపుదొరలు అనేక పోరాటాలు, తిరుగుబాట్లు చేశారు. 1768-1888 మధ్య ఉత్తర సర్కారులలో, 1800 తరువాత రాయలసీమలో చాలా తిరుగుబాట్లు జరిగాయి. 1857 లోనే ఆదిలాబాద్ జిల్లాలో గోండులు రాజీ గోండు నాయకత్వంలో బ్రిటిష వారికి వ్యతిరేకంగా పోరాడారు. దీనివల్ల మొదటి నుంచీ ఏదో ఒక రూపంలో బ్రిటిషవారికి వ్యతిరేకత, పోరాటాలు ఉంటూనే

ఉన్నాయని తెలుస్తుంది. అవి సంఘటిత రూపంలో రాకపోవటంవల్ల బలాన్ని పుంజుకోలేకపోయాయి. తెలంగాణంలో మాత్రం 1857 తిరుగుబాటు ప్రభావం ప్రత్యక్షంగా కనిపిస్తుంది. దాని ప్రభావంవల్లనే తుర్రేబాజ్ ఖాన్, మౌల్వీ అల్లా వుద్దీన్‌లు హైదరాబాదులోని రెసిడెన్సీ మీద దాడి చేశారు. కరపత్రాలు పంచారు. తుర్రేబాజ్ ఖాన్‌ని కాల్చి చంపారు. అల్లాఉద్దీన్‌ని అండమాన్‌కు పంపారు.

1858లో సిపాయి తిరుగుబాటు ఫలితంగా కంపెనీ అధికారం పోయి ప్రత్యక్షంగా బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశపు పాలనాధికారాన్ని స్వీకరించింది. ఈస్టిండియా కంపెనీ అధీనంలోని దేశం అంతా ప్రత్యక్షంగా బ్రిటిష్ సార్వ భౌమాధికారం కిందికి వచ్చింది. అంతకుముందు కంపెనీ వసూలు చేస్తుండిన శిస్తుల, పన్నుల వసూళ్ళు బ్రిటిష్ ప్రభుత్వం పేరనే ఇప్పుడు జరుగుతాయి. స్థానిక సంస్థానాధిపతులతో కంపెనీ చేసుకున్న ఒప్పందాలను గుర్తిస్తామని, గౌరవిస్తామని, భూములపైన స్థానిక ప్రజల హక్కులను గుర్తిస్తామని, గౌరవిస్తామని, వారి విశ్వాసాలను, సంప్రదాయాలను కూడా గౌరవిస్తామని, అనువంశికంగా సంక్రమించిన ఆస్తులను అనుభవించే అధికారం స్థానికులకు ఉంటుందని, ప్రభుత్వోద్యోగాల విషయంలో చిన్నచూపు చూపటంగాని, భేదభావం చూపటంగాని జరగదని, భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను కాపాడటం జరుగుతుందని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. భారతదేశంలో తమ పరిపాలన సజావుగా సాగాలంటే, స్థానికుల నుండి ప్రతిఘటన ఏర్పడకుండా ఉండాలంటే భారతీయుల విశ్వాసాలలో, సాంఘికాచారాలలో జోక్యం కలుగచేసుకోకుండా ఉండాలని భావించటంవల్ల ఈ కొత్త విధానాన్ని వారు అనుసరించారు. ఇదే సమయంలో బ్రిటిష్ వారి ఆర్థిక విధానాలలో ప్రధానమైన మార్పులు వచ్చాయి. 1857 నాటికి భారతదేశంలో వ్యవసాయం దెబ్బతిన్నది. చేతివృత్తులు క్షీణించాయి. చేనేత పరిశ్రమ దెబ్బతిన్నది. స్థానికంగా గ్రామీణ వ్యవస్థ పూర్తిగా శిథిలమైంది. పన్నులు డబ్బుల రూపంలో వసూలు చేసే పద్ధతి స్థిరపడింది. భూమి కూడా మారకపు సరుకుగా మారింది. భారతీయ వ్యవసాయం ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్మాణంలో భాగం అయింది. ఎగుమతులకు చేతి పరిశ్రమల ఉత్పత్తులను చేసే దేశంగా, వ్యవసాయ దేశంగా ఉన్న భారతదేశం మార్కెట్ అయింది. వ్యవసాయ రంగంలో జమీందారీ, రైత్వారీ పన్నుల విధానాలవల్ల రైతులు చితికిపోయారు. కరువుకాటకాలు విజృంభించాయి. 1828-33 లో వచ్చిన నందనకరువు వచ్చింది. బ్రిటిష్

మార్కెట్‌గా భారతీయుల కొనుగోలు శక్తిని కూడా పెంచటం బ్రిటిష్ ప్రభుత్వానికి అవసరం అయింది. 1852 నాటికి రాజమండ్రి దగ్గర గోదావరి దగ్గర ధవళేశ్వరం ఆనకట్ట, 1855 నాటికి విజయవాడ దగ్గర కృష్ణానదికి ఆనకట్ట సర్ ఆర్థర్ కాటన్ ఆధ్వర్యంలో నిర్మాణం అయ్యాయి. దీనివల్ల కోస్తాప్రాంతాలు కొంతవరకు బాగు పడ్డాయి. కాని బ్రిటిష్ ప్రభుత్వం బ్రిటిష పారిశ్రామికుల ఆర్థిక అవసరాలకు అనుగుణంగా వాణిజ్య పంటలైన పత్తి, చెఱకు, పొగాకులను ప్రోత్సహించారు దీనివల్ల ఆహారానికి కొరత ఏర్పడింది. ఆ కాలంలో చాలా మంది బర్మా, మారిషస్‌లకు వలస వెళ్ళారు. 1850 తరువాత తేయాకు, కాఫీ తోటలు పడ్డాయి. భారతీయులకు టీ, కాఫీలు అలవాటయ్యాయి. మొత్తంమీద అంతకు ముందు విదేశీయులలాగా కాకుండా బ్రిటిష్ పాలకులు తమ దేశ ఆర్థికాభివృద్ధి కోసం భారతదేశాన్ని దోపిడి చేశారు. ఇదే కాలంలో 1853 లో బొంబాయిలో మొట్ట మొదట బట్టల మిల్లు, 1855 లో బెంగాల్‌లో జనపనార మిల్లు ఏర్పడ్డాయి. బొగ్గుగనులు వచ్చాయి. తెలుగుదేశంలో చక్కెర, సిమెంటు పరిశ్రమలు, కొంచం ఆలస్యంగా జనపనార, కాగితపు పరిశ్రమలు వచ్చాయి. నిజాం సంస్థానంలో భాగమైన తెలంగాణాలో చాలా ప్రాంతాలు దేశ్‌ముఖ్‌లు, జమీందార్లు మొదలైన వారి వంశపారంపర్య అధికారంలో ఉండి వారి దుష్పరిపాలనవల్ల ఆ ప్రాంతం ఆర్థికంగా ఇంకా వెనుకబడింది. నిజాం సంస్థానం ఎప్పుడూ అప్పులలోనే ఉండేది.

ఆర్థిక వలసీకరణలో భాగంగా దేశంలో రైలుమార్గాలు, తంతి తపాలా సౌకర్యాలు ప్రారంభమయ్యాయి. బ్రిటిష్ ఉత్పత్తులను పెద్దఎత్తున దేశం అంతా పంపటానికి, ముడిసరుకులను సేకరించి పంపటానికి రవాణా సౌకర్యాలు అవసరం. అంతకుముందు పశువులద్వారా సరుకులు రవాణా అయ్యేవి. భారీయెత్తున జరిగే రవాణాకు యాంత్రిక సాధనాలు అవసరం అయ్యాయి. 1853లో బొంబాయి నుంచి థానాకు మొదటిరైలుమార్గం పడింది. ఆ తరువాత మద్రాసుస్టేట్ రైల్వే ఏర్పడింది. తెలుగుదేశంలో మొదట 1862లో పుత్తూరు-రేణిగుంట రైలుమార్గం పడింది. 1871నాటికి తెలుగుదేశంలో రైలుమార్గాలు విస్తరించాయి. నీటి పారుదలకు ఉపయోగించే కాల్వలు కూడా రవాణాకు ఉపయోగపడేవి. 1853లో మొదటి టెలిగ్రాఫ్‌లైను కలకత్తా-ఆగ్రాలమధ్య ఏర్పడింది. పోస్టల్ స్టాంపులు ప్రవేశించాయి. రవాణా, తంత్రీసాధనాలు పరిపాలనాపరంగా దేశాన్ని ఒకటి

చేశాయి. ఆధునికతా పరిణామానికి ఆధునిక జాతీయతా దృక్పథం ఏర్పడటానికి కారణం అయ్యాయి.

మెకాలే ప్రతిపాదనల ఆధారంగా విలియంబెంటింక్ భారతదేశంలో 1835లో ఇంగ్లీషు విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాడు. 1835నాటికి స్థానిక విద్వాంసులను ప్రోత్సహించటం, ప్రాచీన సాహిత్యాన్ని ఉద్ధరించటం, దేశభాషల్ని పాలనా భాషగా ఉపయోగించటం, వాటి అభివృద్ధికి దోహదం చేయటం ఉండేది. మద్రాస్ గవర్నర్ సర్ థామస్‌మన్రో 1820లలో ప్రతిజిల్లాలో ఒక సంస్కృత పాఠశాలను, అరబిక్ పాఠశాలను ప్రారంభింపజేశాడు. ఆకాలంలో భారతీయ సాంప్రదాయక విద్యఅంటే ఈ భాషలలోని మతవిద్య, వ్యాకరణ, తర్క, మీమాంసాది శాస్త్రాలు మాత్రమే. కాని మన్రో ప్రవేశపెట్టిన పాఠశాలలకు తగిన ప్రోత్సాహం లభించలేదు. దేశీయ భాషలలో విజ్ఞానంగాని, కొత్తసాహిత్యంగాని లేదని, దేశభాషల ద్వారా ఉన్నత విద్య సాధ్యంకాదని మెకాలే అభిప్రాయపడ్డాడు. భారతీయులకు సంస్కృతం, అరబిక్‌లను నేర్పటంకంటే ఇంగ్లీషును నేర్పటం అవసరమని, ఇంగ్లీషులోనే మేధస్సుకు, విజ్ఞానానికి సంబంధించిన విషయాలున్నాయని, అది భారత దేశంలో పరిపాలనాభాషగా, వ్యాపారభాషగా రూపొందే అవకాశముందని, భారతీయులను ఇంగ్లీషులో పండితులుగా తయారుచేసే అవకాశం ఉందని, అలాంటి వారు పాలకులకు, పాలితులకుమధ్య వారధులుగా ఉపయోగిస్తారనీ కూడా మెకాలే అభిప్రాయపడ్డాడు "రంగులో, రక్తంలో భారతీయులుగా ఉంటూనే ఆలోచనల్లో అభిరుచుల్లో, నీతుల్లో, భావాల్లో ఇంగ్లీషువారుగా తయారుచేసే విధంగా విద్యావిధానం ఉండా"లని మెకాలే అంటాడు. వలస పాలకుల ప్రయోజనాలు ఈ భావాల్లో స్పష్టంగా కనిపిస్తాయి. 1857నాటికి మద్రాసు, కలకత్తా, బొంబాయిలలో విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి. అంతకుముందే క్రైస్తవమత ప్రచారకులు, మిషనరీలు ఆధునిక పాఠశాలలను, వైద్యశాలలను తెరిచారు. దీనివల్లకూడ వలసీకరణలో భాగమైన ఆధునీకరణ జరిగింది. బ్రిటిష్ ఉత్పత్తులను కొనుగోలుచేసి ఉపయోగించేవారుగా భారతీయులు రూపొందటంకూడా వలస ఆధునీకరణలో ఒక భాగం. తెలుగుదేశంలో 1826 నుండే కాకినాడ, నర్సాపూర్, రాజమండ్రి, నెల్లూరు, బందరులలో మిషనరీలు విద్యాలయాల్ని స్థాపించారు. 1854లో మద్రాసురాష్ట్రంలో విద్యాశాఖ ఏర్పడింది. అదే సంవత్సరం బందరులో నోబుల్ కళాశాల ఏర్పడింది. తరువాత రాజమండ్రి, విశాఖపట్టణం, విజయనగరం మొదలైన

క్రైస్తవేట్ల పాఠశాలలు ఏర్పడ్డాయి. ఉపాధ్యాయ శిక్షణ పాఠశాలలు ఏర్పడ్డాయి. తెలంగాణా ప్రాంతంలో హైదరాబాద్‌లో 1834లో సెయింట్ జార్జి గ్రామర్ పాఠశాల, 1855లో రోమన్‌కాథలిక్‌ల ఆల్ సెయింట్ పాఠశాల ఏర్పడ్డాయి. 1887లో నిజాం కళాశాల మొదలైంది. కాని ఈ ప్రాంతంలో పోలీసు చర్య వరకు హైదరాబాదులో తప్ప అంతగా విద్యావ్యాప్తి జరగలేదు.

సమకాలీన భారతీయ సమాజంలోని అస్తవ్యస్త స్థితి, ముఖ్యంగా అగ్ర కులాలలోని మూఢ భావాలు, దురాచారాలు, బాల్య వివాహాలు, బాల్య వైధవ్యాలు, స్త్రీల అవిద్య, అజ్ఞానం మొదలైనవి పోవాలంటే, దేశం పురోగమించాలంటే ఆధునిక విద్యావిధానం, ఆలోచనా విధానం అవసరమని కొందరు భారతీయ మేధావులు భావించారు. ఈ దేశంలో ఆధునికీకరణకు ప్రధాన సాధనం పాశ్చాత్య ఆలోచనా విధానమని ఈ మేధావులు నమ్మారు. 19వ శతాబ్దం మొదటి దశాబ్దాల నాటికే బెంగాల్‌లో రాజా రామమోహన్ రాయ్ వంటి వారు ఆధునికీకరణను సంస్కరణల రూపంలో ఒక ఉద్యమంగా ప్రారంభించారు. ఆధునిక పెట్టుబడిదారీ విధానం ఆవశ్యకతను గురించి చెప్పారు. స్త్రీ పురుషుల సాంఘిక సమానత్వం, కులవ్యవస్థ, మూఢ విశ్వాసాల వ్యతిరేకత, హేతుబద్ధమైన శాస్త్రీయ దృక్పథం, మతాలలో నైతిక సూత్రాలనుకున్న వాటినే స్వీకరించడం, విగ్రహారాధన వ్యతిరేకత, ఏకేశ్వరోపాసన మొదలైనవి వారి సంస్కరణలలోని ప్రధానాంశాలు. బహుభార్యాత్వ వ్యతిరేకత, హేతువాదం, అంతర్జాతీయ దృక్పథం, ప్రజాస్వామ్య భావాలు ఆధునిక భావాలుగా వారు ప్రచారం చేశారు. పత్రికా రచనను దీనికి సాధనంగా చేసుకున్నారు. దేశంలో ఐకమత్యం లేకపోవడానికి, అసమానతలకు మత భేదాలే కారణమని కూడా వారు చెప్పారు. ప్రాచ్యపశ్చిమ ఆలోచనా విధానాలను సమన్వయించి, విభిన్న మత సిద్ధాంతాలతో 1828లో రాజా రామమోహనరాయ్ బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ఈ ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకువెళ్లారు. తెలుగు దేశానికి సంబంధించినంత వరకు 1867 నాటికే ఆధునిక సంస్కరణ భావాలు ప్రవేశించాయి. రాజమండ్రిలో ఫస్ట్‌క్లాస్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ పదవిలో ఉన్న సామినేని ముద్దు నరసింహనాయనింగారు ప్రమేయం అన్న పేరుతో 1842-47 మధ్య 'హితవాది' అన్న పత్రికలో కొన్ని వ్యాసాలు ప్రకటించారు. 1862లో ఆ ప్రమేయమే 'హిత సూచని' అన్న పేరుతో సంకలనంగా వచ్చింది. శిష్ట

వ్యవహారికానికి దగ్గరగా ఉన్న భాషలో రాసిన ఈ వ్యాసాలలో హేతువాదం, సంస్కరణ ప్రియత్వం, మూఢ విశ్వాసాల ఖండన, వైజ్ఞానిక దృష్టి మొదలైనవి కనిపిస్తాయి. కన్యాశుల్కం, బాల్య వైధవ్యం, స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహం మొదలైన అంశాలు కూడా ఇందులో ఉన్నాయి. ఏనుగుల వీరాస్వామి 'కాశీ యాత్రా చరిత్ర'లో కూడ సంఘ సంస్కరణ భావాలున్నాయి. సతీ సహ గమనానికి మూలస్మృతి ప్రమాణం లేదని ఇందులో ఆయన చర్చించాడు. హిందూ మతంలోని మూఢాచారాలు చాలా అపరాధంగా తోచి భగవంతుడే ఈ కర్మ భూమిని పాలించటానికి ఇంగ్లీషు వారిని పంపాడని ఏనుగుల వీరాస్వామి అభి ప్రాయం వెలిబుచ్చాడు.

1851 నాటికే భారతదేశంలో రాజకీయ సంఘాలు ఏర్పడ్డాయి. 1851 లో బెంగాల్‌లో బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్, 1852 లో బొంబాయిలో బొంబాయి అసోసియేషన్ ఏర్పడ్డాయి. ఈ సంఘాలలో సాంప్రదాయక మేధావులు, భూస్వాములు, బొంబాయిలోని పెద్ద వ్యాపారులు సభ్యులుగా ఉండేవారు. దీని పరిణామమే ఇంగ్లీషు చదువుకున్న మధ్య తరగతి మేధావులతో 1876 లో కలకత్తాలో సురేంద్రనాథ బెనర్జీ అధ్వర్యాన ఏర్పడ్డ ఇండియన్ అసోసియేషన్. 1855 నాటికే జాతీయతా భావధోరణులతోపాటు హిందూ పునరుద్ధరణవాద ధోరణులు కూడా తలఎత్తాయి. ఇదే కాలంలో గాజుల లక్ష్మీ నరసు సెట్టి మొదలైనవారు మద్రాస్ నేటివ్ అసోసియేషన్ స్థాపించారు. ఈ సంఘంలో ఎక్కువగా వ్యాపారస్తులుండేవారు. గాజుల లక్ష్మీనరసు సెట్టి వృత్తి, నీలిమందు వ్యాపారంలో బాగా డబ్బు సంపాదించాడు. ఇంగ్లీషువాని పోలీసులకు, రైతులకు ఇంగ్లీషులో అర్జీలు తయారు చేయించి సహాయం చేసే బాధలు పెట్టేవారిని, కొరడా దెబ్బలు మొదలైన శిక్షలను పోగొట్టటానికి ఆయన కృషిచేశాడు. అధికారులను, పార్లమెంటు సభ్యులను స్వయంగా గ్రామాలకు, తీసుకుని వెళ్ళి రైతుల బాధలను గురించి తెలియజేశాడు. రైతుల విషయంలో బ్రిటిష్ పార్లమెంటు కొన్ని కొత్త నిర్ణయాలు తీసుకునేట్టుచేశాడు. క్రైస్తవమతం తీసుకున్నా వంశ పారంపర్యంగా వచ్చే ఆస్తులపైన హక్కు ఉంటుందన్న ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకించాడు. తమమత విశ్వాసాలకు విరుద్ధంగా ప్రవర్తించ మని నిర్బంధించనందు వల్లే 1857 సిపాయి తిరుగుబాటు వచ్చిందని గాజుల

లక్ష్మీనరసు సెట్టి స్వయంగా ప్రతిష్ఠ పొర్లమెంటుకు రాశాడు. తమిళాంధ్రపండితు లెందరినో ఆయన పోషించాడు.

తెలుగుభాషా సాహిత్య పరిశోధన కూడా 1857 కు పూర్వమే ఇంగ్లీషు అధికారుల ఆధ్వర్యంలో ప్రారంభమైంది. 1784లో ఏసియాటిక్ సొసైటీ స్థాపించిన సర్ విలియంజోన్స్ 1786 లో ఒక ఉపన్యాసంలో సంస్కృతానికి గ్రీక్, లాటిన్ భాషలతో పోలికలున్నాయని ఈ భాషలు ఒకే మూల భాషనుంచి వచ్చాయని మొదటి సారిగా పేర్కొన్నాడు. దీనితో తులనాత్మక భాషాశాస్త్రానికి తోవ పడింది. ఇంగ్లీషు వారికి దేశీయ భాషల అధ్యయనంపైన ఆసక్తి పెరిగింది. తెలుగు, తమిళం మొదలైన దక్షిణభారత భాషల అధ్యయనం కూడా ప్రారంభమైంది. కర్నల్ కాలిన్‌మెకంజీ, విలియంబ్రౌన్, ఏ. డి. కాంప్‌బెల్, ఫ్రాంసిస్ ఎల్లిస్, సి. పి. బ్రౌన్ తెలుగు భాషకు సంబంధించి కృషి చేశారు. వారికి స్థానిక పండితులు సహాయ పడ్డారు. స్థానికులతో, పాలితులతో సంబంధాలు పెట్టుకోవడం, ఇందుకోసం వారి సంస్కృతీ, సంప్రదాయాలను అధ్యయనం చేయటంలో భాగంగా తెలుగు భాషాధ్యయనం ప్రారంభమైంది. 1812 లో మద్రాసులో సెయింట్ జార్జి ఫోర్ట్ కళాశాల ప్రారంభమైంది. అక్కడ ఇంగ్లీషు ఉద్యోగులకు తెలుగు నేర్పటం, అందుకోసం ఇంగ్లీషువాళ్ళు నిఘంటువులను, వ్యాకరణాలను రాయటం ప్రారంభమైంది. పాలన అవసరాల కోసమే తెలుగు భాషాధ్యయనం ప్రారంభమైనా కొందరు తెలుగు భాషా, సాహిత్యాలపైన ప్రత్యేకమైన ఆసక్తి చూపించారు. 1816 లో ఏ.డి. కాంప్‌బెల్ ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణం రాశాడు. దానికి పీఠిక రాస్తూ తెలుగు, తమిళం మొదలైన భాషలలోని సామ్యాలను గురించి చర్చించాడు. అంతకు ముందు విలియంకారె తన తెలుగు వ్యాకరణంలో దక్షిణ భారత భాషలు సంస్కృత జన్యాలని నిరూపించే ప్రయత్నం చేస్తే కాంప్‌బెల్ సంస్కృత జన్యాలు కావని సిద్ధాంతీకరించాడు. కాంప్‌బెల్ వ్యాకరణం పీఠికకు ఒక నోట్ రాస్తూ ఫ్రాంసిస్ వైట్ ఎల్లిస్ తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మొదలైన దక్షిణ భారత భాషలు సంస్కృతంతో సంబంధంలేని భిన్న భాషా కుటుంబానికి చెందినవని మరిన్ని ఉపపత్తులతో ఆ అభిప్రాయాన్ని బలపరచాడు. తరువాత 1856 లో బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ 'కంపారటివ్ గ్రామర్ ఆఫ్ ద్రవిడియన్ ఆర్ సౌత్ ఇండియన్ లాంగ్వేజెస్' వెలువరించి దానికి ఒక రూపం తెచ్చింది.

తెలుగులో స్థానిక చరిత్రలు, గ్రంథాలు, శాసనాలు, నాణాలు సేకరించి భారతీయుల, ముఖ్యంగా తెలుగువారి మత, సాంఘిక, సాహిత్యాది విషయాలను గురించి పరిశోధనచేసినవారిలో కల్నల్ కాలిన్ మెకంజీ ముఖ్యమైనవాడు. తనకు లభించిన స్థానిక చరిత్రలను కొన్ని సంపుటాలుగా ఆయన రికార్డు చేయించాడు. వీటికి సంబంధించిన ఆయన వ్యాసాలు అనేకం పత్రికలలో వచ్చాయి. ఆయన సేకరించిన స్థానిక చరిత్రలను సి. పి. బ్రౌన్ ఉద్ధరించి భద్రపరిచే ఏర్పాట్లు చేశాడు. తెలుగు దేశ చరిత్ర పరిశోధనలకు మొదటితరంలో దోహదం చేసిన వారిలో ఒకరిగా మెకంజీని చెప్పుకోవాలి. కావలి వెంకటబొర్రయ్య, తరువాత కావలి వెంకటలక్ష్మయ్య ఆయనకు సహాయపడ్డారు. కావలి వెంకట రామస్వామి 1829 లో 'బయోగ్రాఫికల్ స్కెచెస్ ఆఫ్ దక్కన్ పొయెట్స్' అన్న పేరుతో ఇంగ్లీషు భాషలో 108 మంది కవుల జీవిత చరిత్రలను ప్రకటించాడు. దాని పీఠికలో ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలను తులనాత్మకంగా పరిశీలించాడు. 1855 లో హెచ్. హెచ్. విల్సన్ న్యాయ, రెవెన్యూ విభాగాలకు చెందిన పదపట్టికలను ప్రకటించాడు.

స్థానికుల భాషా, సాహిత్యాలను అధ్యయనం చేయకుండా సంస్కృతీ, సంప్రదాయాలను అర్థం చేసుకోకుండా వారితో వ్యవహరించటం కష్టమని భావించిన బ్రౌన్ తెలుగు భాషా, సాహిత్యాల విషయంలో చాలా కృషి చేశాడు. ఒక రకంగా వేమన, పోతనాదులకు మూలమైన ప్రాచీన కావ్యాలను, ప్రబంధాలను పరిష్కరించి వ్యాఖ్యానాలతో ప్రకటింపజేశాడు. గ్రంథ పరిష్కరణ రూపంలో తెలుగులో పరిశోధన ప్రారంభమైంది. తెలుగు భాషా సాహిత్యాలు క్షీణ దశకు వచ్చాయని, అర్థం చెప్పేవారు కూడా లేకుండా పోయారని సి.పి. బ్రౌన్ అన్నాడు. ఆంధ్ర మహాభారత పరిష్కరణకు బ్రౌన్ అంకురార్పణ చేశాడు. భాగవత పరిష్కృత పాఠాన్ని తయారు చేయించాడు. రెండువేలకు పైగా వేమన పద్యాలను సేకరించి ప్రకటించాడు. రాజుల, జమీందారుల ఆశ్రయాలను కోల్పోయిన పండితులెందరో బ్రౌన్ దగ్గర పని చేశారు. రావిపాటి గురుమూర్తిశాస్త్రి, పాటూరు రామస్వామి శాస్త్రులు, వేతపూడి సుందరరామయ్య, జూలూరి అప్పయశాస్త్రి తెలుగుభాషా, సాహిత్యాల పరిశోధనలో ఆయనకు తోడ్పడ్డారు. ఇంగ్లీషువారు తెలుగు నేర్చుకోవటానికి వ్యాకరణాలు తయారుచేశాడు. ఛందస్సును గురించి చర్చించాడు. ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులను తయారు

చేసింది. గ్రంథపరిష్కరణ, పరిశోధన, నిఘంటు నిర్మాణం మొదలైనవి అధునాతన కళా పరిణామంలో భాగం. ఆధునిక దృష్టితో భాషను గురించి ఆలోచించటం ఇప్పుడే ప్రారంభమైంది. 1857 కు పూర్వం దేశభాషా సాహిత్యాలపైన ఆంగ్లేయులు చూపిన శ్రద్ధ, తరువాత తమ భాషా విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టటంగా మారింది.

1857 కు ముందు చక్కని వ్యావహారికంలో వచన రచనలు వచ్చాయి. సమకాలీన చరిత్రకు, ఆర్థిక, సామాజిక పరిస్థితులకు ప్రతిఫలనమైన ఏనుగుల వీరాస్వామి 'కాశీయాత్రా చరిత్ర' వ్యావహారికంలో ఉంది. రావిపాటి గురుమూర్తి శాస్త్రి 1819 లో రాసిన 'విక్రమార్క కథలు', 1834 లో రాసిన 'పంచతంత్ర కథలు' వ్యావహారిక భాషలోనే ఉన్నాయి. ఈ పుస్తకాలు పాఠ్య గ్రంథాలుగా ఉండేవి. ఆ రోజులలో 'వృత్తాంతిని', 'వర్తమాన తరంగిణి' మొదలైన పత్రికల లోని భాష కూడా వ్యావహారికానికి దగ్గరగా ఉండేది. అర్జీలు, ఉత్తరాలు, డాక్యు మెంట్లు కూడా సాధారణ భాషలోనే ఉండేవి. 1853 లో వచ్చిన రావిపాటి గురు మూర్తి శాస్త్రి శిష్యుడు చిన్నయసూరి 'నీతిచంద్రిక'తో తెలుగు వచన రచన వ్యావహారికానికి దూరమైంది. పాఠ్యపుస్తకాలు గ్రాంథికంలో రావటం మొదలు పెట్టాయి. గ్రంథ పరిష్కరణలు, కావ్యాలు పద్ధతిలో గ్రాంథిక భాషా రచనలను దాటిరీసి భాషా పునరుద్ధరణగా పరిణమించింది. 1820 లో ప్రారంభమైన 'మద్రాస్ స్కూల్ బుక్ అండ్ వర్నాక్యులర్ సొసైటీ' 1845 లో చిన్నయ సూరి అధ్యక్షం కిందికి వచ్చింది. 1858 లో సూరి 'బాల వ్యాకరణము' అచ్చయింది. తరువాత వ్యావహారిక భాషోద్యమం ఒక ఉద్యమంగా రావలసివచ్చింది.

1746–47 లో బెంజమిన్ షుల్ట్జ్ అనువాదంలో తొలి తెలుగు బైబిలు జర్మనీలోని హాలె నగరంలో అచ్చుయంత్రంతో తెలుగు ముద్రణ ప్రారంభమైంది. 1816 నాటికి మద్రాసు కళాశాల లో ముద్రణ సౌకర్యాలు ఏర్పడ్డాయి. క్యాంప్ బెల్ వ్యాకరణం, సి. పి. బ్రౌన్ మొదలైన వారి గ్రంథాలు అక్కడి నుంచే వచ్చాయి. 1812లోనే బళ్లారిలో, తరువాత తిరుపతిలో, విశాఖపట్నంలో ముద్రణ సౌకర్యాలు ఏర్పడ్డాయి. 1831లో తొలి క్రైస్తవ పత్రిక వెలువడింది. 1835లో బళ్లారి నుంచి 'సత్యదూత', 1848లో మద్రాసు నుంచి 'హితవాది' పత్రికలు వెలువడ్డాయి. 1844 లో గాజుల లక్ష్మీనరసుసెట్టి 'క్రెసెంట్' అనే ఇంగ్లీషు

పత్రికను ప్రారంభించాడు. మొట్టమొదటి దేశీయ తెలుగు వార్తాపత్రిక 'వృత్తాంతిని' 1838 లో మద్రాసులో ప్రారంభమైంది. 1842 లో 'వర్తమాన తరంగిణి' వచ్చింది.

### మారిన వలస విధానం

1857 తరువాత వలస పాలనలో భాగంగా బ్రిటిష్‌వారు ఆర్థిక, సామాజిక రంగాల్లో రెండు భిన్నమైన పద్ధతులను అనుసరించారు. వలస పాలకులు ఆర్థిక సామాజిక రంగాలలో ఏ విధానాన్ని అవలంబించినా అవి వారి ప్రయోజనాలకు అనుగుణంగానే ఉంటుంది. ఆర్థికరంగంలో బ్రిటిష్ పారిశ్రామికుల ప్రయోజనాలకు అనుగుణమైన విధానాలనే బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించింది. తమ పాలనా వ్యవస్థలో ఉద్యోగులుగా పనిచేయటానికి అనుగుణంగా ఆంగ్ల విద్యావిధానాన్ని ప్రవేశపెట్టింది. భారతీయ వస్త్రాలను బ్రిటన్‌లో అమ్మటానికి బ్రిటిష్ పార్లమెంట్ ఆంక్షలు విధించింది. బ్రిటిష్ యంత్రాలు, పనిముట్లు కూడా దిగుమతి కావటం మొదలు పెట్టాయి. ఆర్థిక వలసీకరణ పూర్తి కావటానికి రైల్వేలు తోడ్పడ్డాయి. స్వేచ్ఛావాణిజ్య పద్ధతి ప్రవేశపెట్టి బ్రిటన్ నుంచి దిగుమతి అయిన వస్తువులకు పన్నులు తగ్గించటం జరిగింది. చవకగా దిగుమతి అయిన వస్తువులను దేశం అంతా చవకగా సరఫరాచేసి దేశీయ చేతి ఉత్పత్తులకంటె చవకగా అమ్మటానికి రైల్వేల ప్రవేశం వల్ల అవకాశాలు ఏర్పడ్డాయి. ఎగుమతికోసం పత్తి మొదలైన ముడి సరుకుల ఉత్పత్తికి ప్రాధాన్యం ఏర్పడింది. ఆహార కొరత, కరువులు ఏర్పడ్డాయి. వ్యవసాయ రంగంలో 1870 తరువాత భూములను సర్వేచేసి, పన్నుల సెటిల్‌మెంట్ జరిగినా రైతుల పరిస్థితి బాగుపడలేదు. రైతుల స్థానంలో రైతు కూలీల సంఖ్య పెరిగింది. భారతదేశంలో కొన్ని భాగాలలో క్రమంగా దేశీయులైన వర్తకులు, వడ్డీ వ్యాపారులు, కొంతమంది జమీందారులు పరిశ్రమలు ప్రారంభించారు. కాని బ్రిటిష్ వారి పరిశ్రమల పోటీని వారు తట్టుకోలేక పోయారు. ఈ పరిశ్రమలు కూడా బెంగాల్, బొంబాయి వంటి కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఏర్పడ్డాయి ఈ కారణంవల్ల దేశంలో అసమానతలకు ప్రారంభం జరిగింది. తెలుగు దేశానికి సంబంధించినంతవరకు గాజుల పరిశ్రమ, కొండపల్లి బొమ్మల పరిశ్రమ, ఇతర చేతి వృత్తులు క్షీణించాయి. బ్యాంకింగ్ ఋణాలు మొదలైన ప్రోత్సాహక విషయాలలో కూడా బ్రిటిష్ ప్రభుత్వం

పక్షపాతం చూపింది. ఉదాహరణగా 1861 లో ఏర్పడ్డ 'ఇండియన్ కౌన్సిల్
ఏక్ట్' వల్ల ఉన్నత తరగతికి చెందిన కొందమందికి మాత్రమే పరిపాలనలో నామ
మాత్రపు ప్రాతినిధ్యం ఇచ్చింది.

తన ప్రయోజనాల కనుగుణంగా వలస పాలన అనుసరించిన విధానాలవల్ల
భారతదేశంలో అనుకూల ఫలితాలు కూడా వచ్చాయి. ఈ ఫలితాలు వలస
పాలకులు ఆశించినవి కావు. యాదృచ్ఛికాలు. బ్రిటీష్ ఏర్పరచిన రవాణా
సౌకర్యాలవల్ల భారతదేశంలోని భిన్న ప్రాంతాలలో ఉన్న [illegible] సంబంధాలు
ఏర్పడ్డాయి. ఇంగ్లీషు విద్యా విధానంవల్ల కొత్తగా మధ్యతరగతి వర్గం బాగా
అభివృద్ధి చెందింది. ఆధునికతలో భాగంగా వస్తున్నటువంటి [illegible] కూడా
ఈ వర్గాలలో ఏర్పడింది. మెల్లగానైన అభివృద్ధి పొందుతున్న పరిశ్రమల [illegible]
కార్మిక వర్గం ఒకటి ఏర్పడింది. వర్తక వ్యాపారానికి కేంద్రాలు పెరిగాయి. [illegible]
విద్యా విధానం కారణాలుగా పట్టణాలు పెరిగి, దానిపైన ఆధారపడిన
సమాజాలు ఏర్పడ్డాయి. ఆర్థిక వ్యవస్థ, స్వతంత్రము పూర్తిగా [illegible] వ్యవస్థ
దెబ్బతిన్నది. లౌకిక విద్యా విధానంవల్ల విద్యాసంస్థలలో, ఉద్యోగ సంస్థలలో
అన్ని కులాలవారికి ప్రవేశాలు లభించాయి. అస్పృశ్యతా నివారణ ఒక నినాదం
అయింది. సహపంక్తి భోజనాలు, కులాంతర, మతాంతర వివాహాలు ప్రారంభ
మయ్యాయి. బహుభార్యాత్వాన్ని వ్యతిరేకించటం, విధవా వివాహాలను ప్రోత్స
హించటం, స్త్రీ విద్యను ప్రోత్సహించటం సంఘసంస్కరణలో భాగం అయింది.
పైవర్గంలో, చదువుకున్నవారిలో అఖిల భారత దృక్పథం ఒకటి ఏర్పడింది.
ఈ స్థాయిలో అఖిల భారత ఆలోచనా విధానం ఏర్పడటానికి కారణం బ్రిటిష్ వారి
కేంద్రీకృత పాలన. సమాజంలో వ్యక్తి స్వేచ్ఛను గురించిన భావాలు, ప్రజా
స్వామ్యాన్ని గురించిన భావాలు నెమ్మదిగానైనా ప్రవేశించాయి. ఆర్థిక రంగంలో
క్రమక్రమంగా వచ్చే మార్పులు పై ధోరణులను మరింత వేగవంతం చేశాయి.
పత్రికలవల్ల రాజకీయ, సాంస్కృతిక చైతన్యం పెరిగింది. సామాజిక విలువలలో
మార్పులు వచ్చాయి. పద్దెనిమిదవ శతాబ్దంలో, పంతొమ్మిదవ శతాబ్దం పూర్వ
భాగంలో లేని పరిస్థితులను సృష్టించినప్పుడు ఇవి ఆధునిక లక్షణాలుగా పేర్కొన
వచ్చు. క్రమంగా అభివృద్ధి చెందిన బ్రిటిష్ పారిశ్రామికులకు, బ్రిటిష్ సామ్రాజ్య
వాదానికి, భారతదేశంలో అప్పుడప్పుడే పెరుగుతున్న దేశీయ పెట్టుబడిదారులకు,
పాలనావ్యవస్థలో భేదభావం పెరగటంవల్ల మధ్య తరగతి మేధావులకు, బ్రిటిష్

వ్యవసాయ విధానాలవల్ల చితికిపోయిన రైతులకు మధ్య వైరుధ్యాలు స్వాతంత్ర్యోద్యమానికి దారితీశాయి. తెలుగుదేశంలో పరిణామాలు అంతగా లేవు. ఇక్కడ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారు, రైతు వర్గానికి సంబంధించినవారు ఎక్కువగా పాత్ర వహించారు.

సామాజికరంగంలో బ్రిటిష్ ప్రభుత్వం 1857 తరువాత భావాత్మకంగా ఆలోచనా విధానాలలో ఆధునికీకరణ ప్రాధాన్యం తగ్గించారు. స్థానికుల ప్రతిఘటనను ఎదుర్కోకుండా ఉండాలంటే వాళ్ళ మత విశ్వాసాలలో, ఆచారాలలో జోక్యం కలుగజేసుకోకూడదని నిర్ణయించుకున్నారు. సామాజిక, సాంస్కృతిక రంగాలలో ఛాందసవాద సంప్రదాయవాదులకు అనుగుణమైన విధానాలనే అనుసరించారు. తన ప్రయోజనాల కోసం స్థానిక భూస్వాములతో, సంస్థానాధీశ్వరులతో బ్రిటిష్ ప్రభుత్వం రాజీపడింది. 1857 కు ముందు తెలుగు భాష ఆధునిక భాషగా రూపొందటానికి దోహదం చేసిన బ్రిటిష్ పాలనావిధానం ఆ తరువాత వ్యావహారిక భాషోద్యమ కాలంలో సంప్రదాయ భాషావాదులకు అనుకూలంగా ఉండే విధానాలను అనుసరించటం దీనికి ఒక నిదర్శనం మాత్రమే. దాని ఫలితం ఈ రోజుకీ తెలుగుదేశంలోని విద్యారంగంలో కనిపిస్తున్నది. దీనికి తోడు బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన పన్నుల ఆర్థిక విధానం కూడా భారతీయులలో సంప్రదాయ దృష్టి పెరగటానికి, గతం మీద మక్కువ ఎక్కువ కావటానికి కారణం అయింది. తమ క్షీణదశకు కారణాలు ఆర్థికమైనవి అయినా బ్రిటిష్ వ్యతిరేకత ప్రధానంగా ఆర్థిక దృష్టితో కాకుండా సంప్రదాయ విచ్ఛిత్తి, మత విశ్వాసాలు దెబ్బతినటం దృష్టితోనే ఎక్కువగా పెరిగింది. సాంప్రదాయకమైన గ్రామీణ వ్యవస్థ, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ, భూస్వామ్య మానవసంబంధాల విచ్ఛిత్తికి కారణంగా బ్రిటిష్ పాలనను చాలామంది చూశారు. దీనివల్ల పునరుద్ధరణ ధోరణులు పెరిగాయి. తరువాత స్వాతంత్ర్యోద్యమానికి, ఇతర రాజకీయోద్యమాలకు ఈ ధోరణులే ప్రధాన ప్రేరక శక్తులయ్యాయి. ఆర్థిక పరంగా కుల వ్యవస్థ విచ్ఛిన్నమైనా ప్రాచీనకాలపు వర్ణాశ్రమ ధర్మవ్యవస్థను ఆదర్శ వ్యవస్థగా నిరూపించే ప్రయత్నం కొందరు ముఖ్యమైన నాయకులు చేయటంవల్ల సంప్రదాయ కులాల గుర్తింపులు ఏదో ఒక రూపంలో పెరిగి, తరువాత రాజకీయ స్వరూపాన్ని పొందటానికి కారణమైంది. స్వాతంత్ర్యోద్యమంలో రాజకీయంగా పురోగమనాంశం ఉంది. సామాజికంగా మాత్రం అది దేశాన్ని గతంలోకి తోసింది. దీనికి తోడు పాశ్చాత్య

వస్తువుల మొదలైన విషయాలపైన ఈ సంఘం దృష్టిని కేంద్రీకరించింది. ప్రజాస్వామ్య భావాలను ప్రచారంలోకి తెచ్చింది. సురేంద్రనాథ బెనర్జీ దేశమంతా పర్యటించి తన గంభీరమైన ఉపన్యాసాలద్వారా రాజకీయ భావాలను ప్రచారం చేశాడు. రైతులను పీడించే జమీందారులకు వ్యతిరేకంగా, రైతులకు అనుకూలంగా అభిప్రాయాలను కూడగట్టటానికి ప్రయత్నం చేశాడు. ప్రాంతీయంగా ఏర్పడ్డ ఈ సంఘాలన్నీ 1885లో భారతజాతీయ కాంగ్రెస్ ఏర్పడటంతో అఖిలభారతస్థాయి ఉద్యమ స్వరూపాన్ని సంతరించుకున్నాయి. బ్రిటిష్ రిటైర్డ్ అధికారి ఏ. ఓ. హ్యూమ్ ప్రోత్సాహంతో ప్రారంభమైన జాతీయకాంగ్రెస్ డబ్ల్యు.సి. బెనర్జీ అధ్యక్షతన 1885లో మొదటిసారిగా సమావేశం అయింది. దేశంలోని వివిధప్రాంతాల నుంచి ప్రతినిధులు వచ్చారు. దేశంలోని ప్రజాభిప్రాయాన్ని కూడగట్టటం, ప్రజల సమస్యలను ప్రభుత్వంముందు పెట్టటం, శాసనసభలలో ఎక్కువ భాగస్వామ్యం, సంస్కరణల కోసం మొదటిదశలో కాంగ్రెస్ అభ్యర్థనగా ఉండేది. రైతులు, గిరిజనుల తిరుగుబాట్లను శాంతింపజేసే ధోరణిని కొనసాగిస్తూ కాంగ్రెస్ ఉద్యమంలో ఐక్యతగా ఉండేది. 1905లో బెంగాల్ విభజనతో సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్ష విజృంభించింది. గోపాలకృష్ణగోఖలే, దాదాభాయి నౌరోజీ ఆదే సంవత్సరం స్వరాజ్య కాంక్షను ప్రకటించారు. బాలగంగాధరతిలక్ స్వరాజ్యం నాజన్మహక్కన్నాడు. బిపిన చంద్రపాల్ దేశమంతటా పర్యటించి స్వరాజ్యవాదాన్ని ప్రచారం చేశాడు. బంకించంద్రఛటర్జీ 'వందేమాతరం' గీతం అఖండంగా భావాత్మకంగా భారతదేశానికి మాతృస్వరూపాన్ని సంతరింపజేసి ప్రచారం చేశాడు. తెలుగు దేశంలో రాజమండ్రి, విజయవాడ, బందరులలో పర్యటించాడు. ఆయన 'మాతృమూర్తి' ఉపన్యాసాలు తెలుగుదేశాన్ని కూడా కదిలించింది. 1908లో తన 'స్వరాజ్య' పత్రికలో బ్రిటిష్ ప్రభుత్వవిధానాలను ఖండిస్తూ రాసి తెలుగువారిలో మొదటిసారిగా శిక్షను అనుభవించినవాడు గాడిచర్ల హరిసర్వోత్తమరావు. అంతకుముందే పాల్ ఉపన్యాసాలను ప్రభావితుడైన హరిసర్వోత్తమరావును రాజమండ్రి ట్రైనింగ్ కళాశాల నుండి బహిష్కరించారు. 1921లో విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం సమావేశం కావటం, సహాయ నిరాకరణోద్యమంతో తెలుగుదేశంలో జాతీయ ఉద్యమం బలాన్ని పుంజుకుంది. ఎందరు మొదలైనచోట్ల జాతీయ కళాశాలలు ఏర్పడ్డాయి. కొండా వెంకటప్పయ్య మొదలై మొదలైన ముట్నూరి కృష్ణారావుతో నడుస్తున్న 'కృష్ణాపత్రిక', 'నవయుగ', 'దేశం' మొదలైన పత్రికలు రాజకీయ వాతావరణాన్ని పెంచటానికి

దోహదం చేశాయి. సాహిత్యం, కళలు కూడా జాతీయోద్యమానికి దోహదం చేశాయి. దక్షిణ భారతదేశంలో ఇతర ప్రాంతాలతో పోల్చినప్పుడు తెలుగువారిలో జాతీయోద్యమ చైతన్యం, నాయకత్వం ఎక్కువగా కనిపిస్తుంది.

స్వాతంత్ర్యోద్యమంలో కాని, ఇతర రాజకీయ పరిణామాలలో కాని పైస్థాయిలో పైవర్గానికి సంబంధించిన వర్గాలు, మధ్య తరగతి పాత్ర ఎక్కువగా కనిపించినా రాజకీయ పరిణామాలు మరింత వేగవంతం కావటానికి కింది స్థాయిలో జరిగే ఉద్యమాలు, తిరుగుబాట్లు ఒక్కొక్కప్పుడు కారణమౌతుంటాయి. మన రాజకీయ చరిత్రలో వాటికి ఉండవలసినంతగా ప్రాధాన్యం, గుర్తింపు కనిపించదు. ఈ తిరుగుబాట్లు విడివిడిగాను, ప్రాంతీయంగాను జరిగేవిగా కనిపించినా పై స్థాయిలోని ఉద్యమాలు, రాజకీయాల స్వరూప స్వభావాలను అవి నిర్ణయిస్తుంటాయి. ఉద్యమ లక్ష్యాలను సాధించటాన్ని అవి మరింత వేగవంతం చేస్తాయి. 1857 తిరుగుబాటు తర్వాత బ్రిటిష్ ప్రభుత్వ విధానాలే పూర్తిగా మారిపోవటం మనం స్పష్టంగా చూడవచ్చు. కింది స్థాయిలో తరచుగా జరిగే రైతాంగం, ఆదివాసుల తిరుగుబాట్లు పైస్థాయిలో జరుగుతున్న రాజకీయ నిర్మాణాన్ని బ్రిటిష్‌వారు పరోక్షంగా ప్రోత్సహించటానికి కారణమయ్యాయి. జాతీయ కాంగ్రెస్ స్థాపన తొలి దశలో కొందరు ఇంగ్లీషువారు కూడా అందులో పాల్గొన్నారు. తిరుగుబాట్లను ఒక శాంతి యుత మార్గంలో ప్రశాంత పరచటానికి బ్రిటిషువారికి ఈ అవసరం ఏర్పడింది. క్రమంగా కాంగ్రెస్ బ్రిటిష్ ప్రభుత్వం చర్యలను నిశితంగా విమర్శించటం ప్రారంభించిన తరువాత ప్రభుత్వానికి కాంగ్రెస్ విషయంలో కొంత విముఖత ఏర్పడింది. మహారాష్ట్రలో రైతుల పోరాటం, ఉత్తర తూర్పు ప్రాంతాల్లో ఆది వాసుల తిరుగుబాట్లు రాజకీయ పరిణామాలను వేగవంతం చేశాయి. 1879 లో గోదావరి ప్రాంతంలోని రంపచోడవరం ప్రాంతంలో బ్రిటిష్ ప్రభుత్వం విధించిన ఎక్కువ పన్నులకు వ్యతిరేకంగా రైతులు, కోయలు, కొండరెడ్లు తిరుగుబాటు చేశారు. బ్రిటిషువారి పక్షాన పని చేస్తున్న మున్సబుదారు పీడనకు వ్యతిరేకంగా వారు పోరాడారు. రాజమండ్రి సమీప ప్రాంతం నుండి అటు విశాఖపట్టణం వరకు, ఇటు తెలంగాణావరకు తిరుగుబాటు వ్యాపించింది. ఇదే కాలంలో జమీందార్ల పీడనకు వ్యతిరేకంగా కూడా తిరుగుబాట్లు జరిగాయి. చల్లపల్లి ఎస్టేట్లో గొట్టిపాటి బాలకృష్ణమ్మ, నూజివీడులో కడియాల చెంచయ్య జమీందారుల పీడనకు, దోపిడీకి వ్యతిరేకంగా పోరాడారు. తెలంగాణా ప్రాంతంలో 1928-30 మధ్య భువనగిరి

తాలూకాలోని అనేక గ్రామాలలో ప్రజలు పోరాడి తమ హక్కులను సంపాదించుకున్నారు.

1922-24 లో మన్యం ప్రాంతంలో గిరిజనులు బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా, ఏజన్సీ ప్రాంతాలలోని జమీందార్లు, షావుకారుల అక్రమాలకు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడారు. తూర్పుగోదావరి జిల్లా ఏజన్సీ ప్రాంతాలలో నర్సీపట్నం నుంచి బంతపల్లి వరకు రోడ్డు నిర్మాణానికి గిరిజనులను బలవంతంగా ఉపయోగించటానికి పూనుకోవటంతో పోరాటం చెలరేగింది. గిరిజనులు మరొకరి కింద పనిచేసి ఎరుగరు. బ్రిటిష్ ప్రభుత్వం 1860 లో రిజర్వు, రక్షిత అడవుల్లో పోడు వ్యవసాయాన్ని నిషేధిస్తూ అటవీ చట్టం తీసుకొని వచ్చేవరకు గిరిజనులకు అడవులమీద అన్ని హక్కులు ఉండేవి. గిరిజనులు మరొకరి అధికారంతో సంబంధం లేకుండా స్వేచ్ఛగా బ్రతికేవారు. సహజమైన స్వేచ్ఛాపరులైన గిరిజనులు నిర్బంధ పని విధానాన్ని ప్రతిఘటించారు. అధికారులు ఆహార పదార్థాలు కూడా దొరకకుండా దిగ్బంధం చేసినందువల్ల ప్రతిఘటన ఉద్ధృతం అయింది. దీనికి తోడు ఆ వయసు ప్రాయంలో చదువు వదిలిపెట్టిన అల్లూరి సీతారామరాజు ఈ ఉద్యమానికి నాయకత్వం వహించాడు. తీవ్రమైన సాయుధ పోరాటం సాగింది. సీతారామరాజు, ఆయన అనుచరులు కాల్చివేతలో, పట్టుబడి మరణించటంతో పోరాటం ఆగిపోయింది. 1940 లో బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఆదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్ అడవులలో గోండులు, కోలాములు తాము నివసించే అడవుల మీద సర్వాధికారాలు కావాలని పోరాడారు. కొమరం భీం దీనికి నాయకత్వం వహించాడు. పరిశ్రమలకు ముడిసరుకులను సరఫరా చేయటంకోసం అడవుల చట్టాలు వచ్చాయి. దీనికి వ్యతిరేకంగా స్వేచ్ఛకోసం, తరతరాలుగా తాము అనుభవిస్తున్న హక్కులకోసం గిరిజనులు పోరాడారు. స్థానిక జాతుల ఆశలు, ఆకాంక్షలు, స్వేచ్ఛ మొదలైనవాటిని అక్కడి పరిస్థితులను బట్టి వారి ప్రపంచాన్ని బట్టి అంచనా వేయవలసి ఉంటుంది. భిన్న స్థాయిలలోని పోరాటాల స్వభావాలను అవగాహన చేసుకొని సమన్వయం చేసినప్పుడే జాతీయోద్యమం ఏ రూపంలో, ఏ కారణాలవల్ల ముందుకు పోయిందో తెలుస్తుంది. 1946 లో ప్రారంభమైన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి ప్రత్యేక రాజకీయ లక్ష్యాలున్నా హైదరాబాదు సంస్థానం భారత యూనియన్‌తో విలీనం కావటాన్ని వేగవంతం

చేయడానికి కారణమైందన్న సంగతిని విస్మరించలేం. ఇంటి స్థాయిలో జరిగిన ఆర్థిక పోరాటాలు బ్రిటిష్ ప్రభుత్వం పలు విధానాలు మార్చుకోవడానికి కారణాలయ్యాయన్న విషయం చరిత్రలో స్పష్టంగా కనిపిస్తుంది.

**ఆధునికత వైపుగా....**

రాజకీయ, సామాజిక, తాత్విక, విజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో గత సమాజంతో పోల్చినప్పుడు సమకాలీన సమాజంలో నూతనంగా కనిపించే అంశాలే ఆధునికత. ఈ ఆధునికత మొదట పరిమిత అంశంగా ఉద్యమాల ద్వారా ప్రారంభమై క్రమంగా ఆర్థిక రంగంలో వచ్చిన మార్పులవల్ల స్థిరపడింది. ఈ ఉద్యమాలలో సంఘ సంస్కరణోద్యమాలు ముఖ్యమైనవి. సంస్కరణోద్యమాలు సామాజిక సంస్కరణలుగా, మత సంస్కరణలుగా రెండు రకాలుగా విభజిస్తారు. సామాజిక సంస్కరణలు బెంగాల్‌లో రాజా రామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌లతో ప్రారంభమై తెలుగుదేశంలో కందుకూరి వీరేశలింగం, రఘుపతి వేంకటరత్నం మొదలైన వారితో వ్యాపించింది. సామాజిక సంస్కరణల ప్రభావం చదువుకున్న మధ్య తరగతి వర్గంలో మొదట ఎక్కువగా కనిపిస్తుంది. వారి కోసమే సంస్కరణలు అవసరమయ్యాయి కూడా. ఆర్యసమాజం, రామకృష్ణ పరమహంస, వివేకానందుల మార్గం మతసంస్కరణలకు సంబంధించినవి. సంఘ సంస్కరణోద్యమాల్లో బ్రహ్మసమాజం వంటి వాటిలో మతానికి కొంత చోటున్నా అందులో సామాజికాంశాలకు ప్రాధాన్యం ఉంది. ఆ రూపంలో వాటిలో ఆధునికత ఉంది.

ఆర్య సమాజాన్ని 1876 లో గుజరాతీ అయిన స్వామి దయానంద సరస్వతి ప్రారంభించాడు. పంజాబీ లాలా లజపతిరాయ్ దాని నిర్మాణ కార్య క్రమాలను చేపట్టాడు. స్త్రీ సమానత్వం, స్త్రీ విద్య, విగ్రహారాధన ఖండన, బహుభార్యాత్వ వ్యతిరేకత మొదలైన సంస్కరణాంశాలున్నా ఆర్యసమాజం ఆధునికతకు దారి తీయలేదు. ఇందులో పునరుద్ధరణ ధోరణులున్నాయి. ప్రొటెస్టాంటిజంలో జీసస్ మౌలిక బోధనలు, బైబిల్ స్వచ్ఛత మొదలైన వాటిలాగే ఆర్యసమాజంలో వేదాలలో మౌలిక సత్యాలు, వైదిక సంస్కృతే ఆర్య సంస్కృతి, మౌలిక సంస్కృతి అనే అంశాలున్నాయి. మౌలికమైన వైదిక సంస్కృతే భారతీయ సంస్కృతిగా అనుసరణీయం అని ఆర్యసమాజం చెప్తుంది. శూద్రులు

ప్రాపంచికమైన వాదాన్ని ఆర్యసమాజం అంగీకరించదు. చతుర్వర్ణాలవారూ ఆర్యులే అని చెప్తుంది.

భౌతిక, ఆధ్యాత్మిక, సామాజిక స్థితిగతులను మెరుగుపరచటం లక్ష్యంగా ఆర్య సమాజం చెప్పింది. క్రైస్తవ మత వ్యాప్తి జరుగుతున్న రోజుల్లో హిందూమతాన్ని నిలబెట్టేదిగా ఆర్య సమాజం వచ్చింది. తెలుగుదేశంలో దీని ప్రభావం తక్కువ. నిజాం సంస్థానంలో భాగమైన తెలంగాణా ప్రాంతంలో మాత్రం మహమ్మదీయమతమార్పిడులకు వ్యతిరేకంగా ఆర్యసమాజ ప్రభావం కొంత కనిపిస్తుంది. రామకృష్ణ పరమహంస శిష్యుడైన వివేకానందుడు కూడా మత సంస్కర్త. వివేకానందుడు కుల వ్యవస్థను ఖండించాడు. మత తత్వాలన్నిటినీ జను వ్యతిరేకించాడు. ఆస్తిక పరమైన ఆలోచనలు కూడా వివేకానందుడికి ఉన్నాయి. అందరికి తిండి, బట్ట కావాలని ఆయన ఆకాంక్షించాడు. అప్పటికి ప్రజల ఆకలి, అజ్ఞానాలని అంతమొందించటాన్ని గురించి బాధపడ్డాడు. కాని ఆర్థిక వ్యవస్థను సంబంధించిన రాజకీయ ఆలోచనలు వివేకానందుడికి లేవు. భారతదేశం వెనక బడిన దేశమైనా తన ఆధ్యాత్మిక చింతనతో ప్రపంచానికి వెలుగు చూపాలన్నాడు. పరమతాల దాడిని, విదేశీయుల ఆధిపత్యాన్ని భారతదేశం తట్టుకోగలుగటానికి దానికి సంప్రదాయంగా వస్తున్న ఆధ్యాత్మిక శక్తే కారణం అన్నాడు. రాజకీయ వ్యవహారంలో వివేకానందుడు దేశ ఆర్థిక స్థితిని గురించి ప్రచారం చేయక పోయినా రామకృష్ణ మిషన్ను స్థాపించి కొన్ని సామాజిక కార్యక్రమాలను చేపట్టాడు. వివేకానందుని సాత్విక ప్రభావం కొంతమంది చదువుకున్న మధ్య తరగతి వారి మీద కనిపించినా దేశంలో వచ్చిన రాజకీయ, సాంఘికోద్యమాలపైన దాని ప్రభావం చాలా తక్కువ. మత సంస్కరణోద్యమాలు ఆత్మికంగా ఔన్నత్యాన్ని కోల్పోయిన భారతీయులలో, ముఖ్యంగా హిందువులలో ఆత్మగౌరవభావాన్ని పెంచింది. గతాన్ని తలుచుకొని గర్వించటానికి దోహదం చేసింది. కాని ఈ సంస్కరణలు ఒక ప్రత్యేక మతానికి సంబంధించినవి కావటం వలన ఇతర మతాల వారిని కూడా కలిపే సమగ్ర జాతీయ భావనకు అవి అంతగా తోడ్పడలేదు. ఆధునిక ఆలోచనా విధానం పెరగడానికి దోహదం చేయలేదు.

ఆలోచనలలో, ఆచరణలో, జీవన విధానంలో అన్ని విధాలా ఆధునికతకు దోహదం చేసినవి సామాజిక సంస్కరణోద్యమాలు. మత సంస్కరణల

ద్వారా గురజాడ పొందిన ప్రేరణ [illegible] సవివరించారు. స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించని [illegible] సంస్కరణలు చేసిన అపూర్వ వీరుగా నడిపించారు. రాజారామమోహనరాయలు, ఈశ్వర చంద్ర విద్యాసాగరుల సమన్విత రూపంగా ఆయన మనకు కందుకూరి వీరేశలింగం కనిపిస్తారు. కందుకూరికి ముందే అనుగుణ సంస్కర్తలు, మామిడి ముద్దు నరసింహనాయని గారు, గాజుల లక్ష్మీనరసుశెట్టి, [illegible] రామ శాస్త్రి, పరవస్తు వెంకటరంగాచార్యులు స్త్రీ విద్యను, స్త్రీ సహగమనాన్ని, స్త్రీ పునర్వివాహాన్ని ప్రచారం చేశారు. కన్యాదానాన్ని నిరసించారు. అంటరానితనాన్ని ఖండించారు. మూఢనమ్మకాలను వ్యతిరేకించారు. కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కరణల కోసం ఆచరణాత్మకం, నిర్మాణాత్మకం అయిన దృక్పథాన్ని [illegible] తన జీవితాన్ని అంకితం చేశాడు. హితకారిణీ సమాజం, పత్రికలు, సాహిత్యం మొదలైన వాటిని సంఘసంస్కరణకు సాధనాలుగా చేశాడు. [illegible] యజ్ఞోపవీతాన్ని విసర్జించాడు. అవినీతి విషయంలో రాజీ [illegible] ద్వారా కృషి చేశాడు. కందుకూరిలో కనిపించే అనేకమైన లక్షణాలను ఇలా రూపంలో సంగ్రహించవచ్చు. సాంఘిక ఆచార వ్యవహారాలలో గత కాలపు ఆలోచనా ధోరణికి భిన్నంగా ఉండటం, స్త్రీ సమస్యల పట్ల నూతన దృక్పథాన్ని కలిగి ఉండటం, సాంఘిక దురాచారాలను ఎండగట్టటం, భోగం మేళాల నిషేధం, హేతుబద్ధమైన వైజ్ఞానిక దృక్పథం, విజ్ఞాన శాస్త్రాభివృద్ధి సామాజికాభివృద్ధికి చిహ్నంగా భావించటం, వేదాలు అపౌరుషేయాలన్న వాదాన్ని ఖండించటం, జ్యోతిశ్శాస్త్రం వైజ్ఞానికం కాదని నిరూపించటం, ముద్రణా సౌకర్యాలవల్ల కొత్తగా వచ్చిన సాహిత్యప్రక్రియలు ఎన్నింటినో తెలుగులో మొదటిసారిగా ప్రవేశపెట్టటం, సాహిత్యాన్ని సామాజిక ప్రయోజనానికి సాధనంగా గ్రహించటం, భూస్వామ్య వ్యవస్థనాటి ప్రబంధ సాహిత్యం నాటి భౌతిక శృంగార వర్ణనలను నిరసించటం, తరువాత మానసికమైన ప్రేమతత్వానికి సంబంధించిన ఆధునిక రచనలు రావడానికి దోహదం చేయటం, తన ఉద్యమాన్ని నిర్వహించటానికి, భావాల్ని ప్రచారం చేయటానికి వివేకవర్ధని, హాస్య సంజీవని, సతీహితబోధిని, సత్య సంవర్ధని, సత్యవాదిని మొదలైన పత్రికలను స్థాపించటం, అధికారుల అవినీతిని బయటపెట్టటానికి కూడా పత్రికలను సాధనంగా చేయటం, పత్రికల ద్వారా నవలా రచనల పోటీలను నిర్వహించటం, తన పత్రికల ద్వారా తెలుగు

ఆవిష్కరించి వ్యాప్తికి కృషి చేయటం మొదలైనవి తెలుగుదేశం ఆధునిక సమాజంగా రూపొందటానికి కందుకూరి వీరేశలింగం ఆచరణాత్మకంగా నడిపిన ఉద్యమాలలో భాగం. ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన శాస్త్రీయమైన భావాలు కందుకూరిలో లేకపోయినా ఆర్థికంగా దేశం ముందుకు పోవలసిన అవసరాన్ని గురించి, నిరుద్యోగ సమస్య తీరటానికి దేశీయమైన పరిశ్రమలను ప్రారంభించవలసిన అవసరాన్ని గురించి తన భావాలను చాలాచోట్ల వెల్లడించాడు.

కందుకూరి వీరేశలింగం స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి అంతగా పట్టించుకోకపోవడానికి కారణం దానితోపాటు పెరుగుతున్న పునరుద్ధరణ ధోరణులు కావచ్చు. ఇంగ్లీషు విద్య, పాశ్చాత్య విజ్ఞానం భారతీయులలో జ్ఞానోదయం కలిగించిందని ఆయన గట్టిగా నమ్మాడు. హిందూ సమాజ కార్యక్రమాల్ని వ్యతిరేకించాడు. దివ్యజ్ఞాన సమాజంలో ఉండి హోమ్ రూల్ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన అనిబిసెంట్ ఆధ్యాత్మికత పేరుతో భారతీయ సంప్రదాయ సమాజాన్ని ప్రశంసించటం, వర్ణ సమాజం గొప్పతనాన్ని చాటటం—వీటిని కందుకూరి నిశితంగా నిరసించాడు, విమర్శించాడు, ఇంగ్లీషువారి పాలన వలన మన సమాజం ముందుకు పోగలుగుతున్నదన్న భావాన్ని ఇంగ్లీషు విద్యా ప్రాముఖ్యాన్ని కందుకూరి ఇలా వెల్లడించాడు. "అమూల్యమైన యీ విద్యా ప్రభావము చేతనేగదా గడచిన మూడు సంవత్సరముల నుండియు జాతి మత వైషమ్యములను లేశమాత్రమును వహింపక, ఆసేతు హిమాచల పర్యంత నివాసులైయున్న హిందువులును, మహమ్మదీయులును, క్రైస్తవులును, పారశీకులును, బౌద్ధులును, జైనులును, బ్రాహ్మణులును, శూద్రులును, ద్రావిడులును, గౌడులును, మహారాష్ట్రులును నిమిత్తమై ధన వ్యయమునకును, శరీర ప్రయాసమునకును సహించి నానాదేశ ప్రయాణములు చేసి ఏటేట [illegible] మందిరమున [illegible] సంభాషించ గలుగుచున్నారు". [illegible], తగిన మత హద్దులు దాటిపోవటం ఆధునికత లక్షణాలలో ముఖ్యమైనవి. కందుకూరి మతాల హద్దులు దాటి ఎదిగే సమాజాన్ని గురించి ఆలోచించాడు. రాజ్యాంగ సంస్కారాలకంటె, స్వాతంత్ర్య సముపార్జన కంటె సాంఘిక సంస్కరణ ముఖ్యమైనదని వీరేశలింగం భావించాడు. "మతనీతి కులాచార సంస్కారములు లేక యొక్క రాజ్యాంగ సంస్కారములవలనే దేశ మభివృద్ధి బొందునని నేనెప్పుడును తలచిన వాడను కాను. దేశాభివృద్ధి కన్నిటి

లోను సహజముగ జరగవలెనని నా యభిప్రాయము. దేశము యొక్క యిప్పటి అభివృద్ధికి ఇంగ్లీషువారి పరిపాలనమే మూలమనియు, వారి పరిపాలనము నిరంతరముగా సాగుటచేతనే ముందును దేశమభివృద్ధి గాంచుననియు నాదృఢమైన నమ్మకము." అని తన భావాలను ఆయన స్పష్టం చెప్పాడు. అందుకే 1907లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రిలో ప్రసంగించి వెళ్ళిన తరువాత రాజమండ్రి కళాశాలలో విద్యార్థులు వందేమాతరం నినాదాలు చేయటం, పాఠాలను బహిష్కరించటం చూచి వీరేశలింగం బాధపడ్డాడు.

సాహిత్య, పరిశోధనా, సాంస్కృతిక రంగాలలో కూడా వీరేశలింగం ఆధునిక ధోరణులు ప్రవేశించటానికి కృషి చేశాడు. ఆధునిక ప్రక్రియలయిన నవల, వ్యాసం, ప్రహసనం, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర, శాస్త్రగ్రంథాల రచన మొదలైన వాటికి ప్రచారం తెచ్చాడు. ఆయన స్వీయ చరిత్ర సమకాలీన సాంఘిక చరిత్ర. మూడు భాగాలుగా రచించిన ఆంధ్ర కవుల చరిత్ర ఆయన పరిశోధనా దృష్టికి నిదర్శనం. అముద్రిత తాళపత్ర గ్రంథాల పరిశీలన, శాసనాలు మొదలైన వాటి ఆధారంగా కవుల కాల కర్తృత్వ నిర్ణయాలు, కావ్య విమర్శ మొదలైనవి కందుకూరి పరిశోధనం ద్వారా సాధించిన అంశాలు. తరువాత వచ్చిన కవి చరిత్రలకు, సాహిత్య చరిత్రలకు వీరేశలింగం ఆంధ్ర కవుల చరిత్ర ఆధారం. తన పత్రికలలో కూడా సాహిత్య చర్చలను, పరిశోధనలను ఆయన నిర్వహించేవాడు. సాంస్కృతిక రంగంలో నాటక ప్రదర్శనలకు ఆయన దోహదం చేశాడు. తన రచనల మీద వచ్చిన ఆదాయంతో బ్రతికిన రచయితలలో కూడా కందుకూరి వీరేశలింగం మొదటివాడు. వీరేశలింగం సమకాలంలో సాహిత్య సంస్థలు, సాహిత్య పత్రికలు—బ్రౌను మొదలైన యింగ్లీషు అధికారులు ప్రోత్సహించి పోయిన భాషా సాహిత్య కృషిని కొనసాగించటానికి దోహదం చేశాయి. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వంటి సంస్థలు, ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, అముద్రిత గ్రంథచింతామణి, [illegible], ఉషారాణి వంటి పత్రికలు సాహిత్య పరిశోధనా వ్యాసాలను ప్రకటించేవి. కొక్కొండ వెంకటరత్నం పంతులు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, జయంతి రామయ్య, పూండ్ల రామకృష్ణయ్య మొదలైనవారు పరిశోధనా రంగాన్ని మరింత ముందుకు నడిపించారు. కట్టమంచి రామలింగారెడ్డితో తెలుగు సాహిత్యంలో ఆధునిక విమర్శరీతులు ప్రారంభమయ్యాయి.

ఆధునికతా మార్గంలో మరో ముందడుగు వేసినవాడు వెంకటరత్నం నాయుడు. [illegible] వేశ్యావృత్తిని నిర్మూలించటానికి ఉద్యమించాడు. వెంకటరత్నం నాయుడు వేశ్యలకు వివాహం చేసి గౌరవప్రదమైన కుటుంబ జీవితం గడపటానికి దోహదం చేశాడు. అస్పృశ్యతా నివారణకు కృషి చేశాడు. విద్యారంగంలో ఉండటంవల్ల అనాటి విద్యార్థులను ప్రభావితం చేయటానికి ఆయనకు అవకాశం లభించింది. విద్యార్థినులకు, కింది కులాలవారికి ఉచితంగా విద్యాదానం చేయటం ఆయనతోనే ప్రారంభమయింది. మద్యపాన నిషేధానికి, ధూమపాన నిషేధానికి కూడా ఆయన ఉద్యమాలను నిర్వహించాడు.

ఆలోచనలో, లాక్షణికతలో పెట్టుబడిదారీ విధానం ఫలితమైన ఆధునికతా భావాలు 1900 తరువాత గురజాడలోగాని చోటు చేసుకోలేదు. ఉద్యమ నిర్మాణం చేపట్టకపోయినా ఆయన ఆలోచనలు సమకాలీన విద్యావంతులు, మేధావులతో పోలిస్తే చాలా విప్లవాత్మకమైనవి. బెంగాల్, బొంబాయిలతో పోలిస్తే మద్రాసు ప్రెసిడెన్సీలో ఆ రోజులలో పారిశ్రామికీకరణ తక్కువ. తెలుగుదేశంలో మరీ తక్కువ. ఆ దశలో దక్షిణ దేశం మొత్తం మీద సంఘ సంస్కరణోద్యమాలు, ఆధునిక భావాలు తెలుగుదేశంలోనే ఎక్కువగా కనిపిస్తాయి. అందులో గురజాడ ఆధునిక భావాలకు నిజమైన ప్రతినిధి, నిజమైన మేధావి, హేతువాది, అజ్ఞేయవాదీ కూడా. దృక్పథం అన్న భావం గురజాడతో తెలుగు సాహిత్యంలో ప్రవేశించింది. భాష విషయంలో కూడా ఆయన నిజమైన ఆధునికుడు. నాటి పట్టుబడి విషయం, ఎవరిని సంతృప్తిపరచటానికీ దాన్ని వదులుకోనన్నాడు. పునర్ధర్మ భావాలతో గతం నుంచి స్ఫూర్తి పొందుతూ జాతీయోద్యమాలు మొదలౌతున్న రోజులలో "మంచి గతమున కొంచెమేనోయ్, మందగించక ముందు అడుగేయ్" అన్నాడు. భవిష్యత్తుకోసం స్ఫూర్తి కలిగించాడు. 'మగడు వేల్పన పాత మాటది, ప్రాణమిత్రుడ వీవు' అని స్త్రీ, పురుష సంబంధాలకు కొత్త దృక్పథం ఇచ్చాడు. 'మలిన దేహుల మాలలనుచును, మలిన చిత్తుల కధికకులముల నెలవు సంగెస వర్ణధర్మ మధర్మ ధర్మంబే' అన్నాడు. 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలచి వెలుగును' అన్నది సమకాలీన పరిస్థితులలో చాలా విప్లవాత్మకమైన భావం. 'ఎల్లలోకము లొక్క యిల్లై' అని విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఆకాంక్షించాడు. 'అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్, దేశి సరుకుల నమ్మవలెనోయ్', 'డబ్బు తేలేనట్టి నరులకు కీర్తి సంపద లబ్బవోయ్', '[illegible]

పాటిస్తూ మంచి' అన్న భావాలు ధనస్వామ్య వ్యవస్థను సంబంధించిన భావాలు. ఆదర్శమానవతావాదం, హేతువాదం, ధనస్వామ్య భావాలతో సహా సుందరమయిన కవిత్వం రాశాడు గురజాడ. దేశమంత పేరుతో దేశభక్తిని మతంతోను, గతంతోను, జాతి స్వరూపంతోను ముడిపెడుతూ సమకాలంలో వ్యాపిస్తున్న భావాలకు సమాధానంగా గురజాడ 'దేశభక్తి' గేయాన్ని రచించాడు. 'దేశాభిమానం నాకు కద్దని వట్టి గొప్పలు చెప్పుకోకోయ్, పూని యేదైనాను ఒక మేల్ కూర్చి జనులకు చూపవోయ్' అనటం దేశభక్తి పేరుతో సమకాలంలో వస్తున్న ఉపన్యాసాలను, ప్రసంగాలను దృష్టిలో పెట్టుకొని అని ఉంటుంది. సమకాలంలో మతవిశ్వాసాలలోని బూటకాలను తన కథానికల ద్వారా నిరూపించాడు. సీతేర లింగంలాగే రాచరికపు దుష్ట పరిపాలన వల్లే సమాజం ముందుకు పోవటానికి ఇంగ్లీషు పరిపాలనే కారణం అని నమ్మినవాడు కాబట్టి ఆంగ్లేయుల ధర్మ రాజ్యాన్ని పొగిడాడు. అయితే సాహిత్యంలో రూపంలోను, భావాలలోను గురజాడ ఆధునికతను సాధించాడు.

చిలకమర్తి లక్ష్మీనరసింహంలో సంస్కరణ భావాలతోపాటు, స్వాతంత్ర్యోద్యమ ప్రభావంకూడా కనిపిస్తుంది. జాతీయకాంగ్రెస్ సభల్లో స్వచ్ఛందంగా ఆయన పాల్గొన్నాడు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలను తెనుగుచేశాడు. ప్రదర్శనసభల్లో పాల్గొన్నాడు. రైతుల దుస్థితిని గూర్చి బాధపడ్డాడు. స్వయంగా స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్నాడు. పుస్తక ప్రచురణం ద్వారా దేశాన్ని దోచుకుంటున్నదనే కారణంగా మాక్మిలన్ కంపెనీకి పుస్తకాలు రాసివ్వడానికి నిరాకరించాడు. పత్రికలలో బ్రిటిష ప్రభుత్వవిధానాలను ఖండించాడు. జాతీయోద్యమంలో పాల్గొన్నవారి సన్మాన సంఘానికి అధ్యక్షుడయ్యాడు. కాకినాడలో కాంగ్రెస్ మహాసభల ఆహ్వాన సంఘంలో ఉన్నాడు. భారతదేశం ఆర్థిక దుస్థితిని 'భరత ఖండంబు చక్కని పాడి యావు, హిందువులు లేగదూడలై యేడ్చుచుండ, తెల్లవారను గడుసరి గొల్లవారు, పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి' అని తన కవిత్వంలో వర్ణించాడు. హరిజన పాఠశాలను స్థాపించాడు మత మౌఢ్యాన్ని ఎదుర్కొన్నాడు. కందుకూరి వీరేశలింగానికి అండగా మఠాధిపతులను ఎదుర్కొన్నాడు. 'జాతీయ పాఠశాలల్లో తురకలు చేరవచ్చును, క్రైస్తవులు చేరవచ్చును; శైవులు చదువవచ్చును, వైష్ణవులు చదువవచ్చును; నానా మతస్థులు చదువవచ్చును. ఒక మతస్థుని సిద్ధాంతాలు మరియొక మతస్థునకు సరిపడవు. కాబట్టి మతవిద్య పరస్పర వైషమ్యములు

కలిగించదు కాబట్టి దానిని పుంటపరచాలని నేను భావించితిని' అని తాత్విక విద్యా విధానాన్ని ఉపదేశించి సమర్థించాడు. 'దేశాభిమానమే మన మతముగా నుండవలెను' అని ఆయన భావించాడు. బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సమస్య, హిందూ, మహమ్మదీయుల సమస్య మొదలైనవాని అందరం భరతమాత బిడ్డలమే అన్న భావం ప్రబలంగా ఉండాలని. కందుకూరి సంస్కరణభావాలు, జాతీయభావాలు రెండూ సమపాళ్ళలో మిళితమైయుండ చిలకమర్తిలో. ఈ చక్కని సమన్వయం జాతీయోద్యమం తీవ్రమౌతున్న దశలో కొనసాగలేదు.

తెలుగుదేశంలో ఆధునికతను సంతరింపజేసిన వారిలో కొమర్రాజు లక్ష్మణరావు పంతులు ఒకరు. మహారాష్ట్రంలో పుట్టి, పెరిగి, చదువుకొని తెలుగు దేశంలో తన ఉద్యమాలను నిర్వహించిన కొమర్రాజు 1901 లో హైదరాబాదులో 'శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయ' స్థాపనకు దోహదంచేసి తెలంగాణా, కోస్తా, రాయలసీమాంధ్ర ప్రాంతాలకు మధ్య వారధిగా నిలచాడు. విజ్ఞాన శాస్త్ర వ్యాప్తి ఆధునికతకు, నాగరికతకు అవసరమైన ముఖ్యమైన ముడి సరుకుగా ఆయన భావించాడు. విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిద్వారా దేశ చరిత్ర, జీవిత చరిత్ర, పదార్థ విజ్ఞాన శాస్త్రం రసాయన శాస్త్రం, అర్థశాస్త్రం, భూగర్భ శాస్త్రం మొదలైన విషయాలలో గ్రంథాలను ప్రకటింపజేశాడు. నిరక్షరాస్యతా నిర్మూలనను, పఠనాసక్తిని పెంచటానికి కృషి చేశాడు. మాతృభాష అయిన తెలుగు ద్వారా సామాన్యులకు ఎక్కువగా నుంచిన విజ్ఞానాన్ని అందజేయటం సాధ్యమని భావించాడు. 'అన్య భాష మొదట నేర్చుకొని పిదప దానిద్వారా శాస్త్రములు గ్రహించుట అనవసర ప్రయాసము కలిగించును' అని ఆయన చెప్పాడు. ఒక పద్ధతిలో చరిత్ర పరిశోధన తెలుగునేలలో ఆయనతోనే ప్రారంభమైందని చెప్పాలి. చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, ఆదిరాజు వీరభద్రరావు మొదలైనవారు ఆయన ప్రోత్సాహంతోనే చరిత్ర పరిశోధనా రంగంలో ప్రవేశించారు. ఆయా శాస్త్ర రంగాలలో పోటీలు పెట్టి చాలామందిని లక్ష్మణరావు పంతులు ప్రోత్సహించాడు. తెలుగులో తొలి విజ్ఞాన సర్వస్వ నిర్మాణం చేశాడు. 'విజ్ఞాన చంద్రికా పరిషత్తు' ద్వారా పఠనాభిరుచిని పెంచటానికి ఉద్యమించాడు. పరిశోధనలకు రూపకల్పన చేశారు. 'జనరంజని' అన్న పత్రికను నడిపాడు. తెలుగులో కొత్త పారిభాషిక పదాలను ప్రవేశపెట్టాడు. ఆధునిక భాషా శాస్త్ర వ్యాసాలను కూడా రచించాడు. సంఘ సంస్కరణకు కూడా ఆయన దోహదం

చేశాడు. రాజకీయంగా ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. స్వేచ్ఛా భావాలను, ప్రజాస్వామ్య భావాలను సమర్థించాడు. [illegible] యుక్త వయస్సు వచ్చిన ప్రతి పురుషునికి, స్త్రీకి ఓటు కలిగిన స్వరాజ్యమే గమ్యమని ప్రకటించాడు. దేశంలో ఆనకట్ట పంచముల అస్పృశ్యతను రూపు మాపనిదే స్వరాజ్యం వచ్చినా అది నిలవదని చెప్పాడు. నవీన ప్రపంచంలో భారతదేశం ఒక స్వతంత్ర ప్రజారాజ్యంగా నిలవాలంటే ప్రజలకు నవీన ప్రపంచంలో అభివృద్ధి పొందుతున్న ప్రకృతి శాస్త్ర, చరిత్ర, రాజకీయార్థిక విజ్ఞానం అవసరమని 1906 లోనే ప్రకటించాడు. స్వాతంత్ర్యాన్ని పొందటానికి, పరిపాలనను నిర్వహించటానికి అవసరమైన [illegible], పరిపక్వత భారతీయులకు అవసరం అని కొమర్రాజు భావించాడని దీనివల్ల తెలుస్తుంది. భారతదేశ చరిత్ర రచనలో ఆంగ్లేయ చరిత్రకారులలాగే హిందూమహాయుగం, మహమ్మదీయ మహాయుగం అని యుగవిభజన చేసినా విశ్లేషణలో కొత్త పద్ధతులను అవలంబించాడు. తాను చరిత్రను ఎంత నిష్పక్షపాతంగా రాయటానికి ప్రయత్నించిందీ మహమ్మదీయ మహాయుగం పీఠికలో చెప్పుకున్నాడు. "పూర్వకాలమందు హిందూముసల్మానులు పోరాడుచుండిరి గనుక [illegible] రను మాట లోకానుభవము లేనివారు చెప్పునటువంటి [illegible]... [illegible] వాసులైనందున ప్రస్తుతమున్న హిందూ ముసల్మానుల [illegible] కూడ పీఠికలో చెప్పాడు. చరిత్ర పరిజ్ఞానం ఆత్మవిశ్వాసానికి దోహదకారిగా ఉపయోగించాలిగాని, గతాన్ని తవ్వి బయటకు తీసి [illegible] కొమర్రాజు నమ్మాడు. గాడిచర్ల హరి సర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైన రాజకీయ నాయకులు ఆయన [illegible].

ప్రజలలో మౌఢ్యాన్ని తొలగించటానికి, సంస్కరణ భావాలను వ్యాపింపజేయటానికి ఉద్యమించిన కందుకూరి వీరేశలింగం తన [illegible] భాష విషయంలో వ్యావహారిక భాషా ప్రాధాన్యాన్ని గుర్తించలేదు. చిలకమర్తి లక్ష్మీనరసింహం గ్రాంథిక భాషను సమర్థించాడు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులు సలక్షణ భాష అన్నాడు. తెలుగుదేశంలో హేతువాద దృక్పథానికి ప్రతినిధిగా నిలిచిన త్రిపురనేని రామస్వామి చౌదరి కూడా గ్రాంథిక భాషను తన రచనలలో వాడాడు. సామాజిక రంగంలో వైజ్ఞానిక దృక్పథాన్ని ప్రచురించినా, విజ్ఞానశాస్త్రాల పరిజ్ఞానావశ్యకతను గుర్తించినా కొమర్రాజు వంటివారు భాషను

గురించి శాస్త్రీయంగా, అధునాతనంగా ఆలోచించలేకపోయారు. దేశీయ భాషలలో సాహిత్య, విజ్ఞానాలు రావటమే కాదు, చాలామందికి దగ్గరగా ఉండే భాషలో ఆ గ్రంథాలు రావాలని గ్రహించలేదు. భాష విషయంలో శాస్త్రీయ దృక్పథంకాక వైయక్తిక దృక్పథమే ఇక్కడ పనిచేసింది. సాహిత్య, విజ్ఞానాలు అధికాధికుల్లోకి వెళ్లాలంటే అది దేశీయ భాష అయినంతమాత్రాన చాలదు; అది ఎక్కువ మందికి అర్థమయ్యే భాష కూడా కావాలని గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావులు అభిప్రాయపడ్డారు. గిడుగు రామమూర్తి తన జీవితాన్ని వ్యావహారిక భాషోద్యమానికే అంకితం చేశాడు. గురజాడ దానికి దోహదం చేశాడు. వ్యావహారిక భాషలోకాక గ్రాంథిక భాషలో రాయమన్నందుకు విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి 'కళింగదేశ చరిత్ర'ను రాసి ఇవ్వటానికి గురజాడ నిరాకరించాడు. గిడుగు రామమూర్తి తన వ్యావహారిక భాషావాదాన్ని నిరూపించటానికి ప్రాచీన కావ్యాల లోని భాషా రూపాలనన్నింటినీ పరిశోధించాడు. గ్రాంథిక భాష నిజమైన మాతృ భాష కాదనీ, వ్యావహారిక భాషే నిజమైన మాతృభాష అనీ గిడుగు, గురజాడలు చాటి చెప్పారు. అనువాదాలు, అనుసరణలుగాకాక స్వతంత్ర పరిశోధనల ద్వారా తెలుగులో స్వతంత్రశాస్త్ర గ్రంథాలు రావాలని వారభిప్రాయపడ్డారు. దానివల్ల సహజసిద్ధమైన భాషలో గ్రంథాలు వస్తాయని కూడా వారు భావించారు. ఆనాటి బ్రిటిష ప్రభుత్వం సంప్రదాయవాదులకు అనుకూలమైన పద్ధతిలో విధానాలు అవలంబించటంవల్ల విశ్వవిద్యాలయాల్లో, ఇతర విద్యాలయాల్లో గ్రాంథికభాషకే స్థానం లభించింది. కాని పత్రికలు, రేడియో, సృజనాత్మక సాహిత్య రంగాలలో క్రమంగా వ్యావహారిక భాష స్థిరపడింది.

గతం ప్రేరణగా....

అఖిల భారత స్థాయిలో పరిశీలించినప్పుడు జాతీయోద్యమ తీవ్రతతో సామాజిక రంగంలో తాత్వికంగా పునరుద్ధరణ భావాలు వ్యాపించాయి. జాతీ యోద్యమంలో అతివాదులకు మతం ప్రజాసమీకరణ సాధనం. సామాజిక రంగంలో పురోగతిని, ఆధునికతను సంస్కరణవాదులు ఆశించారు. ఇంగ్లీషువాళ్ల వల్లనే ఆర్థిక పురోగతి సాధ్యమౌతుంది. మొదటి దశలో రాజకీయ సంస్కరణ వాదులు ఆశించారు. విదేశీయ పాలన పోతేనేగాని ఆర్థిక రంగంలో వారి ఆధిక్యత పోదనీ, స్వతంత్రభారతంలోనే దేశీయుల పరిశ్రమలు అభివృద్ధి చెందటానికి అవ

కాలం ఉంటుందని భావించినప్పుడు జాతీయోద్యమం ప్రజ్వలనమవుతుంది. ప్రత్య వలస పాలనకు, భూస్వామ్యానికి వ్యతిరేకమైన మధ్యతరగతివర్గం, ఆ మధ్యతరగతి వర్గం జాతీయోద్యమంలో ప్రధాన పాత్ర వహించింది. కాని జనాన్ని సమీకరణ చేయటానికి సంప్రదాయ భావజాలమే సాధనం అయింది. ప్రజలను ఉద్యమోన్ముఖుల చేయటానికి కొన్ని ప్రతీకలు అవసరం అయ్యాయి. అలా దేశాన్ని మాతగా దుర్గగా, దేవిగా కొలవటం, భారతమాత అన్న సంకేతం స్వాతంత్ర్యోద్య మంలో ముఖ్య ప్రేరకాలయ్యాయి. శక్తి ఉద్యమ కాలంనుంచీ కూడా భారత దేశంలో ప్రజలను కదపటానికి కొన్ని ప్రతీకలను సాధనంగా చేసుకోవటం కనిపిస్తుంది. శివుడు, కృష్ణుడు, రాముడు ఇవన్నీ ఇటువంటి ప్రతీకలే. స్వాతం త్ర్యోద్యమంలో అతివాదులుగా చాలా మంది తాత్త్వికులుగా, ఆధ్యాత్మిక చింతన పరులుగా మారిపోయారు. ఆధునికంగా పురోగమించిన యూరప్ దేశాలతో పోల్చినప్పుడు వలస దేశమైన భారతదేశంలో ప్రజలలో ఒక గౌరవం ఆత్మవిశ్వా సాన్ని కలగజేయటానికి గత కాలంపైన ఆధారపడవలసి వచ్చింది. పాశ్చాత్యులది యాంత్రిక, భౌతిక సంస్కృతి అని, భారతదేశం [illegible] ఆధ్యాత్మిక సంపద మీద ఆధారపడి ఉందని చెప్పుకోవలసి వచ్చింది. దేశభక్తి ఒక దైవీయ మైన భావన అని, జాతీయత అన్నది విదేశీయమని అన్నంతవరకు సంప్రదాయ ఆధ్యాత్మిక వాదులు వెళ్ళారు. దేశభక్తిని మతంతో జోడించటం కూడా జరిగింది. వర్ణాశ్రమ వ్యవస్థను మౌలికమైన ఆదర్శ వ్యవస్థగా కూడా కొందరు వర్ణించారు. నిజానికి దేశభక్తి, జాతీయత అన్న రెండు భావాలు ఆధునిక కాలంలో వచ్చినవే. అంబేద్కర్‌లాంటి వారు కూడా హరిజనుల [illegible] మతంలోనే చూసి బౌద్ధమతాన్ని స్వీకరించారు.

1907 లో బిపిన్ చంద్రపాల్ తెలుగుదేశంలో పర్యటించిన తరువాత 'వందేమాతరం' ప్రభావం అంతటా వ్యాపించింది. తెలుగుదేశంలో స్వాతంత్ర్యోద్య మంలో అతివాదులు, మితవాదులు ఇద్దరూ ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న మొదటి తరంలో సంస్కరణోద్యమాల ప్రభావం చాలా ఉంది. ఉన్నవ లక్ష్మీనారాయణ, అయ్యదేవర కాళేశ్వరరావు, [illegible] లక్ష్మీనరసింహంలతో సన్నిహిత సంబంధం ఉన్న టంగుటూరి ప్రకాశం ఏదో ఒక రూపంలో సంస్కరణ భావాలున్నవారే. 1921 తరువాత గాంధీ నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమం విస్తరించిన తరువాత గాంధీ వ్యక్తిత్వం, భావాల ప్రభావం తెలుగుదేశంలోని

నాయకులపైన పడింది. ఆంగ్ల సాహిత్య ప్రభావంవల్ల దేశభక్తి సాహిత్యంలో గతానుస్మృత్య కీర్తన కనిపిస్తుంది. చీరాల, పేరాల పురబహిష్కార సత్యాగ్రహ సందర్భంగా సమష్టిగా ప్రజా ఉద్యమం నిర్వహించినప్పుడు దుగ్గిరాల గోపాల కృష్ణయ్య నాయకత్వంలో రామదండు నిర్మాణం సంఘటన కనిపిస్తాయి. వ్యవసాయ ప్రధానమైన తెలుగుదేశంలో రైతు ఉద్యమాలు, పన్నుల నిరాకరణ ఉద్యమాలు కూడా స్వాతంత్ర్యోద్యమంలో భాగం అయ్యాయి. పర్వతనేని వీరయ్యచౌదరి, ఎన్.జి. రంగా మొదలైనవారు రైతు ఉద్యమాలకు నాయకత్వం వహించారు. ముట్నూరి కృష్ణారావు 'కృష్ణాపత్రిక', మొదట 1908 లో బొంబాయిలో వారపత్రికగా ప్రారంభమై 1914 లో మద్రాసులో దినపత్రికగా మారిన కాశీనాథుని నాగేశ్వరరావు 'ఆంధ్రపత్రిక' మొదలైన పత్రికలు స్వాతంత్ర్యోద్యమానికి దోహదం చేశాయి. ఆనాటి పరిశోధనలు ముఖ్యంగా చరిత్ర పరిశోధన ఈ ఉద్యమానికి ప్రేరణ అయ్యే పద్ధతిలో జరిగింది. భారత జాతీయ కాంగ్రెస్ ప్రభావం, స్వాతంత్ర్యోద్యమ ప్రభావం నిజాం రాష్ట్రంలో కూడా మొదటినుంచీ ఉన్నా 1938 నాటికిగాని స్టేట్ కాంగ్రెస్ ఏర్పడలేదు. 1939-40 లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'వందేమాతరం' నినాదాలవల్ల చాలామంది విద్యార్థులను బహిష్కరించడం జరిగింది. రామానందతీర్థ, ఆచార్య నరేంద్రదేవ్, బూర్గుల రామకృష్ణారావు, ఎందరెందరో ఈ ఉద్యమంలో ఉన్నారు. మాడపాటి హనుమంతరావు వంటివారు తెలుగు భాష, సంస్కృతి, సంస్కరణ, గ్రంథాలయ ఉద్యమాలతో తెలంగాణంలో చైతన్యం కలిగించారు. కరడుగట్టిన ఫ్యూడల్ వ్యవస్థ ఉన్న ఈ ప్రాంతంలో తెలంగాణా సాయుధ పోరాటం వచ్చిన తరుణంలో ఆ ప్రాంతం కోసం పోరాటానికి దోహదం చేసింది.

ఈ నేపథ్య ప్రతిఫలనంగా స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి తొలి తరంలో విచిత్రమైన భావవైరుధ్యాలు కనిపిస్తాయి. సామాజికంగా ఆధునిక దృష్టి, అభ్యుదయ భావాలు ఒకవైపు, ధార్మికంగా సంప్రదాయ దృష్టి, గతౌన్నత్యంపైన అభిమానం, ఆధ్యాత్మిక చింతనా ప్రాముఖ్యం మరోవైపు కలిసిపోయి కనిపిస్తాయి. ప్రపంచ దేశాలలో వచ్చిన భిన్న రాజకీయ ఉద్యమాలపైన ఆసక్తిని కనబరచినా, ఆ ఉద్యమాల వెనుక ఉండే సమకాలీన చైతన్యాన్ని, ఆర్థిక భూమికను వారు దర్శించలేకపోయారు. తెలుగుదేశంలో సంస్కరణ, రాజకీయోద్యమాలు రెండింట్లో సమానంగా క్రియాశీలంగా పాల్గొన్న వారిలో ఉన్నవ లక్ష్మీనారాయణను

ముఖ్యంగా చెప్పుకోవాలి. ఉన్నవ స్వయంగా సంస్కర్త. స్త్రీ సముద్ధరణకు ఆచరణాత్మకంగా కృషి చేశాడు. రాజకీయోద్యమంతోపాటు కలిసి నడచిన అస్పృశ్యతా నివారణోద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు. ఆయన 'మాలపల్లి' నవల సమకాలీన రాజకీయ, సామాజిక వాతావరణాన్ని, రెండు తరాల మధ్య ఉండే భేదాన్ని చిత్రించే చారిత్రక నవల. ఉన్నవ స్వాతంత్ర్యోద్యమంలో స్వయంగా పాల్గొని జైలుకు వెళ్లాడు. రష్యాలోని సోషలిస్టు విప్లవ ప్రభావం కూడా కొంతవరకు ఆయనమీద ఉంది. ఆయన సమతా ధర్మాన్ని కోరాడు. కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారం చేయటం తప్పు కాదన్నాడు. ఆచరణలో గాంధీ మార్గాన్ని అనుసరించాడు. దేశంలోని విభిన్న మతాలవారు తమ మతసంప్రదాయాలను, సంస్కృతిని అనుసరించటానికి అవకాశం ఇవ్వాలని, ఆ రూపంలోనే భారతదేశ సమైక్యత పటిష్టం అవుతుందని చెప్పాడు. ఇటీవల లౌకిక రాజ్యానికి [illegible] ఇస్తున్న నిర్వచనానికిది సరిపోతుంది. అన్ని మతాలను కలుపుకొని వచ్చే సమన్వయ అంశం దేశాభిమానం అని కూడా ఉన్నవ చెప్పాడు. దీనితోపాటు ఆధ్యాత్మికత పట్ల ఆసక్తి ఉంది. తత్వకవులద్వారా [illegible] వారిలో ప్రచారంలోకి వచ్చిన అచల వేదాంతాన్ని కూడా ఉన్నవ అభిమానించాడు. వీరబ్రహ్మంలోని భవిష్యద్వాణిలాంటిది ఆయన 'బుడబుక్కల జోస్యం'లో కనిపిస్తుంది. 'వేదశాస్త్రములు వెలిసిన రాజ్యం'లో, 'యజ్ఞయాగములు వెలిగిన రాజ్యం'లో, 'సొంత ధర్మములు సన్నగిల్లుతవి', 'పరధర్మాలే బలిసిపోతవి', 'హిందువులంతా తగ్గిపోతరు', 'పరమతముల్లో కలిసిపోతరు', 'మాలపల్లెలు మాదిగపల్లెలు' 'పరమతములకు పట్టుగొమ్మలు' అవుతాయని అందులో చెప్పాడు. 'నాస్తిక మతములు ప్రబలముయితే నాశనమైపోతుంది బాబు' అని ఇతర మతాలను నాస్తికమతాలుగా ఉన్నవ పేర్కొన్నాడు. మతాంతరీకరణను [illegible] ప్రతీకగా భావించటంవల్ల అన్ని మతాలవారికీ సమానస్థానం ఉండాలని ఆధునిక దృష్టిని ప్రదర్శించిన ఉన్నవలో స్వమతాభిమానం తీవ్రంగా కనిపిస్తుంది. తాత్త్వికంగా భిన్నమైన మార్గంలో నడచిన త్రిపురనేని రామస్వామి చౌదరిలో కూడా ఇలాంటి వైరుధ్యాలు కనిపిస్తాయి. 1917 లో మద్రాసులోని బ్రాహ్మణేతర సంఘంవారు స్వరాజ్యాన్ని వ్యతిరేకిస్తే, త్రిపురనేని స్వరాజ్య కాంక్షను స్పష్టంగా వ్యక్తీకరించాడు. వెంటనే దేశానికి స్వరాజ్యం కావాలన్నాడు. జాతీయ బ్రాహ్మణేతర సంఘంలో ప్రాధాన్యం వహించాడు. స్వరాజ్యంపైన అంతగా సుముఖత చూపని జస్టిస్ పార్టీతో సంబంధాలు పెట్టుకుంటూనే సత్యాగ్రహోద్యమాన్ని సమర్థించాడు, పాల్గొన్నాడు.

దాహాంబునేయులు, పూతిపెద్ది కాశీ విశ్వనాథ శాస్త్రి, 'స్వరాజ్య గీతామృతం'
'దండాలు దండాలు భారతమాత' అనేపాటల్తో చాలా ప్రచారం పొందింది. 1939లో
'మాకొద్దీ తెల్లదొరతనము' మొదలైన గేయాలతో గరిమెళ్ల సత్యనారాయణ
'స్వరాజ్య గీతాలు' వచ్చాయి గరిమెళ్ల స్వయంగా జైలుశిక్ష ననుభవించాడు.
'ఆదికావ్యం బండెనెక్కెను, ఐదు శాఖలు పెనగొనెక్కెను' అని గతోన్నత్యాన్ని కీర్తించే
రచనలుకూడా వచ్చాయి. స్వాతంత్ర్యోద్యమంలో వీరమరణం చెందిన వారి పట్ల కల్పించిన త్రిపుర
నేని 'వీరగంధము తెచ్చినాము .. వీరులెవరో తెలుపుడీ' వంటి గేయాలూ వచ్చాయి.
తిలక్ మరణం సందర్భంగా అనేక స్మృతి గీతాలు వచ్చాయి. జాతీయోద్యమంలో
గాంధీ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. గాంధీ స్తవం, అంటూ గాంధీయుగం,
'గాంధీ దర్శనమే పావనము' మొదలైన విధంగా గాంధీని ఒక అవతారమూర్తిగా
కీర్తిస్తూ గేయాలూ, పద్యకావ్యాలూ వచ్చాయి. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ
తెలుగు కవులను ప్రభావితం చేసింది. దేశ ఆర్థిక దుస్థితిని కూడా కొన్ని రచనలు
వెల్లడించాయి. చింతమర్తి లక్ష్మీనరసింహం 'భరతఖండంబు చక్కని పాడియావు'
ఈ భావాన్ని కొంత వెల్లడించింది. త్రిపురనేని రామస్వామి 'రోజు రోజు పోవు
చుండె, రోజకుండా నెంతో డబ్బు, ఇతరదేశజనులచేతికేమి చెప్పవారమిప్పుడు....
సాలినేత మూలబడియె, మాలనేత మూలబడియె.......లాంకషైర్ నేతగాండ్రు,
లాభమందుచున్నవారు, షాపుకార్లు కోట్లకొలది, సంతరించుచున్నారె ధనము' అని
దేశ ఆర్థిక స్థితిని చిత్రించాడు. జాతీయోద్యమ కవులు జానపద బాణీలను గ్రహిం
చారు. "దేశ సౌభాగ్యము కష్టజీవులపై నాధారపడియున్నది .. మన దేశమున
జనసామాన్యము నిరక్షరాస్యులు. దేశ దైన్యము వారికి సుబోధము గావలెనన్న
నిర్భాగ్యమైన గ్రామ్యభాషయే నేడు శరణ్యము" అని జాతీయోద్యమాన్ని ప్రేరే
పించే సాహిత్యం వ్యావహారిక భాషలో ఉండాలని వారు గుర్తించారు. చారిత్రక
వీరులు వస్తువులుగా దుర్భాక రాజశేఖరశతావధాని 'రాణాప్రతాప చరిత్రము',
గడియారం వెంకటశేషశాస్త్రి 'శివభారతము' వంటి పద్యకావ్యాలూ వచ్చాయి.
ఇలాంటి వస్తువుతోనే అనేక నాటకాలు వచ్చాయి. మొదటితరంలో చారిత్రక
వస్తువును దేశభక్తి ప్రేరణకు అనుకూలంగా మార్పులు చేసి, కల్పనలు చేసి
రచించిన వేదం వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయం' లాంటి నాటకాలు
వచ్చాయి. కవిత్వంలోలాగే తిలక్ జీవితం, నిర్యాణం, అసహాయోద్యమం,
స్వాతంత్ర్యోద్యమంలోని ప్రముఖ సంఘటనలు, గాంధీ విజయాలు, హరిజనో

వ్యసనం, మద్యపాన నిషేధం మొదలైనవి ఇతివృత్తాలుగా అనేక నాటకాలు వచ్చాయి. పౌరాణిక నాటకాలు కూడా దేశభక్తి ప్రబోధం చేశాయి. రైతు కుటుంబాన్నుంచి వచ్చిన దువ్వూరి రామిరెడ్డి రైతు జీవితాన్ని, గ్రామీణజీవితాన్ని చిత్రించే కావ్యాలతోపాటు 'కాంగ్రెస్‌వాలా' వంటి నాటకాలు కూడా రాశాడు.

గతకాలపు వైభవాన్ని కీర్తించడం కాల్పనికోద్యమంలో భాగంగా కూడా వచ్చింది. యూరప్ దేశాలలోని పారిశ్రామిక, ఫ్రెంచి విప్లవాలు వ్యక్తి స్వేచ్ఛా భావాలను, ప్రజాస్వామ్య భావాలను దారితీశాయి. దాని ఫలితంగా ఆ దేశాలలో కాల్పనిక కవిత్వం వచ్చింది. దాని ప్రభావంవల్ల ఆత్మాశ్రయ ప్రధానమూ, అనుభూతి ప్రధానమూ అయిన కవిత్వం భారతీయ భాషలతోపాటు తెలుగులో కూడా భావకవిత్వం పేరుతో వచ్చింది. సాహిత్యరంగంలో తప్ప సాంఘిక, రాజకీయ రంగాలలో ఈ కవిత్వం నిర్వహించిన పాత్ర చాలా తక్కువ. యూరపులోని కాల్పనిక సాహిత్యానికి ఆర్థిక, రాజకీయ ప్రేరణలున్నాయి, భారతదేశంలో భాగంగా ఉన్న తెలుగుదేశంలో దానికి ఆర్థిక పునాదులు లేవు. ఒక భావంగా మాత్రమే అది ప్రవేశించింది. యూరపులో నవ్య ప్రబంధ (Neo-classism) రీతులకు వ్యతిరేకంగా కాల్పనిక కవిత్వం వచ్చింది. గతకాలపు వైభవస్మృతులతో, ప్రబంధవాసనలతో ఆత్మాశ్రయ కవిత్వంగా రాయప్రోలు సుబ్బారావు మొదలైన వారితో తెలుగులో భావకవిత్వం చాలా ఆలస్యంగా 1910 నాటికిగాని మొదలు కాలేదు. ప్రబంధాలలోని అంగాంగ శృంగారం కాకుండా మానసికమైన ప్రేమ తత్వాన్ని ప్రవేశపెట్టడం భావకవిత్వంలో సాహిత్య పరంగా ఒక నవీన గుణం. అనంతర ప్రబంధాలలోని కరడు గట్టిన భాష కాకుండా మృదువైన శైలిని, గీతిగుణాన్ని రూపపరంగా భావ కవిత్వం సాధించింది. ఈ ఒకటి రెండు గుణాలలో తప్ప తక్కిన అన్నిటా సంప్రదాయ రీతులనే భావకవిత్వం ఆశ్రయించింది. అందుచే భావాలలో, రూపంలో అన్నిటా ఆధునికమైన గురజాడ కవిత్వాన్ని కాక భావకవిత్వాన్ని సంప్రదాయవాదులు నవ్యకవిత్వంగా ఆహ్వానించారు. రాజకీయమైన ప్రజాస్వామ్యభావాలనుండి వచ్చిన వ్యక్తి స్వేచ్ఛాభావాలు కాకుండా, వ్యక్తి ప్రాముఖ్యభావాలే భావకవిత్వంలో ఎక్కువగా కనిపిస్తాయి. సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తు ఈ కవిత్వానికి ఎక్కువగా ప్రచారం

తెచ్చాయి. 1933లో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అధ్యక్షతన ప్రారంభ మైన 'అభినవాంధ్ర కవిపండిత సభ' 1936లో 'నవ్య సాహిత్య పరిషత్తు' గా మారింది. సాహిత్య రంగంలో ఈ సంస్థల ద్వారా తెలుగుదేశంలోని కవులందరినీ ఒక వేదికమీద చేర్చటానికి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి వంటివారు ఉద్యమించారు.

### తెలుగు జాతి చైతన్యం

ద్వంద్వ జాతి సిద్ధాంతాన్ని అంగీకరిస్తే మొదటినుంచు తెలుగు వారిలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. ఎన్ని ఉద్యమాలు వచ్చినా, మొదటి భాషా ప్రయుక్త రాష్ట్రం తెలుగు వారిదే అయినా వారికి గుర్తింపు లభించటానికి చాలా దూరం ప్రయాణం చేయవలసి వచ్చింది. భిన్నభాషాప్రాంతాల కలయిక అయిన మద్రాసు రాష్ట్రంలో తమిళుల ప్రాధాన్యం, నిజాం సంస్థానంలో అల్ప సంఖ్యాకుల భాష అయిన ఉర్దూ ఆధిక్యతతో పాటు మరాఠీ భాషవారి ఆధిక్యతా భావం తెలుగుజాతి చైతన్యాన్ని రగల్చటానికి కారణమయ్యాయి. భాషా జాతి చైతన్యం ఆధునిక పరిణామాలలో ఒక ముఖ్యమైన అంశం. కోస్తా, రాయలసీమ ప్రాంతాలతో సమాన మైన ఆంధ్రోద్యమ చరిత్ర తెలంగాణా ప్రాంతంలో కూడా ఉంది. తెలుగువారికి భారతమాతతో సమానమైన చరిత్ర, ఆంధ్రమాతను కనిపిస్తుంది. 'ఏ దేశమేగినా ఎందుకాలిడిన.........పొగడరా నీ తల్లి భూమి భారతిని ...' అని 'దేశ గర్వము దీప్తి చెందగ' గానం చేసిన తెలుగు కవి 'ఉపనిషన్మీమాంస నేర్పంగ ప్రతిష్ఠల నవధరించిన పురాణాంధ్ర జాతి'ని గురించి 'వ్రాయఁబడి, పాడఁబడి, గీయఁబడి, యుపన్యసింపఁబడి శ్రోత్రపేయమై చెన్నుదాల్చిన' ఆంధ్ర సంస్కృతిని గురించి, శౌర్యాన్ని గురించీ కూడా గానం చేశాడు. 1903-04 లోనే గుంటూరులోని యువ జన సాహితీ సమితి ప్రత్యేక రాష్ట్రంగా తెలుగువారందరూ కలవాలని కోరింది. 1907-08 లో బందరులో నిజాం రాష్ట్రానికి, కోస్తా ప్రాంతానికి చెందిన తెలుగు వారి సంయుక్త సమావేశం జరిగింది. 1911 లో ఉన్నవ లక్ష్మీనారాయణ, చెన్నవిత్తుల గురునాథం కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు కలసిన ఆంధ్ర దేశ పటాన్ని సిద్ధం చేయించారు. తెలుగుదేశంలోని పత్రికలన్నీ ఈ ఉద్యమానికి దోహదం చేశాయి. ప్రజలందరిలో సమానమైన అభివృద్ధి జరగా లంటే ప్రాంతీయ భాషలో పరిపాలన జరగటం అవసరమని, అది భాషా ప్రయుక్త రాష్ట్రాలలోనే సాధ్యమన్న అభిప్రాయం స్థిరపడింది. 1911 లో కొండా వెంక

ఒప్పయ్య 'ఆంధ్రోద్యమము', 1913 లో భోగరాజు పట్టాభిసీతారామయ్య, ఒ పత్తి హనుమంతరావులు 'ఆంధ్ర రాష్ట్రము' అన్న గ్రంథాలు రాశారు. 1917 లో మద్రాసు రాష్ట్రంలోని తెలుగు ప్రాంతానికి ప్రత్యేక కాంగ్రెస్ కమిటీ ఏర్పడింది. 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడింది. జాతీయోద్యమ కాలంలో జాతీయతకు ప్రతీకగా హిందీ భాషా స్థానాన్ని కొందరు తెలుగువారు వ్యతిరేకించారు. దక్షిణాదివారిలో జాతీయాభిమానాన్ని, చైతన్యాన్ని పెంచటం ద్వారా హిందీని నేర్చుకోవటానికి అవసరమైన వాతావరణాన్ని పెంచాలని గాంధీ అంటాడు. అంటే జాతీయతకు ప్రతీకగా హిందీని ఆయన తీసుకువచ్చాడు. ప్రఖ్యాత కథారచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి హిందీ భాషావాదులు చూపుతున్న ప్రతిపాదించిన హిందీ భాషాభిమానం మాతృభాషల పెరుగుదలను అరికడుతుందని తీవ్రమైన హిందీ భాషా వ్యతిరేకి అయ్యాడు. జస్టిస్ పార్టీ కూడా తెలుగువారికి ప్రత్యేక రాష్ట్ర నిర్మాణాన్ని బలపరచింది. ఈ విషయంలో కాంగ్రెస్, జస్టిస్ పార్టీలను ఒక దశలో ఒకే వేదికపై నుంచి కృషి చేశారు. జస్టిస్ పార్టీవారు ఆంధ్ర అన్న పదం కాక తెలుగు అన్న పదాన్ని ఎక్కువగా వాడారు. త్రిపురనేని రామస్వామి చౌదరి వంటివారు ఉత్తరాది వారికి ఊడిగం చేయటానికి వ్యతిరేకంగా తెలుగు రాష్ట్రవాదాన్ని బలపరచారు. జస్టిస్ పార్టీ, త్రిపురనేని ద్రావిడ జాతి వాదంలో భాగంగా తెలుగు రాష్ట్రాన్ని కోరారు. త్రిపురనేని 'సుంపేరా' అన్న గేయంలో, ఒరిస్సాలో బరంపురం, పర్లాకిమిడి వరకూ, బెంగాలు సరిహద్దుల కనతల బస్తరు వరకు, మహారాష్ట్ర ప్రాంతంలో నాగపూర్ వరకు, తమిళనాడులో తంజావూరు వరకు, కర్ణాటకలో బళ్ళారి వరకు తెలుగుదేశమే అని ప్రకటించాడు. 'వీరగంధము తెచ్చినారము' మొదలైన జాతీయోద్యమ ప్రేరణ గేయాలలో కూడా తెలుగువాడిని సంబోధించడమే ప్రధానంగా కనిపిస్తుంది. తెలుగుబిడ్డ, తెలుగు బాలుడు, తెలుగునాడు, తెలుగుపాట, తెలుగు చరిత అన్న మాటలు ఆయన కవిత్వంలో కనిపిస్తాయి. 1922 లో ఎనిమిదవ కమ్మ మహాసభకు అధ్యక్షత వహిస్తూ అలాంటి సభలు ఆంధ్ర జాతీయతా వికాసానికి తోడ్పడాలని రామస్వామి చౌదరి బోధించాడు. 1939 లో త్రిపురనేని రాసిన గేయం 'తెలుగు నాయకులు' ప్రత్యేక తెలుగు రాష్ట్రం నిర్మాణం విషయంలో తెలుగు నాయకుల మౌనాన్ని 'తెలుగు మంత్రులు మంత్రవిదుత్తై, మూగనోమును బట్టినప్పుడు, తెలుగు శాసన సభ్యులెల్లరు, తెల్ల మొగములు

పైచునప్పుడు"....అని 'ఆంధ్రకేసరిరేయిఁ బవలును, గుహల నిద్దురఁ బోవు
నప్పుడు ..." అని 'తెలుఁగు డాక్టరు తెలుఁగు దేశము, నాడిఁజూచుచు నిల్చు
నప్పుడు, కాలమాన పరీక్షఁజేయుచు, నడ్డసాళులుపైచునప్పుడు ..." అని విమర్శిం
చాడు. తమిళ ప్రాంతంలో ఇ. వి. రామస్వామి నాయకర్ నేతృత్వంలో ఆనాడు
మొదలైన 'ఆత్మగౌరవ' ఉద్యమఛాయలు తెలుగు ప్రత్యేక రాష్ట్రోద్యమంలో
భాగంగా త్రిపురనేనిలో కన్పిస్తాయి.

నిజాం రాష్ట్రంలో ఆంధ్రోద్యమం 1921 నాటికి భాషా సాంస్కృతికోద్యమ
రూపంలో వచ్చింది. బ్రిటిష్ పరిపాలనలో ఉన్న తెలుగు ప్రాంతంలో లాగా
స్వాతంత్ర్యోద్యమంతో కలసిరాలేదు. ఫ్యూడల్ సంస్థానంగా అక్కడి ప్రత్యేక
పరిస్థితులు దానికి కారణం. చాలా పరిమితులలో అక్కడి ఉద్యమాలు పనిచేయ
వలసి వచ్చాయి. ఆ ప్రాంతంలో కళాశాలలు, పాఠశాలలు తక్కువ. విశ్వవిద్యా
లయంలో ఉర్దూ బోధనా భాష. 1901 లో హైద్రాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర
భాషానిలయ స్థాపనతో గ్రంథాలయోద్యమంతో భాషా చైతన్యం ఆ ప్రాంతంలో
ప్రారంభమైంది. 1921 లో హైదరాబాదులో కర్వే అధ్యక్షతన జరిగిన సంఘ
సంస్కరణ సభలో ఆలంపల్లి వెంకటరామారావు తెలుగులో ఉపన్యాసం ఇస్తుండగా
ఇతర భాషలకు చెందిన సభికులు గేలి చేసిన సంఘటన నిజాం రాష్ట్రంలోని
తెలుగువారు ఒక ప్రత్యేక సంఘంగా ఏర్పడటానికి దారితీసింది. అదేరోజు కొండా
వెంకట రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు,
ఆదిరాజు వీరభద్రరావులు సమావేశమై ఆంధ్రజన సంఘాన్ని ప్రారంభించారు.
భాషా ప్రచారం, గ్రంథాలయోద్యమం, సాంస్కృతిక చైతన్యం ధ్యేయాలుగా
తెలంగాణా ప్రాంతంలోని ఆంధ్రోద్యమం మొదటి దశలో నడచింది. వెట్టిచాకిరీ
నిర్మూలన, స్త్రీ విద్య మొదలైన రంగాలలో కూడా ఈ ఉద్యమం కొంత కృషి
చేసింది. 1922 లో నల్లగొండ నుంచి వెలువడిన 'నీలగిరి', వరంగల్ జిల్లాలోని
ఇనుగుర్తి నుంచి ఆదే సంవత్సరం వచ్చిన 'తెలుగు పత్రిక' 1926 లో సురవరం
ప్రతాపరెడ్డి సంపాదకత్వాన వెలువడ్డ 'గోలకొండ పత్రిక' ఆంధ్రోద్యమానికి
దోహదం చేశాయి. 1930 లో ఆంధ్ర మహాసభ ఏర్పడటంతో ఆంధ్రోద్యమానికి
రాజకీయ స్వభావం వచ్చింది. 1944 నాటికి ఆంధ్ర మహాసభ కాంగ్రెస్, కమ్యూ
నిస్టు పార్టీలుగా చీలిపోయింది. రావి నారాయణరెడ్డి మొదలైన వారి నాయకత్వం

లోని కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రోద్యమాన్ని తీవ్రతరం చేసింది. 1953 లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం, 1956 లో ఆంధ్రప్రదేశ్ పేరుతో విశాలాంధ్ర ఏర్పడ్డాయి.

వలస పాలకులు స్థానికుల ప్రయోజనాల దృష్టితో కాకుండా తమ ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా భాషా ప్రధాన విభాగాలుగా కాకుండా భిన్న భాషలవారు కలిసిన కొన్ని పరిపాలనా విభాగాలుగా దేశాన్ని విభజించారు. మొదటి సారిగా బ్రిటిష్ వారి కాలంలో భారతదేశంలో బలమైన కేంద్రీకృత పాలన ఏర్పడింది. దాన్ని ఎదుర్కోవటానికి అఖిలభారత స్థాయిలోనే కేంద్రీకృతమైన ఉద్యమావశ్యకత ఏర్పడింది. భాషలన్నిటిని సమానంగా గుర్తించి, భాషా జాతులలో ఆత్మ విశ్వాసం కలిగించటం ద్వారా కింది స్థాయి నుంచి పై స్థాయికి జాతీయతను బలంగా అభివృద్ధి చెందించే ప్రయత్నం జాతీయోద్యమ కాలం నుంచీ జరుగలేదు. భారతీయ భాషల మధ్యన న్యాయమైన సమానత్వాన్ని గుర్తించటం ద్వారా దేశ ఐక్యతకు మార్గం పడలేదు. పై స్థాయి నుంచి ఒక భాషకు ప్రాధాన్యాన్ని ఇచ్చే ప్రయత్నం చేయటం వల్ల దేశీయ భాషల వారిలో రకరకాల అసంతృప్తులకు దారితీసింది. ఆర్థిక కారణాలవల్ల ఒకే భాషకు సంబంధించిన వారు ఏకమై ఏక భాషా రాష్ట్రం ఏర్పడటం కూడా అంత సులభంగా జరగలేదు. మొదటి నుంచీ దత్త మండలాలవారు ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి అంత సుముఖంగా లేరు. నీటి పారుదల సౌకర్యాలు లేకపోవటం వల్ల, రైత్వారీ విధానం వల్ల ఆ ప్రాంతం ఆర్థికంగా చాలా చితికిపోయింది. చిలుకూరి నారాయణరావు ఆ ప్రాంతం వారిలో ఆత్మ విశ్వాసాన్ని కలిగించటానికి కాబోలు ఆ ప్రాంతానికి 'రాయలసీమ' అని పేరు పెట్టాడు. రాజధానిగా మద్రాసు గాని, రాయలసీమలో ఒక పట్టణం గాని ఉండటానికి, శాసన సభలోను, మంత్రి వర్గంలో సమాన ప్రాతినిధ్యం ఉండటానికి, రెవిన్యూ ఆదాయాన్ని కూడా సమానంగా ఖర్చు పెట్టటానికి, తుంగభద్ర ప్రాజెక్టు మొదలు పెట్టటానికి 1937 లో శ్రీబాగ్ ఒడంబడిక జరిగిన తరువాత మాత్రమే రాయలసీమ ప్రాంతం వారు ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి కొంత వరకు సుముఖులయ్యారు. 1956 లో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడే ముందు ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల మధ్య ఇలాంటి ఒప్పందాలే జరిగాయి. రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రంగాలలో రెండు ప్రాంతాలలో చాలా వ్యత్యాసం ఉంది. దానికి కారణం అంతవరకు ఆ రెండు ప్రాంతాల వారు భిన్న ఆర్థిక వ్యవస్థలలో జీవించటమే.

ఆంధ్రోద్యమంతోపాటు తెలుగు దేశానికి, తెలుగు దేశాన్ని పాలించిన రాజ వంశాలకు సంబంధించిన చరిత్ర పరిశోధనలెన్నో జరిగాయి. చిలుకూరి వీరభద్రరావు 1910 లో ఆంధ్రుల చరిత్ర మొదటి భాగాన్ని, 1912 లో రెండవ భాగాన్ని, 1916 లో మూడవ భాగాన్ని రచించాడు. మొదటి రెండు విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలికోసం రాశాడు. మూడవది తానే స్థాపించిన ఇతిహాస తరంగిణీ గ్రంథమాల పక్షాన ప్రచురించాడు. 1936 లో కాకతీయాంధ్ర రాజ యుగ చరిత్రను ప్రత్యేకంగా రచించాడు. 'అళియ రామరాయలు', 'తిక్కన సోమయాజి', 'తిమ్మరుసు' మొదలైన జీవిత చరిత్రలను కూడా ఆయన రచించాడు. మల్లంపల్లి సోమశేఖర శర్మ తెలుగు రాజవంశాల చరిత్రలను వెలుగులోకి తీసుకొని వచ్చాడు. 1920 ల లోనే రాజమండ్రిలో ఆంధ్ర ఇతిహాసిక పరిశోధన మండలి (Andhra Historical Research Society) ఏర్పడింది. ఉత్సవాలను నిర్వహించటం, ప్రత్యేక సంచికలను తీసుకురావటం ద్వారా తెలుగు దేశ చరిత్ర పరిజ్ఞానాన్ని మండలి పెంచింది. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక, కాకతీయ సంచిక, రెడ్డి సంచిక వంటి సంచికలు వెలువడ్డాయి. కొమర్రాజు లక్ష్మణరావు కాలంనుంచి దేశ చరిత్రతోపాటు తెలుగుదేశ సంఘ చరిత్ర పైనకూడా చారిత్రకులు తమ దృష్టిని ప్రసరింపజేశారు. నేలటూరి వెంకట రమణయ్య ఆర్థిక వ్యవస్థ, పాలనా వ్యవస్థ దృష్టితో కూడా చరిత్ర రచన చేశాడు. విజయనగర సామ్రాజ్య కాలంలో పన్నుల విధానం, రైతుల పరిస్థితి మొదలైన అంశాలను నేలటూరి వెంకట రమణయ్య చర్చించాడు. నాయంకర వ్యవస్థను ఫ్యూడల్ వ్యవస్థతో పోల్చే ప్రయత్నం చేశాడు. రాజుల చరిత్రనుండి, ఆర్థిక చరిత్ర రచన వైపు చరిత్ర పరిశోధనలో జరిగిన పరిణామాన్ని ఇది సూచిస్తుంది. తెలుగు ప్రాంతపు చారిత్రక పురుషులు ఆధారంగా నవలలు రాయటం చిలుకూరి వీరభద్ర రావుతోనే ప్రారంభమైంది. ఇదే సందర్భంలో తెలుగువారి గతాన్ని కీర్తిస్తూ వేములపల్లి శ్రీకృష్ణ వంటి కమ్యూనిస్టులు కూడా "చేయెత్తి జైకొట్టు తెలుగోడా!" వంటి గీతాలు రాశారు.

### మారుతున్న వ్యవస్థలో కులాలు

వలస ఆర్థిక వ్యవస్థ కులవ్యవస్థకు పునాది అయిన భారతీయ సంప్రదాయ ఆర్థిక వ్యవస్థను కూల్చివేసింది. సంప్రదాయ విద్య ఆధారంగా

అంతవరకు జీవించినవారు ఇంగ్లీషు విద్య నేర్చుకొని బ్రిటిష్ పాలనా చట్రంలో భాగం అయ్యారు. ఇంగ్లీషు విద్యకు కులభేదం లేదు. అందరికీ అందుబాటులోకి రావడం మొదలు పెట్టింది. ఆంగ్ల విద్యా ప్రభావం భిన్న కులాలవారిలో గుర్తింపు సమస్యను తెచ్చింది. అంతకుముందు పాలనా వ్యవస్థలో భాగమైన మధ్య కులాలవారి ప్రాధాన్యం తగ్గింది. విద్యారంగంలో, ఉద్యోగాలలో బ్రాహ్మణులెక్కువ. భూస్వామ్య కులాలకు సంబంధించినవారు, భూమిమీద ఆధారపడ్డ పెద్ద రైతు కులాలవారు వలసపాలనా చట్రంలో ఎదుర్కొంటున్న ఇబ్బందులకు మధ్య, కింది తరగతి ఉద్యోగాలలో ఉన్న బ్రాహ్మణులే కారణమన్న భావం ఏర్పడింది. తెలుగుదేశంలో అనేక కుల సంఘాలు ఏర్పడ్డాయి. ఈ సంఘాలన్నీ సుమారు మధ్య కులాలైన రెడ్డి, కమ్మ, తెలగ, వెలమ, కాపు కులాలకు సంబంధించినవి కావడం గమనించదగ్గది. మధ్య తరగతి వారి పరస్పర ప్రయోజనాలు, వారి ప్రయోజనాలలోని వైరుధ్యాలు కుల సంఘాలు ఏర్పడటానికి ముఖ్యమైన కారణాలు. చదువుకొని పాలనా యంత్రాంగంలో భాగమైన మధ్య తరగతికి, భూమిమీద ఆధారపడ్డ మధ్య తరగతికి మధ్య వైరుధ్యాలే కుల సంఘాలు ఏర్పడటానికి దారితీశాయి. విద్యాభివృద్ధి, తమ అభ్యుదయం ధ్యేయంగా 1910 ప్రాంతంలో ప్రారంభమైన ఈ కుల సంఘాలలో క్రమంగా స్వాధికృతా భావన ప్రవేశించింది. శాఖా భేదాలుపోయి ఒక కులం వారిని ఒక బలమైన వర్గంగా ఈ సంఘాలు ఒకచోట చేర్చాయి. గత చరిత్రను తవ్వి తమ కులాలు క్షత్రియ కులాలకు సంబంధించినవిగా నిరూపించుకొనే పరిశోధనలు జరిగాయి. కొత్త భావయ్య చౌదరి 'కమ్మవారి చరిత్ర' వంటి కుల చరిత్ర గ్రంథాలు వచ్చాయి. కుల పత్రికలు వచ్చాయి. ఇదంతా పునరుద్ధరణ ధోరణులలో భాగమే. తరువాత కాలంలో కులాల గుర్తింపు సమస్య సంస్కృతీకరణకు దారితీసింది. మధ్య కులాలవారికి సామాజిక స్థాయి ఉండటంవల్ల తమ కులాల పేర్లను సంస్కృతీకరించవలసిన అవసరం రాలేదు. కాని వృత్తికులాలు, కింది కులాలు తమ కులాల పేర్లనుకూడా సంస్కృతంలోకి మార్చుకున్నారు. ఆచారవ్యవహారాలలో, జీవనవిధానంలో అగ్రకులాలను అనుకరించారు. ఇది సంస్కృతీకరణంలో ముఖ్యంగా బ్రాహ్మణీకరణంలో భాగం. తెలుగుదేశంలోని కులసంఘాలు తమిళ ప్రాంతంలోలాగా బ్రాహ్మణేతరులందరినీ కలిపే ఉద్యమంగా పరిణమించి సంస్కరణ, రాజకీయ ప్రాముఖ్యాన్ని పొందలేదు. బ్రాహ్మణేతరుల, కింది కులాలవారి సమగ్ర

'ఆర్థికాభివృద్ధికి, సామాజిక స్థానానికి సంబంధించిన ధ్యేయాలు, సంస్కారాలు ప్రత్యేక కుల సంఘాలలోఉండే అవకాశంలేదు. ఎనిమిదవ కమ్మమహాసభకు అధ్యక్షత వహిస్తూ త్రిపురనేని రామస్వామిచౌదరి 'వంశపరంపరగావచ్చుచున్న కర్షక వృత్తినే యాధారముగా జేసుకొని, కొందరు మలమును మాతవలసి వచ్చుచున్నది' అని, 'విద్యయొసంగిన మహాత్మ్యము చేతనే యితరకులజులు మనలను తిరస్కరించుచున్నవి' అని సామాజికస్థాయికి విద్య అవసరాన్ని నొక్కిచెప్పాడు. బ్రిటిష్ ప్రభుత్వం వ్యవసాయ రంగంలో అనుసరించిన పన్నుల విధానం కూడా భూమిమీద ఆధారపడ్డ కులాలు తమ సామాజిక, సాంస్కృతిక స్థాయిని గురించి ఆలోచించవలసిన అవసరాన్ని కలిగించి ఉంటుంది.

జాతీయోద్యమ కాలంలోని కొన్ని పునరుద్ధరణ ధోరణులు ప్రతి పునరుద్ధరణ ధోరణులకు దారితీశాయి. అస్పృశ్యతా నివారణ మొదలైన సామాజికాంశాలు జాతీయోద్యమంలో భాగమైనా, మతవిశ్వాసాలలో భాగంగా సనాతనమైన వర్ణాశ్రమ వ్యవస్థను ఆదర్శవ్యవస్థగా, సమాజంలోని మౌలిక విభజనగా ప్రధాన నాయకత్వంలోని కొందరు బోధించి ప్రచారంచేయడంవల్ల అగ్రవర్ణాలపై వ్యతిరేకమైన ఉద్యమాలు దేశంలో బయలుదేరాయి. 1929లో ఒక పత్రికలోవచ్చిన సంపాదకీయం ఆనాడు వర్ణాశ్రమ వ్యవస్థను ఆదర్శీకరించే ధోరణులను సంగ్రహిస్తున్నది. "విరాట్పురుషుడే హిందూ సంఘముయొక్క లక్ష్యము. ప్రతివ్యక్తియందును ఆ విరాట్పురుషుని సర్వశక్తియు గర్భితమై యున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మములకన్నిటికి విరాట్పురుషుడాధారభూతుడై వానియందు సామరస్యము పొందినట్లే, ప్రతివ్యక్తియు తనయందు దాగియున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మముల నేకోన్ముఖమునకుదెచ్చి వ్యష్టియందును సమష్టియందును విరాట్పురుషుని ప్రతిబింబింపజేయుట కవకాశముగల్గును". ఈ సంప్రదాయ విశ్వాసాల చట్రంలోనే సంస్కరణలను ప్రవేశపెట్టే ప్రయత్నం ఆ కాలంలో జరిగింది. ఈ ధోరణులకు వ్యతిరేకంగా కులోద్యమాలు, బ్రాహ్మణేతరోద్యమాలు దేశంలో వచ్చాయి. ద్రవిడ భాషా జాతి గుర్తింపులో భాగంగా దక్షిణ భారతంలో, మరీ ముఖ్యంగా తమిళప్రాంతంలో ఈ ఉద్యమాలు తీవ్రంగా వచ్చాయి.

1920-40 మధ్య తమిళనాడులో వచ్చిన ఆత్మగౌరవ ఉద్యమం **(Self-Respect movement)** ఈ ధోరణులలో వచ్చిన ముఖ్యమైన ఉద్యమం.

1916 లో తరువాత జస్టిస్ పార్టీగా మారిన సౌత్ఇండియన్ లిబరల్ ఫెడరేషన్‌తో తమిళనాడులో బ్రాహ్మణేతరోద్యమం ప్రారంభమైంది. కాని ఇది చదువుకున్న బ్రాహ్మణేతరులకు మాత్రమే పరిమితమైంది. ఇతరులు ఈ నిర్మాణం పరిధికి రాలేదు. చదువుతో సంబంధం లేకుండా బ్రాహ్మణేతరులందరిని ఉద్దేశించి ఉద్యమాన్ని నడిపినవాడు ఇ.వి. రామస్వామినాయకర్. సామాజిక అంతరాలు పోగొట్టే సంస్కరణ ఉద్యమంగా 'ఆత్మగౌరవ ఉద్యమా'న్ని ఆయన ప్రారంభించాడు. సామాజిక దురాచారాలు, కులభేదాలు ముందు పోవాలని తరువాతే స్వాతంత్ర్యమని రామస్వామినాయకర్ అభిప్రాయపడ్డాడు. రాజ్యాంగ సంస్కరణలకంటే ముందు సామాజిక సంస్కరణలు రావాలన్న వీరేశలింగం అభిప్రాయాలతో స్థూలంగా ఇది సరిపోతుంది. 1921 లో మద్రాసులో ఒకచోట మాట్లాడుతూ "మద్రాసులో హిందూమతం బ్రాహ్మణులు ఆ మతానికి చేసిన సేవలకు, అపుడుపరచిన సంప్రదాయాలకు ఋణపడి ఉందని, బ్రాహ్మణులు తమకుతాము హిందూ మతానికి ధర్మ కర్తలుగా ప్రకటించుకున్నారని, దాని పవిత్రతను వారే కాపాడుతార"ని గాంధీ వెలిబుచ్చిన భావాలు, ఇతర సంఘటనల వంటివి ఇ.వి. రామస్వామి నాయకత్వంలోని ఆత్మగౌరవోద్యమానికి మరింత బలాన్ని చేకూర్చింది. రామస్వామి నాయకర్ రష్యా పర్యటించి వచ్చిన తరువాత సమస్యల విషయంలో ఆర్థికపరమైన దృష్టి కూడా కొంతవరకు ఏర్పడ్డా, బ్రాహ్మణేతరుల సామాజిక పోరాటాకు సంబంధించిన ఉద్యమంగా మాత్రమే అది కొనసాగింది. మత వ్యతిరేక, నాస్తిక దృష్టితోనే రష్యాలోని సమధర్మానికి రాశిజలను రామస్వామి నాయకర్ చూశాడు. అగ్రవర్ణాలకు ప్రాధాన్యమిచ్చే పురాణాలను, స్మృతులను ఆయన వ్యతిరేకించాడు.

దక్షిణ భారతంలో బ్రాహ్మణేతరోద్యమంలో ముఖ్యమైన అంశం జస్టిస్ పార్టీ. 1916 లో ఏర్పడ్డ జస్టిస్ పార్టీలో నాయకత్వం తెలుగువారిది. ముఖ్యంగా జమీందారులు, చదువుకున్న మధ్య తరగతి వర్గానిది, భూస్వాములది, పెద్ద రైతులది. కాని తెలుగు దేశంలో దాని అనుచరులు చాలా తక్కువ. తమిళనాడులో అనుచరులు ఎక్కువ. పానగల్లు రాజా పానుగంటి రామారాయణింగారు, వెల్లపల్లి కుమారరాజా, బొబ్బిలిరాజా, కె.వి. రెడ్డినాయుడు, కె. రామమూర్తినాయుడు, రఘుపతి వెంకటరత్నంనాయుడు బారిస్టర్ కె. సుబ్బారెడ్డి, కట్టమంచి రామలింగారెడ్డి, కోకా అప్పారావు, రైతు నాయకత్వానికి చెందిన బి. మునిస్వామినాయుడు జస్టిస్ పార్టీ నాయకత్వంలో ఉన్నారు. ఒక దశలో రైతు నాయకత్వానికి,

జమీందారీ నాయకత్వాన్నికి జస్టిస్ పార్టీలో పోటీ ఏర్పడింది. జస్టిస్ పార్టీ అధికారంలో ఉన్న కాలంలో తెలుగుదేశంలో బ్రాహ్మణేతర సభలు చాలా జరిగాయి. మద్రాసు రాష్ట్రంలో జస్టిస్ పార్టీ మంత్రి వర్గాలు ఏర్పడ్డాయి. స్వాతంత్ర్యోద్యమం వైపు తీవ్రంగా పురోగమిస్తున్న కాంగ్రెస్ పార్టీకి పోటీగా బ్రిటిష్ ప్రభుత్వం జస్టిస్ పార్టీకి మద్దతు నిచ్చింది. తెలుగును ద్రావిడ భాషగా తెలుగు మాట్లాడేవారిని ద్రావిడ జాతికి చెందినవారుగా జస్టిస్ పార్టీ గుర్తింపును కోరింది. 1926 లో మద్రాసు కౌన్సిల్‌లో ఆంధ్ర విశ్వవిద్యాలయం బిల్లును ప్రవేశ పెట్టినప్పుడు కె.వి. రెడ్డినాయుడు ఆంధ్ర అన్న పదాన్ని వ్యతిరేకించాడు. ఆంధ్ర అన్నది సంస్కృత పదమని, తెలుగు అన్నది ద్రవిడ పదమని, దాన్ని తెలుగు విశ్వవిద్యాలయంగా మార్చాలని వాదించాడు. రామస్వామి ముదలియార్ తెలుగు విశ్వవిద్యాలయం ద్రావిడ సంస్కృతిని పెంపొందించాలని కోరాడు. అప్పుడు కౌన్సిల్‌లో మెజారిటీలో ఉన్న స్వరాజ్య పార్టీ పేరు మార్పును వ్యతిరేకించటంవల్ల ఆంధ్ర విశ్వవిద్యాలయంగానే అది ప్రారంభమైంది.

తెలుగుదేశంలో బ్రాహ్మణేతరోద్యమాలేవీ బలంగా నిలదొక్కుకోలేక పోయాయి. దానికి కారణాలు నాలుగు. తెలుగుదేశంలోని బ్రాహ్మణేతరోద్యమాలలో తమిళనాడులోలాగా కాకుండా జమీందారులు, భూస్వాములు, మధ్య కులాలలోని చదువుకున్నవారు మాత్రమే ప్రాధాన్యం వహించటం, ఇతర వెనుకబడిన, కింది కులాలవారికి స్థానం లేకపోవటం మొదటిది. దక్షిణ భారతదేశం మొత్తంమీద చూచినప్పుడు అంతకుముందే బలమైన సంఘ సంస్కరణోద్యమాలు తెలుగుదేశంలో వ్యాపించటం రెండవది. తెలుగుదేశంలోని జాతీయోద్యమం తొలిదశలోని నాయకత్వంలో ఎన్ని వైరుధ్యాలున్నా సంస్కరణ భావాల ప్రభావం ఉండటం మూడవది. ఆర్థిక సిద్ధాంతాలుగల కమ్యూనిస్టు పార్టీ తెలుగుదేశంలో స్థిరపడి రైతాంగం మీద, కార్మికులపైన ఎక్కువ ప్రభావాన్ని చూపటం నాలుగవది. హరిజనులపైన కూడా అంబేద్కర్ ప్రభావం ఉన్నంతగా బ్రాహ్మణేతరోద్యమాల ప్రభావం లేదు. జస్టిస్ పార్టీ వారికి జాతీయోద్యమంపైన అంతగా సానుభూతి కనిపించదు. కమ్యూనిస్టు ఉద్యమాన్ని బాగా విరోధించారు. బ్రిటిష్ అనుకూల విధానాలనే జస్టిస్ పార్టీ ఎక్కువగా అనుసరించింది. 1936 లో 'మాలపల్లి' నవల కమ్యూనిస్టు పార్టీకి ప్రచారం తప్ప మరొకటి కాదని మొత్తం పుస్తకాన్ని విశ్వ విద్యాలయం పాఠ్యభాగాల నుంచి తొలగించాలని కె.వి. రెడ్డినాయుడు నోట్ రాశాడు,

కట్టమంచి రామలింగారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలరుగా విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో నాస్తిక భావాలకు సంబంధించిన గ్రంథాలు ఉండకూడదని ఉత్తర్వు చేశాడు. ఇదే కాలంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వందేమాతరం ఉద్యమం సందర్భంగా బహిష్కరింపబడిన విద్యార్థులను నిబంధనలు లేవన్న కారణంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం పరీక్షలకు కూర్చోనివ్వకపోగా వారు నాగపూర్ విశ్వవిద్యాలయంలో పరీక్షలకు వెళ్ళవలసి వచ్చింది. అంతకుముందు హైదరాబాదు లోని బాలికా పాఠశాలలోని విద్యార్థినులకు తెలుగుమీడియంలో పరీక్షలు నడపటానికి కూడా అంతగా సుముఖత రాలేదు. కులోద్యమాల ప్రభావం సాహిత్య, సాంస్కృతిక రంగాలలో కూడా ఎక్కువ కనిపించదు.

## వైరుధ్యాలమధ్య హేతువాదం

యూరప్‌లో వైజ్ఞానికాభివృద్ధి కారణంగా వైజ్ఞానిక దృష్టితో భౌతిక ప్రపంచాన్ని, సమాజాన్ని విశ్లేషించే హేతువాద దృక్పథం వికసించింది. భారత దేశంలో వైజ్ఞానికాభివృద్ధి చాలా ఆలస్యంగా జరిగింది. పాశ్చాత్య దేశాలలో విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెందిన ఫలితంగా ఏర్పడిన హేతువాద ప్రభావం గురజాడ అప్పారావు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులు మొదలైన వారిమీద ఉంది. విజ్ఞానశాస్త్రాభివృద్ధి ఒకటే దేశప్రగతికి తోడ్పడుతుందని కొమర్రాజు నమ్మాడు. కాని తెలుగువారి సామాజిక చరిత్రలో హేతువాదంగా ప్రచారానికి వచ్చింది త్రిపురనేని రామస్వామి చౌదరి వంటివారు పురాణాల, స్మృతుల విషయంలో చూపించిన దృక్పథం. పురాణాలను, స్మృతులను, వర్ణవ్యవస్థను ప్రశ్నించటం భారతదేశంలో బుద్ధదేవునినుండీ, తెలుగులో వేమనాదుల నుండే ప్రారంభమైంది. పురాణాలు, స్మృతులపైన ఆధారపడిన వ్యవస్థను ప్రశ్నిస్తూ, వ్యతిరేకిస్తూ తమిళ నాడులో ఇ. వి. రామస్వామి నాయకర్ నాయకత్వంలో హేతువాదం పునాదిగా ఆత్మగౌరవోద్యమం పెద్ద ఎత్తున వచ్చింది. తెలుగుదేశంలో ఇలాంటి హేతువాదం ఒక విస్తృతమైన ఉద్యమంగా వ్యాపించలేదు. కొందరు వ్యక్తుల ద్వారా కొన్ని భావాలు ప్రచారానికి వచ్చాయి. సామాజిక సంస్కరణోద్యమాలలో, ఆర్థిక సిద్ధాంతాల పునాదిపైన వచ్చిన రాజకీయోద్యమాలలో భాగంగా వచ్చిన హేతువాద దృష్టిలాగా కేవలం పౌరాణిక వ్యవస్థను ప్రశ్నించిన హేతువాదం నిలబడలేదు. అది కేవలం కొన్ని వైయక్తిక కారణాలవల్ల, మానసిక కారణాలవల్ల వచ్చినది

శాపటంవల్ల ప్రజా స్వభావం దానికి తలొగ్గేదు. అయితే హేతువాదపు ప్రశ్నలు, భావాలు సామాజికంగా, చారిత్రకంగా అర్థవంతమైనవి. సామాజిక, రాజకీయ పరిణామంలో కొన్ని దృక్కోణాలను ఈ హేతువాదం నిశితంగా పరిశీలించింది. తెలుగుదేశంలో హేతువాదం అనగానే త్రిపురనేని రామస్వామి చౌదరి జ్ఞాపకం వస్తాడు. నిర్దిష్టమైన లక్ష్యాలతో ఉద్యమ నిర్మాతగా ఆయన కనిపించడు. కాని సృజనాత్మక సాహిత్యం ద్వారా తన భావాలను వెల్లడిచేశాడు తన జీవిత పరిణామంలో విరుద్ధమైన భావాలకు ఆయన లోనైనాడు. త్రిపురనేని ద్రావిడ భాషగా తెలుగు పాత్ర ప్రణాళికలలో సంస్కృత భాషా ప్రాముఖ్యం తగ్గాలన్నాడు. కాని తన రచనలన్నిటిలో గ్రాంథిక భాషనే అనుసరించాడు. ఒక దశలో అపువిన వేదాత్మ మీద మమకారం, మరొక దశలో భూతదయ వర్ధిల జేసిన గౌతమబుద్ధుని పైన అభిమానం ఆయనకు కనిపిస్తుంది వర్ణ విభజన, స్మృతులు ద్రావిడులపైన ఆర్యుల కుట్రగా నమ్మిన త్రిపురనేని ఆర్యసమాజంలో, కందుకూరి లాంటివారు వ్యతిరేకించిన హిందూ సమాజంలో చేరి క్రియాశీల సభ్యుడై క్రైస్తవులను శుద్ధి కార్యక్రమాలను నిర్వహించాడు. విద్యార్థి దశలోనే మహాసాహిత్యాన్ని విసర్జించాడు. జాతీయోద్యమంతో మమైకం అయి 'రాణాప్రతాప్' లాంటి చారిత్రక పురుషులను గురించి నాటకాలను రాశాడు. దేవాలయాలలోని అర్చకులను జీతభత్యాలిచ్చి ఉద్యోగం చేయించడం కంటే, వాళ్ళను విద్యావంతులను చేసి మత ప్రచారానికి ఉపయోగిస్తే బాగుంటుందని చెప్తూ 'హిందువులయ్యూ మన హిందూ మతమననేమో యెఱుంగక యుండుచున్న వారము మనము' అని భావించిన రామస్వామి చౌదరి 'మనము నాడు మోసము సుతా యిటి ముందు ధర్మపీడకుడ' అంటాడు భగవద్గీతలో, బ్రాహ్మణ పౌరోహిత్యాన్ని అంగీకరించడం బ్రాహ్మణులను ఉద్యోగం చేయటంగా బోధించి కమ్మకులంలో స్వకుల పౌరోహిత్యాన్ని ప్రోత్సహించాడు. బ్రాహ్మణాధిక్యతను కాదన్నాడే కాని సంప్రదాయాన్ని కాదనలేదు. 'రాణాప్రతాప్' నాటకం కాలంలో శంకర, వివేకానందులను తన్ను భారతమాతను స్మరించి, జీవితాంతంలో నాస్తికుడుగా పరిణమించాడు. అన్ని సమస్యలను నాస్తికత దృష్టితోనే పరిశీలించాడు. ఈ పరస్పర వైరుధ్యాలకు కారణం జీవితాన్ని, సమాజాన్ని సమగ్రంగా విశ్లేషించటం వల్ల వచ్చిన దృక్పథం వల్ల కాకుండా వైయక్తిక జీవితంలోని కొన్ని సంఘటనలకు ప్రతిస్పందనగా తన అభిప్రాయాలను ఏర్పరచుకోవటం వల్లనేమో అనిపిసుంది. వలస పాలనలో రాజకీయ, సామాజిక రంగా

లతోను పరస్పర విరుద్ధ భావ ధోరణుల మధ్య ఏదీ సిద్ధియించుకోలేని విచ్ఛిన్నతకు ప్రతీకగా త్రిపురనేని నిలుస్తాడు. స్వాతంత్ర్యోద్యమంలో ఏకీభవిస్తూనే దానితోపాటు పెరుగుతున్న భావాలంతో రాజీపడలేకపోవటం త్రిపురనేనిలో కనిపిస్తుంది.

కొన్ని దృక్కోణాలతో చూచినప్పుడు రామస్వామిగారి హేతువాద దృక్పథం చాలా విప్లవాత్మకంగా కనిపిస్తుంది. జాతీయోద్యమంలో వస్తున్న రెండు ధోరణులను హేతుబద్ధంగా, నిశితంగా ఆయన పరిశీలించాడు. మొదటిది చారిత్రక గాథలను స్వేచ్ఛగా మార్చి కల్పనలు చేసి సాహిత్యసృష్టి చేయటాన్ని ఆయన హేళన చేయటం. వేదం వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయ నాటక' కథలోని అసత్యాల్ని, కల్పనల్ని "ఢిల్లి దగ్గర గంగ యుండెనొ? గంగ యొడ్డున ఢిల్లి యుండెనొ ? గంగమీదను బడవనెక్కిన, ఓరుగంటిని చేరగలడా!, ఔర! వేంకటరాయశాస్త్రి! ఔర! వేంకటరాయశాస్త్రి? ఎంత బొంకును బొంకివోతివి, చచ్చి పుట్టుచునుంటివో కద, తెలుగువిద్యా? తెలుగు చరితను నేటికైనను తెలుసుకోరా!" అన్న గేయంలో పరిహసించాడు. రాజరాజనరేంద్రుడికి రత్నాంగి, చిత్రాంగి అన్న ఇద్దరు భార్యలున్నారని సృజనాత్మక రచనల్లో కనిపించే చారిత్రక అవాస్తవాన్ని దుయ్యబట్టాడు. రెండవది భగవద్గీతకు సంబంధించింది. జాతీయోద్యమ నాయకులు 'భగవద్గీత'కు రకరకాల వ్యాఖ్యానాలు రాస్తూ దాన్ని ఉద్యమానికి ప్రేరణగా తీసుకుంటున్న రోజుల్లో దానిలోని అసంబద్ధతలను త్రిపురనేని నిరూపించాడు. చిన్నయ లక్ష్మీనారాయణ త్రిపురనేనిని భగవద్గీతను అనువాదం చేయుమని అడిగినప్పుడు బ్రహ్మనాయుడు బాలచంద్రుడికి చెప్పినట్లుగా భగవద్గీతను మార్చి రాశాడు. భగవద్గీతను వ్యాసుడు రాయలేదని, అది క్రోడీకరణమని అభిప్రాయపడ్డాడు. "వెర్రిమతులు నాల్గు కులాల నేర్పరచి విడువ, బ్రహ్మ సృజించితి నను మాట పుట్టెను" అని మూల గీతలోని హేతుబద్ధంకాని భావాలన్నిటిని ఖండిస్తూ ఆయన భగవద్గీతను రచించాడు. కాని ఈ హేతువాద దృష్టి ఆయనను అన్నిచోట్లా పనిచేయలేదు. స్మృతులు, పురాణాలు ఆర్యుల, బ్రాహ్మణుల కుట్రగా తన రచనలలో నిరూపిస్తూనే, ఎవరో ఒక మఠాధిపతి క్షత్రియులుకాదన్నారన్న కారణాన కమ్మవారు క్షత్రియులని నిరూపించటానికి ప్రయాసపడ్డాడు. పునరుద్ధరణ ధోరణిని ప్రదర్శించాడు. సంప్రదాయ వ్యవస్థలో ఉన్నత వర్గానికి సంబంధించిన వర్గంలో భాగంగా క్షత్రియులూ ప్రజాపీడకులేనన్న హేతువుని చూడలేదు. దీనికి

కారణం చరిత్రను ఆర్థికదృష్టితో చూచేపరిస్థితి ఇంకా అభివృద్ధి చెందకపోవటమే. ఈకారణంవల్లనే సోవియట్ రష్యాలోని ఆర్థికసమానత్వానికి నాస్తికత్వం అడ్డంరాలేదని నాస్తిక్య దృష్టితోనే ఆ సమాజాన్ని పరిశీలించాడు. "రష్యాలో నిరుపది యేండ్ల క్రింద బయలుదేరిన యీ ప్రళయ ఝంఝూ మారుతమునకు భయపడి యచ్చట గుడులలో నున్న భగవంతుడు కాలి చప్పుడు కాకుండ నెచ్చటికో దారి తీసెను.... గుడులన్నియు యంత్రాగారములుగను, పుస్తక భాండాగారములుగను మారిపోయెను. ఈ మార్పువల్ల రష్యా దేశమునకు గల్గిన ఫలమేమి? నూటికి తొంబది మందికిఁ దినకూడును, కట్టుబట్టయు, బంతమంచమును, సంపదలంగాంచయునను లభించినవి" అంటూ, ఆస్తికత్వము ప్రపంచ పరిణామమునకు నాటంకములు కలుగ జేసెనుగాని, తోడ్పడలేదని గట్టిగ చెప్పవచ్చు"నని "ఖూనీ" పీఠికలో నాస్తికత్వ ప్రాధాన్యాన్ని వివరించాడు త్రిపురనేని. పౌరాణిక గాథల ఔచిత్యాన్ని ప్రశ్నిస్తూ ముద్దు కృష్ణ, చలం, పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి, నార్ల వెంకటేశ్వరరావులు కూడా రచనలు చేశారు.

**ప్రజలలోకి . .**

కుల, మతాల ప్రసక్తి లేకుండా ఆర్థిక దృష్టితో సమకాలీన సామాజిక పరిస్థితుల్ని, గత చరిత్రను, పరిణామాన్ని అర్థం చేసుకోవటం మార్క్సిస్టు సిద్ధాంతాల పరిచయంతో ప్రారంభమై, కమ్యూనిస్టుపార్టీ అవతరణతో బలపడింది. తెలంగాణాలో ఉత్తరాది నుంచి వచ్చిన కేవల మత దృక్పథం ప్రభావం నుంచి కోస్తా, రాయలసీమ ప్రాంతాల్లో దక్షిణాదిలోని జస్టిస్ పార్టీ ప్రభావం నుంచి దూరమై, ఆర్థిక వ్యవస్థ, ఆర్థిక కారణాల దృష్ట్యా సమాజాన్ని గురించి ఆలోచించటం దీని వల్ల ప్రారంభం అయింది. తెలుగుదేశంలో సంస్కరణోద్యమాల కొనసాగింపుగా సోషలిస్టు భావాలు ప్రవేశించాయి. బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులుగా, భిన్నమత వర్గాలుగా చీలుతున్న దశలో మధ్య తరగతివారు, రైతులు, కార్మికులు శ్రమజీవులలోని సమాన ప్రయోజనాలను కమ్యూనిస్టు పార్టీ గుర్తింప జేసింది. భిన్న ఆర్థిక, పాలనావ్యవస్థలలో కొన్నిశతాబ్దాలు జీవించిన ఆంధ్ర, తెలంగాణాల మధ్య అవగాహనను పెంచింది. విశాలాంధ్ర నిర్మాణానికి దోహదం చేసింది. అంతకుముందు చరిత్రలో గుర్తింపుకురాని రైతాంగ, ఆదివాసుల ఉద్యమాలకు, పోరాటాలకు ప్రాధాన్యం లభించింది. ప్రజాపోరాటాలు, రైతు, కార్మిక పోరా

టాలు, సంస్థాన ప్రజాపోరాటాలు, మన్యపు తిరుగుబాట్లు, స్త్రీల అభ్యున్నతికై జరిగిన పోరాటాలు, సైనికుల తిరుగుబాట్లు అన్నిటికీ జాతీయోద్యమంలో భాగంగా గుర్తింపు కమ్యూనిస్టు పార్టీవల్ల వచ్చింది. సమగ్ర సామాజికదృష్టి అంటే కింది స్థాయినుంచి కూడా సమాజాన్ని అర్థం చేసుకోవటం అన్న దృక్పథం ఏర్పడింది. వలసదేశమై ఆర్థికంగా క్షీణించిన భారతదేశంలో తరువాతికాలంలోని రాజకీయ పక్షాలన్నీ ఏదో ఒకరూపంలో సోషలిజాన్ని తమ లక్ష్యంగా ప్రకటించవలసిన అవసరం కలిగింది.

భారతదేశంపైన ఫ్రెంచి రాజకీయ విప్లవప్రభావం పరోక్షంగా మాత్రమే కనిపిస్తుంది. కాని వలసదేశమైన భారతదేశంపైన 1917లో రష్యాలోవచ్చిన సోషలిస్టువిప్లవప్రభావం ప్రత్యక్షంగాకనిపిస్తుంది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న అన్ని రకాల అభిప్రాయాలు కలవారిపైనా ఏదోఒక రూపంలో రష్యన్ విప్లవ ప్రభావం కనిపిస్తుంది. అక్కడ జరుగుతున్న పరిణామాలను నాయకులు ఆసక్తితో పరిశీలించారు. మార్క్స్ 1850లో 'న్యూయార్క్ డైలీట్రిబ్యూన్'లో భారతదేశంలో బ్రిటిషపరిపాలనను గురించి, దాని భవిష్యత్పరిణామాలను గురించి, 1857కాలంలో వచ్చిన తిరుగుబాట్లనుగురించి వ్యాసాలు రాశాడు. భారతదేశంలోని ఆర్థికవ్యవస్థ పరిణామాన్ని విశ్లేషించాడు. భారతదేశంలో పరిశ్రమలు ఏర్పడటంతో ముఖ్యంగా కలకత్తా, బొంబాయి, మద్రాసులలో కార్మికవర్గం తలయెత్తింది. దేశంలోని విప్లవవాదులు చాలామంది 1919లో విదేశాల కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌తో సంబంధాలు పెట్టుకోవటంతో ఈ దేశంలో కమ్యూనిస్టు పార్టీచరిత్ర ప్రారంభం అవుతుంది. కలకత్తా, బొంబాయి, మద్రాసు, లాహోరులలో కొందరు గ్రూపులుగా కమ్యూనిస్టు సిద్ధాంతాలను అధ్యయనం చేసేవారు. 17-10-1920 నాడు భారతీయ కమ్యూనిస్టుపార్టీ ఏర్పడింది. ఎమ్. ఎన్. రాయ్, అబనిముఖర్జీ, మహమ్మద్‌అలీ, ప్రతివాది భయంకరాచార్య, ముజఫర్ అహ్మద్ మొదలైనవారు కమ్యూనిస్టుపార్టీ వ్యవస్థాపకులలో ఉన్నారు. మొదటినుంచీ కమ్యూనిస్టు పార్టీపై బ్రిటిష ప్రభుత్వం దమననీతిని అనుసరించింది.

తెలుగుదేశం ప్రధానంగా వ్యవసాయదేశం. పరిశ్రమలు ఎక్కువగా లేవు. అందువల్ల తెలుగుదేశంలో కమ్యూనిస్టుపార్టీ రైతాంగంమీద ఆధారపడి ఉంది. జాతీయోద్యమంలో భాగంగా తెలుగుదేశంలో పన్నుల నిరాకరణోద్యమాలు చాలా

వచ్చాయి. 1922 లో గుంటూరు జిల్లా పెద్ద నందిపాడులో పర్వతనేని వీరయ్య చౌదరి, కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ నాయకత్వంలో స్థానిక పన్నుల నిరాకరణోద్యమం వీటిలో ముఖ్యమైంది. జమీందారులలో ఏండిన జస్టిస్ పార్టీకి వ్యతిరేకంగా రైతులను సంఘటిత పరచిన 'ఆంధ్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ' 1934లో ఎన్.జి. రంగా ప్రభృతుల ఆధ్వర్యంలో ప్రారంభమైంది. తరువాత కమ్యూనిస్టు పార్టీలో ఇందులో చాలాభాగం కలిసిపోయింది. 1938 నాటికే సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంత గ్రంథాలు తెలుగుదేశంలోకి రహస్యంగా దిగుమతి అయ్యాయి. చాలా గ్రంథాలు తెలుగులోకి అనువాదం అయ్యాయి. ఆనాడు బనారస్ విశ్వవిద్యాలయంలో చదువుకున్న తెలుగు విద్యార్థులపైన మార్క్సిస్టు భావాల ప్రభావం బాగా పడింది. 1934 లో కమ్యూనిస్టు పార్టీని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. అందువల్ల కమ్యూనిస్టులు కూలి సంఘాలు, కార్మిక సంఘాలు, రైతు సంఘాల పేరుతో పనిచేశారు. 1935 లో ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ కాకినాడలో రహస్యంగా సమావేశమై పుచ్చలపల్లి సుందరయ్యను కార్యదర్శిగా ఎన్నుకొన్నది. 1939 నుండి కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా పని చేసింది. నిజాం సంస్థానంలో భాగమైన తెలంగాణాలో 1930 లో ఆంధ్ర మహాసభ ఏర్పడింది. 1938 లో స్టేట్ కాంగ్రెస్ పుట్టింది. కొందరు కామ్రేడ్స్ అసోసియేషన్ పేరుతో మార్క్సిజం అధ్యయనం చేస్తుండేవారు. 1935-38 లోనే అక్కడ జాగీర్దారీ వ్యతిరేక పోరాటాలు ప్రారంభమయ్యాయి. 1944 లో భువనగిరిలో జరిగిన ఆంధ్ర మహాసభలో రావి నారాయణరెడ్డి నాయకత్వాన కమ్యూనిస్టులు చీలిపోయారు. 1946-48 లలో జరిగిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం భారతదేశంలోనే కమ్యూనిస్టు పార్టీ నడిపిన పోరాటంలో ముఖ్యమైంది. 1948 సెప్టెంబరులో జరిగిన పోలీసు చర్యతో నిజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావటంతో ఈ పోరాటం వెనుక్కు మళ్ళింది. 1952 లో జరిగిన మొదటి సాధారణ ఎన్నికలలో హైదరాబాదు రాష్ట్రంలో తెలుగు ప్రాంతంలోను, మద్రాసు రాష్ట్రంలోని తెలుగు ప్రాంతంలోను కమ్యూనిస్టుపార్టీ సభ్యులే ఎక్కువగా ఎన్నికయ్యారు. 1955 లో ఆంధ్రరాష్ట్రంలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో అధికమైన ఆత్మవిశ్వాసంవల్ల కాబోలు కమ్యూనిస్టుపార్టీ దెబ్బతిన్నది. జాతీయోద్యమ కాలంలో ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం సందర్భంగా, క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా కమ్యూనిస్టు పార్టీ కున్న అంతర్జాతీయ స్వభావం

వల్ల, అంతర్జాతీయ వైఖరిపట్ల అది అనుసరించిన విధానాలు అపోహలకు లోనైనా రైతాంగంపైన కమ్యూనిస్టు పార్టీ ప్రభావం బాగా ఉంది.

సోషలిస్టు భావాల ప్రభావం, రష్యన్ సోషలిస్టు విప్లవ ప్రభావం తెలుగు సాహిత్య, సాంస్కృతిక రంగాలపైన చాలా కనిపిస్తుంది. సాహిత్యంలో వస్తుపరంగానూ, రూపంలోనూ విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. మొట్టమొదట రష్యన్ బోల్షివిక్ విప్లవ ప్రభావం ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' నవలలో కనిపిస్తుంది. చిన్న కావ్యాలయినా త్రిపురనేని రామస్వామి చౌదరి పైనా కనిపిస్తుంది. 1934 లో రైతు నాయకుడు ఎన్.జి. రంగా స్థాపించిన రైతాంగ విద్యాలయం నుంచి వెలువడిన వ్యాస గీతాల సంకలనం 'రైతు భజనావళి' పీఠికలో రష్యా విప్లవ ప్రభావం కనిపిస్తుంది. ప్రపంచంలో ఒకచోట రైతులు రాజ్యానికి వచ్చారని, కోటీశ్వరులంతా లేకుండా పోలిటే రాజ్యం చేస్తున్నారని. వినటానికి వింత, పడుకోవటానికి పరుపు లేని సామాన్యానికి లభిస్తున్నాయని, అల్లాంటి ప్రజలు కూడా అత్యంత స్వరాజ్యాన్ని కాంక్షిస్తున్నారనీ అందులో ఉంది. రైతుభజనావళిలో ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' నవలలోని ఒకగేయం ఉంది. గరిమెళ్ల సత్యనారాయణ, ముద్దుకృష్ణ, కంభంపాటి సత్యనారాయణ, దువ్వూరి రామిరెడ్డి, తుమ్మల వెంకటరామయ్య, చదలవాడ పిచ్చయ్య, నార్ల వెంకటేశ్వరరావు మొదలైనవారి గేయాలు కూడా ఈ సంకలనంలో ఉన్నాయి. ఇందులోని రచనలన్నీ రైతులదుస్థితిని, ఆర్థిక సంక్షోభాన్ని ప్రతిబింబిస్తాయి. గరిమెళ్లసంపాదకత్వాన వెలువడ్డ 'వాహిని' పత్రికలో వామపక్ష భావాలుగల రచనలెన్నో వచ్చాయి. గద్దె లింగయ్య 'ప్రభ', ముద్దుకృష్ణ 'జ్వాల', కమ్యూనిస్టుపార్టీ నడిపిన 'నవశక్తి', ''ప్రజాశక్తి' పత్రికలు ప్రజాసాహిత్యాన్ని ప్రచారంలోకి తెచ్చాయి. ప్రగతి ప్రచురణాలయం, విశ్వసాహిత్యమాలవంటి ప్రచురణ సంస్థలు మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను ప్రచారంలోకి తెచ్చాయి.

మార్క్సిస్టు సిద్ధాంతం ఆత్మగా వచ్చిన సాహిత్యానికి వేదికగా తెలుగు దేశంలో అభ్యుదయ రచయితలసంఘం 1943లో ఏర్పడినా అభ్యుదయ భావాలు గల రచనలు 1930 దశకంలో మొదటిభాగంనుంచే కనిపిస్తాయి. తెలుగులో

అభ్యుదయ రచనలు బయలుదేరటానికి ముఖ్యంగా రెండుకారణాలున్నాయి. 1930 లలో ప్రపంచంలో ఆవరించిన ఆర్థిక మాంద్యం, భారతదేశంలో దాని ప్రభావంవల్ల ఏర్పడ్డ ఆర్థిక పరిస్థితులు, 1935లో పారిస్‌లో ప్రపంచరచయితల మహాసభల తరువాత అంతర్జాతీయ సాహిత్యంలో తలెత్తిన అభ్యుదయ ధోరణులు. ఈ రెండూ శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వం రాయటానికి కారణాలు, ప్రేరకాలు అయ్యాయి. శ్రీశ్రీ కవిత్వానికి ప్రారంభంలో సాహిత్య ప్రేరణతే ఎక్కువ. అబ్బూరి రామకృష్ణ రావుద్వారా తనకు అందిన 1935లో ఏర్పడ్డ లండన్‌లోని ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మ్యానిఫెస్టో ప్రభావంలో శ్రీశ్రీ 'ప్రతిజ్ఞ' గేయాన్ని రచించాడు. క్రమంగా మార్క్సిస్టు భావాల ప్రభావంతో రచనలు చేశాడు. 'మహాప్రస్థానం' లో ఆయనరాసిన గేయాలన్నీ 1933-41 మధ్యరాసినవే అయినా అవి సంకలన రూపంలో 1948 తరువాతే వచ్చాయి. ఆ తరువాత వచ్చిన అభ్యుదయ రచయితలు చాలామంది తెలంగాణా సాయుధ పోరాటంవల్ల ప్రభావితులైన వాళ్ళే. వారిలో ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, కె. వి. రమణారెడ్డి, గంగినేని వెంకటేశ్వరరావు చెప్పుకోదగినవారు. 1935లో ప్రేమచంద్ మొదలైనవారిలో భారతీయ అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. 1936లో ప్రేమచంద్ అధ్యక్షతన మొదటి అభ్యుదయ రచయితల సభలు జరిగాయి. తెలుగుదేశంలో మొదటి అభ్యుదయ రచయితల సంఘం సభలు తాపీ ధర్మారావు అధ్యక్షతన 1943 లో జరిగింది. అభ్యుదయ రచయితల సంఘం 'అభ్యుదయ' అన్న పత్రికనుకూడా నడిపింది. అభ్యుదయ రచయితలసంఘం కందుకూరి, గురజాడ మొదలు తెలుగుదేశంలో సామాజిక పరివర్తనలో ప్రముఖస్థానం వహించిన రచయితలను, ఉద్యమకారులను ప్రచారంలోకి తెచ్చింది. కాని అభ్యుదయ రచయితల సంఘం రెండవదశలో సిద్ధాంతాలతో సంబంధంలేకుండా అన్నిరకాల రచయితలకీ స్థానం ఇచ్చినందువల్ల ప్రధాన లక్ష్యాలకు పూర్తిగా దూరం అయిపోయింది.

ఒక దశలో అభ్యుదయ సాహిత్యం ఒక బలమైన సామాజిక శక్తిగా పని చేసింది. సాహిత్య దృక్పథంలో విలక్షణమైన మార్పులను తీసుకొని వచ్చింది. భాషాశైలుల సామాన్యులకు సన్నిహితం చేసింది. రాజకీయాలలో కింది స్థాయి నుండి ప్రజలను కమ్యూనిస్టు పార్టీ కలుపుకొని వచ్చినట్లుగానే, కింది స్థాయి

సమూహం అభ్యుదయ సాహిత్యంలో ప్రధాన వస్తువు అయింది. వారి దగ్గరికి సాహిత్యం వెళ్ళింది. తెలంగాణా సాయుధ పోరాటం వల్ల ప్రజా సాహిత్యం వచ్చింది. సాంస్కృతిక రంగం ప్రజలకు సన్నిహితం అయింది. దీనికి 1943 లో ఇండియన్ ప్రోగ్రెసివ్ థియేటర్స్‌కి అనుబంధంగా ఏర్పడ్డ 'ప్రజా నాట్య మండలి' ఎంతో దోహదం చేసింది. ప్రజా కళారూపాలు బుర్రకథలు, గొల్ల సుద్దులు మొదలైన వాటి ద్వారా ప్రజలను రాజకీయావగాహన కలిగించింది నాట్య మండలి. నాటక ప్రదర్శనలో కొత్త రీతులు బయలుదేరాయి. సామాజిక, ఆర్థిక సమస్యలను, భూస్వాములకు వ్యతిరేకంగా రైతుల పోరాటాలను చిత్రించే నాటకాలు వచ్చాయి. నిత్య జీవితంలో సాహిత్యానికి, కళలకు సన్నిహిత సంబంధం ఏర్పర్చ టానికి అభ్యుదయ రచయితల సంఘం, అంతకంటే ముఖ్యంగా 'ప్రజానాట్య మండలి' దోహదం చేశాయి. సాహిత్యంలో కళలో వాస్తవికత అనే అంశాన్ని అవి ప్రవేశపెట్టాయి.

## ముగింపు

1947 ముందు సుమారుగా అన్ని రాజకీయ ఉద్యమాల ప్రధాన లక్ష్యం వలస పాలన నుంచి దేశానికి విముక్తి. హైదరాబాదు సంస్థానానికి సంబంధించినంత వరకు నిజాం నిరంకుశత్వం నుంచి విముక్తి రాజకీయ పక్షాల ప్రధాన లక్ష్యం. 1947 ఆగస్టు 15 నాడు బ్రిటిష్ పాలనలో ఉన్న తెలుగు ప్రాంతం స్వాతంత్ర్యాన్ని పొందింది. కొన్ని రాజకీయ పక్షాలకు స్వాతంత్ర్య సాధనకంటే విస్తృత మైన లక్ష్యాలున్నాయి. కాని అనేక లక్ష్యాలలో ఒక లక్ష్యాన్ని సాధించిన తరువాత ఉద్యమాలు సహజ సిద్ధంగా చల్లబడ్డాయి. తెలంగాణా సాయుధ పోరాటానికి ప్రధానంగా ఆర్థిక రాజకీయ సిద్ధాంతాలున్నా 1948 సెప్టెంబరులో పోలీసు చర్యతో హైదరాబాదు సంస్థానం విముక్తం కావటంతో వెనుకబడి పోయింది. స్థానిక భూస్వామ్య పాలనలో ఉన్న హైదరాబాదు విముక్తిని సాయుధ పోరాటం వేగవంతం చేసింది. ఉద్యమాలు తీవ్రదశలో ఉన్నప్పటి కన్నా సాధారణ దశలో ప్రజలకు అవగాహ నను కలిగించి, విద్యావంతుల్ని చేసి చైతన్యవంతులుగా నిలబెట్టగలగటం చాలా కష్టం. కాని ఏ రాజకీయ పక్షమూ ఈ కర్తవ్యాన్ని నిర్వహించలేకపోయింది. చాలా రాజకీయ పక్షాలు సాధించిన స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యోద్యమ కాలంలో తమ పాత్రను సంబంధించిన స్మృతులపైన నిలబడటానికి ప్రయత్నం చేశాయి.

1947-56 మధ్యకాలంలో దేశంలో కొన్ని ప్రధాన సంఘటనలు జరిగాయి. దేశానికి స్వాతంత్ర్యం, హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం, భారతదేశంలో ఇతర సంస్థానాల విలీనీకరణ, దేశానికి రాజ్యాంగం ఏర్పడటం, దేశం రిపబ్లిక్ కావటం, 1952 లో ఎన్నికలు, 1953 అక్టోబరు 1 వ తేదీనాడు ఉద్యమాల ఫలితంగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటం, భారత దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడటంలో భాగంగా 1956 నవంబరు 1 వ తేదీన ఆంధ్రప్రదేశ్ పేరిట విశాలాంధ్ర ఏర్పడటం ఈ కాలంలోని ప్రధాన సంఘట నలు 1952 ఎన్నికలలో మద్రాసు రాష్ట్రంలో భాగమైన ఆంధ్ర ప్రాంతం లోను హైదరాబాదు రాష్ట్రంలో భాగమైన తెలంగాణాలోను కమ్యూనిస్టు పార్టీ ఎక్కువ సీట్లను ఎన్నిక కావటం తక్కిన భారతదేశం దృష్ట్యా తెలుగుప్రాంతంలో జరిగిన ప్రత్యేక పరిణామం. 1955 లో ఆంధ్ర రాష్ట్రంలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో వ్యతిరేకంగా తక్కిన అన్ని పార్టీలు కలిసి పోటీచేయటంతో కమ్యూనిస్టు పార్టీ అనుకున్న విజయాలను సాధించలేకపోయింది.

1947-56 మధ్య రాజకీయ రంగంలో కనిపించినంత ఆర్థిక, సాంఘిక రంగాలలో మార్పు స్పష్టంగా కనిపించదు. నిదానంగానైనా, పరిమితంగానైనా ఈ కాలంలో కొన్ని ముఖ్యమైన పరిణామాలు జరిగాయి. స్వాతంత్ర్యానంతరం కూడా భారతదేశం ప్రధానంగా వ్యవసాయిక దేశం. 85 శాతం ప్రజలు గ్రామీణులు. జమీందారులకు వ్యతిరేకంగా జరిగిన రైతు పోరాటాలవల్ల జమీందారీ విధానం రద్దయింది. దీనితోపాటు అనేక ఉద్యమాల ఫలితంగా వ్యవసాయిక సంస్కరణలు వచ్చాయి. కౌల్దారీ చట్టం వచ్చింది. ఏదో ఒక రూపంలో భూసంస్కరణల బిల్లులు వచ్చాయి. అంతకుముందు రైత్వారీ విధానం ఉన్న ప్రాంతాలలో ఈ సంస్కరణలవల్ల పెద్దగా మార్పు కన్పించదు. జమీందారీలు ఉన్నచోట రైత్వారీ విధానం ఉన్న ప్రాంతాలలోలాగా రైతులు భూమిపైన హక్కును పొందారు. ఈ వ్యవసాయిక సంస్కరణల ఫలితం దేశ ఆర్థిక వ్యవస్థపైనా, రైతులపైనా ఎంత ప్రభావం ఉందో ఈ కాలపరిధిలో అంచనా వేయటం కష్టం

రాజకీయ రంగంలో గాంధీ మార్గానికి సంబంధించిన ఆర్థిక సంస్కరణలు, సోషలిజం ప్రభావాలు స్పష్టంగా కనిపిస్తాయి. పాకిస్తాన్ విభజన కారణంగా

హిందూమతం ఆధారంగా కొన్ని రాజకీయ పక్షాలు వచ్చాయి కాని వాటికి ఆర్థిక సిద్ధాంతాలు, లక్ష్యాలులేవు. ఆ రాజకీయ పక్షాల ప్రభావం తెలుగు దేశం పైన అంతగా లేదు. ఆర్థిక రంగంలో ముఖ్యంగా రెండు సిద్ధాంతాలు భిన్న రాజకీయ పక్షాల లక్ష్యాలుగా ఉన్నాయి. దేశం ఆధునికంగా, పారిశ్రామికంగా, సాంస్కృతికంగా అభివృద్ధిచెందటం దక్షిణపక్ష రాజకీయపార్టీల లక్ష్యం. అభివృద్ధి కంటే ముఖ్యం అసమానతలను పోగొట్టటం, ఉత్పత్తి పంపిణీ సమానంగా జరగటం అన్నది వామపక్ష రాజకీయ పార్టీల లక్ష్యం ప్రైవేటు రంగంద్వారా మాత్రమే దేశం అభివృద్ధిచెందుతుందనేది మొదటి తరగతికి చెందిన రాజకీయపక్షాల అభిప్రాయ పడ్డాయి. భూసంస్కరణలు ఆస్తిహక్కుకు భంగకరం అని వారి సిద్ధాంతం. భూసంస్కరణలు ప్రవేశపెట్టాలని, ప్రభుత్వరంగం పరిశ్రమలకు ప్రాధాన్యం ఇవ్వాలని, ప్రైవేటు రంగంపైన ఆంక్షలుండాలని రెండవ తరగతికి చెందిన రాజకీయపక్షాల సిద్ధాంతం. ఈ రెండింటికి మధ్య మధ్యే మార్గంగా మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అన్న నినాదం వచ్చింది. అధికారంలో ఉన్న కాంగ్రెస్‌పార్టీ ప్రజాస్వామ్య-సోషలిజాన్ని ధ్యేయంగా ప్రకటించింది. ఈ మిశ్రమ ఆర్థిక, రాజకీయ వ్యవస్థల ఫలితాలుకూడా 1966 నాటికి స్పష్టంగా బయటపడే అవకాశాలులేవు.

సామాజికరంగంలోకూడా బలపడకుండానే ఈ కాలంలో కొన్ని మార్పులు కనిపిస్తాయి. ఈ పరిణామాలలో కొన్ని వైరుధ్యాలుకూడా కనిపిస్తాయి. స్వాతంత్ర్యానికి పూర్వం కలకత్తా, బొంబాయి, మద్రాసులాంటి తీరనగరాలలో మాత్రమే పరిశ్రమలు ఉండేవి. తరువాత క్రమంగా దేశం నలుమూలలలోకూడా పరిశ్రమలు ప్రారంభం అయ్యాయి. ప్రసారాల సాధనాలు పెరిగాయి. ఏటి కారణంగా బ్రిటిష్ పాలన నుంచి విముక్తం అయిన ఆంధ్ర ప్రాంతంలోనే కాదు, కరడుగట్టిన భూస్వామ్య వ్యవస్థగల తెలంగాణా ప్రాంతంలో కూడా నిదానంగానే అయినా సామాజిక సంబంధాలలో కొన్ని మార్పులు మొదలయ్యాయి. పల్లెలు, పట్టణాలు కలవటం ప్రారంభించాయి. అవసరమైతే భూస్వాములను ఎదిరించి అయినా తన కూలి సంపాదనకు పట్టణాలకు చేరటం ప్రారంభం అయింది. నగరీకరణ అభివృద్ధి చెందటం మొదలయింది. సంప్రదాయ రూపంలో కుల వ్యవస్థ శిథిలమైనా కుల చైతన్యం సామాజిక, సాంస్కృతిక రూపాన్ని ధరించింది. కుల చైతన్యాన్ని బట్టి ఎన్నికలలో ప్రాతినిధ్యం ఇవ్వటం ప్రారంభం కావటం వల్ల కులం రాజకీయ

రూపాన్ని పొంది కులాల మధ్య పోటీలు ప్రారంభమయ్యాయి. సహ పంక్తి భోజనాలవంటివి మారిన ఆర్థిక వ్యవస్థలో, ఆధునిక సమాజంలో సమస్యలు కావు. కాని రాజకీయంగా కులం మరిన్ని జటిల సమస్యలకు దారితీయటం 1956 నాటికే దేశంలో ప్రారంభమైంది. వలస పాలన పోయినా పాలనా వ్యవస్థలో వలస పాలన స్వరూప స్వభావాలు కొనసాగాయి. ఇవి సంస్కృతీకరణ, పాశ్చాత్యీకరణ వంటి కొత్త సమస్యలను సృష్టించాయి.

రాజకీయ, సామాజిక ఉద్యమాలతోపాటు ఎదిగిన తెలుగు సాహిత్యం ఆ ఉద్యమాలతో పాటే తీవ్రతను కోల్పోయింది. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో స్వాతంత్ర్య సాధన, స్వాతంత్ర్య ప్రశస్తి కవితా వస్తువుగా ఉండేది. అభ్యుదయ సాహిత్యానికి సంబంధించిన ప్రధానమైన సాహిత్యం తెలంగాణా సాయుధ పోరాట ప్రభావం వల్ల వచ్చింది. పోరాటంలోంచి సాహిత్యం వచ్చింది. సాయుధ పోరాటం ఆగిపోయిన తరువాత దాని ప్రభావం వల్ల సాహిత్యం వచ్చింది. రైతుల సమస్యలు ఆధారంగా భూస్వామ్య వ్యతిరేక సాహిత్యం వచ్చింది. సామాన్యుడుసాహిత్యానికి వస్తువు అయ్యాడు. ప్రజాసాహిత్యం వచ్చింది. రాజకీయోద్యమం వెనుక్కు తగ్గటంతో అభ్యుదయ విపుల రచనలలో మధ్య తరగతి గుమాస్తా, మధ్య తరగతి సమస్యలు, నగర వాతావరణం వస్తువులయ్యాయి. కవిత్వం, నవల, నాటకాలు మొదలైన ప్రక్రియలన్నిటిలోను 1956 నాటికి ఈ పరిస్థితి కనిపిస్తుంది. పోరాటదశలోలాగా ప్రజాకళారూపాలను, ప్రజా కవితారూపాలను గ్రహించేదశ పోయి ఆధునిక ప్రక్రియగా వచన కవితాప్రక్రియ మధ్య తరగతికిచెందిన రచయితలకు ఆశ్రయం అయింది. అభ్యుదయ భావాలుగల రచయితలు సినిమాల లాంటి వ్యాపార రంగాన్ని ఆశ్రయించారు. సంప్రదాయ రచయితలు భూస్వామ్య భావ జాలాన్ని పెంచటంతోపాటు, ప్రజాస్వామ్య వ్యవస్థలో కూడా ఆచరణలో పదవుల్లో ఉన్నవారిని కీర్తించి ఆశ్రయించటాన్ని సంప్రదాయ బద్ధం చేశారు. పత్రికలు, ప్రచురణ వ్యాపారం సాహిత్యంలో వ్యాపార సంస్కృతిని ప్రవేశపెట్టాయి. సాంస్కృతికంగా కొంత వెనుకబడ్డ తెలంగాణా ప్రాంతంలో మాత్రం 1952-56 మధ్య తెలంగాణా రచయితల సంఘం, అంతః కళాశాలల ఆంధ్రాభ్యుదయోత్సవాలు కొంతవరకు సాహిత్య, సాంస్కృతిక చైతన్యాన్ని కలిగించాయి

కొన్ని శతాబ్దాలు వలసదేశంగా ఉన్న భారతదేశంలాంటి దేశాలలో రాజకీయపక్షాలు, సామాజికోద్యమాలు, సాహిత్యం వలసీకరణకు వ్యతిరేకంగా పోరాడిన ఫలితంగా వలసపాలననుండి విముక్తం అయిన తరువాతే ప్రజలను నిత్య సచేతనంగా నడిపించవలసి ఉంటుంది. వలసీకరణవల్ల జరిగిన ఆధునికీకరణ పునరుద్ధరణ భావాలకు, సంస్కృతీకరణకు దారి తీస్తుంది. జీవిత వాస్తవాలకు, ఆలోచనలకు మధ్య వైరుధ్యాలను పెంచుతుంది. ఆలోచనలకు, ఆచరణకూ మధ్య దూరాన్ని పెంచుతుంది. వలసపాలన ఫలితమైన విషమ ఆర్థిక వ్యవస్థ, పరిమిత అవకాశాలు, వనరులు భిన్న వర్గం, కులం, మతవర్గాల మధ్య పోటీలను, వైరుధ్యాలను పెంచుతుంది. వలసపాలన ఫలితాలైన ఈ వైరుధ్యాలను తొలగించి లౌకికీకరణను, ఆధునికీకరణను సాధించాలంటే రాజకీయాలకు, సాహిత్యానికి నిరంతర చైతన్యం అవసరం. తీవ్రమైన ఉద్యమాలదశలో కంటే సాధారణ పరిస్థితులలోనే అవి తమ కర్తవ్యాన్ని నిర్వహించటం కష్టం

## సంప్రదించిన గ్రంథాలు, సంపుటాలు, వ్యాసాలు

కృష్ణారావు, వై.వి, బలరామమూర్తి, ఏటుకూరి (సం.) 1976 ఆంధ్రప్రదేశ్ దర్శిని. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

పట్టాభిరామారావు, పరకాల 1981 మత మౌఢ్యానికి వ్యతిరేకంగా .. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

బంగోరె (సం.) 1977 బ్రౌన్‌లేఖలు. తిరుపతి : వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

బంగోరె 1979 మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు. (రచయిత ప్రచురణ) విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

బిపిన్‌చంద్ర (తెలుగు అనువాదం : సహవాసి) 1988 ఆధునిక భారత చరిత్ర. హైదరాబాద్ : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్.

మార్క్స్, ఎంగెల్స్ 1988 (పునర్ముద్రణ) (1857-59) ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం.మాస్కో: ప్రగతి ప్రచురణాలయం

రమణారెడ్డి, కె. వి. (సం.) 1979 ఉన్నవరచనలు కొన్ని. [illegible] : సెంటెనరి సోషల్ ఫ్రంట్

రమణారెడ్డి, కె.వి. 1984 "అభ్యుదయ సాహిత్యం" పుటలు: 152, 153, 154

రామపతిశర్మ, గురజాడ (సం.) 1978 జాతీయగీతాలు. హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

రామమోహనరావు, పిప్పలపల్లి 1981 యాత్రికుని జ్ఞాపకాలు. హనుమకొండ : చైతన్య సాహితి

లక్ష్మణరావు, కొమర్రాజు వేంకట (పునర్ముద్రణ) 1964 మహమ్మదీయ మహాయుగము. విజయవాడ : ఆదర్శ గ్రంథమండలి

లక్ష్మీనరసింహం, చిలకమర్తి 1944 స్వీయచరిత్రము. బెజవాడ

వీరభద్రరావు, కొత్తపల్లి 1956 తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. న్యూఢిల్లీ : రచయిత ప్రచురణ

వీరేశలింగం, కందుకూరి 1982,1984 (పునర్ముద్రణ) స్వీయచరిత్ర-ప్రథమ, ద్వితీయ భాగాలు. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

వెంకటసుబ్బయ్య, గొర్రెపాటి 1970 కవిరాజు జీవితము-సాహిత్యము. విజయవాడ: దేశి కవితామండలి.

వెంకటేశ్వరరావు, త్రిపురనేని 1958 "యుగకర్త కవిరాజు" అభ్యుదయ 4:8 మార్చి, 1958

శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, చలసాని ప్రసాద్, రామకృష్ణ వి., రమణారెడ్డి,కె.వి. 1980 ప్రజాస్వామిక సంస్కృతి. కావలి: సొసైటి ఫర్ సోషల్ ఛేంజ్.

సుబ్బారావు,త్రిపురనేని 1972 కవిరాజు లేఖలు - డైరీలు. హైదరాబాద్. కవిరాజు సాహితీసదనం

హనుమంతరావు, నోటూరు (సం.) 1984 ప్రజాశక్తి. 38వ స్వాతంత్ర్య దినోత్సవసంచిక

1984 [illegible] సాగుతున్న పీడితుల గిరిజన రైతాంగపోరాటాలు. సికిందరాబాద్: క్రాంతి ప్రచురణ

1959 తెలుగు విజ్ఞాన సర్వస్వము. 3, 4 భాగాలు. మద్రాసు: తెలుగు భాషాసమితి

తెలుగులో కావ్యాలు, ఆధునిక సృజనాత్మక రచనలు - ఇంకాఎన్నో

**Amalenduguha 1984** "Nationalism" Social Scientist : 129 P. 42-65.

**Brinton, Crane 1967** The shaping of Modern thought. Bombay : Jaico Publishing Home.

**Das, Aravind, N. 1984** "History in present tense: on Sumit Sarkar's "Modern India". Social Scientist 137, P. 42-67

**Dharma Kumar (Ed ) 1983** The Cambridge Economic History of India Cambridge: Cambridge University Press.

**Dublin, Christine 1970** Basic Documents in the Development of Modern India and Pakistan. London : Vam Nostrand Reinhold Company.

**Gandhi, M. K. 1965** My Varnasrama Dharma Bombay : Bharatiya Vidya Bhavan.

Gandhi, M. K. 1965 Our Language Problem.
Bombay : Bharatiya Vidya Bhavan.

Irshick, Eugene 1969 Politics&Social conflict in SouthIndia.
Berkeley and Los Angeles :
University of California Press.

Habib, Irfan 1975 "Colonialization of the Indian
Economy (1857-1900)" Social
Scientist 32. P. 23-53.

Marx, Engels 1957 On Religion.
Moscow : Progress Publishers.

Mangala Murugesan, N. K 1977 Self-Respect Movement in
Tamil Nadu 1920-1940.
Madurai : Koodal Pulishers.

Misra, K. K. 1972 "Linguistic Nationalities in India"
Social Scientist 3. 20-33

Namboodripad, E.M.S. 1952 The National Question in Kerala
Bombay : People's Publishing Home.

Russel, Bertrand 1972 (First published in 1946). A History
of Western Philosophy.
New York : Rockefeller Centre,
A Touchstone book.

Sarkar, Sumit 1989 Modern India : 1885-1947
New Delhi: Macmillan India Limited

Srinivas, M. N. 1972 Social change in Modern India.
Bombay : Orient Longman

Subba Rao, G V. (Ed.) 1982 History of Andhra Movement
Vol. I & II
Hyderabad : The Committee for
History of Andhra Movement

Will Durant 1954 (First published in 1926) The stor
of Philosophy.
New York: The Pocket Book Library,

# సంస్కరణోద్యమాలు

(ఉపన్యాస పాఠం)

—ఆర్. వి. ఆర్. చంద్రశేఖరరావు

తెలుగునాట సంస్కరణోద్యమం ఎప్పుడు వచ్చింది అనే విషయం గురించి చాలా చర్చించవచ్చు. అసలు ఇటువంటి విషయాలలో ఇదమిత్థమని చెప్పటం చాలాకష్టం. అయితే గత శతాబ్దంలో సంస్కరణోద్యమ బీజం అంకురించిందని మాత్రం చెప్పవచ్చు. దీనిలో భారతదేశంలోని పరిణామాల ప్రభావం ఎంతైనా ఉండకతప్పదు కదా!

మనదేశంలో సంస్కరణోద్యమాలు అనగానే రాజా రామమోహనరాయ్, దయానంద సరస్వతి పేర్లు జ్ఞాపకానికి వస్తాయి. వీరిద్దరూ కూడా ఆధునిక సంస్కృతికి చాలా ముఖ్యులు. పునరుజ్జీవనోద్యమం భారతదేశంలో రాజా రామమోహనరాయ్‌తో ముడిపడివుంది. రామమోహన్‌రాయ్ తరువాత దయానంద సరస్వతితో ముడిపడివుంది. పునరుజ్జీవనం రాజారామమోహన్‌రాయ్ అయితే, మత సంస్కరణోద్యమం దయానంద సరస్వతి. రామమోహనరాయ్‌ని ఇరాస్మస్‌తోను, దయానంద సరస్వతిని లూథర్‌తోనూ పోల్చవచ్చు. ఈ పోలికలో చాలా విశేషమైన భావాలున్నాయి. రామమోహనరాయ్‌లో సంస్కరణ, మానవతావాదం ఎక్కువగా కనిపిస్తుంది. మతానికి ప్రాముఖ్యం తక్కువ కనిపిస్తుంది. ఆ తరువాత ఆయనే ఏ కారణంవల్లనో మానవతావాదసరళిని మాని మతసంస్కరణకు ప్రాధాన్యం ఇచ్చాడు. ఇది భారతదేశంలో సంస్కరణోద్యమాలకు ఒక విధమైన పునాది అయింది. అప్పటికే (Isidore) Auguste (Marie Francois) Compte అనే ఫ్రెంచి తత్వవేత్త పాజిటివిస్ట్ ఫిలాసఫీకి పేరు పొందాడు. ఆధ్యాత్మికమైన వస్తువేమీలేదని, Obsolutism, Idealism అన్నీ తప్పనీ, Supar natural సిద్ధాంతాలన్నీ తప్పనీ చెప్తుంది పాజిటివిజం. పాజిటివిజంకీ, మెటీరియలిజంకీ, ఎంపెరిసిజంకీ, హ్యూమనిజంకి చాలా విశేషమైన భేదాలున్నప్పటికీ మనకిప్పుడు అన్నీ దాదాపు ఒకటేనని చెప్ప

కోవచ్చు. ఇంచుమించు హేతువాద సంస్థ చేసిందే పాజిటివిజం. Auguste Compte చర్చినికాదని తర్వాత పాజిటివిస్ట్ చర్చిని పుట్టించాడు పారిస్‌లో. చర్చికి ఆదివారమైతే పాజిటివిస్ట్ చర్చికి శనివారం వెళ్ళమన్నాడు. చర్చిలో ది గాడ్, ది సన్, ది హోలీఘోస్ట్ అన్న ట్రినిటీ ఉంది. పాజిటివిజమ్‌కు కూడా ఒక చర్చిని తెచ్చి పెట్టాడాయన. ఈ విధంగా వెళ్ళిపోకడలవల్ల పాజిటివిజమ్ నశించిపోయింది. అయితే ఆగస్ట్‌కామ్ట్ చాలా దైన్యమైన జీవితం గడిపాడు. చాలా పెద్ద కుటుంబంలో జన్మించాడాయన. అతని పాజిటివిజమ్ 19వ శతాబ్దపు పాశ్చాత్య నాగరికతలో హేతువాద సరళికి చెందిందని చెప్పుకోవాలి. అటువంటి పాజిటివిజమ్‌లో ఆగస్ట్‌కామ్ట్ తర్వాత అతని కోవకి చెందినవాళ్ళు James Mill. మొట్టమొదట ఇండియన్ హిస్టరీని ఆంగ్లంలో రాసినవాడు. అతనే మొట్ట మొదట మనకి చరిత్ర రచనాసంప్రదాయం తెచ్చిపెట్టాడు. ఇండియన్ హిస్టరీలో హిందూ పీరియడ్, ముస్లిం పీరియడ్, బ్రిటిష్ పీరియడ్ అని మూడు భాగాలుంటా యని జేమ్స్‌మిల్ చేసిన చరిత్ర విభాగాన్నే ప్రతి భారతీయ చరిత్రకారుడూ తూచా తప్పకుండా పాటించాడనీ, అలా పాటించవలసిన అవసరంలేదనీ, హిందూ పీరి యడ్, ముస్లింపీరియడ్, బ్రిటిష్‌పీరియడ్ అనేది చాలా తప్పువిభజన అని రొమిలా థాపర్‌లాంటివాళ్ళ అభిప్రాయం. అయితే జేమ్స్‌మిల్ కూడా హేతువాదభావాన్నే ఎక్కువ ప్రవేశపెట్టాడు. దీనిని ఫిలాసఫికల్ రాడికలిజం అంటారు. జేమ్స్, బెంథామ్, జాన్‌ఆస్టిన్ మొదలైన ఫిలసాఫికల్ రాడికల్స్ చెప్పిందికూడా ఇంచు మించు హేతువాద ప్రభావం కలిగిఉన్నదే. దీనివల్ల ప్రభావితుడైన రామమోహన రాయ్ పాజిటివిస్ట్ ఫిలాసఫీ చెప్పి సంఘసంస్కరణోద్యమమే పెట్టకుండా మత సంస్కరణోద్యమం ఎందుకు పెట్టాడు? మత సంస్కరణ ముఖ్యమా? సాంఘిక సంస్కరణ ముఖ్యమా? మతంనుంచే సాంఘిక సంస్కరణ రావాలా? అనే సందేహం మనకు కలుగుతుంది. ఈ సందేహం కలగటానికి కారణమేమిటంటే, తరవాత వచ్చిన దయానంద సరస్వతి మత సంస్కరణ మొదలు పెట్టాడు. అయితే అతడు మతసంస్కరణలో సంఘసంస్కరణకన్నా మతాన్నే ఎక్కువ ప్రతిఫలింపచేశాడు. దీనిలో మనకి ఒక విషయం తెలుస్తుంది. రామమోహన రాయ్ మతాతీత లౌకిక సంప్రదాయానికి దోహదంచేశాడు. ఆర్యసమాజ్ మతం హిందూమత సంస్కరణకు ఎంత దారితీసినా కూడా, ప్రస్తుత లౌకిక సంప్ర దాయానికి అంత దోహదకారి కాదేమో ననిపిస్తుంది. ఇది చాలా వివాదా

స్పదం. దీన్ని గురించి ఒక సెమినార్‌లో కంపారిజన్ చేసినప్పుడు ఇతను లూథర్‌లాంటివాడని చెప్పడం జరిగింది. ఎందుకంటే Erasmus సెక్యులర్ భావాలను పునాదులాంటివాడు. ఆధ్యాత్మిక చింతనతో ఉంటూ, సెక్యులర్ భావాలకు పునాదివేశాడు. మార్టిన్ లూథర్ సెక్యులర్‌భావాలు యూరప్‌లో కూడా పునాది కాకపోవడమేకాక, సంకుచిత భావాలకు పునాది అయినాయి. లూథర్ ప్రొటెస్టాంటిజమ్ సెల్ఫ్ రెస్పెక్ట్ అనే పేరుతో Catharsism మీద విమర్శచేసి తన Autismని ప్రతిపాదించుకుంది. ప్రొటెస్టెంట్ మతం కూడా స్వేచ్ఛ గురించి చెప్తున్నా యూరోపియన్ చరిత్రలో కాథలిక్ మతం ఎంత సంకుచితంగా మానవస్వేచ్ఛను అరికట్టిందో ప్రొటెస్టెంట్ మతం కూడా లూథర్ కాలంలో అంత సంకుచితంగా వెళ్ళి రాజకీయంగా స్వేచ్ఛకు అడ్డు తగిలిందనే చెప్పాలి. ఇటువంటి మత సంస్కరణ ఎందుకు వస్తుందంటే మతాన్ని ఉద్ధరించడానికి. సంస్కరణ చేసినప్పుడు, ఉద్ధరించిన మతాన్ని సంకుచితంగా వివరించక తప్పదు. లూథర్ Bibleను అన్వయించడంలో Popeకి, చర్చికి ఉన్న అధికారాన్ని ప్రశ్నించాడు. "I am witness unto myself" అన్న ప్రఖ్యాత సూక్తి ఒకటుంది. నేను క్రీస్తుకు సాక్షిని, ఇంకెవరూ మామధ్య సాక్షులు కారు. పోపుగానీ, ప్రీస్టులుగానీ, బిషపులు గానీ, ఆర్చి బిషపులుగానీ సాక్షులు కారు. నేనే సాక్షాత్కారమైనపుడు Bible అన్న కృతిమాట కూడ మారకన్వయింపు కూడదు. దీనితో Fundamentalist interpretation of Bible అనేది వస్తుందన్నమాట. మాట ఏదైతే ఉందో అదే మాట. ఈ మాటను ఒకప్పుడు లిటరల్‌గా కూడా అన్వయించడం జరిగింది. అంటే ప్రొటెస్టాంటిజమ్‌లో లూథర్‌కి ఇవ్వాల్సినంత ప్రాధాన్యం ఇవ్వడంలేదు. Fundamentalist literalist interpretationలో మాటనుబట్టి పోవడమే ఉంది. Reagan మహాశయుడు వచ్చిన తర్వాత ఇనాగరల్ స్పీచ్‌లో ఒకమాట అన్నారు. ఎవల్యూషన్ థీరిని మనం 100% ఒప్పుకోవడానికి వీల్లేదు అని, Technologyకి పుట్టినిల్లైన అమెరికా ఎవల్యూషన్ థీరీని ప్రశ్నిస్తున్నదంటే ఇంతకంటే హాస్యాస్పదం మరొకటిలేదు. ఇందుకు కారణం ఏమిటంటే, Fundamentalist Christianలు ఇక్కడ అమెరికాలో చాలా ఉండటం, రీగన్ వారి సపోర్ట్‌వల్ల

ఎన్ని కాపడం అని చెప్పవచ్చు. ఇది చాలా unscientificగా అనిపిస్తుంది. మతానికి, సైన్సుకి భేదం ఉన్నా లేకపోయినా ఇది మాత్రం unscientific. మత సంస్కరణ చేసేటప్పుడు ప్రతివాడు కూడా ఉన్న మతాన్ని విమర్శించేటప్పుడు వారు చెప్తున్న మతానికికూడా ఒక సర్దిష్టమైన, సంకుచితమైన interpretation ఇవ్వకతప్పదు. అది లూథర్ కూడా చేయక తప్పలేదు. దీన్ని Sociology of knowledge అంటారు. కాథలిక్ చర్చిని విమర్శ చేస్తున్నప్పుడు, నేను క్రిస్టియన్‌ని అంటే, నీవు ఏ విధంగా క్రిస్టియన్‌వి అంటే అతడు కొన్ని విషయాలలో క్రిస్టియానిటీకి ఒక naarow interpretation ఇవ్వాల్సి వస్తుంది. Narrow, Orthodoxలకు భేదం చాలా తక్కువ. Orthodox interpretation ఇవ్వడాన్నే Fundamental interpretation అంటారు. ఈ ఉపోద్ఘాతం అంతా ఎందుకంటే. దయానంద సరస్వతి హిందూ మత సంస్కరణలో ఒక విధంగా సంఘ సంస్కరణ ఉన్నా, కులమత భేదాలు, ritual, బ్రాహ్మణత్వవాదం ఇవ్వన్నీపోవాలని చెప్పినా, ఇంకో రకంగా కూడా అతను చెప్పటానికి కారణం ఏమిటి? ఉత్తర భారతంలో ఒకప్రక్క బ్రిటిష్ వారిసవాలు, క్రిస్టియానిటీ సవాలు, ఇంకోపక్క అప్పటికే 5, 6 వందల సంవత్సరాలనుండి ఉన్న మహమ్మదీయుల సవాలు వీటిని తట్టుకోటానికి ఈ religion militant movement వచ్చింది. లూథర్‌కూడ ఇదే మాట అన్నాడు. A religion militant, catharsism has become a religion subservient అన్నాడు Dante. ఆ militant religion రావడానికి మతసంస్కరణ అవసరం. ఆ మత సంస్కరణకు పూనుకున్నాడు దయానంద సరస్వతి. చాలా ఉదాత్తమైన విషయాలున్నా కానీ Socialగా ఆర్యసమాజ్ interpretation ఏమిటి అన్నప్పుడు మతమే ముఖ్యంగానీ సంఘ సంస్కరణ, మతం గురించిన సంఘ సంస్కరణగానీ, సంఘ సంస్కరణ గురించిన సంఘ సంస్కరణగానీ కాదని తేలుతుంది. ఇది రామమోహనరాయ్‌కి, దయానంద సరస్వతికి ఉన్న fundamental defference అని చెప్పవచ్చు. ఇరాస్మస్‌ని రామమోహనరాయ్‌తో పోలిస్తే, సరస్వతిని లూథర్‌తో పోల్చటం ఇందుకే. ఆ రెండూకూడా చాలా పెద్దపేర్లే. ఇందులో హెచ్చు తగ్గుల విషయం కాక విపులంగా, కూలంకషంగా ఎనాలిసిస్ చేయాలి. ఇది చాలా విమర్శనాత్మకమైన

ఎలాలిసిస్. ఇది చాలా విమర్శలకు గురౌతుంది కూడా. బ్రిటిష్‌వారు 1857 లోని తిరుగుబాటుకు rebellion అన్నారు ఇప్పుడు ప్రభుత్వం వారు గ్రేట్ రిబేలియన్ అనుకుంటున్నారు Rebellion అంటే బాగుండదు. Revolution అనడం వారికిష్టంలేదు. అందుకని Great తగిలించి Great Rebellion అన్నారు. అయితే Great rebellionని ఏ విధంగా తెలుగులోకి అనువాదం చేయగలం? బృహత్ తిరుగుబాటు అంటే బాగుండదు మహా తిరుగుబాటు అ దామా? అదీ బాగుండదు మహా విప్లవం అంటే విప్లవం రివల్యూషన్ అవుతుంది. ఏదో ఒకటి అనాలి. కాబట్టి తిరుగుబాటు, మహా తిరుగుబాటు అందాం. దీనికి కారణం మతం అనుకున్నాం కదా! మత సంస్కరణ కొంతవరకు తిరుగుబాటుకు కారణమైనప్పుడు దీనిలో జోక్యం చేసుకోవటం ఇష్టంలేని విక్టోరియా మహారాణి మీ మత విషయాలలో ఎలాంటి సంబంధం పెట్టుకోమని ప్రకటించింది. అందువల్ల రెండు శక్తులు దాదాపు ఏకమయ్యేటప్పటు మత సంస్కరణను ఆపేశాయి. ఆ తరువాత సంస్కరణోద్యమాలు చాలా వచ్చాయి. 1867 లో గుజరాత్‌లో మహాదేవ గోవిందరానడే, తర్వాత మహారాష్ట్రలో పూలే, గుజరాత్‌లో ఇంకా కొందరూ వచ్చారు. ఈ విధంగా చాలా సంస్కరణలొచ్చాయి. కాని అవి చాలా వరకు మతపరంగా వచ్చాయి. ప్రార్థనాసమాజ్, బ్రహ్మసమాజ్, ఆర్యసమాజ్, వంటివి. రానడేగారి ప్రార్థనాసమాజ్‌లో కూడా మిగతావాటిలాగే సంఘ సంస్కరణ, వితంతు వివాహం, బాల్యవివాహాలు కాదనటం, కులమత భేదాలుండ కూడదనటం వంటి విషయాలు ఉన్నాయి. కాని కాంగ్రెస్ జాతీయోద్యమం వచ్చేటప్పటికి కొంచెం వేరు పోకడలు ప్రారంభమయినాయి.

1885 లో కాంగ్రెసు స్థాపన జరిగింది. అయితే కాంగ్రెసు రావటం జాతీయోద్యమానికి కారణమా? దానికి ఫలమా? అన్నది చాలా ముఖ్యమైన విషయం. ఏ చరిత్రలో కూడా ఏ ఒక్క సంఘటనా ఏ ఒక్క దానికీ కారణం కాదు. కొంత ఫలితంగానూ కొంత కారణంగానూ ఉంటుంది. Cause effect relationship, చరిత్రలో చెప్పడం చాలా కష్టం ఏది cause అనుకుంటామో అదే effect కావచ్చు. ఏది effect అనుకుంటామో అదే cause కావచ్చు. ఇండియన్ కాంగ్రెసు కలకత్తాలో సమావేశమవుతుండేది. దానికి ఆల్లుకచ్చిన వారు విజయనగరం రాజావారు. అందుకే బ్రిటిష్ గవర్నమెంటు ఎప్పుడూ వారిని చిన్నచూపు చూస్తుండేవారు. బొబ్బిలిని బాగా చూసేవారు. మొదటినుంచీ ఈ రెండు ఎస్టేట్స్‌కీ ఈ భేదం ఉంటుండేది. 1857 లో మూడు Universities

వచ్చాయి. 58 నుంచి ఇంచుమించు 85 నాటికి అప్పటికి చెందిన ప్రమాణం ప్రకారం రెండు జనరేషన్స్‌కి చెందిన వైజ్ఞానికులు, డిగ్రీలు తీసుకున్నవారు, సిద్ధమయ్యారు. ఇది ప్రత్యక్షంగా జరిగిన పాశ్చాత్య ప్రభావం. రామమోహన్ రాయ్‌కి పరోక్షంగా జరిగింది. ఇంగ్లండు వెళ్ళినందుకు. కాకపోతే బెంటింక్స్, కార్న్‌వాలీస్ మొదలయిన గవర్నర్స్‌తో కలిసిన ప్రభావం ఆయనపై ఉన్నది. ప్రత్యక్ష పాశ్చాత్య ప్రభావం యూనివర్సిటీలపై పడింది. అందువల్ల మన జాతీయతాభావం పెరిగింది. రామమోహన్‌రాయ్ కాంటే చదువుకుంటే మనవాళ్ళు చదువుకున్నది జాన్‌స్టూవర్ట్‌మిల్, రామమోహన్‌రాయ్ మెకాలే చదువుకుంటే మనవాళ్ళు చదువుకున్నది బ్రైస్. వీళ్ళు చదువుకున్నందువల్ల గ్రాడ్యుయేట్లుగా, లాయర్స్‌గా, స్కూల్స్ ఇన్స్‌పెక్టర్స్‌గా యూనివర్సిటీస్‌లో, కాలేజీలలో, ఉన్నత పాఠశాలలో పనిచేశారు. మనదేశంలో జాతీయత వచ్చిందికానీ ఈ positivism అనేది అంతగా రాలేదు. 1885 లో కాంగ్రెసు స్థాపించేటప్పటికి జాతీయత ప్రాధాన్యం పెరిగింది. సంస్కరణవాదం ప్రాముఖ్యత తగ్గిందనిపిస్తుంది. అందు వల్ల జాతీయోద్యమం వచ్చినప్పుడు సంస్కరణోద్యమం ఆగిపోలేదు. రెండూ కొన్నాళ్ళ దాకా జోడుగుర్రాల్లాగా నడిచాయి. 1885 నుంచి 96 వరకూ ఏ సంవత్సరంలో నైనా కాంగ్రెసు మహాసభలు జరిగితే ఆ మరునటి రోజు All India Social Conference జరిగేది అక్కడే. అది రానడే ఏర్పాటు చేసేవాడు. అయితే పదేళ్ళదాకా ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. అప్పుడు కాంగ్రెసు సభల్లో పిటీషనింగ్ అండ్ ప్రేయింగ్ అని ఉండేది. మహాజర్లు పంపడం అటు గవర్నర్ జనరల్‌కి ఇటు గవర్నర్‌కి కూడా. ICS మాకివ్వండి సభల్లో ప్రాతినిధ్యం పెంచండి అని అడుగుతుండేవారు. ఇదంతా అయిన తర్వాత మరునటి రోజు సమావేశమై వితంతువివాహాలకు చట్టంలో ఇది చేయండి, కులాంతర వివాహాలకు లాను సవరించండి అని అడుగుతుండేవారు. ఎందుకంటే మొన్న మొన్నటిదాకా అంటే 62-68 దాకా కులాంతర వివాహాలకు Hindu law గవర్న్ కాదు. Special law గవర్న్ అవుతుంది. హిందూలా గవర్న్ కావాలంటే మన two rules of Exogamy, Endogamy అన్వయం కావాలి. Privy Council కూడా enforce చేసింది. మనువు చెప్పింది కాక ప్రాంతీయ సంప్రదాయాలు (మేనరికం మొదలయినవి) కూడా ఇందులో include అయినాయి. మహారాజా ఆఫ్ ఎట్టాయపురం Vs మహాలింగం అన్న ప్రసిద్ధమైన కేసులో మొట్టమొదటిసారి మను ధర్మశాస్త్రమే కాక, యాజ్ఞవల్క్యస్మృతే కాకుండా ప్రాంతీయ సంప్రదాయాలు కూడా తీసుకోవాలని కోరారు. ఎందుకంటే మను

ధర్మశాస్త్రం పాటిస్తే మేనరికాలు చెల్లవు అందుకు కోర్టుకు వెళ్ళారు. 1892 లో ప్రీవీ కౌన్సిల్‌లో ఈ స్మృతులే కాక సంప్రదాయాలు కూడా అంగీకరించాలని నిర్ణయించినారు. ఆ విధంగా మన ఆంధ్రా, తమిళ వివాహాలు చాలావరకు రక్షింపబడ్డాయి. All India social conference లో ఇటువంటి resolutions pass చేసుకునేవారు. దీనికి నాయకుడు మహదేవ్ గోవిందరానడే. ఆయన పెద్ద జడ్జి. ఆయన అటు కాంగ్రెసుతోనూ ఉండేవాడు. దీన్నిబట్టి ఒకటి తెలుస్తుంది. మనకి జాతీయోద్యమ సమయంలో సంఘసంస్కరణ అనేది చిన్నచూపు చూడబడింది. 1896 వచ్చేటప్పటికి తిలక్ అభ్యంతరం పెట్టాడు. పూనాలో కాంగ్రెస్ మహాసభ జరిగినపుడు ఇది చాలా వివాదాస్పదమైన సమస్య అయింది. దీని తర్వాత అదే పందిరిలో సంస్కరణకు సంబంధించిన సమావేశం ఏర్పాటు చేయవచ్చు అనే దానికి అనేక ప్రాంతాలనుంచి వచ్చిన కమిటీలు ఒప్పుకున్నాయి కానీ ఏవో కొన్ని పూర్తిగా ఒప్పుకోలేదు. అనుమానంగా ఒప్పుకున్నారు అని రానడేకి కోపం వచ్చి కాంగ్రెసు సభల్లో సంస్కరణ సభలు జరప మని చెప్పాడు. అప్పట్నించీ జాతీయోద్యమానికీ, సంఘసంస్కరణోద్యమానికి వ్యవస్థాపరంగా విభేదం కాకుండా ఒకవిధంగా వైరుధ్యం కూడా ఏర్పడిందని చెప్పవచ్చు. దీనికి కారణం ఏమిటి? అనేక విమర్శలు చేశారు. తిలక్ చెప్పిందేమి టంటే జాతీయోద్యమానికి ప్రాధాన్యం ఇస్తే స్వాతంత్ర్యం ముందు వస్తుంది. స్వాతంత్ర్యం వస్తే మన ఇల్లు మనం చక్కబెట్టుకోవచ్చు పై దేశం వాళ్ళనుంచి మనం సంఘసంస్కరణ చేయాలనుకోవడమేమిటి అని ఆయన వాదన. ఇది ఎంతనిజమో అతను ఏ విధమైన భావాలతో, ఉద్దేశ్యాలతో అన్నాడో మనకు అవసరం లేదు. Spencer's (evolutionary theory) Social Darvinism ప్రత్యేకంగా శాసనాలవల్ల సాంఘిక పరిణామాలను మారుద్దామన్నది ఒక అపోహ; వెనుకబడినవాళ్ళను రానీడం కూడా అంతే; ఇది ప్రకృతివిరుద్ధం, ప్రకృతికి వదిలేస్తే దానంతటదే రావలసిన వాళ్ళు ముందుకొస్తారు, అవసరంలేనివాళ్ళు ఏది కావాలనుకుంటే అదే అవుతారు అని చెప్తుంది. ఈ సిద్ధాంతం మన కాంగ్రెసు వాదుల్లో చాలా కనిపిస్తుంది. 1887 సమావేశంలో దాదాభాయి నౌరోజీ, ఆయన కూడా సంస్కరణకి కంకణం కట్టుకొన్నవాడే, ఏమన్నాడంటే సంఘసంస్కరణ తాపీగా రావాలి, ఇంతవేగంగా రావటం మంచిదికాదు అన్నాడు. ఇది Social Darvinism. తిలక్‌లాంటి వాళ్ళుకూడా సిద్ధాంతపరంగా సంఘసంస్కరణకు ఇంతవేగం అవసరంలేదు, కొంచెం వెనక్కు వెళదాం అని అన్నారు.

తర్వాత జస్టిస్‌పార్టీ కనిపిస్తుంది. దానిని సంఘసంస్కరణోద్యమం కింద చెప్పవచ్చు. బ్రాహ్మణేతర కులాలకి గౌరవప్రతిష్ఠలు లేవు కాబట్టి ఆ గౌరవ ప్రతిష్ఠలు నివ్వాలని వారి ఉద్దేశం. అది సంఘసంస్కరణ కదా మరి! కులదురహంకారం పోవాలి. బ్రాహ్మణేతర కులాలకి గౌరవం కావాలి. కాబట్టి ఇది సంఘ సంస్కరణే. ఇది దక్షిణా పథంలోను, బొంబాయిలోను ఎక్కువ వచ్చింది. బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం Southలోను, మహారాష్ట్రలోను ఎక్కువ వచ్చింది. దీనికి కొంతవరకు Justice party roots కారణం. Justice party మద్రాసు ప్రెసిడెన్సీలోను, బొంబే ప్రెసిడెన్సీలోను ఎందుకువచ్చింది? బెంగాల్‌లో, ఉత్తర ప్రదేశ్‌లో ఎందుకు రాలేదు? అనేది చాలా ముఖ్యమైన ప్రశ్న. దీనికిగల కారణాలకు Anilsee అనే చరిత్రకారుడు చక్కగా వివరించాడు. Universities వచ్చిన తర్వాత యువకులకి కొన్ని అవకాశాలు ఏర్పడ్డాయి. డాక్టర్లు, స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లు ఇంజనీర్లు వంటి ఉద్యోగాలు ఎన్నో వచ్చాయి. ఒకవిధమైన అవకాశాలు జీవితంలో అభివృద్ధి సాధించటానికి తోడ్పడే విధంగా వచ్చాయి. అయితే South లో సాంఘికంగా బ్రాహ్మణులకు అంతకు ముందే గౌరవం ఉంది. లౌకికమైన అవకాశాలు బ్రాహ్మణేతరులకు వచ్చివుంటే ఒక విధమైన balance సమాజంలో వచ్చుండేది. యూనివర్సిటీలలో విద్యావకాశాలు, తద్వారా ఉద్యోగావకాశాల కూడా ఎక్కువభాగం బ్రాహ్మణులే సంపాదించారు. అందువల్ల 19 వ శతాబ్దం చివరికి బ్రాహ్మణేతర వర్గాల్లో (ఉన్నత వర్గాలు మాత్రమే-నిమ్న వర్గాలు కావు) ఇలా ఎందుకు జరగాలి? అన్న ప్రశ్న ఏర్పడింది 1861-80 Convocationలో Madras, Bombay universityలలో 80% బ్రాహ్మణులే డిగ్రీలు పొందారు. ఉద్యోగావకాశాలు వాళ్లవే. మొదటి ఇండియన్ జడ్జి ముత్తుస్వామిఅయ్యర్. లౌకికంగా ఈ అవకాశాలన్నీ బ్రాహ్మణులవే అయ్యాయి. Culcutta లో 40% మాత్రమే బ్రాహ్మణులు. ఉత్తరప్రదేశ్‌లో కాయస్థలు, బీహార్‌లో భూమిహార్‌లు, కాయస్థులు 60% దాకా అవకాశాలు పొందారు దీనివల్ల సమాజంలో Balance ఏర్పడింది. బొంబాయిలోను, దక్షిణాదిలోను బ్రాహ్మణులకే ఎక్కువ అవకాశాలుండేవి. బొంబాయిలో 90% అవకాశాలు బ్రాహ్మణులు పొందుతుంటే మిగిలిన 10% ఎక్కడో కొద్దిమంది ఇతరులు. ఇది జస్టిస్ పార్టీ రావటానికి కారణం. ఈ నిమ్నవర్గాల్లో ఉన్నత వర్గాలకి అధికారం వస్తే ఆ నిమ్నవర్గాల్లో నిమ్నవర్గాలగురించి ఈ నిమ్నవర్గాల్లోని ఉన్నత వర్గంవారు పట్టించుకోరు. అదే అయింది, Justice party విశ్

యంలో. ఇక్కడ ఇంకో విషయం చెప్పాలి. 1909-1919 లో రాజకీయంగా ఓటు హక్కు ఎక్కువ చేశారు. ఓటు హక్కు సవరింపుతో బ్రాహ్మణేతరులకు ఓటుహక్కు ఎక్కువ వస్తుంది. దానిని వినియోగించుకోవచ్చు అనుకున్నారు. 1919 లో మద్రాసులో Justice party అధికారంలోకి వచ్చింది. అప్పుడు కాంగ్రెసుపార్టీ ఎన్నికల్లో పాల్గొనలేదు కాబట్టి వచ్చింది. 1936 లో ఓటు హక్కును ఇంకా ఎక్కువ చేశారు. అప్పుడు మాత్రం కాంగ్రెసే వచ్చింది కానీ Justice party రాలేదు. అయితే దీని కారణమేమిటంటే, ఓటు హక్కు ఉప యోగించుకోవాలసి వచ్చేటప్పటికి సాంఘిక సంస్కరణలంటే రాజకీయ ప్రయోజనాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వటం అని చెప్పవచ్చు.

ఇరవయ్యవ శతాబ్దం రెండో దశాబ్దంలో చాలా ముఖ్యమైన శక్తులొచ్చాయి. 1. గాంధేయ శక్తి, 2. మార్క్సిస్టు శక్తి. వీటి రెండింటికీ కూడా చాలా నిశిత మైన సంఘ సంస్కరణ ప్రాతిపదిక ఉంది. గాంధీగారు, రానడేలాగా సంఘ సంస్కరణే ముఖ్యం, రాజకీయ సంస్కరణ తర్వాత అని హరిజనోద్యమం చేపట్టారు. చాలా మంది ఆయనను రాజకీయోద్యమానికి ప్రాధాన్యం ఇవ్వవలసిందిగా కోరారు. కాని ఆయన ఒప్పుకోలేదు. సంఘ సంస్కరణ ముఖ్యం అన్నది ఆయన భావన. రాజకీయ స్వాతంత్ర్యానికి రెండో స్థానం ఇచ్చారు. ఈ విషయంలో ఆయన తన గురువైన తిలక్‌తో గాక, గోఖలే, రానడేలతో ఏకీభ విస్తారు. అంతేకాదు అతని సంఘ సంస్కరణ ఆదిపరదటి సంఘ సంస్కరణంటే చాలా విప్లవాత్మకమైంది; సిద్ధాంతపరంగా ఆచరణాత్మకంగా ఎంత వరకు అనేది వేరు విషయం. అయినా హిందూమత ప్రాతిపదికపైన రామ మోహనరాయ్ లాగా శోధనలు చేసినా కూడా, సంకుచితమైనదిగా భావించని విధంగా చేశారు. మార్క్సిస్టులు అంటారు మతం ఎందుకని కాని గాంధేయ మతం సంకుచితమైనదని వాళ్ళు కూడా అనలేదు. సిద్ధాంతపరంగా అసలు మతబోధ తప్పనవసరం. Scientific గా వేరు. కాని ఇతను మతప్రచారం దయానంద లాగా కాని, వివేకానంద లాగా కాని misunderstanding కి, సంకుచితత్వానికి దారితీసిందనికాని, లౌకిక మార్గానికి అడ్డు నిలిచిందని కాని అను కోవడానికి వీలులేదు. విప్లవాత్మకంగా కులాలు పోవాలి అని చెప్పారాయన. మార్క్సిస్టు సిద్ధాంతానికి, గాంధేయ సిద్ధాంతానికి ఒక విధంగా పోలికలున్నాయి. ఈ రెండూ కూడా కులాలను సమూలంగా నాశనం చేయాలని చెప్పాయి. ఒక

ప్రధాన భేదం కూడా ఉంది. సంఘ సంస్కరణ విషయంలో మార్క్సిస్టులకి విచిత్రంగా తిలక్‌తో పోలికలున్నాయి. సంఘ సంస్కరణకు సమయం వృధా, మొదట విప్లవం మీద దృష్టి కేంద్రీకరించాలి. విప్లవం వస్తే అన్నీ వాటంతట అవే సర్దుకుంటాయి అనేది. Dictatorship of the peasentry or Dictatorship of the proletariot వచ్చిన తర్వాత సంఘ సంస్కరణ అసలు చేయవలసిన అవసరం ఉండదు. దానంతట అదే వస్తుంది. అయితే ఇంకొక సంగతి ఇక్కడ చెప్పాలి. వీరు నాస్తికులు కాబట్టి నిజంగా కూడా Political revolution వచ్చిన తర్వాత Social revolution వస్తుంది; మతం అనేది ఏ విధంగా కూడా అడ్డురాదు అనేవారి అభిప్రాయం నిజమనే చెప్పాలి. ఎంతవరకు దానిని అసలు పరచవచ్చు అనేది వేరే సంగతి. ఏది ఏమైనా మార్క్సిస్టులు సంఘ సంస్కరణకి అందరికన్నా విప్లవకరమైన భావన కలిగి ఉన్నారనటం అసత్యం కాదు. అయితే వారు భారతదేశంలో దీనికి ప్రాముఖ్యత తక్కువగా ఇచ్చారు. విప్లవం గురించి ఎక్కువగా ఆలోచించటంతో సంఘ సంస్కరణతో విడిపోవలసి వచ్చిందేమో కూడా. అందువల్ల సంఘ సంస్కరణోద్యమం ఇప్పటికైనా ఏ మాత్రమైనా మిగిలి ఉందీ అంటే అది గాంధీ ప్రభావంవల్ల ఎక్కువగా ఉంది కానీ, ఇతర ప్రభావాలవల్ల కాదనే అభిప్రాయాన్ని చెప్పవచ్చు. ఎంతవరకు సాధించారు అన్నది వేరే విషయం. ఇక కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతం యొక్క ఉద్దేశం ఏమిటంటే - సంఘ సంస్కరణ గురించి ప్రత్యేకంగా మనం ఆలోచించడం అనవసరం అని. రాజకీయ విప్లవంగానీ, ఆర్థిక విప్లవంగానీ వచ్చిన తర్వాత దానంతట అదే సర్దుకుంటుంది. మతమే అవసరం లేనప్పుడు దాన్నించి వచ్చిన సంస్కరణ అవసరమేముంది? వాటంతట అవే పరిష్కరింపబడతాయి అని. గాంధీ ఉద్దేశం అది కాదు. సంఘ సంస్కరణ ఆయన ఉద్దేశంలో రాజకీయ సంస్కరణ కన్నా ముఖ్యం.

తమిళనాడులో పెరియార్ రామస్వామి నాయకర్ నాయకత్వంలో ద్రావిడ ఉద్యమం స్వయం మర్యాదా ఉద్యమం వచ్చింది. సంఘ సంస్కరణకు ప్రధానమైన అడ్డుగోడ మతం. అందుకని మతం పోవాలన్నాడు రామస్వామినాయకర్ Confirmed atheist. అన్నాదురై కూడా Confirmed atheist. మత సంస్కరణ చేస్తే సంఘ సంస్కరణ అంటున్నారు. ఎంత సంస్కరణ చేసినా

మతం సంఘ సంస్కరణకి దోహదం కాదు. భారతీయ ఉద్యమాల ప్రాతిపదికే తప్పని వారి అభిప్రాయం. సంఘ సంస్కరణ రావాలంటే మతం పోవాలి. ఇంచుమించు అదే అభిప్రాయాన్ని ఒకప్పుడు నార్లవారు వ్యక్తం చేశారు. "నేను మతానికి ద్వేషిని ఎందుకంటే హిందూ మతానికి ద్వేషిని, నేను హిందూమతానికి ద్వేషిని. ఎందుకంటే బ్రహ్మణ మతానికి ద్వేషిని.'' ఇది ఒక మంచి logical sequence. ఇంచుమించు ఈ లాజికల్ సీక్వెన్స్‌నే రామస్వామి నాయకర్ చెప్పాడు. రామస్వామి నాయకర్ అభిప్రాయాలు మనకు ఇవాళ నచ్చకపోవచ్చు. సంఘ సంస్కరణ ముఖ్యమైనటువంటిదైనప్పుడు ఆ భావాలు చాలా ఉత్తేజకరమైనటువంటివి. కొందరికి ఆ భావాలు నచ్చనందువల్ల మనం ఆ భావాల నిజాయితీని ప్రశ్నించటానికి వీలులేదు. ముఖ్యంగా మనం గమనించవలసిన విషయం స్వయం మర్యాదా ఉద్యమం. దీని తర్వాత వచ్చినదే గాంధీగారి హరిజన ఉద్యమం, ఇది చాలా ముఖ్యమైనది. జస్టిస్ పార్టీలాగా ఒక్క బ్రాహ్మణేతరులకు మాత్రమే చెందినది. S.C, S.T. వర్గాలనేవి బ్రిటిష్‌వారు 19 వ శతాబ్దంలోనే ప్రవేశపెట్టారు. అయితే షెడ్యూల్డ్ కాస్ట్ లిస్ట్‌లో జస్టిస్ పార్టీ సమయంలో చేర్చింది చాలా తక్కువ. కాంగ్రెసు సమయంలోనే ఎక్కువ చేర్చారు. అదే ఎవరు ఎవరికి ఎక్కువ చేశారు అన్నదానికి measure. అయితే ఇది measure కాదని చాల మంది అనవచ్చు. చేతిలో measure ఉన్న తర్వాత కొలవక పోవటం ఎలా ? 1981 నుంచి రాజగోపాలాచారి వచ్చిన తర్వాత Madras Precidency లో first Congress Govt. వచ్చిన తరువాత Scheduled caste, Scheduled tribe లకి కొంత చేర్చబడినదన్నమాట.

అంబేద్కర్ వచ్చిన తర్వాత అంబేద్కర్‌కి, గాంధీకి రెండు సిద్ధాంతాల కున్న వైరుధ్యం అందరికి తెలిసిందే. ''హిందూమత ప్రాతిపదికలోనే హరిజనోద్ధరణకు వీలుకలుగుతుంది. మీరు పాపం చేశారు కాబట్టి పాపశమనం కూడా అందులోనే, వారిని పైకి తీసుకు రావటంలోనే ఉంది'' అని గాంధీజీ చెప్పారు. అయితే ఈ మాటనే హాస్యాస్పదంగా చెప్పవచ్చు కూడా. అంబేద్కర్ అన్నాడు, హాస్యాస్పదం చేశాడు కూడా. గాంధీ గురించి ఏమన్నాడంటే-''ఆయన ఏమంటున్నారో చూడండి." మేం ఉన్నతవర్గాల వాళ్ళం. చాలా పాపం చేశాం. వేల సంవత్సరాలనుంచి హరిజనులను చాలా చిన్నచూపు చూశాం. ఇప్పుడు ఈ పాపక్షయానికి కొంచెం సహాయం చేయండి అంటున్నాడు. ఇదివరకు పాపంచేయటానికి

సహాయం చేసిందికూడా మేమేనా? ఇప్పుడు మీరు మోక్షంపొందడానికి కూడా మీకు సహాయం చేయాలా?'' అన్నాడు అంబేద్కర్ చలోక్తిగా అంబేద్కర్‌ది Separtist movement ఇది ఒక్క ఇండియాలోనేగాక ఈ వైరుధ్యధోరణులు మనకు అమెరికాలో కూడా కనిపిస్తాయి. మార్టిన్ లూథర్‌కింగ్ యొక్క సిద్ధాంతం ఒకటి. malcolmx పేరు వినేవుంటారు. నీగ్రో movementలో చాలా ఉద్రిక్తవాది. ఇతణ్ణి శ్వేతజాతీయులు చంపేశారు కూడా. వీరిద్దరిదీ కూడా ఇంచుమించు 1960-67 దాకా చాలా ఉద్రిక్తంగా రెండు movementsగా నడచాయన్న మాట. ఒకటి ntigral movement. మార్టిన్ లూథర్ కింగ్‌ది సత్యాగ్రహం civil disobedience Selma march లలో పాల్గొన్నారు. అలబామా మార్చ్ mancolmx ఒకపక్క, మరోపక్క మార్టిన్ లూథర్‌కింగ్ ఇద్దరూ నీగ్రోలే. కాని రెండు సిద్ధాంతాలు. ఈ రెంటినీ చూసినపుడు మహాత్మాగాంధీ సిద్ధాంతం, అంబేద్కర్ సిద్ధాంతం జ్ఞాపకం వస్తాయి. రెండింటికి కూడా మంచి ప్రాతిపదిక ఉంది. శ్వేతజాతీయుల్ని పట్టుకోవాలి. వారిలోను చాలా ఉత్తములు, ఉదార స్వభావులు, జ్ఞానులు ఉన్నారు కాబట్టి వాళ్ళను పట్టుకొని వాళ్ళద్వారా రావడం ప్రాగ్మాటిక్‌గానే కాదు moralగా కూడా మంచిది అన్నది లూథర్‌కింగ్ మార్గం. ఏ మతమైతే ఆ మతం అవసరమైతే మహమ్మదీయమతమైనాసరే పట్టుకొని అవసరమైతే Separatist గా కే, ఏది ఏమైనాసరే Terrorist method ఐనాసరే అవలంబించి మనం సాధించాలిగానీ ఏరోవిధంగా సాధించడానికి రాదని melcolmx అభిప్రాయం ఇండియావిషయానికొస్తే దీన్ని మనం గాంధీ అంబేద్కర్‌లకి అన్వయించవచ్చు. ఏదైతేనేం అంబేద్కర్ థీరీ ఏమైందన్నమాట. దాన్ని అందరూ అన్ని పార్టీలు వాళ్ళు కలిపేసుకున్నారు అంబేద్కర్ థీరీకి గాంధేయ సిద్ధాంతం ప్రాతిపదిక అనటం చాలా వివాదాస్పదం కావచ్చును. ఎందు కంటే ఎంతైనా కూడా 20% మైనారిటీయే. అటువంటి 20%ని గురించి మెజారిటీ వర్గాల్లోకూడా 1920 నుంచి నూరిపోసి ఒక moral చైతన్యం తెచ్చిపెట్టిన ఉద్యమం గాంధీది. దీనికి కారణం ఏమంటే గాంధీగారు లెజిటిమసీ తెచ్చారు, లెజిటిమసీ అంటే ఏమిటంటే వీరికిది జరగాలి. ఇది చాలా inconvenience కలిగించేదైనా న్యాయం, ధర్మం, ఇది జరగాలి.

మొదట రిజర్వేషన్స్ గురించి ఎవరుగానీ ఎటువంటి అభ్యంతరం పెట్టలేదు. దీనికి కొన్ని వ్యవస్థలోంచి పోవాలి, మనకు కష్టంగా కనిపించినా కూడా ఇవి పోవాలి అనే జ్ఞానాన్ని కలుగచేసి Moral legitemacy ని తెచ్చిపెట్టింది గాంధీయ సిద్ధాంతం. పోరే తెచ్చిపెట్టినంత మాత్రంలో చిత్తశుద్ధి కలుగదు. తరవాత ఏనుగును అంకుశంతో పొడిచినట్లు పొడుస్తుండాలి. ఆ పొడవడం చేశాడు అంబేద్కర్. ఈ సిద్ధాంతాలు రెండూ కలిపితేనే ఇప్పుడీ Scheduled caste ఉద్యమం సఫలమౌతుంది. వారివారి రిజర్వేషన్స్ ద్వారా కొంతమట్టుకి, తర్వాత అంతా సమన్వయం ద్వారా వీలౌతుంది. అందువల్ల హరిజనోద్యమం అనేది గాంధిగారితో మొదలై అంబేద్కర్‌తో వేర్పాటు ఉద్యమంగా స్థిరపడింది. అందువల్ల ఆ moral ఉద్యమం ఈ వేర్పాటు ఉద్యమం - ఈ రెండూ కూడా ఒక లింక్‌లో ఉండేవే అని చెప్పవచ్చని విస్తుంది. సంస్కరణ ఎంతవరకు ఎప్పుడొచ్చిందో నిస్పృహావాదం కూడా మనలో ప్రబలిపోయింది. కొంతవరకు భారతదేశంలో రెండే రెండు వాదాలంటూ ఉంటాయి. euphoric optimism లేకపోతే dispairing pessimism ఈ రెండే ఉంటాయి. భారత దేశంలో అయితే రత్నగర్భ, లేకపోతే గర్భదరిద్ర ఈ రెండేనేమో అనిపిస్తుంది. ఈ రెండే వాస్తవమని అనిపిస్తుంది. dispairing pessimism, euphoric optimism ఈ రెండూ మనలో ఎక్కువే. అసలు సంస్కరణ అనేది ఎలా measure చేస్తాం ? Measure చేయడం లో ఒక విషయం చెప్పవచ్చు. కారణ మేమిటంటే usual గా ఎన్ని intercaste marriages జరిగాయి ? ఎన్ని widow remarriages జరిగాయి ? These are the indicators. అయితే ఇక్కడో చిన్న అనుమానం. సూచన కూడా. దీనివల్ల మనకి ఈ లెక్క చాలా తక్కువగా కనిపిస్తుంది. ఆంధ్రా అంతా తీసుకుంటే ఒక నూరు, రెండు వందలకంటె ఎక్కువ ఉండదు. ఇక్కడ social distance అనే concept introduce చేస్తే మంచిదనిపిస్తుంది. సాంఘిక పరిణామం, అనేది వచ్చినప్పుడు Social distance concept అంటే అర్థం ఏమిటి అంటే ఒక కులాంతర వివాహం జరిగినపుడు ఒక కులాంతర వివాహానికి మరో కులాంతర వివాహానికి ఎంతో భేదం ఉండొచ్చు. వారు ఇది Social distance ను తెలుపుతుంది. కులాలనుఒక విధమైన ladderలో పెట్టామా, ఈ ladderకి ఒక విధమైన గౌరవం ఇస్తున్నారు అందరూ. వారు ఎక్కువ, వీరు తక్కువా అని ఉండకుండా ఉంటారంటే ఉంది కాబట్టే,ఉందని వాళ్ళు సూచిస్తున్నారు కాబట్టి.అంబేద్కర్ ఇది పోవాలని

ప్రయత్నం ఇలాంటప్పుడు ఈ పెళ్ళికొడుకెక్కడివాడు, పెళ్ళికూతురెక్కడిది అనేది పూర్తిగా **Socialogical empirical research** కొరకు చెప్పిన మాట. **Social distance concept** అంటే వివాహం జరగటానికి ఎంత వరకు సంప్రదాయాలను త్యజించవలసిరావచ్చు ? నలుగురిలో కుటుంబంలో ఘర్షణ పడవలసి రావచ్చు. ఎంతవరకు వాళ్ళు స్వతంత్ర భావాలతో విపర్యలను తట్టుకుంటారు అనేది పాయింటు. ఆ పాయింటు వచ్చినపుడు **groom** ఉన్నత శ్రేణికి చెందినప్పుడు ఇవన్నీ **empirical** గా వాడబడుతున్నాయి. **Bride** నిమ్నజాతికి చెందినపుడు అటువంటి వివాహాలు ఒకటేను. మధ్యతరగతి వాళ్ళ మధ్య వివాహం జరిగినపుడు ఈ **intercaste marriges** యొక్క **status** ఒకటి. అలాగే పెళ్ళికొడుకు హెచ్చు, పెళ్ళికూతురు హెచ్చు అనేది చూడాను అటీ పెళ్ళికొడుకు అగ్రజాతికి పెళ్ళికూతురు నిమ్నజాతికి చెందినపుడు అంతగా పట్టించుకోరు ఇదే **reverse** అయితే కొంపలు మునిగినట్టు చేస్తారు. **These are attitudes.** వర్ణాంతర వివాహాలకే కాదు, మతాంతర వివాహాలకు కూడా ఇదే వర్తిస్తుంది. ఏ మతమైనా ఆ మతానికి చెందినవాడు పెళ్ళికొడుకైనప్పుడు ఇంకో మతానికి చెందినవాడి కూతుర్ని పెళ్లాడ్డానికి అంత వెనుకాడడు. అభ్యంతరాన్ని సర్దుకుంటాడు. ఇదే **reverse** అయితే ప్రమాదాలొస్తాయి. అందుకే **adjust** కాలేరు. ఇవన్నీ **social change** కి తార్కాణాలు. ఉదాహరణకి వర్ణాంతర వివాహాలు జరిగినప్పుడు సాంఘిక పరిణామాలలోగల చైతన్యాన్ని ఉద్ధృతమైనదనే చెప్పాలి. నెమ్మదిలో నడుస్తుంది. పూర్తిగా మారుతుందా, లేదా ! వేరే సంగతి. ఇలాంటప్పుడు సంస్కరణ కొద్దిగా కనిపిస్తుంది. పూర్వం వివాహాల విషయంలో **application of Hindu law** సంస్కరణకి ఎక్కువ సంబంధం లేకుండా పోయింది. ఎటువంటి వివాహం చేసుకున్నా, రిజిస్టర్ వివాహం చేసుకున్నా కూడా **law** లో ఒకటే. **Techinical** భేదం ఉండవచ్చు కాని అంతా ఒకటే **Social legitimacy** సంఘ సంస్కరణకి ఏర్పడింది. ఇక మతపరంగా అనేక రకాల విషయాల్లో చర్చలు మనం చూస్తున్నాం భారతదేశం చాలా **Peculiar** దేశం మనం నిస్పృహ చెందనవసరంలేదు. మనలో మతం కరుడుగట్టకు పోయింది. పాశ్చాత్యులు వచ్చి మన దేశాన్ని **Subcontinent** అని ఉట్టినే అనలేదు మరి. **"It is a country of subcontinent of continental standards''** అన్నాడు ప్రఖ్యాత అమెరికన్ రచయిత మార్క్‌ట్వెయిన్. **Continental Standards not only geographical, social in terms of thought.**

అటువంటిదాన్లో ఈ సూత్రం changes రావడం కూడా చాలా అశాజనక మైన పంథా అని చెప్పవచ్చు. Social changes, Social theories గురించి చెప్పేటప్పుడు మనం ఒకటి గుర్తుంచుకోవాలి. వారి Sincerity ని అనుమానించటం మంచిది కాదు. కాని వారి సామాజిక వ్యవస్థ, సమాజంలో వారి స్థానాన్ని బట్టి వారి సిద్ధాంతాలు కూడా మారుతుంటాయేమో అనిపిస్తుంది. మార్క్సిజం నుంచి వచ్చిన థీరీయే ఇదికూడా. దీన్ని Socialogy of knowledge అని కూడా అంటారు. Socialism అన్నది workers theory కాదు. Intellectuals theory అన్నారు కొందరు మంది Sociologists. ఎందుకంటే మధ్యయుగం దాకా వైజ్ఞానిక దృష్ట్యా కూడా మతాధికారులు అధికారం చెలా యించారు. Capitalismలో అధికారం ఎవరిది? economic man. Socialism వైజ్ఞానికులకి ప్రాతిపదిక అయిన సిద్ధాంతం. అందువల్ల Socialist సిద్ధాంతం workers సిద్ధాంతంకాదు. It is an intellectuals' doctrine. మైనికేవిట్జ్ అని ఒక పోలిష్ Sociolgist 1922 లో ఈ మాట అన్నారు. Marxism is not a workers' doctrine, it is essentially an intellectuals doctrine అని. ఆ intellectual sophistication వల్ల Marxism గౌరవం తెచ్చిందెవరికి. లాభం ఎవరికి? అన్నది వేరు సంగతి. గౌరవంఎవరికి, తెస్తుంది? intellectuals కి. అందుకని ఈ మార్క్సిస్టు సిద్ధాంతమే intellectuals ప్రేరణ ద్వారా వచ్చి నపుడు అనేక సంఘ సంస్కరణ సిద్ధాంతాలు selfish reasons వల్ల వచ్చాయా అని ప్రశ్నించవలసిన అవసరం వస్తుంది. అంటే critical analysisలో వాటి నిజాయితీని ఎంతవరకు తీసుకోవాలన్న విషయంలో అనుమానం లేదు. రామ స్వామి నాయకర్ చెప్పిన చాలా విషయాల్లో సంఘ సంస్కరణ చాలా ముఖ్య మైంది. అయితే రామస్వామి నాయకర్ ఎందుకు బ్రాహ్మణ వ్యతిరేక సిద్ధాంతం ప్రతిపాదించారంటే, ఆయన కాదనా? అనే ప్రశ్న కూడా రావచ్చు. ఇటు వంటివన్నీ వస్తుంటే సంకుచితమైన points అన్నీ raise చేయటం అని అనవచ్చు. Intelectualగా, జాగ్రత్తగా analysis చేస్తేనేగాని వివిధ్న రూపాలలో వచ్చిన సంఘ సంస్కరణలలో వారి వారి స్థానాలకు positiveగా అర్థం చేసుకోలేము.

# రాజకీయోద్యమాలు

—చుండి జగన్నాథం

1983 జనవరి ఒకటవ తేదీన దేశంలోవున్న పరిస్థితులనిబట్టి, లోగడ మన గడ్డమీద ప్రభవించిన రాజకీయోద్యమాల స్వరూప స్వభావాలను ఊహించడం దుర్లభమని అనొచ్చు. కాని, వాస్తవం ఏమిటంటే, చిత్తశుద్ధిగల త్యాగశీలురు సేవాపరాయణులు అయిన ఉద్యమాలను అంకితమై కృషి జేసినారు. వారి కృషి మూలాన్నే, ఈనాడు మనం స్వతంత్ర భారతదేశంలో జీవిస్తున్నాము. వారు వేసిన పునాదుల మీదనే స్వతంత్ర భారత పునర్నిర్మాణం అనేక విధాల జరిగింది. క్రమేపి ఆ దీక్ష, సేవాభావం మాయమై పరిస్థితి దిగజారి, నేటి స్థితికి దేశం వచ్చింది. అయితే ఈ మన దేశం. మన రాష్ట్రం ఏ విధంగా ఎంతకాలమో వుండరాదు, వుండదు. పునః మనం స్వతంత్ర భారతంలో తలయెత్తుకొని తిరగ గలిగే పౌరులమై, ప్రజాస్వామ్యంలో ఆత్మగౌరవంగల స్థాయిలో నడిచే పౌరులమై వుండవలెనంటే, మన గడ్డన స్వతంత్ర భారత నిర్మాణానికి దారితీసిన చారిత్రక ఘట్టాలను స్మరించుకోవడం అవసరం.

మన స్వరాజ్య పోరాటానికి ముఖ్యమైన అధ్యాయాలుగా నీటిని పేర్కొన వచ్చును. ఒకటి : కాంగ్రెస్ మహాసంస్థ ద్వారా నడిచిన సత్యాగ్రహాలు. రెండు : భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ లాంటి వీరుని ఉదాహరణనే అంటుకు ముందునుంచే కృషి జేస్తూ వచ్చిన విప్లవకారులు. మూడు : దేశభక్తులైన సిక్కులు, అమెరికా వెళ్ళి వుండి తిరిగి వచ్చి ప్రారంభించిన గదర్‌పార్టీ ఉద్యమం, అల్లూరి సీతారామరాజు నడిపించిన విప్లవ పితూరీ ఉద్యమాలు. నాలుగు : సుభాషచంద్రబోస్ నేతాజీగా నడిపించిన ఆజాద్ హింద్ సైనిక ఉద్యమం, దానిమూలాన జరిగిన, నౌకా సైనిక తిరుగుబాటు మొదలైనవి.

స్వతంత్ర భారతం సిద్ధించిన తర్వాత ప్రత్యేకంగా నడిచిన సోషలిస్టు పార్టీ ఉద్యమం, కమ్యూనిస్టు పార్టీ ఉద్యమం ఎన్నదగినవి.

స్వతంత్ర భారతం ఉదయించక పూర్వం ఒక రంగాన ప్రజల పోరాటాలు సాగినవి. కాంగ్రెస్ నాయకులు, కాంగ్రెస్ ఉద్యమంతో సంబంధముల కార్యకర్తలు ఆ పోరాటాలకు బాగా సాయపడినారు. అటువంటి పోరాటాలలో మహోజ్జ్వలమైన చరిత్ర గలది నైజాం ప్రజల పోరాటం.

కాంగ్రెస్ మహాసంస్థ (Indian national Congress) 1885 లో ప్రారంభమైంది. దానికి ప్రథమ ప్రోత్సాహకారులలో హ్యూమ్, వెడర్బర్న్ అనే ఇద్దరు ఆంగ్లేయులున్నారు. వీరు ఉన్నత ఉద్యోగంలో వుంటూ, ప్రజ్ఞా-సామర్థ్యాలు గల భారతీయులకు పరిపాలనలో అవకాశాలను ఇవ్వవలెనని కోరినారు. అన్ని రంగాలలో కూడా దక్షులైన భారతీయులకు అవకాశాలను కల్పించి, బ్రిటిష్ పాలనను మన దేశంలో ప్రజలకు ఆకర్షణీయంగా చేయవలెనని వారి సంకల్పం. అందుకనుగుణంగా కాంగ్రెస్ మహాసంస్థ కార్యకలాపాలు సాగించిన వ్యక్తి Annie Besant (అనీ బెసెంట్, దివ్యజ్ఞాన సమాజం ద్వారా ప్రాచీన భారత తత్వాన్నీ ఇతర ప్రాచ్యఖండపు మతాల విశిష్టతను లోకానికి వెల్లడి చేసిన విదుషీ మణి.)

ఆ సమయంలో దాదాభాయి నౌరోజీ Poverty and British Rule in India (దారిద్ర్యము : బ్రిటిష్ తత్వానికి విరుద్ధమైన పరిపాలనను భారతదేశంలో సాగించుట) అనే గ్రంథం ద్వారా తమ దేశంలో ప్రజలపట్ల బ్రిటిష్‌వారు అవలంబించే నీతికీ, భారతదేశంలోని ప్రజల పట్ల అవలంబించే విధానానికీ ఎంత భేదమున్నదో వెల్లడి చేసినారు. వీరు వ్యాపార రంగాన సుప్రసిద్ధులు, ఆంగ్లసీమలో పార్లమెంట్ సభ్యులుగా ఎన్నిక కాగలిగిన దక్షులు. అందువలన, వీరి అభిప్రాయములను లోకం శ్రద్ధతో గమనించినది. బెసెంట్, నౌరోజీల దీక్ష వలన భారతీయులలో స్వపరిపాలన అనే ఉదాత్తమైన ఆశయం వ్యాపించినది. Home Rule league (స్వపరిపాలన సమితి) ని బెసెంట్‌తోపాటు లోకమాన్య బాలగంగాధర్ తిలక్ నడిపించినారు.

ఈ విధంగా స్వపరిపాలన ఆసక్తిని పెంపొందించిన నాయకులలో క్రమేపి రెండు విభాగములు తలయెత్తినవి. బొంబాయికి చెందిన సర్ ఫిరోజ్‌షా మెహతా,

పూనాకు చెందిన గోపాలకృష్ణ గోఖలే ఇత్యాదులు మితవాదులుగానూ; తిలక్, అరవింద ఘోష్ ప్రభృతులు అతివాదులుగానూ 1907లో జరిగిన సూరత్ కాంగ్రెస్ సమావేశంలో తమ తమ వాదాలను ప్రకటించుకుని, ఘర్షణ పడినారు. అర్జీలవల్లా, అధికార్లతో చర్చలవల్లా, ప్రాధేయపడినందువల్లా స్వపరిపాలన రాదని అతివాదులు ఘోషించారు. తాము స్వపరిపాలనాశయాన్ని నెమ్మదిగా సాగిస్తూ, ఉద్యమానికి ప్రతిష్ఠను పెంచినామని మితవాదులు జవాబు చెప్పినారు.

1914లో ప్రథమ ప్రపంచ యుద్ధం వచ్చింది. మనకు స్వపరిపాలన వస్తేనే తేగ వస్తుంది అనే ఆశ ఉంటేనే యుద్ధంలో మనం పాల్గొనవలెననే భావం భారతీయులలో వ్యాపించింది. దక్షిణాఫ్రికాలో భారతీయుల పక్షాన పోరాడి, లోకాధ్యుడై గాంధీజీ సైతం స్వదేశానికి చేరుకున్నాడు. యుద్ధంలో గాయ పడినవారికి సేవ జేసినందుకు పరిమితంగా భారతీయుల సహకారం లభించినది. అంతకు మునుపే 'స్వరాజ్యం మన జన్మహక్కు' అని తిలక్ గావించిన నినాదం దిక్కుదిక్కున ప్రతిధ్వనించినది.

1917లో పంజాబ్ దురంతాలు జరిగినవి. అమృతసర్‌లోని జలియన్ వాలా బాగ్‌లో సమావేశమైన ప్రజలపై ఒకనాడు జనరల్ డయ్యర్, వారంతా స్వపరిపాలనకు సంబంధించిన సంరంభంకోసం వచ్చినారని భావించి, వారిపై నిర్దాక్షిణ్యంగా కాల్చినాడు. దేశం ఆ దుర్మార్గునిపై మండిపడినది. కాని, ఆంగ్లసీమలో వానిని సన్మానించారు. 1918లో యుద్ధం ఆగిపోయింది. సహాయ నిరాకరణోద్యమానికి అది బగాయతు ప్రోత్సాహం లభ్యమైనది.

దరిమిలా, విజయవాడలో జరిగిన చారిత్రిక కాంగ్రెస్ కేంద్ర కమిటీ చర్ఖా ఉద్యమానికి, బ్రిటిష్ పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించే ఉద్యమానికి, ఇతరత్రా బ్రిటిష్ ప్రభుత్వంతో సహాయ నిరాకరణోద్యమానికి పిలుపునిచ్చి, కోటి రూపాయల తిలక్ నిధికై విజ్ఞప్తి చేసినది. గాంధీజీకి దేశాన్ని అప్పగించి, స్వరాజ్యం నా జన్మహక్కు అని ఘోషించిన తిలక్ కన్నుమూశాడని కూడా దేశంలో అశేషమైన జనం విశ్వసించినారు. ఆ ఉద్యమంలో శాంతియుతంగా నడువవలెనని పెద్దల ఆదేశం. కానీ, చౌరీ-చౌరా అనే చోట ప్రజలవైపునుంచి జరిగిన దౌర్జన్యం సహింపరానిదై, గాంధీజీ ఉద్యమాన్ని ఉపసంహరించినారు

1920 - 24 వరకు నిర్మాణ కార్యక్రమం సహాయనిరాకరణ తర్వాత సాగింది. లోలోపల స్వరాజ్యప్రాప్తికై కాంక్ష అత్యధికమవుతూ వచ్చింది. ఆంగ్ల సీమలో భారతదాస్య విమోచనం కావలెననే మిత్రబృందం క్రమేపీ అధికమైనది. దానికి, తోడుగా స్వరాజ్య పార్టీ కేంద్రంలో, రాష్ట్రంలో, బ్రిటిష్ ప్రభుత్వ విధానాలను సవాల్ చేస్తూ వచ్చింది. సత్యమూర్తి, దాస్, మోతిలాల్ వంటి దిగ్గజాల ప్రశ్నలకు సమాధానాలివ్వడం అసాధ్యమైపోయింది. కేంద్రంలో ప్రెసిడెంట్ పటేల్ అనుమతిలేనిది, ఏ నివేదికనూ బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టలేకపోయింది. బ్రిటిష్ ప్రభుత్వానికి ఆందోళన కలిగించినది, ఏదో ఒక తంత్రంచేత భారతీయ దేశభక్తులను సంతోషింపచేయాలని ఆ ప్రభుత్వం పూనుకున్నది.

1927 లో పూర్తి రాజ్యాంగ రచనకై బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ సప్తకాన్ని నియమించినది. కోట్లమంది భారతీయుల రాజకీయ భవిష్యత్తును అందరు శ్వేతముఖులైన ఆంగ్లేయ సమితితో నిర్ణయించేది అని దేశంలో విద్యార్థులు, సామాన్యజనం గర్జించినారు. సైమన్ తిరిగి వెళ్ళిపో (Simon go Back) అనే ఉద్యమం ప్రజ్వరిల్లింది. ఇంతకుముందే చీరాల-పేరాలలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నడిపిన రామదండు, చెన్నపురిలో దేశభక్తాగ్రగణ్యులైన మద్దూరి అన్నపూర్ణయ్య ప్రభృతులు నడిపిన నీల్ విగ్రహ విరుద్ధ సత్యాగ్రహం వంటి ఉదంతాలెన్నో దేశమంతటా ప్రజలను ఉత్తేజితులుగా చేసివుండినవి. అందువల్ల సైమన్ కమిషన్ రాకనూ, పర్యటననూ తీవ్రంగా నిరోధించిన సంఘటనలు నలుమూలలా ప్రత్యక్షమైనవి.

లాహోరులో లాజపతిరాయ్ (ఇది సరియైన ఉచ్చారణ, లజపతి రాయ్ కాదు) పెద్ద 'సైమన్ గోబాక్' ఊరేగింపును నడిపినప్పుడు, ఆయన గుండెపై లాఠీలు వర్షించడం, చెన్నపురిలో అటువంటి ఊరేగింపు జరిగినపుడు జరిగిన కాల్పులలో కొందరు మరణించినపుడు, బ్రిటిష్ పరిపాలక రక్షకభట ముఖ్యులను సైతం ధిక్కరించి, ఆంధ్రకేసరి ప్రకాశం విజృంభించడం, గుంటూరులో నడింపల్లి నరసింహారావు మునిసిపల్ చేర్మన్‌గా వుండి రోడ్లన్నీ కడిగించగా సైమన్ కమిషన్ వాహనాల సంచలనం ఆగిపోవడంవంటి ఎన్నో దృశ్యాలు ప్రజల స్వరాజ్య వాంఛను బ్రహ్మాండంగా ప్రజ్వలింపజేసినవి.

1927 అఖరులో చెన్నపురిలో కాంగ్రెస్ వార్షిక సమావేశం జరిగినపుడు అధ్యక్షులైన యమ్. ఎ. అన్సారీ ఇట్లనేవగను పరిస్థితి వచ్చింది: "స్వరాజ్యం వచ్చి తీరవలసిందే- వీలైతే సామ్రాజ్యం లోపలనే, అవసరమైతే సామ్రాజ్యం వెలుపలనే." 1928 లో కలకత్తాలో మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన అధివేశ ప్రతిపత్తికి ఒక్క సంవత్సరం సమయం ఇస్తూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని గట్టిగా హెచ్చరించినారు. గడువు దాటింది. 1929 లో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ వార్షిక సమావేశంలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. I am a republican and socialist (నేను సంపూర్ణ ప్రజాస్వామ్యవాదిని, సోషలిస్టును) అని తన అధ్యక్షోపన్యాసంలో నెహ్రూ ప్రకటించుకున్నారు.

అంతట, వైస్రాయి ఇర్విన్ ప్రభువుకూ మహాత్మా గాంధీకీ జరిగిన చారిత్రాత్మక ఉత్తర ప్రత్యుత్తరాల వలన బ్రిటిష్ ప్రభుత్వం లొంగదని తెలిసిపోయింది. 'ప్రియమైన స్నేహితుడా' అని మహాత్ముడు ఇర్విన్ ప్రభువును సంబోధించినాడు. బ్రిటన్-ఇండియా సరిసమానులనే భావం అందరికీ కలిగినది. ఆ భావం ఇచ్చిన ఊత 1930 లో గాంధీ నాయకత్వాన కాంగ్రెస్ ఆదేశానుసారం జరిగిన లవణ సత్యాగ్రహానికి ఎంతో బలమిచ్చినది. దండీ సత్యాగ్రహంలో పాల్గొనడానికి బొంబై తాజ్‌మహల్ హోటల్‌నుంచి సరోజినీదేవి నేరుగా వచ్చేసింది. దేశమంతటా సముద్రపు కోస్తా ప్రదేశాలన్నింటా విజృంభించిన ఈ సత్యాగ్రహం బ్రిటిష్ ప్రభుత్వాన్ని కదలించినది.

అంతట గాంధీ- ఇర్విన్ సంధి జరిగినది. శాంతియుతంగా, విదేశీ వస్త్ర, వస్తు బహిష్కరణతో సహా, కాంగ్రెస్ కార్యక్రమాలన్నీ జరగడానికి గల ప్రభుత్వపు ఆటంకాలు తొలగినవి. వెంటనే, రెండవ రౌండ్‌టేబిల్ సమావేశానికి (ఈ సమావేశాలలో భారత దాస్య విమోచన విధానాలను, సమస్యలను ఈ బ్రిటిష్ అధికార్లు, భారతదేశంనుంచి ఆహ్వానితులు చర్చించేవారు) గాంధీజీని, సరోజినీ దేవినీ, ఆనాటి హిందూ పత్రిక సంపాదకుడైన ఎ. రంగస్వామయ్యంగారునూ రమ్మని పిలిచినారు. తమ కర్తవ్యాన్ని నెరవేర్చి ఆ ముగ్గురు తిరిగి వచ్చారు. గాంధీజీ ఓడ దిగకముందే, వారిని అరెస్టు చేశారు. గాంధీ-ఇర్విన్ పాక్ట్ భగ్నమైనది. 1932 లో ఎవరికివారే నాయకులై మళ్ళీ సత్యాగ్రహాన్ని

నడిపించవలెనని కాంగ్రెస్ ఆదేశమిచ్చినది. శాసనాన్ని ధిక్కరించిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశం కలకత్తాలో జరిగింది. అపూర్వ సంఘటన! ఆ సమావేశానికి నెల్లి సేన్‌గుప్త అధ్యక్షత వహించినది. బ్రిటిష్ ప్రభుత్వ ద్రోహ చర్యను ఖండిస్తూ తీర్మానించినారు.

ఈలోగా, 1931 లో కరాచీలో కాంగ్రెస్ సమావేశం జరిగింది. సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్ (వల్లభాయ్ పటేల్ అనటం తప్పు), ప్రధానమైన పౌర హక్కుల (Fundamental Rights) తీర్మానాన్ని ఆమోదించినారు. భగత్ సింగ్, రాజగురు, సుఖదేవ్ గార్లను ఉరి తీసినందుకు నిరసనగా పలువురు ప్రముఖులు ఆ సమావేశంలో గర్జించి, గాంధీ-ఇర్విన్ సంధిని ఒప్పుకోలేదన్నారు. కాని, చివరకు ఆది గాంధీజీ ద్వారా జరిగింది గనక సంధిని అందరు ఆమోదించి నారు.

ఆ సమావేశంలో ఆదాయాలలో మరీ ఎక్కువ తక్కువ లుండరాదనే అభిప్రాయంతో అత్యధికమైనదానికీ అతి కనీసమైనదానికీ మధ్య ఒక నిష్పత్తిని సూచించినారు.

వాస్తవమైన సమసమాజ దృష్టిగల వారెవరైనా మన రాజకీయాలలో ప్రాధాన్యం వహిస్తే, ఆ నిష్పత్తిని గూర్చి ఆలోచిస్తారేమో?

* * *

1932 ఉద్యమాన్ని సమీక్షించి ముందుకు వెళ్ళేలోగా భగత్‌సింగ్ వ్యక్తిత్వాన్ని తెలుసుకుందాం. [illegible] ఉత్తరప్రదేశ్‌లో, పంజాబ్‌లో, బెంగాల్‌లో [illegible] Terrarists (భయంకరవాదుల) ఉద్యమం చెలరేగింది. అందులో ఒకనాడు భగత్‌సింగ్ ప్రముఖుడు

బెంగాల్‌లో యుగాంతర్, అనుశీలన సమితి పేర్లు గల భయంకర వాదుల సంస్థలు బలంగా పుంజుకున్నవి. యువతీ యువకులు ధైర్యస్థైర్యాలను త్యాగశీలాన్ని ప్రదర్శించి ప్రజలకు ఆరాధ్యులైనారు. వీరి చర్యలు దేశీ [illegible] రికి తెలిసినవే,

సైమన్ కమిషన్ గో బాక్ ఉద్యమంలో లాలాజీ గుండెపైన పడిన లాఠీ దెబ్బలను ప్రస్తావించి (ఆ దెబ్బలు పడిన తర్వాత కొంత కాలానికి పంజాబ్ కేసరి మరణించినారు) ఇందుకు జవాబు చెప్పేవారు దేశంలో లేరా అని కీ. శే. చిత్తరంజన్‌దాస్ సోదరి వాసంతి గర్జించేసరికి భగత్‌సింగ్ ప్రభృతులు రంగంలోకి దిగినారు. పిమ్మట, ఆనాటి సెంట్రల్ అసెంబ్లీ కేంద్ర శాసనసభలో ఆసీనులై వున్న సైమన్ సప్తకాన్ని చంపడానికి రివాల్వర్లు తీసుకుని భగత్‌సింగ్, భటుకేశ్వరదత్ వచ్చి, తమ సంకల్పం నెరవేరితే ప్రక్కనవున్న మన జాతీయ నాయకుల ప్రాణాలు సైతం వుండవని భావించి, రక్షకభట దళానికి వశం కాక తప్పలేదు. ఆ లోగా తమ ఆశయాలను ప్రకటించారు. వారిద్దరు వశమైన పిమ్మట, లాలాజీని చంపినందుకు ప్రతీకారంగా సాండర్స్ అనే ఇన్‌స్పెక్టరును చంపినవారు, పోలీస్ శక్తుల తీవ్రమైన ఆరాటంతో కూడిన వేటలో, వశమైనారు. రహస్యంగా విచారణ జరిగింది. ఈలోగా, [illegible] పరిస్థితులకు నిరసనగా జతీన్‌దాస్ ప్రాయోపవేశం జరిగింది.

* * *

లాహోర్ కుట్ర కేసులో, బెంగాల్ భయంకర వాదులతో, శిక్షితులు-డిటెన్యూలైన వారి ప్రభావం ద్వారా, ఆయా కారాగారాలకు వెళ్ళిన సత్యాగ్రహులనేకులు యువకులు భయంకరవాదులై, మద్రాసు కుట్ర కేసు, కాకినాడ కుట్ర కేసులలో బందీలైనారు.

కాకినాడ కేసులో ముఖ్యమైన ముద్దాయి ప్రతివాది భయంకర వెంకటాచారి, ఓరుగంటి రామచంద్రయ్య, కాకరాల కామేశ్వరరావు ప్రభృతులు మిగిలిన ముద్దాయిలు. ఈ రచయిత మద్రాస్ కేసులో ఒక ముద్దాయి.

భయంకర వాదులేకాదు కార్మిక సంఘ నాయకులన్నా బ్రిటిష్ ప్రభుత్వం హడలిపోయేది. విప్లవకారులు క్రింద వారిని చిత్రించి, కాన్పూరు కుట్ర కేసును బనాయించినారు. న్యాయవాదులైన జాతీయ నాయకులు ముద్దాయిలకు వాకౌట్ చేసినారు. శివనాథ బెనర్జీ, ఆంగ్లేయులైన ఫిలిప్‌స్ప్రాట్, బ్రాడ్లీగారలు యం. యన్. రాయ్‌తో సహా ఇందులో ముద్దాయిలు. రాయ్ చిక్కలేదు. ఆయన విదేశాలన్నీ తిరిగి విఖ్యాతుడై స్వదేశానికి రహస్యంగా వచ్చింది కనిపెట్టి బ్రిటిష్ అధికార్లు పట్టి బంధించినపుడు ఆ కేసులో ముద్దాయిగా శిక్షించినారు.

మద్రాస్ కేసులో కానూరి రామానంద చౌదరి, జతీన్‌దాస్ వలెనే 61 రోజులు నిరాహారదీక్ష బూని, జైలు అధికార్లను లొంగదీసి, దీక్షను విరమించినాడు. హైదరాబాద్ నగరంలో ఆయన ప్రస్తుతం నివసిస్తున్నాడు.

* * *

1932 సత్యాగ్రహోద్యమంలో కాకలుదీరిన స్వాతంత్ర్య సమరయోధులు, పండితులు, విద్యార్థులు, అన్ని తరగతులవారు, ముఖ్యంగా సామాన్యులు (పామరులనబడేవారు) తమ ప్రతాపాన్ని ప్రదర్శించి పాల్గొన్నారు. కాని, అమిత కఠినమైన విధానాన్ని అనుసరించి బ్రిటిష్ ప్రభుత్వం ఆ ఉద్యమంపై విరుచుక పడినందువల్ల, తాత్కాలికంగా ఉద్యమం చల్లారినది.

ఈ లోగా దేశంమీద కార్మిక కర్షక జనావళిని ఆకర్షిస్తేగాని భారత స్వాతంత్ర్య ఉద్యమం బలిష్ఠతరం కాదనే అభిప్రాయం ఉద్యమంలో పాల్గొన్న యువకులలో కలిగింది. నాసిక్ జైలులో శిక్ష అనుభవిస్తూనే, అట్టి భావాలు కలవారు కలిసి ఒక కూటమిని కాంగ్రెస్‌లో ఏర్పరచవలెనని పథకం వేశారు. జయప్రకాశ్, పట్వర్ధన్, అశోకమెహతా, పురుషోత్తమదాస్, త్రికందాస్, రామ మనోహర్ లోహియా ప్రభృతులు ఆ పథకానికి నిర్మాతలు. జైళ్లు బాసగానే కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆ పథకం ప్రకారం ఏర్పాటైనది.

ఆ విధంగా రష్యా ఇండియాలో ప్రవేశించినది! 1917లో రష్యాలో జరిగిన కార్మిక విప్లవ ప్రభావం ప్రపంచమంతటా ప్రసరించినది. ఆ విధంగా మనకూ సంక్రమించినది. అంతకు పూర్వం అమెరికన్ విప్లవ ప్రభావం మూలంగా దాస్య విమోచనం-ప్రజాస్వామిక రాజ్యం-జాతిసమత్వపు సిద్ధాంతాలు-ఇటువంటి భావాలన్నీ మన జాతీయోద్యమంలోకి ప్రవేశించినవి. ఐర్లాండ్ పోరాటం మన టెర్రరిస్టు (భయంకరవాద) ఉద్యమానికి ఎంతో బలాన్ని చేకూర్చింది. ఏ దేశంలో ఏ పొంగు వచ్చినా అది ఇతర దేశాలపై అనువైన సమయంలో ప్రత్యక్షం కాకమానదు. ప్రపంచంలోని ఉద్యమాలన్నీ అటువంటివే.

టాల్‌స్టాయ్ (రష్యా)-రస్కిన్ (ఆంగ్లసీమ)-తోరో (అమెరికా) గాంధీజీని ఎంతగా ప్రభావితం చేసిందీ మనమెరుగుదుము. అట్లే కార్ల్‌మార్క్స్, లెనిన్ వంటి వారల ప్రభావం మన దేశంలోని యువ విద్యార్థులపై, సామాన్య జనంపై, మధ్య తరగతిలోని అనేకులపై పడింది, పడక తప్పదు. కాలక్రమేణా అదే ఎర్రటి మార్గంగా, కమ్యూనిస్టు పద్ధతిగా దేశానికి పరిచయమైనది. ఆ రెంటికీ మధ్యే మార్గం ఇదివరకు ప్రస్తావించబడిన సోషలిస్ట్‌పార్టీ ప్రబోధించిన సోషలిస్టు మార్గం పైనుదాహరించిన కోవలు మన జాతీయోద్యమంలో వహించిన పాత్రలు అధ్యయనం చేయదగినవి. అందరిధ్యేయం స్వరాజ్యమే, అందరి ఆశయం ఉత్తరోత్తరా ప్రజలందరు సుఖంగా వుండే హెచ్చుతగ్గులులేని సమాజం. బ్రిటిష్, అమెరికన్, రష్యన్ ప్రభావాలు తరతమ భేదాలతో అందరిమీదా ప్రసరించినవి.

1932 ఉద్యమం తర్వాత, పైచేయి నాదే అని పైకి చెప్పగలిగినప్పటికీ లోలోపల బ్రిటిష్ ప్రభుత్వం హడలిపోతూనే వుండినది. ఆలోచించి ఒక తంత్రం పన్నింది. 1935లో ఇండియా ప్రభుత్వ చట్టం సిద్ధంజేసి, దాని ప్రకారం ఎన్నికలు జరిపిస్తాం, ప్రజా ప్రతినిధులు అధికారానికి రావచ్చును అని ప్రకటించింది. అందులో ఒక పేచీ వచ్చింది. ‡ ముఖ్యమంత్రి (అనాడు రాష్ట్ర ముఖ్యమంత్రిని ప్రధానమంత్రి అని పిల్చేవారు) గవర్నర్ శాసనానికి లోనై వుంటాడా? కేంద్రాన ప్రధాని వైస్రాయి లేక గవర్నర్ జనరల్ శాసనానికి లోనై వుంటాడా? ఆ భాగాలను ఏవిధంగానైనా తప్పించి, మంత్రివర్గాలు తగినంత స్వేచ్ఛతో ప్రవర్తించగల మార్గం అన్వేషిస్తే మంచిదని మన జాతీయవాదులంతా అన్నారు. గవర్నర్ల, గవర్నర్ - జనరల్ గారలకు చట్టంలోవున్న విపరీతాధికారాలు అమలులోకి రావనే జవాబు అందగానే, కేంద్రాన - రాష్ట్రాలలో ప్రజాప్రతినిధులు (కాంగ్రెస్‌వారి) మంత్రిత్వాలు ఏర్పడినవి. పరిపాలన దేశమంతటా కొత్త చట్ట ప్రకారం బాగానే నడిచినవి. మధ్యలో వచ్చిన కొన్ని వివాదాలు మధ్యలోనే పరిష్కారమైనవి

ఇంతలో 1939లో రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. సంపూర్ణమైన స్వరాజ్యం రానిది భారతీయులు ఆ యుద్ధంలో పాల్గొనేది లేదన్నారు. కాంగ్రెస్ మంత్రివర్గాలన్నీ దిగిపోయినవి. 1940లో వ్యక్తి సత్యాగ్రహం జరిగింది. 1942

దాకా అన్నికోవల స్వాతంత్ర్య సమరయోధులు పోరాటంలో పాల్గొనివున్నారు. రష్యా మీదకు హిట్లర్ దూకినందువల్ల ప్రపంచ యుద్ధ స్వరూపం మారిందనీ, అది ప్రజాయుద్ధం ఐందనీ మన కమ్యూనిస్టు సోదర సోదరీమణులు భావించి, ఆ ప్రకారంగా నడుచుకున్నారు. అంతకుముందే, ఫాసిస్టులకు ప్రజాస్వామిక వాదులకు జరిగే యుద్ధంలో, ఫాసిస్టులకు అనుకూలమైన పని మనం చేయకూడదని, శ్రీ అరవిందయోగి, మహామేధావి యమ్. యన్. రాయ్, అణగద్రొక్కబడి వున్నవారి చాంపియన్‌గా తన్నుతాను దిద్దుకున్న అంబేద్కర్ భావించారు. అప్పుడు కమ్యూనిస్టులు ఆ వాదాన్ని అంగీకరించలేదు. కాంగ్రెస్‌వారి వ్యక్తి సత్యాగ్రహం కంటె తీవ్రంగా ఆందోళన చేసి జైళ్ళు నింపినారు. కానీ, స్టాలిన్-హిట్లర్ సంధి భంగమై, జర్మన్ దూకుడు రష్యామీదకు ఆరంభం కాగానే, ప్రపంచయుద్ధ స్వరూపం మారిందన్నారు.

ఇక, బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించే పోరాటంలో కేవలం అహింసాయుతంగా, గాంధిజీ మార్గాన్ని అనుసరించే సుచేతా కృపలానీ వంటివారు, దెబ్బకు దెబ్బతీసి ప్రభుత్వాన్ని స్తంభింపజేస్తూ జరగక ఉద్యమాన్ని సాగించవలెనని జయప్రకాశ్ వంటివారు మిగిలినవారంగాగు ఎవరి యిష్టానుసారం వారు పోరాడినారు.

ఆవల మన సరిహద్దులకు దూరంగా నడిచిన జైహింద్ సైనిక ఉద్యమం కూడా కలిసివచ్చింది. నేతాజీ బోస్ తన శక్తులతో ఇంఫాల్ దాకావచ్చి, భారత జాతీయ యోధుల బృందాల నాయకులను కలిసివుంటే, చరిత్ర మరొక విధంగా వుండేది. కాని, అది అసంభవమైనపుడు, అధికారాన్ని మనం వశపరచుకోవడం గాక మనకు బ్రిటిష్‌వారు అధికారాన్ని అప్పగించి, దేశాన్ని రెండుముక్కలు చేసి వెళ్ళేదాకా పరిస్థితి వచ్చినది.

సంస్థానాలను ఏకరాజ్యంలోకి కల్పడం, భూదాన గ్రామదాన ఉద్యమాలు, ప్లానింగ్ రావడం, పారిశ్రామికంగా, వ్యవసాయికంగా ముందడుగు వేయవలెననే తపన-ఇవన్నీ స్వతంత్ర భారతంలో జరిగిన పనులు.

## నైజాం ప్రజల పోరాటం

బ్రిటిష్ ఇండియాలో గాంధేయ, సోషలిస్టు, కమ్యూనిస్టు పంథాల ననుసరించి ఉద్యమాలు నడిపిన వారికి, స్వదేశీ సంస్థానాలలో ఏ పంథా ననుసరించి ఉద్యమం తీయటోయినా ఎంత అపాయకరమైన పరిస్థితిలోకి కార్యకర్తలు తల దూర్చవలసి వస్తుందో, సామాన్య ప్రజలు ఎంతటి ప్రతీకార హింసాకాండకు గురికావలసివస్తుందో మామూలుగా తెలుసుకోవడం అసంభవం. తమ బాధలు తామను భరించారు, కాని సంస్థానాలలోని కార్యకర్తల బాధలు వారికి తెలియడమే అసాధ్యమైపోయింది.

కాని, బ్రిటిష్ ఇండియా నాయకులలో కార్యకర్తలలో యువశక్తితో ఉత్సహించే కొందరు సంస్థానాల ఉద్యమాలను పట్టించుకున్నారు. అంతట, అందరికీ వాటినిగూర్చి కొంతవరకు తెలిసింది. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతా రామయ్యగారి అధ్యక్షతన సంస్థానాల ప్రజాఉద్యమాల సమితి ఒకటి ఏర్పడినది.

సంస్థానాధీశుడు సామంతుడు, అతడికి బ్రిటిష్ ప్రభుత్వపు అండపుండ లుండెడివి. అందువలన బాధ్యతాయుత ప్రభుత్వం కోరినా, ఇతరత్రా పోరాడినా, విపరీతమైన శక్తియుక్తులు కార్యకర్తలకు అవసరమైవుండేవి. అందువలన, విమోచన సమరం నెగ్గవలెనంటే సాయుధపోరాటమే శరణ్యమనిపించినది.

నైజాం ప్రజల విమోచనానికి, అంతకుముందుగా ఆత్మరక్షణకు సాయుధశక్తిని కార్యకర్తలు పొందవలసి వచ్చినది.

కూడని పనులు చేసినపుడు ఎదిరించడానికైనా, కావలసిన పనులకు ఆందోళన చేయడానికైనా అతి సాహసంతో ఉద్యమాలలో పాల్గొన్నవారు. రంగం లోకి దూకవలసివచ్చేది. ప్లీడర్స్ ప్రొటెక్షన్ కమిటీ చర్య ఇందుకు దృష్టాంతం చివరకు రజాకార్ల పీడ అధికమైనపుడు సంస్థానపు మారుమూలల్లో ప్రజాదళాలు సైనికదళాలవలె ప్రవర్తించి ఆత్మరక్షణ చేసుకుని, శత్రుదళాలకు భయంకరమై, ప్రజల మధ్యలోవుండి, ప్రాణాలొడ్డి పోరాడినవి.

ఆ దళాలలో అన్ని తరగతుల వారుండినారు. అన్ని తరగతుల ప్రజలు దళాలను బలపరచినారు. బాలకృష్ణ, నారాయణబాబు, జగదీష్, గంగారాం పాలంకోవ్, దత్తాత్రేయ, ముదఖేడ్కర్ ఉమ్రాబామాషా ధన్‌జ్‌సేత్, నాగనాథ పరంజపే, మోహన్‌శర్మ, అనంతభావేరావ్, వందేమాతరం రామచంద్రరావు, యమ్. రామారావు, ఆర్టిలరీ లక్ష్మినారాయణ సుబేదార్, చీఫ్ ఆర్మర్ హీరాలాల్, ఇమ్మడి రాజరెడ్డి, ఉల్వాంగల వెంకటనరసయ్య, చింతపూడి రామిరెడ్డి, షోయాబ్, మహమ్మద్ ఇస్మాయిల్, ఇరిసెట్టప్ప పంకే, బాపురావు పటేల్, రామారావ్ పాటిల్, నాగన్న, లపంగ అచ్చన్న, లక్ష్మికాంతరెడ్డి, ప్లీడర్స్ ప్రొటెక్షన్ కమిటీ వీరులు జె.వి. నరసింగరావు, గోపాలరావు ఎక్బోటే, కాశీనాథరావు వైద్య సదాశివరావు, వసంతరావు ముద్‌ఖేడ్కర్, ధరణీధరసంఘీ, వినాయకరావు విద్యాలంకార్, బూర్గుల రామకృష్ణారావు, స్వామి రామానంద తీర్థ, హయగ్రీవాచారి, నారాయణరెడ్డి, అప్పారావు పటేల్, కస్తూరియలాల్, చన్‌పిర్, మానికరావు ముంలే, దత్‌గిర్, యశ్వంతరావు సాయిగాంకర్, డాక్టర్ చన్నప్ప, గ్యానోబా, సదాశివధగే, తులసీరాం పటీల్, రాజప్ప పటీల్, గంగారాం ధగే, నివృత్తి రావ్ కదమ్- వీరిలో అనేకమంది అమరవీరులు.

ఉమ్రీ బ్యాంక్‌పై దాడి రక్తరంజితమైన భైరవుని పల్లె, రేణుకుంట పోరాటం, షహీద్ షోయబుల్లా ఖాన్ అపూర్వమైన త్యాగఘట్టం (మహా క్రూరమైన హత్యచర్య), గోర్టలో హత్యాకాండ, బీబీనగర్ దోపిడీ, పి.సి.పి ఏర్పాటు, కారతీయ మహానగరంలో జరిగిన చారిత్రక ఘటన, గెరిల్లా రైతుదళాల చర్యలు, రామ్‌నూట్‌లో పోరాటం, బాలూర్ వడిసెలకారులు.

ఇంగ్లీషువారితో నైజాం ప్రభుత్వం కలిసిన 1800 సంవత్సరం నుంచీ నైజాం ప్రజలవైపు నుంచీ హైదరాబాద్ నగరంలోనూ ఇంకా ఇతర ప్రాంతాల లోనూ తిరుగుబాట్లు ఏదో ఒక విధంగా అన్ని తరగతుల్లో నుంచీ జరుగుతూనే వుండినవి. ఇంగ్లీష్‌వారికీ మహారాష్ట్రీలకు జరిగిన యుద్ధంలో, సిపాయీ తిరుగుబాటు (మన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమని ప్రసిద్ధిపొందిన పితూరీ) లో, ఆ తర్వాత కూడా అనేకమంది యోధానుయోధులు హిందువులు, ముస్లిములు ప్రాణాలొడ్డి సాయపడినారు.

ఇంగ్లీష్‌వారికీ మహారాష్ట్రులకు జరిగిన యుద్ధంలో బేరార్ గవర్నర్ ధ్వజమెత్తినాడు. నైజాం ప్రభుత్వం ఇంగ్లీష్‌వారికి తోడ్పడడం గవర్నరైన మహీపతిరామ్‌కి గిట్టలేదు. సైనికమైన తిరుగుబాటు చేసినాడు.

1808 లో బొలారంలోని సైన్యాలలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా తిప్పు డానికి సాహసించిన నూరుల్-ఉమ్రా, రావురంభా నింబాల్కర్ (ఇద్దరూ జాగీర్దార్లు) తమ జాగీరు గ్రామాలలో నిర్బంధింపబడినారు. 1817 లో మహా చారిత్రాత్మకమైన మూడవ మహారాష్ట్ర యుద్ధంలో, ఇంగ్లీష్‌వారి పక్షాన్ని నైజాం ప్రభుత్వం వహించగా, నైజాం సైన్యాలు ఎదురు తిరిగినవి. వాటి నాయకుడు సర్దార్‌ఖాన్ కోటేజాం పూనావెళ్ళి, పేష్వాలతో కలిసి. పోరాడి, యుద్ధంలో మరణించినాడు. 1839 అనంతరం వహాబ్ ఉద్యమము వ్యాపించగా, బ్రిటిష్ వ్యతిరేక భావం ప్రజ్వరిల్లింది. కర్నూల్ నవాబ్ గులాం రసూల్‌ఖాన్, బ్రిటిష్ గులాం నాసిరుద్దీన్‌ను దించి ముబారిజుద్దౌలాను నైజాం గద్దెపై ఎక్కించవలెనని ఉద్యమంలో పాల్గొన్నాడు.

1856 లో ఔరంగబాద్‌లోని అరబ్బులు తిరుగుబాటు చేసినారు. అది జయప్రదమైనది. పిమ్మట దీనిని అణచడం అధికార్లకు అమిత కఠినమైనది. 1857 జనవరిలో నానా సాహెబ్ షేష్వాను బీదర్‌జిల్లాలోని సర్ఖేడ్ గ్రామ పట్వారీ రంగారావు ద్వారా ఒక లేఖను పంపిన పర్యవసానంగా రాజా దీప్ సింగ్ జాగీర్ ప్రభుత్వాధీనమైనది, మూడు సంవత్సరాల శిక్ష పడినది; సర్దారు ద్దౌలా స్థిరచరాస్తులు జప్తీయైనవి, యావజ్జీవ కారాగార శిక్ష పడింది (విధించ బడింది). రంగారావును అదాలత్‌లో బ్రిటిష్ కోర్టులో విచారించి, మరణశిక్ష విధించినారు.

1858లో పై[illegible]పూర్‌వాసి గోవిందరావు దేశపాండే ఔరంగాబాదులో 2000 మంది భిల్లుల సేనను సమకూర్చగా, బ్రిటిష్ సైన్యానికీ ఈ సేనకూ మధ్య సంకుల సమరం జరిగినది. తాంతియాతోపే అజంతా నగర ప్రవేశం చేసినపుడు రోహిల్లాలు సాయపడినారు. పిమ్మట బ్రిటిష్‌వారు ఘోర యుద్ధంలో తరిమివేసిన రోహిల్లాలను నర్జన్ జిల్లా బస్మత్ తాలూకాలోని ఔలా జాగీర్దార్ పీర్ఖాదా ఆదుకున్నాడు. పిమ్మట జరిగిన పోరాటంలో బ్రిటిష్‌వారు రోహిల్లాలను క్రూరంగా

అణచి, పీర్జాదాను యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించినారు. 1858 జూన్‌లో భీమరావ్‌దేశాయి రాయచూరులో సైన్యం సమకూర్చుకుని కొప్పల కోటను స్వాధీనం చేసుకున్నాడు. ఇంగ్లీషుసైన్యాలు చేసిన దాడిలో ఆయన హతుడైనాడు 150 మంది సైనికులు మరణించినారు. మరి కొందరికి మరణశిక్ష పడింది.

ఆ కాలంలో నానా సాహెబ్ పేష్వా తాంతియా తోపేల వార్తాహరులు నైజాం రాజ్యంలో సంచరిస్తూ వుండిరి. షోరాపూర్ రాజును అపలి నుంచి సందేశం తెచ్చిన ఒకర్ని బంధించి, మరణశిక్ష విధించినారు అధికార్లు.

నానాసాహెబ్ బంధువైన రావుసాహెబ్ పేష్వా దగ్గర సేనలను సమకూర్చుకోవడానికి వచ్చినప్పుడు అతిథ్య మిచ్చిన ధీర పురుషుడు వెంకట్రావ్ జాగీరును అధికార్లు స్వాధీనం చేసుకున్నారు.

ఆదిలాబాద్ జిల్లాలోని గోండ్లను తీసుకుని ధ్వజమెత్తినందుకు రాంజీ గోండను నిర్మల్‌కు తెచ్చి, ఒక చెట్టుకు ఉరితీసినారు అధికార్లు. ప్రజలు ఆ చెట్టుకు రాంజీగోండ్ వృక్షం అని పేరు పెట్టుకొన్నారు. 1848 లో సతారా నుంచి వచ్చి ఔరంగాబాద్, బీదర్, భీర్ జిల్లాలలో దేశభక్తులు ప్రజ్వరిల్లినారు. 1867 లో జంగ్ బహద్దర్ రాంరావ్ అష్టిలోని గడీని వశపరచుకున్నాడు. అతని సైన్యం ఓడిపోయిన తర్వాత, అతణ్ణి అధికార్లు బంధించి, ద్వీపాంతరవాస శిక్షను విధించినారు.

1870 లో జమాలుద్దీన్ ఆఫ్గన్ హైదరాబాద్‌కు వచ్చి ఆసియా సమైక్య వాదాన్ని ప్రబోధిస్తూ చైతన్యాన్ని కలిగించినాడు. స్వాతంత్ర్యోద్యమ రెండవ దశలో పోరాడిన వారిలో చాలామంది ఇతర రాష్ట్రాల నుంచి వచ్చి స్థిరపడిన వారు. అఘోరనాథ్ చటోపాధ్యాయ (హరీంద్ర. సరోజినీదేవి గారల తండ్రి), ముల్లా అబ్దుల్ ఖయ్యూం, రామచంద్రపిళ్ళె, సయ్యద్ అఖిల్ పాత్రలు గొప్పవి.

తుర్రేబాజ్ ఖాన్ నాయకత్వాన హైదరాబాద్‌లోని బ్రిటిష్ రెసిడెన్సీ మీద పట్టపగలు 1867 జులై 17 న దాడి జరిగినది- మౌల్వీల ప్రోత్సాహంతో చైతన్యం పెరిగినది- షోలాపూర వెంకటప్పనాయక్ సాహసం రెసిడెంట్

గవర్నర్ జనరల్‌పై నైజాం దర్బార్‌లో జహంగీర్ ఖాన్ చేసిన హత్యాప్రయత్నం రంప, రేకపల్లె తిరుగుబాట్లు-జవ్వాద్ హుసేన్, భూపేశర్ల సాహస కృత్యములు ఎన్నదగినవి. విప్లవ వీరులకు నిలువ నిచ్చిన నీడగా ప్రసిద్ధి పొందినందుకు మూలమైన కొన్ని మహోజ్వల ఘట్టము లున్నవి. విష్ణు పింగ్లే, కూర్థింజీపైన బాంబు వేసిన సేనాపతి పత్ ఆశ్రయం పొందినారు, 1933 కాకినాడ కుట్ర కేసు పెద్ద ముద్దాయి భయంకరాచారికి కేసుకు పూర్వం, ఇక్కడే ఆశ్రయం లభించినది.

స్వాతంత్ర్య సమరంలో కొన్ని ఘట్టాలలో కీలకమైన పాత్ర వహించిన కేశవరావు కోరట్‌కర్, వామన్ నాయక్, మాడపాటి హనుమంతరావు గారలు చిరస్మరణీయులు. తిరుగుబాట్లలో ఇంకా ఎన్నో ఉజ్జ్వల ఘట్టము లున్నవి.

ఈ చరిత్రను శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు తెలంగాణాలో జాతీయోద్యమాలు అనే గ్రంథంలో క్లుప్తంగా వివరించినారు. (లభ్యం ఆంధ్ర సారస్వత పరిషత్తు పుస్తక విక్రయశాలలో, వెల రూ. 2-50పై.) ఇందులో విశాలాంధ్ర రాష్ట్రం నిర్మాణమయ్యే వరకు జరిగిన ఐతిహాసిక, సాహిత్య ఘట్టము లన్నీ వివరింపబడినవి. దీని ద్వితీయ ముద్రణ 1967లో జరిగినది. పుస్తకం చిన్నదే కాని, విషయములు గంభీరమైనవి.

1929 నుంచి 1979 వరకు యాభై సంవత్సరాల జ్ఞాపకాలు అనే గ్రంథంలో శ్రీదేవులపల్లి రామానుజరావుగారు దేశంలోని, రాష్ట్రంలోని చారిత్రక, రాజకీయ, సాహిత్య రంగములలోని స్మరణీయమైన అనేక అంశాలను తెలియజేసినారు. దీని ప్రచురణ 1981లో. దొరుకుచోటు ఆంధ్ర సారస్వత పరిషత్తు బుక్ డిపో, బొగ్గులకుంట, హైదరాబాద్-500 001. వెల రూ. 16/-

నైజాం ప్రజారంగాన ఆవిర్భవించిన మహాశక్తులను తెలుసుకోవలెనంటే సంపూర్ణంగా పై మూడు పుస్తకాలు చదువదగినవి. ఆరంభిస్తే ఆఖరు దాకా చదవడం ముగియదు. అంత ఆసక్తికరంగా, చదువరికి ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగించే విధంగా వున్నవి. ఈ గ్రంథాల రచయితలైన ఖండేరావు కులకర్ణి, దేవులపల్లి రామానుజరావుగారలు తమ తమ కార్యరంగాలలో సిద్ధహస్తులు, వినయభూషణులు వీరికి వీరేసాటి.

ఇంకా వినండి. నల్లగొండలో 'నాజీశక్తుల దౌర్జన్యాలింకెన్నాళ్ళు' అని కాళోజీ గర్జిస్తూ ప్రశ్నించారు. నిజాముకు వ్యతిరేకంగా సాగిన తెలంగాణా ఆంధ్రోద్యమంలో పాల్గొని, తెలంగాణ కోటిరత్నాలవీణ, తెలంగాణ రైతుదే-ముసలి నక్కకు రాజరికమ్ము దక్కునే' అని దాశరథి కృష్ణమాచార్యులు గర్జించినాడు. 'నల్లగొండలో నాజీ శక్తుల దౌర్జన్యాలింకెన్నాళ్ళు' అని కాళోజీ గర్జిస్తూ ప్రశ్నించాడు.

నైజాముకు వ్యతిరేకంగా సాగిన రైతాంగ సాయుధ పోరాటం ఉత్తేజంతో రచింపబడిన అనేక గేయాల్లో 'బండెనుక బండిగట్టి-పదహారు బండ్లుగట్టి ఏ బండ్ల పోతావు కొడుకో నైజాము సర్కారోడ' వంటి మచ్చు తునకలు. వీటిలో అనేక గేయాలు అజ్ఞాత కర్తృకాలు. ఈ పోరాటం ఉత్తేజంతో, వచ్చిన వాటిలో సోమసుందర్ వజ్రాయుధం, ఆరుద్ర త్వమేవాహమ్ వంటి కావ్యాలు, అళ్వారుస్వామిగారి ప్రజల మనిషి, గంగు, వంటి నవలలో కూడా వున్నవి.

కార్ల్ మార్క్స్-ఏంగెల్స్ రచనలు, మొదటి సామ్యవాద అంతర్జాతీయ సంస్థ నిర్మాణం, చివరకు లెనిన్ నాయకత్వాన రష్యాలో గెల్చి, నిల్చిన విప్లవం ప్రపంచంలో బ్రహ్మాండంగా మేధావులను, పీడిత ప్రజలను ఆకర్షించినవి. ప్రపంచంలోని 'పతితులను భ్రష్టులను, బాధాసర్పదష్టులను' కేకవేసి పిల్చి, 'ఏడవకండి ఏడవకండి' అని ఓదార్చి, సమసమాజ స్థాపనకై ప్రపంచమంతటా కృషి చేయడం కమ్యూనిస్టు ఉద్యమ లక్ష్యం. ఈ శతాబ్దం మూడో దశాబ్దంనుంచి ఉద్యమం పుంజుకుంది. ఇదే సందర్భంలో ఎమ్. ఎన్. రాయ్ ఉద్యమంకూడా గమనించదగ్గది. ఇరవయ్యో శతాబ్దపు నాలుగవ దశాబ్దంనుంచి ఉద్యమం.

దేశభక్తి, రాజకీయోద్యమాల ప్రేరణతో ప్రపంచంలో బ్రహ్మాండమైన సాహిత్యం వచ్చింది. మనదేశంలో రాష్ట్రంలో కూడ అలాంటి సాహిత్యం వచ్చింది. దేశభక్తి కవిత్వం బాగావచ్చింది. దేశభక్తి-గాంధీ స్వప్నం నిజమైతే సంభవమయ్యే పరిస్థితిని గూర్చిన భవిష్యద్వాణి-ఇవన్నీ మన కండ్లకు కట్టినట్లు వివరించిన మకుటాయమానమైన గ్రంథం. నవల, 'మాలపల్లి లేక సంఘ

విజయము'. అని రూపవాణి వంటిదైతే నిర్మాత-అది శిల్పమైతే శిల్పి మాన్యశ్రీ ఉన్నత లక్ష్మీనారాయణ.

దేశభక్తి కలిగినపుడు పూర్వ వైభవాన్ని తలచుకుని గర్వించవలె ననిపిస్తుంది. దేశభక్తివల్ల కలిగిన నూతనోత్తేజంతో మన పూర్వచరిత్రలో మనం కళంకంగా భావించిన అంశాన్ని సవాల్ చేస్తూ నూత్న భావావేశాన్ని ప్రజలకు అందించవలెననిపిస్తుంది. ఈ కోవలకు చెందినవే దేశభక్తి గీతాలు. ఆంధ్ర రాష్ట్రోద్యమానికి దోహదంగా ఆంధ్రప్రశస్తి గీతాలుకూడా వచ్చాయి.

# తిరుగుబాటు ఉద్యమాలు

—ఏటుకూరి ప్రసాద్

సామాజిక శాస్త్రాన్ని అధ్యయనం చెయ్యడం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. అలా ఆసక్తికరంగా చెయ్యడంలో చరిత్రకారుల పాత్ర ఎంతైనా ఉంది. చరిత్రకారులు కొత్త భావనలనూ (Concepts) దృక్పథాలనూ ఆధారంగా చేసికొని యదార్థ ఘటనలను వివరిస్తూంటారు. ఒక్కో సందర్భంలో కొన్ని కొన్ని ఘటనలే కొత్త భావనలను రూపొందించడానికి చరిత్రకారుడికి తోడ్పడుతుంటాయి. ఆ భావనలన్నీ క్రమంగా సామాజిక శాస్త్రంలో భాగాలుగా ఇమిడిపోతాయి. కనుక చరిత్రకారులు కొత్త భావనలను రూపొందించడంలో ప్రధాన పాత్ర వహిస్తుంటారు. వారు ఆయా దశలను ఒక పద్ధతి ప్రకారం విభజిస్తూ, వివేచిస్తూ సమకాలిక ఘటనలకు అన్వయిస్తూ నిర్దిష్టమైన సామాజిక, ఆర్థిక అంశాలను ఆయా సాంఘిక దశల అభివృద్ధికి ఎలా తోడ్పడ్డాయో విశదీకరిస్తూంటారు.

సమాజం-మనకు కనిపించే వాటన్నిటికన్నా క్లిష్టమైంది. ఒక కాలంలో, ఒక దశలో ఒక దేశం యొక్క అభివృద్ధి క్రమాన్ని అంచనా వెయ్యాలంటే, సామాజిక జీవితంలోని అనేక భాగాల, కోణాల పొరల్లోకి ఎక్స్‌రే చూపు సారించాలి. వాటి పరస్పర సంబంధాలనూ, వైరుధ్యాలనూ అవగాహన చేసుకోవాలి. అంటే ఉత్పత్తి సంబంధాలు, సామాజిక నిర్మాణం, ప్రభుత్వ యంత్రాంగం, సామాజిక చైతన్య రూపాలవంటి అనేకానేక అంశాలను గుప్పిట్లో పెట్టుకోవాలి. పైన అనుకున్న పొరలూ-కోణాలూ-భాగాలూ అన్నీ అనేక అంతరువుల్లో నిండి ఉండటమే కాదు. ఒకటి మరోదాని మీద ఆధారపడి కూడా ఉంటాయి. అందుకని ఈ అంశాలన్నిటినీ తెలుసుకోకుండా ఒక దశలోని సామాజిక నిర్మాణాన్ని వివరించడంకానీ, ఆ దశలోని భిన్నాంగాలను అన్వయించడంకానీ సాధ్యమయ్యే పనికాదు.

నేటి సమాజం వర్గ భూయిష్టమైంది. అలాంటి వర్గ సమాజంలో పరస్పర విరోధ వర్గాలు తమతమ వర్గ స్వభావానుగుణంగా ప్రతి అంశాన్నీ తమ తమ గుణంగా ప్రతిబింబిస్తూంటాయి. కనుక తమ ఆర్థిక ప్రయోజనాలకనుగుణంగానే ఆయా వర్గాలు సైద్ధాంతిక, రాజకీయ పోరాటాలను తమ ఆలోచనల పరిధిలో ఆ కొలబద్దతోనే కొలుస్తూంటాయి. ఒకే సంఘటన ఇద్దరి చూపులో వేర్వేరు రూపాల్లో కనిపిస్తూంటుంది. తమ వర్గ ప్రయోజనాల కనుగుణంగానే ఆ చారిత్రక ఘటనలను వివరిస్తూ, అన్వయిస్తూ ఈ విరుద్ధవర్గాలు చరిత్రను నిర్మిస్తాయి. ఇంతటి క్లిష్టమైన సమాజాన్ని ఒకానొక నిర్దిష్ట కాలపరిధిలో, నిర్దిష్టమైన అంశాల మీద పరిశీలించడం ఎంత జటిలమో వేరే చెప్పనక్కర్లేదు.

మానవజాతి చరిత్ర అంతా వ్యతిరేకత, తిరుగుబాటులూ పోరాటాల చరిత్ర అని అందరకూ తెలిసిన విషయమే! చరిత్రపుటలు తిరగేస్తే వేద కాలంలో అంగిరసు కృష్ణుడు (ఋగ్వేదం) దానిసలను వెంటేసుకొని చేసిన తిరుగు బాట్ల ఉదంతాలు కనిపిస్తాయి. సాహిత్యంలో కూడా నాటి ప్రతిబింబం మిల్టన్ రచనల్లో చూడగలం. స్పార్టకస్ ఉదంతం తెలిసిందే. భారతదేశంలో బౌద్ధులు మఠాలూ వాటి కర్మకాండలమీద వ్యతిరేకత చూపించారు. జైనులు భోగలాలస ధనికుల దుర్విలాసాలమీద నిరసన ప్రకటించారు. లోకాయతులు పాలక వర్గ భావాలమీద, తాత్వికతమీద తిరుగుబాటు చేశారు. అలాగే క్రైస్తవ మతంలో జరిగిన అలాంటి తిరుగుబాట్ల పర్యవసానంగానే ఆర్థడాక్స్, కాథలిక్, ప్రొటెస్టెంట్ విభాగాలు ఏర్పడ్డాయి.

ఈ విధంగా జరిగిన ఘటనలన్నిటినీ ఏకరువు పెట్టడం సాధ్యమయ్యే పనికాదు. అయినా ఆయా అంశాల తాత్విక భాగాన్ని వివరిస్తూ కొన్నికొన్ని సంఘటలను చూపడానికి ప్రయత్నిస్తా. ముఖ్యంగా 1857 నుండి 1969 వరకూ జరిగిన ఉద్యమాలు-అందులోనూ తిరుగుబాటు ఉద్యమాల గురించి క్లుప్తంగా చెప్పడానికి కొన్నికొన్నిటిని మాత్రమే తీసుకుంటూ వివరించడానికి పూను కుంటాను.

వ్యతిరేకత, నిరసన, ఆందోళన, తిరుగుబాటు, విప్లవం అన్న పదాలు నేడు వ్యవహారంలో మనకు కనిపిస్తున్నాయి. వ్యక్తుల స్థాయినిబట్టీ వారి ఆలో చనల స్థాయినిబట్టీ, అవగాహన లోతునుబట్టీ వీటిని కొందరు సమానార్థకాలుగాను

వేర్వేరు అర్థాలున్న పదాలుగానూ అర్థం చేసుకుంటూంటారు. స్థూలంగా చూస్తే వాటికి భేదం లేదనిపించే ప్రమాదం ఉంది. కానీ సామాజిక పరిణామ దశల్లో వీటిని ఉపయోగించిన సందర్భాల ననుసరించీ, ఇందులో పాల్గొనే ప్రజారాశుల గుణాలననుసరించీ చూస్తే వీటన్నిటికీ భేదం ఉండటం సామాజిక శాస్త్రం ఒక పద్ధతిలో అధ్యయనంచేసేవాళ్ళకు గోచరిస్తుంది.

Protest, Rebel, Revolt అన్న పదాల ఆధారంగా నిర్వచించాలని చూస్తూ వీటిగున్న లాటిన్ పదాల మూలాల్లోకిపోతే ఒక్కొక్క పదం కాలక్రమేణా అర్థాన్ని మార్చుకుంటూ రావడం గమనించగలం. అలా శాఖాచంక్రమణంచేస్తూ పోకుండా నిరసన, తిరుగుబాటు, విప్లవం అన్న వీటిగురించి ఆలోచించడానికి ప్రయత్నించడం బాగుంటుంది.

నిరసన అన్నది ఇతరుల మాటలనుగానీ, చేతలనుగానీ అసంగీకారాన్ని తెల్పడం అనొచ్చు. ఇది కూడా మాటల్లోనూ, రాతల్లోనూ, చేతల్లోనూ వ్యక్తం కావచ్చు. ఇందులో వ్యక్తి నుండి గుంపులలో పరకు పాల్గొననూవచ్చు. ఇది ఒక రకంగా చూస్తే తన ఎదుట జరుగుతున్న అన్యాయాన్ని బట్టబయలుచేస్తూ అది సమాజానికి మంచిది కాదని చెప్పడం పరకే పరిమితం అయిఉండవచ్చు నని పిస్తుంది. ఆ చెడును నిలకడలో ఇలా నిరసించేవారికి తెలీకపోవచ్చు. దాని స్థానంలో ఏది వస్తే మంచిదో అవగాహన లేకపోవచ్చు. ఆ చెడును సత్వరంగా తీసెయ్యడానికి ఏ కార్యాచరణ ఉపయోగపడుతుందో తట్టకపోవచ్చు. ఒకరకంగా చెడును సంస్కరించాలన్నదే దానివెనుక ఉన్న భావం. దాన్నే సాహిత్య పరంగా అన్వయిస్తే సవిమర్శక వాస్తవికతావాదుల తాత్త్విక చింతనగా మనం అంచనా వెయ్యవచ్చు. ఉదా: కందుకూరి రచనల్లో కొన్ని ఈ కోవకిందకొస్తాయి.

ఇక రెండోది తిరుగుబాటును గురించి విశ్లేషించుకొనే ముందు 'విప్లవం' అన్నదాన్ని పరిశీలిద్దాం. విప్లవం అన్నది వర్గపోరాటం యొక్క ఉన్నత దశ. సామాజిక పరిణామ దశలను వర్గపూర్వ సమాజం, వర్గసమాజం అని విభజించవచ్చు. అందులో వర్గాలేర్పడ్డ తర్వాత వాటిలోనూ పాలక, పాలిత వర్గాలు స్పష్టమైంతర్వాత ఈ రెండు వర్గాల మధ్య వైరుధ్యం సహజంగా చోటు చేసుకుంటుంది. ఆ దశలో విప్లవానికి రంగం సిద్ధమౌతుంది. దీన్నే లెనిన్ ఇలా అంటాడు: పాలిత వర్గాల పట్టు పాలితుల మీద సడలుతూంటుంది. అంతేకాదు,

ఒక దశలో అసాధ్యం కూడా కావచ్చు. అట్టడుగు జనాలు పాత పద్ధతి జీవిత విధానాన్ని అసహ్యించుకుంటూంటారు. ఉన్నత శ్రేణుల్లోని జనం జీవనయానం కష్టంగా భావిస్తారు. దోపిడీకి గురయ్యే వర్గాల బాధలు ఊహించలేనంతగా వారిలో అసహనాన్ని పెంచటంతో ప్రజారాశుల చైతన్యం గణనీయంగా వృద్ధి అవుతుంది. అనంత ప్రజారాసి చరిత్రాత్మకమైన కార్యాచరణను పూను కుంటుంది

దీన్నే రానున్న మార్పుకు విప్లవ అనుకున్నప్పుడు ఆ మార్పుకోసం కదిలిన ప్రజల లక్షణాలనుబట్టి, వారు ఉద్దేశించిన లక్ష్యాలనుబట్టి యీ మొత్తం కార్యాచరణను వివిధ రకాలైన పేర్లతో పిలవడం సామాజిక శాస్త్రం మనకందిం చిన సత్యం.

ఉత్పత్తి శక్తులకు భూస్వామ్య ఆర్థిక, రాజకీయ వ్యవస్థల మధ్య ఉండే వైరుధ్యాలకు సంబంధించి వచ్చిన కార్యాచరణను బూర్జువా విప్లవం అన్నారు. ఇలాటివి ప్రపంచంలో అనేక పర్యాయాలు జరిగినట్లు దాఖలాలున్నాయి. ఉదా: జర్మనీలో 16 వ శతాబ్దం రైతుయుద్ధం, నెదర్‌లెండ్స్‌లో యుద్ధం, తదితరాలు. ఇందులో సమాజంలోని పై శ్రేణులే పాల్గొంటాయి. లోతైన సామాజిక మార్పు లను ఇది ఆశించదు. ఇదే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం అన్న మరో దశకు చేరుకుంటుంది. అప్పుడు అందులో శ్రామిక, రైతాంగ వర్గాలు చురుగ్గా పాల్గొం టాయి. బూర్జువా కోర్కెలను అధిగమించి రైతాంగ సమస్యలు, శ్రామిక వర్గ సమస్యలు ముందుకొస్తాయి. ఇందులో కూడా కొన్ని కొన్ని ప్రత్యేక పరిస్థితుల కనుగుణంగా రెండు, మూడు తరహాల బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాలున్నాయి. అలాటి ఓ తరహాలోంచే 1789-94 మధ్య జరిగిన ఫ్రెంచి విప్లవం. సోషలిస్టు విప్లవం అన్న ఉత్తమ కార్యాచరణ పెట్టుబడిదారీ దశ నుండి సోషలిస్టు దశను ఆశిస్తూ సాగి; వ్యవస్థలో గుణాత్మకమైన మార్పును తెస్తుంది. వ్యక్తిగత ఆస్తిని రూపుమాపుతూ మనిషిపై మనిషి చేసే దోపిడీని అంతమొందిస్తుంది. మార్క్స్ దీని ఆవశ్యకతను వివరించాడు. శ్రామిక శక్తుల చారిత్రాత్మక భాగస్వామ్యం ద్వారా ఇది జరుగుతుంది. బూర్జువా పాలనా యంత్రాంగాన్ని నాశనంచేసి శ్రామిక పాలనను నెలకొల్పుతుంది. తద్వారా సోషలిజం సాధ్యపడుతుంది. ఇదే క్రమంగా వర్గరహిత సమాజ స్థాపనాదశకు సాయం చేస్తుంది

ఈ విప్లవాల ముందడుగెప్పుడూ అందులో పాల్గొనే వర్గాలపై ఆధారపడి ఉంటుంది. వర్గాలమధ్య పోరాటం వాడిగానూ వేడిగానూ సాగాలంటే అది అభివృద్ధి నిరోధక బూర్జువా వర్గాలకు, అత్యధిక సంఖ్యాకులైన ఇతర వర్గాలకూ మధ్య పెరిగే వైరుధ్యాల మీదా, జరిగే సంఘర్షణలమీదా ఆధారపడి ఉంటుంది. అంతే కాదు, బూర్జువా వర్గం ఉపయోగించే బలప్రయోగం అణచివేత మీదకూడా ఈ కార్యాచరణయొక్క వేగం ఆధారపడి ఉంటుందనాలి.

విప్లవంలో వినాశాత్మక, నిర్మాణాత్మక లక్షణాలు రెండూ ఉంటాయి. దీనిలో సంఘటిత ప్రజాశక్తియొక్క సాముదాయక చైతన్యం ప్రస్ఫుటమవుతుంది. ఆధార స్వరూప స్వభావాలను మార్చే లక్షణం దీనికుంటుంది. కొత్త విలువలను నెలకొల్పడంలో ఇది పనిచేస్తుంది.

ఇక మిగిలింది తిరుగుబాటు. ఇందులో ఎదురుతిరిగే తత్వం ఉంది. అణిగినవాళ్లూ, ఓడినవాళ్లూ తిరిగి తలెత్తి యుద్ధం చెయ్యడమన్న అర్థం దీనికున్నట్టు ఆంగ్ల నిఘంటువులు తెలుపుతున్నాయి. ఒక నిబంధనకు అవిధేయులుగా ఉండటం అంటే శాసనోల్లంఘనం కావచ్చు. అదీ ఇందులో ఇమిడి ఉంది. చట్టబద్ధమైన ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిపే కార్యాచరణ అన్న అర్థాన్నికూడా కొన్ని కోశాలందిస్తున్నాయి. అది సాయుధం కావచ్చుకాకపోవచ్చు. ఆ రకమైన కార్యాచరణలో అనంత ప్రజారాసులు పాల్గొనకపోయే లక్షణం ఉంది దీనికి. అలాంటి ప్రతిఘటనలో వినాశక లక్షణమే ఉంటుందంటారు మామిడిపూడి వెంకట రంగయ్యగారిలాంటి చరిత్రకారులు. అయితే స్పష్టమైన లక్ష్య నిర్దేశం లేకుండా సాగిన కార్యాచరణ ఇలా వినాశనాత్మకం కావచ్చేమో! నిర్మాణాత్మక దశకొచ్చేటప్పటికే అది ఆగిపోవచ్చేమో! అలాంటప్పుడే రంగయ్యగారి సూత్రీకరణలో కొంత నిజం కనిపిస్తుంది. కానప్పుడు సంస్కరణ లక్ష్యం మేరకే ఉంటూనూ, ఆధార పరిణామాన్ని ఆశించకుండానూ, తక్కువ జనబాహుళ్యం పాల్గొంటూనూ సాగిన కార్యాచరణను తిరుగుబాటు అనవచ్చు. దీనివల్ల పాతదాని నిర్మూలనం సాధ్యం అవుతుంది. అది ఏ మేరకన్నది పాల్గొన్న వర్గాల పోరాటపటిమా, పరిస్థితుల ఆనుకూల్యం మీద ఆధారపడి ఉంటుంది. ఇది అటు నిరసన దశకూ, ఇటు విప్లవ దశకూ మధ్య ఉంటుందని అనుకోవచ్చు. తిరుగుబాటు సిద్ధం చేసిన రంగం ప్రాతిపదికగా ఉద్యమం విప్లవోన్ముఖం అవుతుంది.

ఈ నిర్వానాలిలా ఉన్నప్పటికీ అప్పుడప్పుడీ పదాలను సామాన్యార్థంలో వాడటం కొత్తేమీకాదు. మార్క్సిస్టు మహోపాధ్యాయులు కూడా విప్లవమన్నదాన్ని సామాన్యార్థంతో వాడినట్టు కనిపిస్తూంటుంది కూడా. గుణపరిణామాన్ని కాక కేవల రాసి పరిణామాన్నే కేవలం విప్లవమనడం నేడు మరీ బహుళమైంది. ఉదా: హరిత, శ్వేత విప్లవాలు, ఇలా చూస్తున్నప్పుడు నేటి మన ప్రభుత్వాలూ, వారి యంత్రాంగం సాధిస్తున్న దాన్ని ''అసిత విప్లవం'' అనవచ్చేమో! బ్లాక్ మార్కెటు, బ్లాక్‌మనీ రాసిలో పెరుగుతోంది.

ఏమైనప్పటికీ మనం చర్చించేది ఆంధ్ర దేశానికి సంబంధించినా, తిరుగుబాటుల వరకే కనక ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక తిరుగుబాటుల గురించి మాత్రమే చర్చను పరిమితం చేసుకోవడం సమంజసం.

రాజకీయాలు ఆర్థికం కిందికే వస్తాయి. అవి ప్రత్యక్ష రూపంలో రావచ్చు, లేదా ఫ్యూడల్ భావాల ప్రాంతాల ప్రభావంవల్ల మత రూపంలో రావచ్చు. మరే రూపంలోనన్నా రావచ్చు కనుక ఆర్థిక, రాజకీయ, సామాజిక తిరుగుబాటులను వేర్వేరుగా విశ్లేషించడం క్లిష్టతరం అవుతుంది, కనుక వాటిని కలిపే చూద్దాం.

ఇక తిరుగుబాట్లు విప్లవదశకు చేరుకున్నదీ, మహా విప్లవ దశనందుకున్నదీ రెండే రెండు సందర్భాలు. అవి ఒకటి వర్గ పూర్వ సమాజం వర్గ సమాజంగా మారడానికి జరిగిన అనంతమైన తిరుగుబాట్ల తర్వాత వచ్చిన విప్లవం. ఈ దశలో బుద్ధుని పాత్ర గణనీయమైందని భౌతికవాద దృష్టితో భారతీయ ఇతిహాసాన్ని చూసినవాళ్ళకు అవగతమవుతుంది. ఇక రెండవది, వర్గ సమాజం వర్గ రహిత సమాజంగా మారడానికి ముందు జరిగిన అనంతమైన తిరుగుబాట్లు వాటి పర్యవసానంగా వచ్చిన మహా విప్లవానికి లెనిన్ సారథ్యం వహించడం ఇదంతా ఇటీవల చరిత్ర. ఈ రెండు విప్లవాలకూ మధ్య వచ్చినవన్నీ తిరుగుబాట్లుగానే భావించాలి.

జగత్తంటే జనమేకదా! వాల్మీకి ధనమూల మిదం జగతి అని ఒకానొక ప్రయోజనాన్నుద్దేశించి అన్నదాన్నే లెనిన్ శాస్త్రీయంగా నిర్వచించాడు: ఆర్థిక సారాంశమే రాజకీయాలనీ, ఆర్థిక వ్యవహారాలు రాజకీయాలద్వారా తప్ప మరో

రకంగా వ్యక్తం కావని ఆయన స్పష్టం చేశాడు. ఈ కోణంలో చూసినప్పుడు మన దేశంలో జరిగిన మతంమీదా, కులంమీదా, రాజరికంమీద జరిగిన తిరుగు బాట్లన్నిటికి అర్థమే మూలమని అర్థమవుతుంది. మనకా తిరుగుబాట్లలోని తత్వం బోధపడ్తుంది.

*ప్రథమ స్వాతంత్ర్య సమరం* **1857** (29-3-1857) :- దీనిని ఆంగ్లేయులు సిపాయీల పితూరీ అన్నారు. నేటికి కొన్ని పాఠ్యగ్రంథాలు అలాగే వాడటం చూడచ్చు. పితూరీ అంటే తెలుగులో నెపాలు చెప్పడంగా ఉంది. కానీ మరాఠీ భాషలో తిరుగుబాటన్న అర్థం ఉంది. ఏది ఏమైనా సిపాయీల తిరుగు బాటుకు పూర్వం భారతదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ రకరకాల కారణాలమీద చిన్న చిన్న తిరుగుబాట్లు జరిగాయి. అన్నీ ఒకేకాలంలోనూ, అన్నిశ్రేణులవాళ్ళ భాగస్వామ్యంలోనూ జరగలేదన్నది వేరే విషయం.

మధుసూదన సరస్వతి నాయకత్వాన బెంగాల్, మహారాష్ట్రలలో సైన్యంలో భర్తీ అయిన సన్యాసులు ఆంగ్లేయుల పీడనమీద తిరగబడ్డారు. శంకరాచార్య మతంలో 'గిరి' అన్న మతభేదం అవలంబించే సన్యాసులు వాళ్ళు. అలాగే తిరునల్వేలి (1810-1814); గడ్కరీ (దక్కన్ 1844); ఉత్మండల్ (గుజరాత్) లోనాయిరాలు (1816-1832) మొ॥న వాళ్ళు అనేక పర్యాయాలు తిరుగుబాట్లు చేశారు. కాని సావర్కర్ దీనికి ప్రథమ స్వాతంత్ర్య సమరం అన్నారు. దేశభక్తులందరూ దీన్నిలాగే అంటారు. ఈ సంగ్రామాన్ని అర్థం చేసుకోవడంలో ఉన్న పరిమితులనుబట్టి వాళ్ళాయా పేర్లను నిర్ణయించుకుంటారు. బ్రిటిష్ వాళ్ళీదేశంలో రాజకీయాధికారం సంపాదించక పూర్వం ఎందరో ఈ దేశంమీద దండయాత్రలు చేశారు. ఇక్కడి లోకమాన్యుడి మతం ప్రకారం మొదటి దాడి చేసింది యూరోపియన్లది. ఇదివరకు అక్కడున్న ప్రాచీన ద్రావిడులు కూడా మధ్యధరా ప్రాంతంనుండి వచ్చి ఇక్కడ స్థిరపడ్డవాళ్ళని కూడా కొందరు చరిత్రకారులంటారు. ఆ తర్వాత శకులు, పల్లవులు, కుషాణులు ఎందరోవచ్చి ఈ దేశంమీద పడ్డారు. వీరంతా స్థానిక సమాజంలో కలిశారు. అప్పటికి దేశంలో ఏమతం ప్రచారంలో ఉంటేదాన్ని స్వీకరించారు. కనిష్కుడు- బౌద్ధం, పుష్యమిత్రుడు-వైదికమతం ఉదాహరణలుగా తీసుకోవచ్చు. కాగా ఆ తర్వాత టర్కీ, పశ్చిమాసియా ప్రాంతం నుండి దాడిచేసినవాళ్ళు తమ మతాన్ని నిలుపు

కోవడమేకాక దాన్ని ప్రచారం చేయడానికి కూడా కృషిచేశారు. ఆ ప్రయత్నాల వల్ల వాళ్ళు ఆ మతాన్ని వ్యాప్తిచేసినా ఇక్కడి సంస్కృతి సాగరంలో మునిగి ఇక్కడే స్థిరపడ్డారు. ఆదిలో వారి రాజభాష పారశీకమైనా తర్వాత స్థానిక భాషల్ని కలగల్పి ఒక కొత్తభాషనే సృష్టించారు. అదే ఉర్దూ. దీని లిపి వ్యాకర ణాదులు పారశీకంనుంచి తీసుకోవడంవల్ల ఆ భాష ప్రభావం దీనిమీద ఉన్న మాట నిజం. అంతమాత్రాన ఇది దిగుమతి అయిన భాష అనడానికి వీల్లేదు. భారత ఉపఖండంలో తప్ప దీనికి ప్రాచుర్యములేదు. పదజాలం వ్యాకరణం పారశీకం నుండి స్వీకరించినా అది పరాయిభాష అయితే, పదజాలాన్నీ వ్యాకర ణాన్ని సంస్కృతంనుండి తీసుకున్న మన తెలుగునేమనాలి? దీనికి ద్రావిడభాషా స్వరూప స్వభావాలు నశించాయా?

ఇంతవరకూ దేశానికొచ్చిన వాళ్ళిక్కడే స్థిరపడిపోతే మొట్టమొదటిసారి ఇంగ్లీషు వాళ్ళు దీన్ని వలసగా మార్చి 6 వేల మైళ్ళ దూరం నుండి దీన్ని పాలించడం ఆరంభించారు. వారు రాజ్యాధికారానికి రావడానికి పూర్వం యూరప్‌లోలాగానే ఇక్కడ కూడా పారిశ్రామిక నాగరికత పెంపొందడానికి అవసరమైన భూబంధం తయారైంది. ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు వాళ్ళు వర్తకులుగానే ఉన్నంతవరకూ పశ్చిమ దేశాల అంగళ్ళకు అందించడం కోసం మన దేశంలో వస్త్ర పరిశ్రమ, ఉక్కు, ఇనుము పరిశ్రమలు చాలా ఉన్నత స్థాయికెళ్ళాయి. అప్పటి కంపెనీవాళ్ళ రాతలను చూస్తే భారత, పారశీక, యూరోపియా అంగళ్ళకు ఆయా ప్రజల అభిరుచులకనుగుణంగా బట్టల మీద బొమ్మలు గీసే కలంకారీ పరిశ్రమ బందరులోనూ, అద్దకం పరిశ్రమ సూరత లోనూ బ్రహ్మాండంగా పెరిగాయని తెలుస్తుంది. ఒక్క బందరులోనే 8 వేల కలంకారీ కళాకారులున్నట్లు ఫ్రెంచి వర్తకుల రాతలవల్ల తెలుస్తుంది. పిఠాపురం చుట్టుపట్ల 80 గ్రామాల్లో అన్ని కులాలవారు వస్త్రోత్పత్తిలోనే నిమగ్నులయి ఉండేవారని పోర్చుగీసు రాతలవల్ల తెలుస్తుంది. అలాగే ఓడల నిర్మాణానికవసర మైన ఇనుప సామాను నర్సాపూర్‌లో తయారయ్యేదని ఆ వర్తకులే రాశారు. వస్త్ర పరిశ్రమలకవసరమైన పెట్లుప్పు బీహార్‌లో ఉన్నత స్థాయిలో దొరికేదనీ, నీలిమందు వ్యవసాయం దేశమంతా ఉండేదనీ వాటి రాతలవల్లే తెలుస్తుంది. భారత దేశంలో ఆర్థికాభివృద్ధి అన్న గ్రంథంలో పిరా అన్‌స్టే ఇలా అన్నాడు:

''పారిశ్రామిక విప్లవం నాటికే భారతదేశంలో ఆర్థిక పరిస్థితి చాలా ప్రగతి పథంలో ఉండేది. భారతీయ ఉత్పత్తి పద్ధతులూ, వాణిజ్య సంస్థలూ ప్రపంచంలో ఏ ఇతర దేశంలో వాటికన్నా మెరుగ్గా ఉండేవి.''

ఇంత విస్తారంగా పరిశ్రమ పెరిగినప్పుడు మన కులవ్యవస్థ ప్రకారం తంతువాయిలు బట్టలు నేయడం, లోహకారులే ఇనుప సామాన్లు తయారీ చేయడం, వడ్రంగులే మగ్గాల వంటివాటిని చేయడం సాధ్యం కాదు. ఇతర కులాల సహకారం అవసరం అయ్యేది అనాడు కులం గోడల్ని బద్దలుకొట్టడానికి తిరుగుబాట్లు లేచాయి. ఆ ఉద్యమాలు మతరూపంలోనూ, వారి భావాలు కబీరు, వీరబ్రహ్మం, సిద్ధప్పల లాంటి జానపద తాత్వికుల రచనల్లోనూ స్పష్టంగా కనిపిస్తాయి. ఈలోగా ఇంగ్లాండులో స్పిన్నింగ్ జెన్నీ కనిపెట్టడంతో పారిశ్రామిక యుగానికి అంకురారోపణ జరిగింది. దాంతో ఆంగ్లేయులు, స్థానిక ప్రభువులూ అంతా కలిసి వారి వారి స్వప్రయోజనాల కోసం ఇక్కడి సరకు ఉత్పత్తిని మొగ్గలోనే తుంచారు. అలా తుంచడానికి వారు చేసిన యత్నం మీద లేచిన తిరుగుబాటును నెత్తుటేళ్ళలో ముంచెత్తారు. ఇలా వృత్తులు కోల్పోయినవారు అన్నాన్వేషణలో దేశమంతా కలియదిరిగి లక్ష్యంలేని దిమ్మరీలయ్యారు. ఇప్పటికీ లక్ష్యం లేకుండా తిరిగే ఆవారాలను 'జులాయి'లా తిరుగుతున్నాడనీ, 'పింజారీ వెధవ'నీ తిట్టడం పరిపాటి. 'జులాయి' అంటే నేతగాడు పింజారీ అంటే ఏకులు చేసేవాడు. ఇక అర్థం చెప్పక్కర్లేదు.

తిండిలేనివాళ్ళు ఆ రోజుల్లో వేమన చెప్పినట్టు 'దొంగతనము దోపిడినైన' అన్న పంథాలో కడుపునింపుకొనేవాళ్ళు.

ఇదిలా ఓ పక్క ఉండగా బ్రిటీషువాళ్ళు స్థానిక రాజులను లోబరుచుకొని దేశాన్ని ఆక్రమించుకోవడం ఆరంభించారు. ఆ దశల్లో రాజ్యం పోయిన రాజులూ, నవాబులూ, వారిమీద ఆధారపడ్డవాళ్ళు కూడా వృత్తులు కోల్పోయి ఇంగ్లీషు వాళ్ళమీద కుతకుతలాడటం మొదలెట్టారు ఇదే 1857 తిరుగుబాటుకు భూమికయింది. ఇలాంటి సందర్భంలో తిరుగుబాటు మంగళ పాండేవల్లా మరొక 88వ ప్లేటూనువల్లా, ఆ మొదట్ల సిపాయీల వల్లా, తూటాలకు పూసిన పందికొవ్వూ ఆవు కొవ్వూవల్లా అన్నది యాదృచ్ఛికం మాత్రమే అవుతుంది. చరిత్రకారులు

యాదృచ్ఛికాలనే విశ్లేషించి రాశారు తప్ప అసలు భూమిబంధం లోలికి పోలేదు (Infrastructural back ground).

అనాడు ఈ తిరుగుబాటు విఫలమైంది. కానీ ఆ తత్వం అంతరించలేదు. అదే తర్వాత అనేక రకరకాల రూపాల్లో తలెత్తింది. వాటిని సంక్షిప్తంగా పరిశీలిద్దాం. ఈ తిరుగుబాటును గురించి 27-7-1857 హౌస్ ఆఫ్ కామన్స్‌లో డిజ్రేలీ ఇలా అన్నాడు: ''ఇది సిపాయీల తిరుగుబాటు కాదు, జాతీయ విప్లవం.'' అలాగే ఫోన్ విలీ బెరిగార్డ్ ''ఇది సిపాయీలలో తిరుగుబాటు కాదు. జనం అందరూ వాళ్ళతో ఏకమయ్యారు'' — అన్నాడు. (భా. స్వా. చరిత్ర. రెం. వా. 95-107.

విదేశీ అంగళ్ళకు సరుకు ఉత్పత్తి ముమ్మరంగా సాగే రోజుల్లో కుల మతాల మీద లేచిన తిరుగుబాటు తర్వాత రెండు సంస్కారణోద్యమాల ఆవిర్భావానికి దోహదం చేసింది. అదే ఆర్య సమాజ, బ్రహ్మ సమాజాలు. ఈ రెండూ కులాల నొప్పుకోవు. విగ్రహారాధనను అంగీకరించవు. ఏ మతం వారైనా ఈ కొత్త మతాల్లో కలవడాని కంగీకరిస్తాయి. అయితే, యూరోపియ సంపర్కంవల్ల ప్రొటెస్టెంటు క్రిస్టియానిటీ బ్రహ్మ సమాజానికి ప్రేరణ అయితే, వేదాలూ ఉపనిషత్తులూ 'కృణ్వంతో విశ్వమార్యం' అన్న ఋగ్వేద సూక్తి ఆర్యసమాజానికి ప్రేరణైంది. ఇందులో బ్రహ్మ సమాజం ఆధునిక విద్య నభ్యసించిన అగ్రకులాల వారికి పరిమితమైతే. ఆర్య సమాజం అట్టడుగు కులాలదాకా వెళ్ళి వారిలో ఆత్మ విశ్వాసాన్ని ప్రబోధించింది. 1857 తిరుగుబాటు పెనుకెరటమైతే ఆది విరిగి పడగా లేచిన కత్తెర కెరటాలీ రెండు ఉద్యమాలూనూ. ఈ రెండూ మత రూపంలో కనిపించినప్పటికీ పూర్వ భూమికను దృష్టిలో ఉంచుకొని చూస్తే వాటి వెనక ఆర్థిక, రాజకీయాంశలు ఉన్నాయన్నది తెలుస్తుంది.

ఓ మూల మతపరమైన ఉద్యమాలు ఇలా ఉండగా మరో మూల రాజకీయపరమైన ఉద్యమాలు కూడా ఆరంభమయ్యాయి. సేలం ప్రాంతంలో కరువు పరిస్థితులనూ, రెవిన్యూ అధికారులు రైతులదగ్గర్నుండి గోళ్ళూడగొట్టి పన్నులు వసూలు చేయడాన్ని గాజుల లక్ష్మినరసింహ సెట్టి వ్యతిరేకించాడు. బ్రిటీషు పార్లమెంటు సభ్యుణ్ణి వెంట తీసుకొని ఆ ప్రాంతాలన్నీ తిరిగాడు. రైతులచేత మహజర్లు పెట్టించాడు. 1840-1860 దాకా ఇది సాగింది ఇదే కాలంలో చరిత్ర

తెక్కని అనేక చిన్న చిన్న స్థానిక తిరుగుబాట్లు వ్యష్టిగానూ, సమిష్టిగానూ చాలా చోట్ల లేచాయి వాటిని బ్రిటీషు పాలకులు నిర్దాక్షిణ్యంగా అణచేశారు. ఈ తిరుగుబాట్లను పల్లెజనం పదాలూ పాటలుగా కట్టుకొని ఇప్పటికీ పాడుకొంటూంటారు. ఇలాంటి పాటలు చాలా వెనుకబడిన పల్లెపట్లలోనే బతికున్నాయి. మన రాష్ట్రింవరకూ చూస్తే కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, పేరంటాలు కథ లాంటివి పుస్తకాలకెక్కాయి. ఎక్కనివి చాలా ఉన్నాయి. తంగిరాలగారు చాలా విపులంగా వాటిని వింగడించారు.

ఈ పరిస్థితిని గమనించిన బ్రిటీషువాళ్ళు జనాన్ని మచ్చిక చేసుకోవడానికి తిరుబాట్లకు బదులుగా విద్యామంత్రులు, అగ్రవర్గాలవారూ మహాజర్లూ, పిటిషన్లూ పెట్టుకోవడానికి అనువుగా ఓ సంఘాన్ని స్థాపించారు. అదే 1885 లో పుట్టిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్. ఈ పేరు రనడే సూచించాడని అంటారు.

ఒక మూల ఇలాంటి సంఘం ఏర్పడినప్పటికీ తిరుగుబాట్లు అణగారలేదు. తిరుగుబాటు ప్రబోధాలుకూడా చల్లారలేదు. ఇలా ప్రబోధించిన పుస్తకాలు పాలకుల కోపాగ్ని శిఖలకు గురయ్యాయి. ఇందుకు బంకించంద్రుని 'ఆనందమఠం' నవలే ఉదాహరణ. నవలను బ్రిటీషువాళ్ళు నిషేధించినా, ఆ నవలలో సన్యాసుల తిరుగుబాటు శంఖం పూరించిన 'వందేమాతరం' గీతం స్వాతంత్ర్యం వచ్చినాక జాతీయ గీతం అయింది.

బెంగాల్లో అనుశీలనోద్యమం, (Armed struggle Adapted in ressians ruins) సతీశ్‌చంద్రబోస్ 1902 గదర్ ఉద్యమం 1913; మోప్లా కయ్యూర్ ఉద్యమం; తలుపుల చంద్రయ్య, తమ్మన్న 1879-80; రంపపితూరి, అల్లూరి సీతారామరాజు (మన్యం పితూరీ) 7-5-1923; చంద్రశేఖర్ ఆజాద్ 1924 హిందు అసోసియేషన్, భగత్‌సింగ్ 23-3-31; చిటగాంగ్ పోరాటం (1930 సూర్యసేన్), కోటప్పకొండప్రాంతంలో గుర్రాల గోపిరెడ్డి, చిన్నపరెడ్డి, కన్నెగంటి హనుమంతు, ప్రతివాది భయంకరాచారిలాంటి వాళ్ళెందరో తిరుగుబాటుదారులు పాటలకూ, పదాలకూ ఎక్కి నిలిచిపోయారు. వాటిలో కొన్ని స్థానిదాధికారుల దోపిడీకి, దౌర్జన్యానికి వ్యతిరేకంగానూ, తమ పూర్వాధికారాన్ని కోల్పోయామన్న కోపంతోనూ కావచ్చు. ఏదైనా పెట్టుబడిదారీ ఆర్థిక, రాజకీయ వ్యవస్థపమీద జరిగిన తిరుగుబాట్లుగానే పరిగణించాలి.

ఆ తర్వాత ఇండియన్ నేషనల్ కాంగ్రెసులో పుట్టిన అనేక వైరుధ్యాలూ, భిన్నాభిప్రాయాలూ వేరేచెప్పాల్సిన అవసరంలేదు. కాలం గడిచినకొద్దీ పాశ్చాత్య విజ్ఞానాలు బాగా వ్యాప్తిపొంది పశ్చిమ దేశాల రాజకీయ, సాంస్కృతిక భావాలకు లోనైన చాలామంది సోషలిస్టులుగా మారారు. అలాకాక ఆ ప్రభావం మన సంస్కృతి మీదపడటంవల్ల నష్టం వస్తుందనుకున్న కొందరు మితవాదులుగా ఉన్నారు.

సోషలిస్టు ఉద్యమంలో ఉంటూనే మార్క్సిస్టు అవగాహనను పెంచుకొని, సోషలిస్టు విప్లవంతో ఉత్తేజితులైనవాళ్ళు అనేకులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో ఉండేవాళ్ళు.

ఇలా ఉంటూండగా కాంగ్రెసువారు 1935 చట్టం ప్రకారం అధికారంలోకి వచ్చారు. జస్టిస్, పీపుల్స్ పార్టీలను గద్దెదింపారు. ఈ దశలో ఆదిలో సామ్రాజ్యవాదుల మధ్య యుద్ధంగా మాత్రమే ఉన్న రెండవ ప్రపంచయుద్ధంలో గుణాత్మకమైనమార్పు వచ్చింది. దీన్ని 1936లోనే మేధావులు ఊహించారు. హిట్లరు, ముసోలినీ లిద్దరూ ఏకమై ప్రజాస్వామ్యానికే పెనుభూతాలయానరసడానికి కార్యక్రమాలు ఆరంభమయ్యాయి. స్పెయిన్‌లో ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికైన అతివాద, అభ్యుదయ ప్రభుత్వాన్ని కూలదొయ్యడానికి వాళ్ళిద్దరూ కుట్రలు పన్నారు. ఫ్రాంకోను నిలబెట్టి, ఆయుధాలందించి, కొత్త ప్రభుత్వం మీద తిరుగుబాటు చేయించారు. ప్రపంచ మేధావులు నాజీజం, ఫాసిజం లనిజ స్వరూపాన్ని దీనివల్ల పసిగట్టగల్గారు. ఇదే కొనసాగితే నాజీజానికి, ఫాసిజానికి మేధావులే మొదటి కబళం అవుతారు. ఈ రెండూ యువకుల ఉద్రేకం మీదా, జనసామాన్యాల్లోని అజ్ఞానం మీదా, అప్పటికే నిరుద్యోగానికి ఇతర భాషల జాతులవారే కారణమన్న భావాలమీదా ఆధారపడ్డవి. అప్పుడు వాస్తవాలను విప్పిచెప్పగల రచయితలు, లెనిన్ మాటల్లో చెప్పాలంటే మానవ మస్తిష్కానికి ఇంజనీర్లలాంటి మేధావులూ ఈ పాశవిక శక్తికి మొదటి కబళమవుతారని ఊహించారు. పారిస్ మహాసభ ప్రభావం లండన్‌లో భారతీయ యువకుల మీదా, మనదేశంలో నెహ్రూతో సహా కాంగ్రెసు సోషలిస్టుల మీదా బాగాపడింది. అప్పటి నుండే కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో అంతర్భాగంగా ఉన్న కమ్యూనిస్టులు ఒక రహస్యబృందంగా పనిచేయడం ఆరంభించారు. అప్పుడు ఎందరో రచయితలు, కవులు తమ సౌభ్రాతృత్వాన్ని

ప్రతిఘటించడానికి కలిసొచ్చిన తుపాకులుపట్టి మ్యాడ్రిడ్ పాపులర్ ఫ్రంట్ కు బాసటగా వెళ్ళారు. నెహ్రూ కూడా అందుకు ఉద్యమిస్తే ఆయన్ని అపడానికి కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఎన్నుకొని అదే సంవత్సరం మహాసభలకు పిలిపించారు. అయినా పారిస్ సభలతో ప్రేరితులైన వారు లక్నో వీలైనంత మంది మేధావులను సమావేశపర్చి ఈ ప్రమాదాన్ని గురించి వివరించారు. పారిస్ సభకెళ్ళిన భారతీయ సభ్యులు లండన్ చేరి అభ్యుదయ రచయితల సంఘం పేరుతో సమావేశమయ్యారు. కొందరు లక్నో సభలకొచ్చి ప్రేంచంద్ అధ్యక్షతన సమావేశమయ్యారు. అలా భారతీయ అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భవించింది. దీనితో మన దేశంలో సాహితీ, సాంస్కృతిక రంగాలలో బాహాటమైన తిరుగుబాటుకు అంకురార్పణ జరిగింది.

ఇదిలా ఉండగా తెలుగునాట అప్పటికే ప్రాచీన సాహిత్యం మీద విసుగు చెందిన మేధావులు కొత్తపుంతలు తొక్కారు. కొందరు నాటి పాఠ్యపుస్తకాల్లో ఉన్న షెల్లీ, కీట్సు, బైరన్ లాంటి కాల్పనిక కవులవల్ల ప్రభావితులై ప్రబంధ ధోరణి మీద తిరుగుబాటు చేస్తే, మరికొందరు దేశ పరిస్థితులను పరిశీలించి అప్పటి అవకతవకలను తమ రచనల్లో ప్రతిబింబించ సాగారు. మొదటి కోవ నవ్య సాహిత్య ఉద్యమంగా భావకవిత్వ ఉద్యమంగా ప్రసిద్ధి పొందింది. రెండో కోవవారికి కాల్పనికతలో ఒక నిర్దిష్టమైన ఈస్థటిక్ సిద్ధాంతం లేకపోయినా తమ ఓపికమేరకు సమాజ దుర్గతులను రట్టు చేశారు. అలాంటి వారిలో కందుకూరి, గురజాడ, చిలకమర్తి, పానుగంటిలాంటివాళ్ళు కొందరు.

1939 లో త్రిపుర కాంగ్రెసుతో కూడా నాటి ప్రతినిధులలో ఉన్న రచయితలు సరోజినినాయుడు అధ్యక్షతన సమావేశమై, లక్నోలో ఏర్పడ్డ అభ్యుదయ రచయితల సంఘాన్ని దేశవ్యాప్తం చెయ్యాలని నిర్ణయం తీసుకున్నారు. మొదటి సమావేశానికి అబ్బూరి (1936), రెండో దానికి తుమ్మల (1939) ప్రతినిధులుగా వెళ్ళి, ప్రేంచంద్ సరోజిని నాయుడులు ఏర్పాటు చేసిన సమావేశాల్లో పాల్గొన్నారు. లక్నో సంఘ నిర్మాణంలో ప్రభావితులైన రామకృష్ణారావు విశాఖవాసి పురిపండా రోణంకి మొదలైనవారు అప్పటికే కొత్తగొంతు విన్పించడానికి సిద్ధమవుతున్న శ్రీశ్రీకి స్వాగతమిచ్చారు. అప్పటితో ఓ నిప్పుల గొంతుక విప్పుకుంది. లండన్ మేనిఫెస్టో అనువాద బాధ్యత శ్రీశ్రీకిస్తే దాన్ని అనుసరించడానికి పదును కాలక ఆ కొత్త భావాలు గేయంగా మలుచుకొన్నాయి.

ఆఖిలభారత స్థాయిలో ఈ సంఘం 1936 లో ఆరంభమైనా, తెలుగునాట కాంగ్రెసు సోషలిస్టులుగా ఉన్న కమ్యూనిస్టులు 1942 దాకా విడివడలేకపోయారు. అప్పటికి నాజీమూకలు రష్యాపై విరుచుకుపడడంతో సామ్రాజ్యవాదుల అంతర్యుద్ధం ఫాసిజానికీ, సోషలిజానికీ మధ్య యుద్ధంగా పరిణమించింది. యుద్ధంలో అమెరికా బ్రిటిషు దేశాలు కూడా సోషలిస్టు దేశంతో సయోధ్య ఏర్పరచుకున్నాయి. దాంతో సామ్రాజ్యవాదం ముదిరి ఫాసిజం నాజీఇజంగా మారిన ఇటలీ జర్మనీలు వేర్పడి ఒకేఒక్క స్నేహితుణ్ణి జపానును తమతో కూడగట్టుకున్నాయి. మిగతా సామ్రాజ్యవాద దేశాలన్నీ, సోషలిస్టు దేశంతో కలిసి ఈ 3 దేశాలకు వ్యతిరేకంగా పోరాడటానికి దిగాయి. అప్పుడిక్కడున్న జాతీయ కాంగ్రెసులో వివిధ వర్గాల మధ్య ఈ సమస్య మీద శిగపట్లు నడుస్తున్నాయి. ఒకరు సోవియట్ దేశంతో మిత్రులుగా ఉన్నా బ్రిటిషు యుద్ధప్రయత్నాలకు అంతరాయం కల్గించాలంటే (సోషలిస్టులు), మరొకరు యుద్ధానికి ఉడతాభక్తి సాయం చెయ్యాలన్నారు. (ర.వా.) వేరొకరు యుద్ధంతో సంబంధం లేకుండా తటస్థంగా (మెజారిటీ) ఉండాలన్నారు. మరొకరు శత్రువుకు శత్రువు మిత్రుడంటూ, ఈ సమయంలోనే పాలకుల శత్రువులతో కలిసి పాలకులను ఓడించాలన్నారు. (సుభాష్) ఈ భావాలతో కాంగ్రెసు ముక్కలైంది.

ఇలాటి దశలో యుద్ధానికి సాయం చెయ్యాలన్న కమ్యూనిస్టు వర్గం మీద నిషేధం తీసేశారు. దాంతో అది బలం పుంజుకుంది. 1943 లో అటు ఆంధ్ర, ఇటు తెలంగాణాంలో అభ్యుదయ రచయితల సంఘాలు వెలిశాయి. అదివరకే ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం అంతకుముందున్న కాల్పనికోద్యమ ప్రభావంవల్ల విప్లవ కాల్పనికవాదంవరకే పరిమితమైంది అందుకని మరోకోన ప్రజానాట్యమండలి జానపద కళాసాహిత్య రూపాలను ఉద్ధరించిరి.

మేధావి వర్గం; అదివరకు పుట్టిన సాహిత్యోద్యమాలలో ఒక వాస్తవికతను గమనించింది. కందుకూరి వీరేశలింగం మతంలోని ఫ్యూడల్ భావాలమీదా, గురజాడ సాహిత్య ఫ్యూడల్ తత్వంమీదా, గిడుగు భాషాఫ్యూడలిజంమీదా ధ్వజ మెత్తారని గమనించి, వారి ముగ్గుర్నీ తమకు ఆదర్శంగా పెట్టుకుంది. రాజ కీయంగా చూస్తే పాలకులు కొత్తగా లభ్యమైన స్వాతంత్ర్యాన్ని విస్తరించు కోడానికి యత్నించారు. దాని ఫలితమే తెలంగాణాలో ఫ్యూడల్ వ్యతిరేక

ఉద్యమం. అది ముందు వ్యతిరేకతగా ఆరంభమై, నిరసనగా మారి, భూమికోసం ముక్తికోసం సాగే తిరుగుబాటుగా పరిణమించింది. లాఠీకి లాఠీ, తూటాకు తూటాతో జవాబిచ్చే స్థాయికి ఎదిగింది. ఆనాటి తెలంగాణా ఫ్యూడల్ వ్యవస్థ గురించి వివరించటం అంతగా అవసరం లేదనుకుంటా. అది సాహిత్యంలో విపరీతంగా ప్రతిబింబించింది. మహాజర్ల సంఘంగా బయల్దేరిన ఆంధ్ర మహాసభల్లో యువకులు తిరుగుబాటుచేసి సాయుధ సమరోద్యమ సంఘంగా రూపొందారు. ఆనాటి తిరుగుబాటు ఉద్యమంలో జాగీర్దారులు, మక్తాదార్లువంటి పెద్ద భూస్వాముల వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా, వర్తకులు, పెద్ద రైతులు, పేద రైతులు, ఇతర గ్రామీణ వృత్తులవాళ్ళు అంతా కలిసి ఏకోన్ముఖంగా సమరం సాగించారు. ముస్లిం మత పరివర్తనకు వ్యతిరేకంగా ఆర్యసమాజం వారూ; మైనారిటీ మత పాలనకు వ్యతిరేకంగా సోషలిస్టులూ కూడా అక్కడక్కడా తిరుగుబాటులో నాయకత్వం వహించారు. కాగా సాహిత్య సాంస్కృతిక రంగాలలో ఈ రెండు వర్గాలు తెచ్చిన మార్పేమీ లేదు. కానీ ఆంధ్ర మహాసభ తెచ్చిన సాయుధ తిరుగుబాటులో మాత్రం జానపద సాహిత్య సాంస్కృతిక కళారూపాలు పునరుజ్జీవనమయ్యాయి.

ఏది ఏమైనా రైతాంగ పోరాటం, ఫాసిస్టు వ్యతిరేక నిజాం వ్యతిరేక పోరాటంగా ఆరంభమై భారత పాలక వర్గ వ్యతిరేక పోరాటంగా చివరకు పరిణమించింది. పోలీసుల చర్యతో ఈ ఉద్యమంలో చేరిన ఇతర వర్గాల వారందరూ ఆయుధ విసర్జన చేశారు. కానీ కమ్యూనిస్టులు మాత్రం మరో రెండేళ్ళు కొనసాగించి, మరికల్లాంటి మరో 4 వేల మంది యోధులు బలైన తర్వాత ఆయుధ విరమణ చేశారు. ఈ విరమణ పోలీసు చర్య వెంటనే చేసిఉంటే మంచిదని ఒక వర్గం, అలాకాక తర్వాత 4 ఏళ్ళు పాటు కొనసాగించి ఆపి ఉండటం మంచిదన్న మరో వర్గం వాదోప వాదాలు 12 ఏళ్ళ పాటు సాగించింది. దాంతో దేశ వ్యాప్తంగా కమ్యూనిస్టు ఉద్యమం చీలింది. ఉద్యమ కాలంలో వచ్చిన నిర్బంధాల వల్లా అంతర్గత వాదోపవాదాలవల్లా అభ్యుదయ రచయితల ఉద్యమం, ప్రజా నాట్య మండలులు, ఛిన్నాభిన్నం అయ్యాయి. ఇలాంటి దశలో తెలుగునాట సాహిత్య రంగంలో ఫార్మలిస్టు ధోరణులు తలెత్తాయి. అదివరకే బీజ రూపంలో ఉన్న వచన కవిత్వం ఎదిగి బట్టకట్టింది. ఇది ఓ రకంగా తరువాతి కాలంలో ఉప్పెనగా పొంగి, సాహిత్యంలో అనేక తిరుగుబాటు ధోరణులకు మాతృక అయింది.

వీరేశలింగం ఆరంభించిన ఫ్యూడల్ మత వ్యతిరేక ఉద్యమం తర్వాతి కాలంలో నాస్తికోద్యమానికి, త్రిపురనేని రామస్వామిగారి ఉద్యమం హేతువాద ఉద్యమానికి ఊతమిచ్చాయి. కమ్యూనిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా భారతదేశం లోనే పుట్టిన రాడికల్ హ్యూమనిజం అనే సిద్ధాంతం ఈ హేతువాద ఉద్యమానికి తర్వాత తర్వాత తాత్విక పునాదిగా పని చేసింది. వీటన్నిటినీ మత ఫ్యూడలిజం మీద జరిగిన చిన్నపాటి తిరుగుబాట్లుగానే భావించాలి. అలానే దళితవాదులుగా పుట్టిన ఫార్మలిస్టు ధోరణులు కూడా సాహిత్య ఫ్యూడలిజం మీద తిరుగుబాటులు గానే ఉద్దేశించవచ్చు. ఇప్పటికీ భాషా ఫ్యూడలిజం మీద యుద్ధం కొనసాగుతూనే ఉంది. ఇన్ని రకాల పోరాటాలు సాగుతున్నా మన రాష్ట్రంలో ఫ్యూడల్ సంబంధాల పట్టు పూర్తిగా సడల లేదు. పైగా ఫ్యూడల భావాల దర్పం, పెట్టుబడిదారీ భావాల కుటిలతత్వం చెట్టాపట్టాలేసికొని జీవాన్ని సామాజికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా వెనుకబాటు తనంలో ఉంచాలని ప్రయత్నిస్తున్నాయి. ఇంతవరకూ ఈ శక్తులమీద ఉచ్ఛస్థాయిలో రాజకీయంగా తిరుగుబాటు జరగలేదు. జరుగుతున్నవన్నీ చిన్న చిన్న తిరుగుబాట్లుగానే ఉంటున్నాయి. తెలంగాణా సాయుధ పోరాటం నాటి ఉప్పెనల్లా పొంగలేదు. అదే జరిగిననాడు ఈ తిరుగుబాట్లన్నీ విప్లవ రూపాన్ని సంతరించుకుంటాయి. అయితే అందుకు కృషి చాలా అవసరం. అశేష ప్రజానీకాన్ని సంసిద్ధం చెయ్యాలి. వారిలో చైతన్యం పెంచాలి. వాళ్ళ బతుకులకున్న నిజమైన అర్థాన్ని వివరించాలి.

-బానిస బతుకు తన కర్మఫలం, దాన్ని అనుభవించక తప్పదంటూ యజమానికింద బతికే వాడు బానిస.

-బానిస బతుకన్నా దక్కిందే. అదీ దయగల మన యజమాని ఔదార్యంతో అంటూ బతికేవాడు తొత్తు.

-బానిస బతుక్కి కారణం కర్మఫలం కాదు-యజమాని దౌష్ట్యం, దోపిడి అంటూ తిరగబడ్డవాడు విప్లవకారుడు.

అంటూ ఓ సందర్భంలో లెనిన్ అన్న మాటల్తో దీన్ని ముగిస్తాను. మీరిచ్చే సూచనలే దీన్ని పరిపుష్టం చేయడానికి తోడ్పడాలి.

## ఉపయోగించుకొన్న పుస్తకాలు :-

1. Dufunttons
2. Dictionery of Phylosophy
3. Lenin works
4. Random Dictionery
5. History of the Freedom Movement, Vol I to II -Tarachend
6. Economic Development in India Viera-Austeng
7. భారతదేశ స్వాతంత్ర్య చరిత్ర -డా. వెంకటరంగయ్య, భా.1
8. తెలంగాణా పోరాట గీతాలు -భా. 1,2. విరసం ప్రచురణ
9. వీర తెలంగాణా -రావి నారాయణరెడ్డి, విశాలాంధ్ర ప్రచురణ
10. కాంగ్రెసు చరిత్ర
11. జానపద వీరగాథలు -డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు
12. కొండా వెంకటప్పయ్య స్వీయచరిత్ర
13. సమ్యాంధ్ర -అయ్యదేవర కాళేశ్వరరావు స్వీయచరిత్ర
14. విజ్ఞాన సర్వస్వం -వా. సంస్కృతి 2
15. సన్యాసుల స్వాతంత్ర్య సమరం -దిగవల్లి శివరావు
16. భారతస్వాతంత్ర్య పోరాటాలు -కె.వి. రమణారెడ్డి
17. నేనూ-నా దేశం -దర్శి చెంచయ్య

నూరేళ్ళ తెలుగునాడు :

# పరిశోధనోద్యమాలు

— కేతవరపు రామకోటిశాస్త్రి

పరిశోధన అనేమాట మనమిప్పుడు అర్థంచేసుకొంటున్న విధంగానే మొదటినుండీ లేదు. పాతమాటలు కొత్త అర్థాలను చెప్పటానికి కూడా మనుషుల అవసరాలనుబట్టి సిద్ధమవుతూ వుంటాయి. అలాంటి మాటల్లో దశాపరిణామాలు రెండున్నాయి-ఒకటి అభ్యుదయం, రెండు నిష్ఫలం. మామూలుగా ఇప్పుడు మనమీ పరిశోధన అనేదాన్ని తేర్చుకోవచ్చు. మరింత జాగ్రత్తగా శోధించటమే పరిశోధించటం. అంటే బాగా వెదకటం. బాగా శుద్ధిచెయ్యటమనే అర్థంతోనూ పరిశోధన అనే మాట వెనుక వాడుకలో అంత ఎక్కువగా లేక పోయినా మొత్తానికి వ్యవహారంలో వున్నట్లు కనిపిస్తుంది. అందువల్ల ఇప్పుడు పరిశోధన పదానికి ఏది అర్థంగా వ్యవహారంలో వున్నదో దానికోసం వెనుకటి కాలానికిపోయి వెదకి లాభంలేదు. రీసర్చి అనే ఇంగ్లీషు పదాన్ని వాడుకొంటూ యూనివర్సిటీలలోని ఆయా విజ్ఞాన విభాగాల్లోని లోతుపాతుల గురించి అన్వేషణ బుద్ధితో అధ్యయనంచేసి అన్వయపూర్వకంగా అపూర్వమైన ఆయా భావనలను సహేతుకంగానూ సలక్షణంగానూ మొత్తంమీద శాస్త్రీయంగానూ అంటే మరొకరు దాసి ఉచితానుచితాలను బేరీజు వేయటానికి తగిన పద్ధతిలో అక్షరబద్ధం చేయట మనే యే కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నామో దానినే మనం పరిశోధన అంటున్నాం. ఇదే నిజమైతే మన తెలుగు పరిశోధన కార్యక్రమ చరిత్ర వయస్సు గట్టిగా అర్ధ శతాబ్దం మించివుండదు. ఎందుకంటే- మన విశ్వవిద్యాలయాల్లో పరిశోధన కార్యక్రమాలు ముఖ్యంగా మన భాషా సాహిత్యాల్లో మొదలయింది ఈ శతాబ్దంలోనే కదా! అయితే, మనకు యూనివర్సిటీలు ఏర్పడకముందూ ఏర్పడిన తరువాత కూడా యూనివర్సిటీ పరిధుల్లోలేని వ్యక్తులు-సంస్థలూ చే- పరిశోధన కార్యక్రమంలో ఆసక్తితో పాల్గొనటాన్ని విస్మరించకూడదు.

ఇప్పటి మన అర్థానికి చాలా దగ్గరగా తెలుగు దేశభాషా సాహిత్య చరిత్రలకు సంబంధించిన పరిశోధన మొదలయింది తూర్పు ఇండియా కంపెనీ పాలనకాలంలో సర్వేయరుగా వచ్చిన మెకంజీ దొరవల్ల. 1796 లో కావలి బొర్రయ్యగారు ఆయన దగ్గర గుమాస్తాగా చేరి, ఆయనచేత గురువుగా భావింప బడిన క్షణంనుండే తెలుగు పరిశోధన-వస్తు సేకరణ మొదలయింది. నెల్లూరు-రాయలసీమ-గుంటూరు సీమలను సర్వేచేస్తూ తిరుగుతూ ఆయన తెలుగుదేశ స్థానిక చారిత్రక ఆధారాలను గుర్తించటమూ, సేకరించటమూ, అధ్యయనం చెయ్యటమూ చేశాడు. తెలుగు శాసనాలను చదివి అర్థంచేసుకోవటానికి ఆయన కావలి సోదరులను ఉపయోగించుకొన్నాడు. తెలుగు శాసనాలను చరిత్రను గురించిన పరిశోధనకు విషయాలుగా చేసిన గౌరవం మెకంజీకి-ఆయనపక్ష ఆ పని చేసిన కావలి సోదరులకూ దక్కుతుంది. దేశభాషల్లోని తాళపత్ర గ్రంథాల సేకరణ కార్యక్రమానికి కూడా మెకంజీయే ప్రారంభం చేశాడు. ఇప్పుడు మద్రాసులో ప్రసిద్ధంగావున్న ప్రాచ్య లిఖిత గ్రంథ భాండాగారం యొక్క ప్రారంభరూపం అప్పటి సెంట్‌జార్జి కోటలోని కాలేజి లైబ్రరీగా మెకంజీ సేకరణలతోనే ఏర్పడింది. పరిశోధనకు అవసరమైన అంశాలను సేకరించే ప్రాథమికమైన పనిని మెకంజీ, కావలి సోదరులూ ప్రారంభించారు. మెకంజీ ప్రోత్సాహంతో బొర్రయ్యగారు భారత యూరోపియను విజ్ఞానశాఖ లయిన గణితంలో-జ్యోతిషంలోనూ కూడా కృషి చేశాడు. భారతీయ ప్రాచీన విజ్ఞాన విషయాల్లో పాశ్చాత్యులు శ్రద్ధ వహించటానికి నాంది పలికినవాడు కూడా మెకంజీయే. ఇదంతా ఒక రకంగా మరీ పూర్వ రంగం. 18 వ శతాబ్దంలో జరిగిన పని. 19 వ శతాబ్దంలో ఈ రకమైన పరిశోధన కార్య క్రమాన్ని కొనసాగించింది కూడా పాశ్చాత్యుడే. ఆయన సి.పి. బ్రౌను.

19 వ శతాబ్దం ప్రారంభానికి తెలుగు ప్రాంతం మొత్తాన్ని తూర్పు ఇండియా కంపెనీ తన అధికారం కిందికి తెచ్చుకొన్నది. భౌగోళికంగా తెలుగు దేశాన్ని మండలాలుగా విభజించి కలెక్టర్ల ద్వారా పరిపాలించటం కూడా కంపెని మొదలు పెట్టింది. 1800 సంవత్సరంలో థామస్ మన్రోను ప్రిన్సిపల్ కలె క్టరుగా నియమించింది. బ్రిటిషు అధికారులకు తెలుగు ప్రజలను పాలించవలసి వచ్చేటప్పటికి వాళ్ళ పనులుబాటుకొరకు తెలుగు జనంతో సన్నిహితంగా వుండ వలసిన అవసరం ఏర్పడింది. ముఖ్యంగా భాషా సాహిత్యాల ద్వారానే విదేశీయు

లకు స్వదేశీయులకూ సంబంధాలు ఏర్పడటమేకాక బలపడతాయి కూడా. అందువల్ల తెలుగుదేశపు బ్రిటీషు కలెక్టర్లు తెలుగు నేర్చుకోటం తప్పనిసరి అయింది. అలా నేర్చుకొన్నవాళ్ళే మంచి పాలకులుగా చలామణి అయ్యారు. అలాంటి వాళ్ళందరికీ థామస్ మన్రో ఆద్యుడు. ఆయనకు తెలుగు ప్రజలతో తెలుగు భాషలో వ్యవహరించటం నల్లేరుమీద బండి నడకలాగా వుండేది. ఆయన అడుగు జాడల్లో తెలుగు దేశంలో బ్రిటీషు సివిల్ సర్వీసులో పని చేసి అందర కంటే కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన గౌరవం సి.పి. బ్రౌనుకు దక్కింది.

1858 (నవంబరు 1) లో తూర్పు ఇండియా కంపెనీ పాలన నుండి బ్రిటీషు ఇండియా విక్టోరియా కింద పాలనకు మారింది. ఆమె తన ప్రకటనలో మత విషయాలకు సంబంధించి తన ప్రభుత్వం తటస్థ వైఖరిని అవలంబిస్తుం దని హామీ ఇచ్చింది గానీ, ఆచరణలో అది ఆరక్కపోగా, అంతకు ముందు కంటే మరి కాస్త ఎక్కువగా క్రైస్తవమత సంస్థలు నడిపే పాఠశాలలకు ప్రభుత్వ ఆర్థిక సహాయం లభించటం మొదలయింది. క్రైస్తవ మత బోధలతో పాటు మతాంతరీకరణ కార్యక్రమాలు కూడా మరింత ఎక్కువ అయినాయి. క్రైస్తవ మత విజ్ఞానాన్ని తెలుగు ప్రజలలో ప్రబోధించటానికి తెలుగు భాషనే వాడవలసి వచ్చింది. తెలుగు వాళ్ళకు ఇంగ్లీషు నేర్పి తమ మతాన్ని బోధించేదానికంటే, తాము తెలుగు నేర్చుకొని తమకు వచ్చిన తెలుగులోనే తమ మత భావాలను ప్రబోధించటం సులభంగా వుంటుందని మిషనరీలు తెలుగు మాట్లాడటానికి, వ్రాయటానికి తగిన పుస్తకాలను వ్రాయించుకోటానికి ఉద్యమించారు. ఆ ప్రయోజనం ఈడేరటానికి చేసిన కృషివల్లనే ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణాలు వచ్చాయి. తెలుగు–ఇంగ్లీషు; తెలుగు-నిఘంటువులు వచ్చాయి. ఇంగ్లీషు ఉన్నతాధికారులు-మతాధికారులూ తెలుగు భాషా సాహిత్యాల పట్ల శ్రద్ధ వహించటానికి గల భౌతిక కారణాలను ఇలా క్రోడీకరించవచ్చు:

1. ప్రజల కష్ట సుఖాలను వాళ్ళ భాషద్వారానే తెలుసుకొని వాళ్ళ భాష ద్వారానే వాళ్ళను సమాధానపరచటంవల్ల పరిపాలన సుఖంగా సాగుతుందని.

2. ప్రజల సంస్కృతీ సంప్రదాయాలతో కూడిన మత భావాలు వాళ్ళ సాహిత్యంలో ప్రతిఫలిస్తాయి గనుక, భాషా సాహిత్యాల ద్వారా వాటిని తెలుసు

కొని మన్నించటం ద్వారా ఆ ప్రజలను తమ అదుపు ఆజ్ఞల్లో ఇష్టంగా వున్నట్లే వుంచుకోవచ్చునని.

3. ప్రజల పాత సంప్రదాయాలనూ, ఆలోచనా ధోరణులనూ గొప్పవిగా చేసి వాళ్లకే చెప్పటంవల్ల వాళ్లకు వెనుకచూపేర్పడి, వర్తమాన పరిస్థితులనంతగా పట్టించుకోకుండా మన్నుదిన్న పాముల్లా పడివుండి తమ పాలన కొనసాగటానికి తోడ్పడుతారని.

4. తమ మత భావాలను ప్రబోధించటం ద్వారానూ, తమ మతంలో ప్రజలను చేర్చుకోటం ద్వారానూ దేశీయులను దేశానికి పరాయివాళ్లను చేయటం ద్వారా తమకు దగ్గరవాళ్ళుగా వాళ్ళు అనుకొనేటట్లు చేసి తమ బలాన్ని పెంచుకోవచ్చునని.

5. తాము తెలుగు భాషా సాహిత్యాలను నేర్చుకొని అందులో కృషి చేయటం ద్వారా తెలుగువాళ్ళ రీతుపాతులు-చరిత్రా సంస్కృతీ గ్రహించి వాళ్లను మంచి పాలకులుగా తాము కొనసాగవచ్చునని.

ఆయా కారణాలననుసరించి 18, 19 శతాబ్దాలలో తెలుగు భాషా సాహిత్య చారిత్రక రంగాల్లో పరిశోధన కార్యకలాపాలను పాశ్చాత్యులే ప్రారంభించి యథావకాశంగా నిర్వహించారు.

19 వ శతాబ్దం ఉత్తరార్థం నుంచి, అంటే 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగి విఫలంగా ముగిసినప్పటినుండి దేశంలో బ్రిటిష వ్యతిరేకత ఒకటి మసకమసకగానే అయినా అన్ని రంగాల్లోనూ, ప్రకటమవించటం మొదలయింది. పన్నులెక్కువ వేయటం, వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి పరచక పోవటం, భారతీయులను-తెలుగు వారిని-మిలటరీ సర్వీసుల్లోకి సివిల్ సర్వీసుల్లోకి తీసుకోకపోవటం, క్రైస్తవ మిషనరీలను ప్రభుత్వం మత ప్రచారానికి ఆర్థిక సహాయంతో ప్రోత్సహిస్తూ వుండటం, ప్రజలకు ఇష్టంగాని జమీందారీ పద్ధతి, రైత్వారీ పద్ధతి రెవిన్యూ విధానాన్ని అమలు పరచటం, ఉప్పు కొఠారులను వేలం పాడి గుత్తేదార్ల వశం చేసి ఉప్పు పండించే పేదల నోళ్ళు కొట్టటం-ఈ మొదలయినవన్నీ దేశీయుల్లో బ్రిటిష పాలనలంటే ఒక విధంగా వ్యతిరేక భావాలు కలగటానికి తోడ్పడ్డాయి- పునాది స్థాయిలో ఏర్పడ్డ బ్రిటిషు వ్యతిరేక భావ ప్రభావం ఉపరితల రంగాలమీద కూడా పడింది. పరిశోధన రంగంలో

అడుగు పెట్టిన దేశీయుల ఆలోచన విధానంమీద బ్రిటిషు వ్యతిరేక భావ ప్రభావం యొక్క ఛాయలు కనిపిస్తాయి.

19 వ శతాబ్దం ఉత్తరార్ధం నుండి తెలుగు దేశంలో 1857 లో మద్రాసు యూనివర్సిటీ ఏర్పడి, రాజమండ్రిలో (1877) విశాఖపట్నంలో (1878) బరంపూరులో (1879) కళాశాలలు ఏర్పడి-మొత్తంమీద 20 వ శతాబ్దం ప్రారంభానికి కోస్తా ప్రాంతమంతా ఇంగ్లీషు విద్య వ్యాపించి ఒక కొత్తరకం విద్యావంతుల తరగతి ఒకటి బయలుదేరటానికి దోహదం చేసింది. ఈ విద్యావంతుల తరగతికి హిందూ ప్రాచీన సంప్రదాయ బంధనాలనుండి బయటపడాలన్న ఒక ఆలోచన బలంగా కలిగింది. సామాజిక రాజకీయ రంగాల్లో పాత వ్యవస్థలను సంస్కరించుకోవాలనీ, మార్చుకోవాలనీ వాళ్ళు బయలుదేరారు. దేశంలోని సంస్కరణోద్యమాలకు ఇంగ్లీషు చదువే మూలకారణం, దోహదకారి.

ఇక్కడ గమనించవలసి అంశమేమిటంటే, ఇంగ్లీషు భాషా సాహిత్యాలతో పరిచయమేర్పడటంవల్ల అందులోవున్న పుస్తకాల్లాంటివి తెలుగు సాహిత్యం గురించి తెలుగులో వుంటే బాగుంటుందనిపించి కొందరు అలాంటి పుస్తకాలు వ్రాయటం, ఈ విషయంలో ప్రథమంగా పేర్కొనవలసింది గురజాడ శ్రీరామమూర్తిగారిని. Macaulays critical and Biographical Essays of poets-అన్న పుస్తకాన్ని చూచినప్పుడు అలాంటిది తెలుగులో వుంటే బాగుంటుంది గదా అనిపించినందున ఆయన 1876 నుండి మొదలుపెట్టి 1878, 1880, 1882 సంవత్సరాల్లో తెలుగు కవుల జీవితాల సేకరించినవి సేకరించినట్టు నాలుగు సంపుటాలుగా వెలువరించారు. 1893 లో అన్నింటినీ కలిపి ఒకే సంపుటంగా కవుల జీవితాలను ద్వితీయ ముద్రణగా ప్రచురించారు.

వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర కంటే శ్రీ రామమూర్తిగారి కవి జీవితాలు ముందుగా వ్రాయబడిందే అయినా అందులో ఆయా కవుల గురించి లోకంలో వ్యాపించి వినవస్తున్న మహిమలూ, పుక్కిటి పురాణాలూ ఉన్నంతగా చారిత్రక ఆధారాలమీద, కవుల దేశకాల నిర్ణయాలు గానీ, గ్రంథకర్తృత్వ నిర్ణయాలు గానీ లేవు. ఆ దృష్టితో చూస్తే వీరేశలింగంగారి కవుల చరిత్రే అప్పటి కందుబాటులో ఉన్నంత వరకూ సరియైన ప్రమాణాల ననుసరించి చేయబడిన పరిశోధన ఫలితంగా వెలువడిన మొదటి గ్రంథం. ఈ విషయంలో ఆ

గ్రంథానికి దాని పునర్ముద్రణలే ప్రామాణికమైన రీతాలు. 1886 లో 72 పుటల గ్రంథంగా వెలువడిన కవుల చరిత్ర 1887 ద్వితీయ ముద్రణలో 12 పుటల క్రొత్త విషయాలతోనూ 1890 మూడవ ముద్రణలో మొత్తం 96 పుటల గ్రంథంగానూ, 1895 నాల్గవ ముద్రణలో 150 పుటల గ్రంథంగాను, క్రొత్త క్రొత్త కవులతోనూ క్రొత్త క్రొత్త విషయాలతోనూ పెరుగుతూ వచ్చిందంటే అది "పంతులుగారి పరిశోధన సామర్థ్యమునకును, సత్యదీక్షకును విషయ ప్రామాణికత్వమునకు సాక్షిభూతమగుచున్నది" అని రమాపతిరావుగారు చెప్పిన మాటతో మనమూ ఏకీభవించటమే అవుతుంది. ఇంకా ఆశ్చర్యమైన విషయమేమిటంటే, ఆ గ్రంథం 1899 లో 160 పుటలకు పెరిగి, 1917 నాటికి సంస్కరణలతోనూ పూరణలతోనూ పెరిగి పెరిగి 680 పుటల గ్రంథమై కూర్చున్నది. ఇదంతా పంతులుగారి పరిశోధనా ప్రాగల్భ్యానికేనిదర్శనం.

20 వ శతాబ్దం వచ్చేటప్పటికి - ప్రాచీన భారతీయ విజ్ఞాన వైభవ ప్రశంసా - భావం - పాశ్చాత్య విద్యావిజ్ఞానాలకు అభిముఖ్యం - బ్రిటిషు పాలనకు వ్యతిరేకత - క్రైస్తవ మత ధోరణులకు వ్యతిరేకత - ఈ రెండు విషయాలకు కార్యరంగాలుగా పాలక వర్గంలో దేశీయులుండాలనీ, హిందూమత వైభవాన్ని పునరుద్ధరించాలనీ రాజకీయ సాంస్కృతిక ఉద్యమాలను రూపొందించుకోవటం జరిగింది. 1885 లో భారత జాతీయ కాంగ్రెసు సంస్థ ఏర్పడింది. 1905 లో జరిగిన బెంగాలు విభజన హిందూ మహమ్మదీయ విభజనకు మూలమైంది. ఇప్పుడు భారతీయులు మూడు మతాలవారు: హిందువులు, క్రైస్తవులు, మహమ్మదీయులు. అధిక సంఖ్యాకులయిన హిందువులకు అటు క్రైస్తవులతోకంటే ఇటు మహమ్మదీయులతో విరోధభావం ఎక్కువగా వచ్చింది. కవిగా రసన్న ప్రసిద్ధి కెక్కిన మండపేల్లి రామచంద్రశాస్త్రిగారు ఈ ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో క్రైస్తవ మిషనరీ సంస్థల మతాంతరీకరణ కార్యక్రమాల నడ్డుకోటానికి హైందవ హిత సభ- Indian mission- నొకదాన్ని స్థాపించారు. మహమ్మదీయుల పీర్ల పండుగ అట్టహాసాన్ని ఎదుర్కోటానికి 1909 లో శ్రీరామలీల ఉత్సవాలను ప్రారంభించారు. విశాఖపట్నం, ఎలమంచిలి మొదలయినచోట్ల ఆ ఉత్సవాలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. 1905లో బెంగాలు విభజన భౌగోళికంగా భారతదేశాన్నీ, మానసికంగా భారత ప్రజానీకాన్నీ ఛిన్నాభిన్నం చేసింది. ఆర్థిక సామాజిక స్థితిగతులను వెనక్కునెట్టి మత ద్వేషంతో కూడిన రాజకీయంగా

విరోధానికి బెంగాలు విభజన దోహదం చేసింది. ఇండియా విభజనకు పునాది 1905 లో పడింది. బెంగాలు విభజనవల్ల జాతీయోద్యమంలో స్వదేశీ భావాలు వెల్లువికి, అవి తెలుగు నేలను కూడా ముంచెత్తినాయి. విదేశీ వస్తు బహిష్కరణ, తిరస్కారం, స్వస్థాన వేషభాషాభిమానం ఎక్కువ కావటానికి వందేమాతరం-స్వదేశీ-ఉద్యమం బాగా దోహదం చేసింది. ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన ఆలోచన ద్వారా భారతదేశం భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజింపబడటానికి పునాది ఆ ఉద్యమంలోనే పడినది. తెలుగు భాషా సాహిత్య చారిత్రక వైజ్ఞానిక రంగాల్లోని పరిశోధన కృషి మీద వందేమాతరం ప్రభావం గమనించటానికి 1906 లో స్థాపింపబడిన కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథ మాల విషయం చూస్తే చాలు. ''వందేమాతరం ఉద్యమం వచ్చింది; లక్ష్మణరావు గారి ఆశయాలకు ఉత్సాహమూ, కార్యదీక్షకు పదునూ చేకూర్చింది.'' అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారంటూ ''లక్ష్మణరావుగారి హిందూ మహాయుగమూ, వీరభద్రరావుగారి ఆంధ్రదేశ చరిత్ర సంపుటములూ ప్రకటించి విజ్ఞాన చంద్రిక ఆంధ్ర జాతీయతకు పునాదిరాలు పరిచిందనీ, ఆ గ్రంథాలు వచ్చే వరకూ భారతీయులకు గొప్ప సంస్కృతీ చరిత్రలున్నవనీకానీ, ఆంధ్రులది ప్రాచీన యుగాలలో మహాసామ్రాజ్య నిర్మాణం కావించి అఖండ రాజ్యాధికార వైభవం అనుభవించిన జాతి అని కానీ ఆంధ్ర జనసామాన్యానికే కాదు విద్యాధికుల మనుకొనేవారికి సైతం తెలియదనీ, ఆంధ్రదేశ చరిత్ర వచ్చి ఆంధ్రులలో జాతీయాభిమాన దర్పాలను రేకెత్తించిందనీ, ఆంధ్రోద్యమం బాపట్లకు ఆంధ్ర దేశ చరిత్ర ప్రకటన మొదటి కారణమనీ- ఆ విధంగా ప్రాచీన వైభవ గాథలను చెప్పి జనంలో జాతీయభావోద్దీపనం కలిగించటం జరిగింది''అని వ్రాశారాయన. అందువల్లనే లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రిక- విజ్ఞాన సర్వస్వ ప్రకటన కార్య క్రమం ఉద్యమ స్థాయినందుకొన్నది. చంద్రికలో ప్రకటించిన పుస్తకాలుగానీ, ఆయా విషయాలమీద మూలమట్టుగా పరిశోధించి వ్రాసినవిగానీ అనువాదాలు గానూ ఉద్ధరింపులుగానూ చేసినవి కావు. భారతీయ సంస్కృతికీ విజ్ఞానానికీ సంబంధించిన ఏ విషయాన్నైనా లక్ష్మణరావుగారు స్వయంగా లోతుపాతులు తరచిచూచి చెప్పే నిజాయితీని అంటిపట్టుకొని పని చేయటం చేతనే వైజ్ఞానిక సాంస్కృతిక పరిశోధనకు నిబద్ధతా నిమగ్నతాగల ఉద్యమ స్థాయి ఏర్పడింది. ఈ శతాబ్దం ప్రారంభ కాలంలో భారతీయాంధ్ర చారిత్రక సాంస్కృతిక

రంగంలో ''లోకైన ఉత్తమ శ్రేణికి చెందిన పరిశోధన'' కార్యక్రమాన్ని వందే మాతరం ఉద్యమ స్ఫూర్తితో నడిపించిన మహానుభావుడు లక్ష్మణరావుగారు.

లక్ష్మణరావుగారి మార్గాన్ని అనుసరించి భాషాసాహిత్య రంగంలోనూ చారిత్రక రంగంలోనూ అత్యుత్సాహంతో పరిశోధనలుచేసి కొత్త కొత్త గ్రంథాలను, శాసనాలనూ వెలికి తీసికొనివచ్చి వాటిని నిశితంగా పరిశీలించి సంస్కరించి ప్రచురించటంతోపాటు అందువల్ల తెలియదగిన కొత్త విషయాలను ప్రతిపాదించిన విద్వాంసులు చాలా మంది వున్నారు. మానవల్లి రామకృష్ణ కవిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారూ, శేషాద్రి రమణ కవులూ, జయంతి రామయ్య పంతులుగారూ, వావిలికొలను సుబ్బారావుగారూ, ఆదిరాజు వీరభద్రరావుగారూ, మల్లంపల్లి సోమశేఖర శర్మగారూ, నేలటూరి వెంకట రమణయ్యగారూ - ఇలా ఇంకా కొందరిని చెప్పవచ్చు. వీళ్ళతోపాటు ప్రాచీన భారతీయ విజ్ఞానం సంస్కృతంలో వుండి దేశీయులకు అందుబాటులో లేకుండాపోతున్నదనిపించి అనువాదాలకు పూనుకొని పనిచేసిన వారిలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారిని చెప్పాలి. 1919 నాటికే ఆయన వాత్స్యాయనుని కామసూత్ర గ్రంథాన్ని వివిధ వ్యాఖ్యానాలతో అధ్యయనంచేసి తెలుగులోకి అనువదించారు. అలాగే గౌతమ ధర్మ సూత్ర గ్రంథాన్ని కూడా ఆయన తెనుగు చేశారు. వట్టి తెనుగుచేయటంగాక ఆయా గ్రంథాలలో దొర్లియున్న విషయాలనుబట్టి అప్పటి సామాజిక జీవిత విశేషాలను, సాంస్కృతిక ఆలోచనలను వివరంగా సమన్వయించి వ్రాసే ప్రయత్నం చేశారు. సాంఘిక చరిత్ర అవగాహనకూ, నిర్మాణానికీ సాహిత్యగ్రంథాలూ, ధర్మ శాస్త్ర గ్రంథాలు తోడ్పడటాయన్న ఒక వాఙ్మయ సత్యాన్ని ఆదినారాయణ శాస్త్రిగారు బాగా కనుక్కొని తెలుగువారికి తెలియచెప్పారు. తెలుగులో తరువాత తరువాత వచ్చిన సాంఘిక చరిత్రలకూ, సాహిత్య రచనలనుబట్టి అప్పటి సామాజిక జీవితం గురించి ఆలోచనాకర్తే సురవరం ప్రతాపరెడ్డిగారి లాంటి విమర్శకులు రావటానికి ఆదినారాయణ శాస్త్రిగారి గ్రంథాలూ, వారి పీఠికలూ దోహదం చేశాయి. పంచాగ్నుల వారి పరిశోధన గ్రంథాలను తోనారసి చూచేది-అసాధారణ ప్రజ్ఞాపాటవంతో కూడుకొన్నది. వాఙ్మయ అధ్యయనానికి చరిత్రను జోడించుకొన్నది.

వందేమాతరం ఉద్యమమే తెలుగునాట జాతీయ విద్యావ్యాప్తికి, ప్రత్యేకంగా జాతీయ పాఠశాలలు, కళాశాలలూ ఏర్పాటు చేసింది. ముఖ్యంగా రాజమండ్రి, మచిలీపట్నం ఆ రోజుల్లో ఈ జాతీయ విద్యాస్థానాలుగా వుండేవి.

కాలేజీ విద్యార్థులు రాజకీయాల్లోకి దిగటానికి కూడా ఆ ఉద్యమమే కారణం. 1907 లో రాజమండ్రి కళాశాలలో వందేమాతరం బాడ్జీలను పెట్టుకొన్నందుకు విద్యార్థులకు కాలేజీలో ప్రవేశాన్ని నిరాకరించటంతో విద్యార్థులు ఉద్యమంలోకి దూకటానికి వీలు చిక్కింది. భారత ఆంధ్ర జాతీయతా భావాన్ని తీవ్రంగా రెచ్చగొట్టిన వందేమాతరం ఉద్యమ ప్రభావం విద్యావైజ్ఞానిక సాంస్కృతిక విషయ పరిశోధనల మీద కూడా పడింది. పడటానికి కారణం అది కేవలం ఒక ప్రభావంగా కాక ఒక జీవిత దృక్పథంగా మనసుల్లో నాటుకొన్నది. ఉమామహేశ్వర పండితుడూ, జటావల్లభుల పురుషోత్తంగారూ, కొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు మొదలయినవారు హిందూమత వైభవోన్నతులను గురించి మహాశా పన్యాసాలిస్తూ తెలుగుదేశమంతా సంచారం చేయటానికి వాళ్ళకాకాలంలో ఏర్పడిన జీవిత దృక్పథమే కారణం. ఆ దృష్టితోనే వారనేక గ్రంథాలు వ్రాసి ఆ దృక్పథాన్ని బాగా ప్రచారం చేశారు. కోట వెంకటాచలంగారి పురాణ చారిత్రక పరిశోధనలన్నింటి వెనుకా భారత జాతీయ మహావైభవాన్ని విదేశీయులయిన పాశ్చాత్యులా మనకు చెప్పేది- మనమే ఆయా విషయాలను లోతుగా పరిశోధించి చెప్పకోవాలన్న భావన వుంది.

ఇంగ్లీషు దొరల ఉపయోగం కొరకు తెలుగు వ్యాకరణాలను ఇంగ్లీషులో వ్రాయటం మొదలు అయినప్పుడే తెలుగుభాష యొక్క స్వరూప స్వభావాల గురించి ఆలోచన- పరిశోధన ప్రారంభమయ్యాయని చెప్పవచ్చు. ఎందుచేత నంటే, 1816 లో A. D. Camp bell అనే ఆయన A Grammar of the Teloogoo Language అనే గ్రంథం వ్రాస్తే దానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ Traneis Whyte Ellis అనే ఆయన తెలుగు - తమిళం, మల యాళం, కన్నడం భాషలతో కలిసి ఒక భాషా కుటుంబానికి చెందినవిగా కనిపిస్తున్నదని వ్రాశాడు. అది ద్రావిడ భాషాకుటుంబ భావనకు మూలం. ఈ అభి ప్రాయ ప్రతిపాదనను కూలంకషంగా పరిశోధించి సిద్ధాంతంగా ప్రతిపాదించింది Robert Caldwell. ఆయన గ్రంథం పేరు A Comparative Grammar of the Dravidian or South-Indian Family of Languages. అది 1856 లో వెలువడింది మొదటిసారిగా. భాషాపరిశోధన విధానాన్ని శాస్త్రీయ పద్ధతులతో నడిపించిన మొదటి విద్వాంసుడు కాల్డ్ వెల్. ఆయనకు ప్రధానమైన నాలుగు ద్రావిడ భాషా సాహిత్యాలతో మంచి పరిచయ

మన్నది. సంస్కృత భాషతో ఈ ద్రావిడ భాషలకు జన్మసంబంధం లేదన్న కాల్డ్‌వెల్ సిద్ధాంతాన్ని దేశీయ విద్వాంసులు సరిగ్గా అర్థం చేసుకోక వ్యతిరేకించటంచేత మన భాషా పరిశోధన చాలాకాలం కుంటుపడింది. ముఖ్యంగా తులనాత్మక పరిశోధన మెరకపట్టింది. 1906 లో Linguistic Survey of India నాల్గవ సంపుటం ద్రావిడభాషల గురించి వచ్చింది. దాన్ని సిద్ధంచేసింది కూడా విదేశీయుడే. నార్వేపండితుడు Sten Konow. ఈ సంపుటం వచ్చినప్పటి నుండి భారతీయ విద్వాంసులు భాషాశాస్త్ర విషయాల్లో శ్రద్ధవహించటం మొదలు పెట్టారు. వాళ్ళల్లో తెలుగువాళ్ళు లేరు. తమిళులు, కన్నడిగులు – పాశ్చాత్యులు మాత్రమే వున్నారు. భాషాశాస్త్ర పరిశోధకులలో కోరాడ రామకృష్ణయ్యగారినీ, చిలుకూరి నారాయణరావు గారినీ, గంటిజోగి సోమయాజిగారినీ మొదటివాళ్ళుగా చెబుతారు. వాళ్ళ కాలం తరువాత భాషా పరిశోధనలు వినూతన పద్ధతుల్లో శాస్త్రీయంగా కొనసాగాయి. అంతకంటే ముందుగా చెప్పవలసింది గిడుగు రామమూర్తి పంతులు గార్ని. నన్నయగారినాటినుండి వెయ్యేళ్ళ తెలుగు భాషా వికాసాన్ని పరిశీలించిన ఉద్దండ భాషా పరిశోధకుడాయన. సవరభాష గురించిన ఆయన పరిశోధన జగత్ప్రసిద్ధం. గిడుగు రామమూర్తిగారి ప్రసిద్ధి అంతా ఆయన వ్యావహారిక భాషావాద విజయం మీద ఆధారపడి వుంది. స్వదేశీ ఉద్యమ ప్రభావంలోనే వ్యావహారికా భాషా ఉద్యమం సాగింది. రాజకీయాల్లో తన్నర్వేటిప్పులాగానే ఈ భాషావాదంలో గ్రాంథిక వాదులు. వ్యావహారిక వాదు లది లిబరల్ యాంటిట్యూడ్. జమీందారీ ప్రభువుల అహంకారపు దర్జా గ్రాంథిక వాదులది. ప్రజాస్వామ్య దృక్పథం గలది వ్యావహారిక భాషావాదం. వందేమాతరం ఉద్యమ స్ఫూర్తితో మాతృభాషను లాక్షణికవాద శృంఖలాలనుండి విముక్తం చేసి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో నలుగురికీ మంచిగా పనికివస్తూ ప్రతికేట్టు చేయటానికి గిడుగు తన జీవితాన్ని ధారపోశాడు.

1930 ఉప్పు సత్యాగ్రహ శాసనోల్లంఘన ఉద్యమం కూడా ఫలవంతం కాకపోయేటప్పటికి యువతరం గాంధీగారి నాయకత్వంనుండి బయటపడి వామ పక్ష భావాలు గల కమ్యూనిస్టు-సోషలిస్టు-రాడికల్ హ్యూమనిస్టు పార్టీలుగా చీలి బయలు దేరారు. కమ్యూనిస్టు పార్టీకే ఒక సామాజిక జీవిత తాత్విక దృక్పథ మున్నది. దానికి కొన్ని మార్పులతోనూ చేర్పులతోనూ మిగిలిన రెండు పార్టీలూ సర్దుకొన్నాయి. కమ్యూనిస్టు తాత్విక దృక్పథ ప్రభావం విస్తృతంగా కాక

పోయినా అప్పటినుండి తెలుగు భాషా సాహిత్య చారిత్రక సాంస్కృతిక విషయ పరిశీలనల్లోనూ పరిశోధనల్లోనూ కాస్త కాస్త కనిపిస్తూనే వుంటుంది. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం 1943 లో ఏర్పడ్డప్పటి నుండి పుచ్చలపల్లి సుందరయ్య గారూ, మద్దుకూరు చంద్రశేఖరరావు గారూ, శ్రీరంగం శ్రీనివాస రావుగారూ, టి. వి. ఎ. ఎస్. నారాయణరావు గారూ - భాషా సాహిత్య విషయాల్లో కమ్యూనిస్టు దృక్పథాన్ని వివరిస్తూ వచ్చారు. జి. వి. కృష్ణారావు గారు కావ్య జగత్తు అనే పుస్తకాన్ని ఆ దృక్పథంతోనే వ్రాశారు. 1974లో వెల్చేరు నారాయణరావు గారు తెలుగులో కవితా విప్లవాల స్వరూపం అనే సిద్ధాంత గ్రంథం ఆంధ్రా యూనివర్సిటీలో సమర్పించేదాకా యూనివర్సిటీ పరిశోధనల్లోకి మార్క్సిస్టు ఫిలాసఫీ ఎక్కలేదు.

స్వాతంత్ర్యం దాక మునుపు జరిగిన భాషా సాహిత్య పరిశోధనల విషయంలో ఆయాలక్షణాలున్నాయి. అప్పటివాళ్ళు ఆయాలక్షణాలతో తాదాత్మ్యాన్ని పొందే ఆయా పనులు చేశారు. అంతవరకూ శాస్త్రీయ నిజాయితీ వున్నది.

# భాషోద్యమాలు

—చేకూరి రామారావు

ప్రపంచంలో భాషలన్నిటికీ లిపిలేదు. లిఖితస్థితి ఉన్న భాషా సమాజాల్లోనే భాషా ఉద్యమాలు కనిపిస్తున్నై. భాషోద్యమం రచనా భాష కుసంబంధించింది మాత్రమే అని భాషా సమాజాలను పరిశీలిస్తే తెలుస్తుంది. భాషోద్యమం అంటే ఏమిటి ? భాషోద్యమాలు ఎందుకు వస్తాయి ? అనే ప్రశ్నలు ఈ ప్రసంగవ్యాస పరిధిలోనివే. దీనికి పూర్వరంగంగా, విషయాన్ని కొంచెంలోతుగా అర్థం చేసుకోటానికి వీలుగా మౌలిక లిఖిత భాషలమధ్య వ్యత్యాసాన్ని పరిశీలిద్దాం.

మౌలిక భాష ప్రధానంగా అత్యధిక భాగం ప్రత్యక్ష ప్రయోజన లక్షితమైనది. వాక్యాల్లో మనం వ్యక్తంచేసే అభిప్రాయం, విషయనివేదనకో, విషయ సంపాదనకో, కార్యాచరణకో ఉద్దేశించబడింది. ప్రత్యక్ష విషయ (భావ) గ్రహణ మౌలిక భాషా లక్ష్యం కాగా మౌలిక భాషా వ్యవహర్తలతో భాష కూర్పు మీద దృష్టి అంతగా ఉండదు.

అయితే ఇందుకు ఒకే అపవాదం ఉంది. మనుషులకు సౌందర్య దృష్టి సహజమైనది. తన చుట్టూ తనకుద్దిష్టంకాని ప్రకృతిలోనే ఎవరో ఎవరి కోసమో ఉద్దేశించినట్లుగా సుందర దృశ్యాల్ని చూడటానికి, శ్రావ్య సంగీతాన్ని వినటాని అలవాటుపడ్డ మనిషి తన దండుబాటులో, సాగే గుణమున్న (flexible) భాష అనే వస్తువు ఉన్నప్పుడు దాన్ని సౌందర్య ప్రతిపాదనకోసం ఉపయోగించటం ఆశ్చర్యంకాదు. అందువల్ల ప్రతి భాషా సమాజంలోనూ సాహిత్యం అని మనం పిలిచే భాష కూర్పు ఉంటుంది [ఇక్కడ సౌందర్యం, సాహిత్యం అనే మాటల నిర్వచనాల తీగెలు కదిలించను.]

సాహిత్య రచనలో భాషమీద దృష్టి ఉంటుంది. ప్రత్యక్ష ప్రయోజనాన్ని మించి ఉండటంవల్ల సాహిత్యం లిఖితస్థితి లేకుండాకూడా మొదటి పరిసరాన్ని

దాటి భిన్న కాలాలకు విస్తరించగలదు. జానపద గేయాలు, గాథలు ఇట్లాంటివే. మౌఖిక భాషలో నిక్షిప్తమయ్యే విషయానికి మనుషుల జ్ఞాపకశక్తి ఒక పెద్ద పరిమితి. లిఖిత సంప్రదాయంలేని భాషా సమాజాల సాంకేతికాభివృద్ధి అతిప్రాథమికంగా ఉంటుంది. అభివృద్ధి చెందిన సమాజానికి లిఖిత భాష చాలా ముఖ్యమైన అంగం.

మాట్లాడే భాషకు వక్తృశ్రోతలు ప్రత్యక్షంగా ఉండాలి. దీనిస్థితికి దేశ కాల పరిమితి ఉందన్నమాట. భిన్నకాలాలకు భిన్నప్రాంతాలకు అందాలంటే అంచెలంచెలుగా మళ్ళీ మనుషులే అందించాలి. దానివల్ల చాలా చిక్కులున్నై. పరిమితమైన మనిషి జ్ఞాపక శక్తిమీద ఆధారపడాల్సి రావటంవల్ల భాషలో నిక్షిప్తం చేసే విషయం పరిమాణం (quantity of infromation) అత్యంతం పరిమితంగా ఉంటుంది. అంతేకాదు, మనిషి జ్ఞాపకశక్తి విషయ గుణాన్ని (quality of information) కూడా మార్చవచ్చు.

లిఖితభాష ఈ పరిమితులను దాటుతుంది. విషయ పరిమాణానికి పరిమితులుండవు. భాషా ప్రసారానికి దేశకాలావధులుండవు. అంతేకాక తొలిసారి నిక్షేపించిన విషయం మారకుండా ఉంటుంది. Accuracy చెడిపోదు.

ఇదేగాక ఇంకో విశేషం ఉంది. మౌఖిక భాషా స్థితికి స్థిరత్వం లేదు. ధ్వనివాహకమైన భాష త్వరగా గాలిలో కలిసిపోతుంది. అందువల్ల విషయ గ్రహణ త్వరగా జరగాలి. లిఖితభాష విలంబ విషయ గ్రహణాన్ని (delayed comprehension) సహిస్తుంది. ఇప్పుడు చదివిన వ్యాసాన్ని ఇప్పుడే అర్థం చేసుకోవాల్సిన అవసరంలేదు. ఇంకో నెలతరవాత అర్థం చేసుకోవచ్చు.

మౌఖిక భాషలో వ్యక్తీకరణ, ఎడిటింగ్ దాదాపు ఒకేసారి జరుగుతై. ఒకసారి ప్రయోగించిన తరువాత ఎడిటింగు కవకాశం లేదు. లిఖితభాషలో వాక్యాలనుగాని, వాక్య సముదాయాలనుగాని ముందు వెనుకలు చాలాసార్లు చూసుకొని సవరించుకొనే అవకాశం ఉంటుంది. ఆ అవకాశం టెక్నాలజీ పెరిగే కొద్దీ ఇంకా ఎక్కువయింది. విషయ నిక్షేపంలోనూ, విషయ గ్రహణంలోనూ లిఖితభాషకు విలంబ క్షమత్వం అనేది గుర్తించదగిన ముఖ్యాంశం. దీనివల్ల మౌఖిక, లిఖిత భాషా స్వరూపంలో ప్రయోగంలో భేదం ఉంటుంది. అందుచే

రాసేభాషకు మాట్లాడే భాషతో సంపూర్ణసామ్యం ఉండదు. మౌఖిక, లిఖిత స్థితుల్లో, పరిసరాల్లో, సందర్భాల్లో ఉన్న భేదంవల్ల ఈ భేదం వస్తుంది. ఇది సహజమైనది. అందువల్ల రాసేభాషను మాట్లాడినట్టు లేదే అని ఈసడించటం అంత సమంజసంగా కనిపించదు.

భాషా సమాజానికి ఒక సంస్కృతి ఉంటుంది. బహుకాలంగా లేఖన సంప్రదాయం ఉన్న సమాజానికి చిరకాలంగా ఏర్పడ్డ సాంస్కృతిక సంప్రదాయాలు, భాషా సంప్రదాయాలు ఉంటై.

ఉదాహరణకు తెలుగుభాషా సమాజానికి 2 వేల సంవత్సరాల సాహిత్య రచనా సంప్రదాయం ఉంది. ఏ సంప్రదాయమైనా నూటికి నూరుపాళ్లూ అంత కాలం అట్లాగే ఉండదు. తయారయిన ఒక వ్యవస్థలో కొన్ని అంశాలు నష్ట మవుతూఉంటే మరికొన్ని అంశాలు కొత్తగా చేరుతూ ఉంటై. ఇది విపగణ అక్కరలేని సత్యం. భౌతిక, సాంస్కృతిక, భాషా వ్యవస్థలన్నిటిలోనూ ఇది నిత్యం జరిగే పని. మౌఖిక భాషా వ్యవస్థలో ఈ పని కొంత వేగంగా జరుగు తుంది. లిఖిత భాషా వ్యవస్థలో ఈ పని కొంత ఆలస్యంగా జరుగుతుంది. ఉదా హరణకు తెలుగుకావ్య భాషా సంప్రదాయాన్నే తీసుకోండి. నన్నయ్య భాషలో "నూఱేండ్లుం గొలెన్, యోజనంబున గొలెన్, నినుజూచినయప్పట గొలెన్" అని కొలెన్ అనే విభక్తి ప్రత్యయాన్ని దేశాల బోధకనామాలమీద పర్యంతార్థంలో ఉంది. తరవాత భాషలో, ముఖ్యంగా నన్నెచోడ తిక్కనల భాషలో "ఎఱిగిన కొలఁదిను, గూడిన కొలఁదిను, గోగ్రహణంబునంగొలె, కనుచూపుకొలె," అని క్రియాజన్య విశేషణాలమీద, వ్యాపకార్థకనామాల తరవాత ఈ ప్రత్యయం కనిపిస్తుంది. ఆ మేరకు కావ్యభాషా వ్యవస్థలో మార్పు జరిగింది. ఈ కావ్య భాషలో వివిధకాలాల్లో శబ్దరూపాల్లోనూ, అర్థాల్లోనూ జరిగిన మార్పుల్ని గిడుగు రామమూర్తిగారు బాలకవి శరణ్యంలోనూ, సూ.రా నిఘంటు విమర్శనంలోనూ విశేషంగా చర్చించారు. విశేషచరిత్ర ఉన్న ఏ భాషా వ్యవస్థలోనైనా ఇట్లాంటి మార్పులు కనిపిస్తయి.

లిఖిత భాష అనే అర్థంలో రచనాభాష అనే మాటను ఇప్పుడు వాడు తున్నాం. ఆ అర్థంలోనే ఈ వ్యాసం వాడతాను. రచనాభాషకూ, మౌఖిక భాషకూ స్థితి, పరిసర, సందర్భభేదాలవల్ల వచ్చే వైషమ్యాలను గుర్తిస్తూనే

రెంటికీ ఎక్కువ పోలికలున్న ప్రాచీనకాలాన్ని ఊహించటం [illegible] సాధ్యమే. ఏదో ఒక కాలంలో ఈ రెండు భాషలూ అతి సన్నిహితంగా ఉన్న యనుకుందాం. తరవాత కొంతకాలానికి అనుసరించటానికి వీలయిన ఒక సంప్రదాయం ఏర్పడుతుంది. మౌఖిక భాషతో సామ్యం ఉంచుకుంటూనే తద్భిన్నమైన భాషావ్యవస్థ ఏర్పడుతుంది. దీన్నే సంప్రదాయీకరణం అందాం. దీన్ని ఇంగ్లీషులో stylization అనీ, దాన్ని అనుసరించి శైలీకరణం అని తెలుగులో వ్యవహరిస్తున్నారు. ఒకరకంగా సంప్రదాయీకరణం, స్వనస్థీకరణం ఒకే రకమైన వ్యాపారాలు. తెలుగురచనా భాషలో 11వ శతాబ్దినుంచీ సంప్రదాయీకరణానికి ప్రత్యక్ష సాక్ష్యం దొరుకుతుంది. సంప్రదాయీకృతం కాని లిఖిత భాషావ్యవస్థ ఉండదనుకుంటాను. నిజానికి మౌఖిక సాహిత్య భాషలోనూ ఈ సంప్రదాయీకరణం కనిపిస్తుంది. ''అనగా అనగా ఒక రాజుండేవాడు'' అనే వాక్యం మౌఖిక సాహిత్యంలో సంప్రదాయీకరణకు ఒక ఉదాహరణ. రచనా భాషలో యక్షగానాలు, సంకీర్తన సాహిత్యం, శాసన భాష, పత్రికల భాష – ఇవన్నీ సంప్రదాయీకరణకు లక్ష్యాలే. ఆ మాటకొస్తే రామమూర్తి, అప్పారావుగార్ల 'ఉన్నూ'ల భాష సంప్రదాయీకృతమైన భాష.

సంప్రదాయానుసరణంవల్ల పదాలూ, పదరూపాలూ, వాక్య పద్ధతులు తత్కాల మౌఖిక భాషావిరుద్ధంగా రచనా భాషలో కనిపిస్తాయి. వర్ణ క్రమ రచన (స్పెలింగు) లోనూ కనిపిస్తాయి. విద్వాన్ విశ్వంగారి 'మాణిక్యవీణ' లో బండి 'ఱ' ఇట్లాంటిదే. మాట్లాడే భాషలో తరచుగా లోపించే ఉత్తమ పురుష క్రియాంత ప్రత్యయం 'ను' రచనాభాషలో ప్రత్యక్షం కావటం ఇందుకే. ఉత్తరం ముగిస్తూ 'ఇట్లు' అని రాయటం సంప్రదాయీకరణ ప్రభావమే. రచన భాషలో ప్రాచీనతా ముద్ర కనిపించటం సంప్రదాయీకరణ ప్రభావమేనని గుర్తించటం కష్టం కాదు. ఇది తెలుగు భాషకు ప్రత్యేకమైనది కాదు. ఇంగ్లీషు భాష రచనలో ఉత్తమ పురుషలో shall ప్రయోగం మౌఖిక భాషా సామాన్యం కాదు. మౌఖిక భాషలో కనిపించే 'ain't' మాండలికేతర భాషలో కనిపించదు. ఇట్లా ఏ కాలంలో అయినా మాట్లాడే భాషకూ రచనా భాషకూ గుర్తింపదగిన వైషమ్యం ఉంటుంది. ఇందులో తప్పొప్పుల ప్రసక్తి లేదు. ఉచితానుచితాల ప్రమేయం లేదు. ఉన్నస్థితి ఇది.

చారిత్రక వాస్తవాల పరిశీలన మిషతో గ్రాంథిక భాషావాదాన్ని నాంగ దాటుగా రంగ ప్రవేశం చేయిస్తున్నానన్న అనుమానం రావచ్చు మీకు. గ్రాంథిక, వ్యావహారిక భాషా వాదాలను శాస్త్ర దృష్టితో పునః పరిశీలించుకోవలసిన అవసరాన్ని మాత్రమే మీకు తెలియజేయదల్చుకున్నాను. గ్రాంథిక, వ్యావహారిక భాషా వాదాలకు కాలం చెల్లినట్టుగానే భావిస్తున్నాను. ఆయనెవరో 24 ఏళ్ళ క్రితం జయంతి పత్రికలో అన్నట్టుగా, భాషా లడాయికి పేర్లు సరిగ్గా కుదరలేదు. వాక్య నిర్మాణంలో జాతీయతా ముద్రతో రచించే గ్రాంథిక భాషా ఉంది, అందుకు విరుద్ధంగా రాసే వ్యావహారిక భాషా ఉంది. గ్రాంథిక, వ్యావహారిక భాషా భేదాలు అన్ని వేళలా స్పష్టంగా వేరుపరిచి చూపలేం.

గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావుగార్లు శిష్ట వ్యావహారిక భాష అనే పేరుతో ఒక రకపు రచనా భాషను ప్రవేశపెట్టారు. ఉదాహరణకు గురజాడ అప్పారావుగారి వచన శైలి చూడండి.

"గత కాలములో నపమాష్టం పంచాయణం చెయ్యడమందు నిపుణులయిన బ్రాహ్మణ వుద్యోగస్థులు రయితును, రట్టను పరిపాటిగా ఒక స్వారస్యమైన తిట్లును తిట్టుచూ వచ్చేవారు. ఇప్పుడైనా రడపెదలను ఆ శబ్దం వినబడడం కద్దు. ఈనాడు కొందరు పండితులూ, కవులూ అట్టిదియే గ్రామ్యోక్తి పాకటి గ్రామ్యభాషను గురించి వినియోగించుదురు."

గురజాడ అప్పారావుగారి దృష్టి కొత్త గ్రాంథిక భాషను ప్రవేశపెట్టటమే అనేది స్పష్టంగానే తెలుస్తుంది. "వాడుక భాషలో నుంచి సులభసాధ్యమైన పాక కొత్త గ్రాంథిక భాషను కల్పించుకుంటే శాస్త్రులుగారికి యేమికొరత?" అన్నారాయన.

గురజాడ అప్పారావుగారు "బ్రాహ్మణాదులువాడుకొనే నాగరికమైన భాష" అన్నా, ఆయన రాసింది వాడుక భాష కాదని గుర్తించటం కష్టంకాదు. ప్రాచీన రచనా భాషా రూపాలను, ఆధునిక వ్యవహార భాషను కలగలిపి ఒక కొత్త గ్రాంథిక భాషను తయారు చెయ్యటమే ఆయన ఉద్దేశించింది. శిష్ట వ్యావహారికం

పేరుతో ఇంతవరకు ఎవరు రాసిందయినా ఖచ్చితమైన అర్థంలో మౌఖిక వ్యవహార భాష కాదు. మౌఖిక భాషలో లేని ప్రాచీన నామ క్రియాపదాలు, కొన్ని రకాల వాక్య భేదాలు రచనా భాషలో ఉంటాయి. మౌఖిక భాషలో లేని క్లిష్టత, సంక్లిష్టత, రచనా భాషలో ఉంటాయి. కొందరి రచన మౌఖిక స్వభావానికి చాలా దూరంగా ఉంటుంది.

ఉదాహరణకి శ్రీశ్రీగారి ఈ శైలి చూడండి: ''పశ్చాదృక్కులు ప్రగల్భ ఘోషలను లక్ష్యపెట్టక మానవ మహోదయం దిక్కుగా ప్రగతిరథం సాగిపోతుంది. తొలినుంచీ తెలుగు జాతి ప్రగతి మార్గంలో అగ్రేసరంగానే నిలిచింది. అవాంతరాలకు జడిసి ఆగిపోవడంగాని, అనర్థాలకు లొంగి అణిగిపోవడం గాని గతంలో జరగలేదు, ఆగతంలో జరుగబోదు. సుస్థిరమూ, సుస్పష్టమూ అయిన ఈ విశ్వాసమే ఇక్కడ మనందరిని ఏకత్రపరిచిందని ఘంటాపథంగా చెప్ప దిస్తున్నాను.'' ఈ రకమైన భాష ఎవరి నోటంటూ అయినా వింటే రాసింది చదువుతున్నట్టుగానో, అప్పజెప్పుతున్నట్టుగానో అనుకుంటాం. శ్రీశ్రీగారు 1955 ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ సమావేశంలో రాసుకొచ్చి చదివిన అధ్యక్షో పన్యాసంలో భాగం ఇది.

అట్లాగే శ్రీశ్రీగారి చరమ రాత్రిలో ఈ వాక్యాలు వినండి:

''ఆరు నెలలు అహోరాత్రాలు జాగ్రత్స్వప్నాలలో ఎడతెగని యోచనా తరంగాలలో నా నిశ్చయాన్ని స్నానం చేయించాను. ఆరు నెలల అవభృథ స్నానంలో పవిత్రీకృతమైన నా అందమైన, నా ఆడుకునే, నా తిరుగులేని భయంకరమైన సంకల్పాన్ని ఈ రాత్రి ఆచరణలో పెడుతున్నాను.''

అయితే, వ్యావహారిక భాషోద్యమం ప్రయోజనమేమిటి? ఈ ఉద్యమం ఒక ఒక నిర్దిష్టమైన కాలంలో ఎందుకొచ్చింది? అసలు ఉద్యమమంటే ఏమిటి? భాషోద్యమాలు పూర్వం ఉన్నాయా? ఇట్లాంటి ప్రశ్నలు తలెత్తుతై. ఈ సందర్భంలో భాషకూ సమాజానికీ ఉన్న సంబంధాన్ని కూడా మనం అర్థం చేసుకోవాలి.

భాష మానవుల సాంఘిక వ్యాపారానికి అతి ముఖ్యమైన సాధనం. భాష లేకపోతే మానవజాతి సాధించిన అభివృద్ధి అంతా సాధ్యం కాదు. మానవులు భాషను సంఘ జీవనంతోపాటు సాధించుకున్నారు. భాష ఎట్లా పుట్టింది? అనే ప్రశ్న మనకు ప్రస్తుతం అనవసరం. మనకు తెలిసిన చరిత్ర బట్టి చూస్తే ప్రపంచంలో ఎక్కడా ఎప్పుడూ భాష లేని మానవ సమాజం ఉన్నట్లు సాక్ష్యం లేదు. అందువల్ల భాషకూ సమాజానికి ఉన్న సంబంధాన్ని గురించి అంతగా ఘోషించి చెప్పక్కర్లేదు. ఆ సంబంధం స్వభావాన్ని గురించి మాత్రం చెప్పుకోవాలి.

మానవజాతి అభివృద్ధి కొన్ని దశలవారీగా జరిగిందని Henry Morgan సూచించాడు. ఆ దశల మూలతత్వాన్ని విశదీకరిస్తూ మార్క్స్, ఏంగెల్సులు "ప్రతి దశలోనూ సమాజానికి ఆర్థిక పునాది ఉంటుంది. ఆ పునాది మీద నిర్మితమయ్యే రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థ ఉపరితల నిర్మాణంగా ఉంటుంది. రెండు నిర్మాణాలు పరస్పర పోషకంగా, రక్షకంగా ఉంటాయి. ఒక దశ నుంచి ఇంకో దశకు సమాజం మారేప్పుడు ముందు పునాది మారుతుంది. దానిమీద ఏర్పడ్డ ఉపరితల నిర్మాణమూ తరవాత మారుతుంది. ఈ మార్పు వర్గపోరాటంవల్ల సాధ్యమవుతుంది" అని అన్నారు. దీన్ని గురించి ఏ ప్రాథమికమైన మార్క్సిస్టు మూలగ్రంథం చూసినా తెలుసుకోవచ్చు.

సామాజిక అభివృద్ధిలో అత్యంత ప్రముఖపాత్ర వహించే భాష స్థానం ఎక్కడ అనే ప్రశ్న ఉద్భవిస్తుంది. N.Y. Marr అనే సోవియట్ భాషా శాస్త్రజ్ఞుడు దీన్ని గురించి ఆలోచించి కొన్ని సిద్ధాంతాలు చేశాడు. భాషను ఆర్థిక వ్యవస్థమీద ఆధారపడ్డ ఉపరితల నిర్మాణంలో భాగంగా గుర్తించాడు. భాషకు వర్గదృష్టిని అంటగట్టాడు. దీని విషయమై సోవియట్ శాస్త్రజ్ఞులలో తర్జనభర్జనలు జరిగినై. మార్క్స్, లెనిన్ సిద్ధాంతాల భాష్యకారుడు జోసెఫ్ స్టాలిన్ ఈ వివాదంలో పాల్గొని, కొన్ని సందేహాలను నివారించి, భాషా సమాజాలను గురించిన సదవగాహనకు గట్టి ప్రాతిపదిక వేశాడు. ఆయన వివరణ సారాంశం ఇది:

"సామాజిక దశలలో ఒక దశనుంచి ఇంకో దశకు పరివర్తన నెమ్మదిగా జరగదు. క్రాంతియుతంగా జరగదు. ఒక వర్గం తమమీద పెత్తనం చేస్తున్న

వర్గాన్ని బలవంతాన అధికారాన్నుంచి తొలగించి, పునాదిని మారుస్తుంది. ఒక దశ పునాదితో పాటు, దానిమీద నిర్మితమైన ఉపరి నిర్మాణం పేకమేడం కూలి పోతుంది. కొత్త ఆర్థిక వ్యవస్థ పునాదిగా కొత్త ఉపరి నిర్మాణం సాగుతుంది. ఇదంతా విప్లవ కార్యాచరణవల్ల సాగుతుంది.'' భాష ఉపరితల నిర్మాణంలో భాగమయితే ఆర్థిక వ్యవస్థ మారినప్పుడల్లా భాషలో మార్పు రావాలి. ఆ మార్పు విప్లవకరమైన మార్పు కావాలి. అంటే, పాత రాజకీయ వ్యవస్థలాగే పాత భాషా యంత్రాంగం భ్రష్టమైపోవాలి. కొత్త పునాది మీద కొత్త భాషా యంత్రాంగం నిర్మితం కావాలి. ఇట్లాంటివేవీ భాష విషయంలో జరిగినట్లు ఆధారాలు లేవు. భాష ఒక వర్గం చేతిలో ఆయుధం కావాలి. భాషకు వర్గ స్వభావం ఉండాలి. పీడితవర్గం పీడకవర్గ భాష మీద యుద్ధం ప్రకటించాలి. కాని, భాషకు ఈ విధమైన వర్గస్వభావం ఉన్నట్టు మనకు దాఖలా లేదు. భాషను ఉపరితల నిర్మాణంలో భాగంగా భావించటం పొరపాటు. భాషకు వర్గస్వభావం లేదు. భాషను కొన్ని అంశాలలో ఉత్పత్తి పరికరాలతో పోల్చవచ్చు. ఉత్పత్తి పరికరాలకు వర్గస్వభావం లేదు. ఏ వర్గమైనా దాన్ని ఉపయోగించుకోవచ్చు. అయితే, ఉత్పత్తి పరికరం వస్తూత్పత్తి చేస్తుంది. భాషకు అట్లాంటి సామర్థ్యం లేదు.

భాష మారని పదార్థంకాదు. భాష మారుతుందని వాదించనక్కర్లేని సత్యం. అందులో మార్పును పదార్థ అస్తిత్వంలో భాగంగా పరిగణించే మార్క్సిస్టులు భాషలో మార్పును అలక్ష్యం చేయటం అసాధ్యం. అయితే, భాషలో మార్పులు సామాజిక రంగంలో లాగా దశలవారీగా, అంటే విప్లవాత్మకంగా రావు. క్రమ పరిణామ పద్ధతిలో వస్తాయి. ఆదీగాక భాషలో వచ్చే మార్పులకూ, ఆర్థికమైన పునాదికీ సంబంధం లేదు. ఉదాహరణకు కొన్ని ద్రావిడ భాషల్లో ప్రాచీన ద్రావిడ 'క'కారం 'చ'కారం అయింది. ఇది తెలుగు, తమిళాలలో జరిగింది. కన్నడంలో జరగలేదు. దీనికి కారణభూతమైన, లేక సమాంతరమైన ఆర్థిక వ్యవస్థలో మార్పును చూపించలేము. ఇంగ్లండులో ఫ్యూడల్ వ్యవస్థ భగ్నమైన వెంటనే భాషలో మార్పులు రాలేదు. భాషా వ్యవస్థలో మార్పులు ఆర్థిక, రాజకీయ, సామాజిక కారణాలవల్ల రావు.

అయితే భాషకూ, సమాజానికీ ఏ విధమైన సంబంధం ఉంది? అనే ప్రశ్న అట్లాగే మిగిలి ఉంది. సమాజంలో మార్పులు భాషలో ప్రతిఫలించవా?

భాషకు వ్యాకరణ నిర్మాణం, ధ్వని వ్యవస్థా ఉన్నయ్. వాటిలో వచ్చే మార్పులకు ఆర్థిక వ్యవస్థ ప్రత్యక్ష కారణం కాదు. భాషలో ఉన్న మూలధాతువుల్లో, ప్రత్యయాల్లో వచ్చే మార్పులకు సామాజిక కారణాలుండవు. కాని కాంక్రీట్ లెవెల్లో సామాజిక కారణాలవల్ల కొన్ని మార్పులు వస్తయ్. పాత మాటలకు కొత్త అర్థాలు రావచ్చు. ఇంతకుముందు లేని కొన్ని కొత్త సమాస కల్పనలు జరగొచ్చు. ఇతర భాషా సంపర్కంవల్ల కొత్త మాటలు భాషలో చేరొచ్చు. కాని భాషలో కొత్త సూత్రాలు సామాజిక కారణాల వల్ల ఏర్పడవు.

ఇటీవల కాలంలో కొన్ని ధ్వనుల మార్పులకు సామాజిక కారణాలు చూపించారు కొందరు. భాషా వ్యవహర్తలు కొన్ని రకాలు భాషా రూపాలను అనుసరించటానికి, లేక వాడటానికి సామాజిక కారణాలుండొచ్చు. తెలుగులో చకారాది పదాలు కొందరి ఉచ్చారణలో సకారాదిగా ఉన్నయ్. అది సకారోచ్చారణ గౌరవప్రదం కాబనితోస్తే వ్యవహర్తలు గౌరవ సంపాదన ప్రయత్నంలో చకారోచ్చారణని గ్రహించవచ్చు. ఈ రకమైన మార్పులు అన్ని భాషల్లోనూ గమనించవచ్చు. ఈ రకమైన మార్పులు ఒకే దశలో ఉన్న సామాజిక వ్యవస్థలోనే వ్యవహర్తల మానసిక ప్రవృత్తులననుసరించి జరగవచ్చు. మార్క్సిస్టుల అర్థంలో ఈ రకమైన మార్పులకు వర్గ స్వభావం లేదు. అంటే, వర్గ వైరుధ్యం లేదు.

ఈ సందర్భంలోనే వర్గ మాండలికాల విషయ
చించాలి. ఒక భాషా సమాజంలోనే ఉన్న భాషా భేదాలను ప్రాంతీయ భేదం కాకపోతే వర్గమాండలికాలని వ్యవహరిస్తాం. ఇక్కడ వర్గాలంటే సామాజికమైన వర్గభేదాలే. అయితే, ఇవి మార్క్సిస్టులు ఆర్థిక వ్యవస్థా వివరణలో ఉపయోగించే వర్గాలు కావు. పూజారులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, రైతులు, కూలీలు, చదువుకున్నవాళ్లు, చేపలు పట్టేవాళ్లు, ఉప్పరి పనివాళ్ళు, మేదర పనివాళ్ళు-ఇట్లా రకరకాల పనిపాటలవాళ్ళలో భాషాభేదాలుండవచ్చు. వీటిని వర్గ మాండలికాలనే అంటాం. కాని, ఈ వర్గాలు ఆర్థిక వైరుధ్యమున్న వర్గాలు కావు. వర్గపోరాట ప్రసక్తి భాషా విషయంలో రాదు.

అయితే, భాషోద్యమాల మాటేమిటి? అసలు ఉద్యమమంటే ఏమిటి? ఉద్యమానికి ఒక పనిని ప్రారంభించటం, ఒక పనికి పూనుకోవడం అనే నైఘంటుకార్థాలున్నై. దీనికి సమానార్థకంగా ఇంగ్లీషులో "movement" అనే మాటను ఉపయోగిస్తున్నారు. ఆ మాటకు ఇక్కడ సరిపడే అర్థం. ఒకరుకాని, కొందరుకాని ఒక లక్ష్యసాధనకోసం అదే పనిగా ప్రయత్నించటం అని అర్థం చెప్పవచ్చు. అయితే, ఎక్కువగా ఎక్కువమంది కలిసి చేసిన ప్రయత్నాన్నే ఉద్యమం అని నేటి వాడుక. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, విశాలాంధ్రోద్యమం, భారత స్వాతంత్ర్యోద్యమం-ఇట్లాంటివి. ఈ దృష్టితో ప్రాచీనకాలంలో భాషోద్యమాలు ఉన్నాయా? అంటే కొంచెం తీవ్రంగా వెతకాలి. నన్నయ తెలుగులో కవితారచన చెయ్యటం, తిక్కన తెలుగు పలుకుబళ్ళు వాడటం భాషోద్యమాలుగా కొందరు సూచిస్తుంటారు. ఆధునికార్థంలో అవి ఉద్యమాలు కావు. వాటికి సామూహిక కార్యాచరణ లేదు. శివకవుల సాహిత్యాన్ని ఉద్యమం అనొచ్చునా? శివకవులు ఒక మతాన్ని అవలంబించే కవులే కావచ్చు, వాళ్ళు జాను తెలుగును ఆదరించిన వాళ్ళే కావచ్చు, వాళ్ళది భాషోద్యమం కాదు. అసలు ఉద్యమం కాదు. శివకవులంతా ఒక ప్రాంతంవాళ్ళూ, సమకాలికులూ కాదు. వాళ్ళు కలిసికట్టుగా వ్యవహరించిన దాఖలా లేదు. అందువలన ఒక లక్ష్యసాధనకోసం సామూహికంగా జరిగిన ప్రయత్నంగా శివకవుల కవిత్వాన్ని, కవితాతత్వాన్ని భావించలేం. మనం ఈనాడు ఇస్తున్న అర్థంలో మొదటి భాషోద్యమం వ్యవహారిక భాషోద్యమమే.

ఇంతకుముందే అనుకున్నట్టుగా వ్యావహారిక భాషోద్యమం రచనా భాషకు సంబంధించింది. రచనా భాషగా ఏ రకమైన భాష వాడాలి అనే సమస్యను దృష్టిలో పెట్టుకొని వచ్చింది వ్యావహారిక భాషోద్యమం. ఇది ఆధునిక కార్థంలో ఉద్యమం. ఇది కొందరు వ్యక్తుల సామూహిక ప్రయత్నం. సామినేని ముద్దు నరసింహం నాయుడుగారు తమ హిత సూచని ద్వారా ఈ ప్రచారం సాగించినట్టు మనకు దాఖలాలున్నై. ఒక పత్రికలో కొందరు వ్యక్తులు అవసరం. ఆ తరువాత గిడుగు, గురజాడ, యేట్స్, శ్రీనివాస అయ్యంగారు, కాల క్రమేణ మరికొందరు ఈ ప్రయత్నంలో చేరారు. ఈ ఉద్యమం ఇంకా బలం పుంజుకొని తరవాత చాలామంది తరవాత కాలాల్లో ఉద్యమంలో చేరారు. పత్రికా రచయితలు ఈ ఉద్యమాన్ని సమర్థించారు. ఆధునిక రచయితలు, భావ

కవులు, నవ్య కవులు ఈ ఉద్యమాన్ని బలపరిచారు. కాబట్టి, దీనికి ఉద్యమ స్వభావం ఉంది. అయితే, ఈ ఉద్యమం ఎందుకొచ్చింది ? ఈ సమయంలోనే ఎందుకొచ్చింది ?

ప్రాచీన సమాజంలో రచనా భాషగా తెలుగు సాహిత్యంలోనే కనిపించేది. రకరకాల శాస్త్రాలు సాహిత్యంలో భాగంగానే పరిగణ్యమవుతూ ఉండేవి. పైపెచ్చు అవి పద్యాల్లో కూడా ఉండేవి. ప్రాచీన కాలంలో భాషా ప్రయోగం అంటే సాహిత్య భాష అనే అర్థం. ఈ సాహిత్యభాష మనకు అందుతున్నప్పట్నుంచే సమకాలీనమైన వాడుక భాషకు భిన్నంగానే ఉంది. కావ్యభాషేతరంగా మనకు ప్రాచీన కాలం నుంచి దొరుకుతున్నది శాసన భాష. తొమ్మిదో శతాబ్ది నుంచి శాసనాలు దొరికినై. 11 వ శతాబ్దం నుంచి కావ్య భాష దొరుకుతున్నది. ఈ రెంటికి వైరుధ్యం ఉంది. శాసన భాష సామాన్య జనానికుద్దేశించింది కాబట్టి ఆనాటి వాడుక భాషతో దానికి సామ్యాలెక్కువ. కావ్యభాష ఎప్పుడూ సామాన్య భాషగా ఉపయోగపడలేదు. కావ్యేతర ప్రయోజనాలకు కావ్యభాష ఉపయోగించ లేదు.

అప్పకవీయం, చింతామణి వంటివాటికి రాసిన వ్యాఖ్యానాల్లో వాడుక భాష ఉందనీ, కావ్యేతర వచన రచనకు వాడుక భాష ప్రయోగించటం నిజమైన సంప్రదాయం అనీ గిడుగు రామమూర్తిగారు వాదించారు. అయితే, ఈనాడు మనమనుకుంటున్న వాడుక భాష కాదు. కావ్య భాషేతర ప్రయోగాల్ని కూడా కావ్య భాషతోపాటు వాడటానికి అభ్యంతరం లేని ఒకానొక శైలి ఇందులో కనిపిస్తుంది. నియమాలు సడలించిన గ్రాంథిక భాషనే వ్యావహారిక భాషగా రామమూర్తిగారు ప్రపంచం ముందు పెట్టి దబాయించారు. ఆధునిక భాషా వ్యవహారంనుంచి ఏర్పడ్డ రచనా భాషగాని, యూరోపియన్ నాగరిక సమాజాల్లో లాగా ప్రామాణిక భాషగాని ఏర్పడలేదు. అందుకు కారణం ఆ అవసరం అంతగా ఏర్పడలేదు. అందుకు కారణం ఆనాటి సామాజిక వ్యవస్థే

రాచరిక పరిపాలనా వ్యవస్థలో ప్రభుత్వానికి ప్రజలతో ప్రమేయం పన్నులు వసూలు చెయ్యటమే. ఎక్కువమంది ప్రజలకు భాషా ప్రయోజనం సాధారణ దైనందిన వ్యవహారమే. సాహిత్యభాషగా రెండు మూడు రకాల సంప్రదాయాలుండేవి 1, జానపద సాహిత్యంగా నేడు చెలామణిలో ఉన్న సాహి

త్యతో వాడేభాష. వ్యవహారిక భాషకు భిన్నమైన వ్యవస్థీకృతాంశాలు ఇందులో గమనించొచ్చు. కూర్పరి భాషా పరిచయాన్నిబట్టి ఇందులోనూ కొన్ని కావ్య భాషారూపాలు సందు చేసుకోవచ్చు. 2. అత్యధిక వ్యవస్థీకృతమైన సాంప్రదాయిక సాహిత్య భాష. ఇది బాగా చదువుకున్నవాళ్ళు రచన కుపయోగించే భాష. ఇందులో మాండలిక భేదాలు జానపద భాషలోలాగా ఎక్కువ ఉండవు, అంటే, ఈ భాషలో ప్రాంతీయతాముద్ర తక్కువ. ఈ రెండు ధ్రువాల మధ్యలో కొన్ని రకాల అంతరువులను గమనించవచ్చు. వాటిల్లో కొన్ని కావ్య భాషకు దగ్గరగా ఉండేవి. కొన్ని జానపద భాషకు సన్నిహితంగా ఉన్నై. యక్షగానాలు, సంకీర్తన సాహిత్యం సాంప్రదాయిక కావ్యభాషకు సన్నిహితం. అట్లాగే లక్షణ గ్రంథాల వ్యాఖ్యాలు కూడా. కొన్నిరకాల తత్త్వాలు, భారత రామాయణాలు పాటలుగా కూర్చిన సాహిత్యం జానపద సాహిత్యభాషకు ఎక్కువ దగ్గరగా ఉన్నై. కొన్నిరకాల ప్రమాణాలను నిర్మించుకొని ఈ సాహిత్య సంప్రదాయాల్ని పరిశీలిస్తే ఈ సాహిత్యరూపాల అన్యోన్య అంతరాల్ని లెక్కగట్టటం సాధ్య మవుతుంది. వీటన్నిటికీ పరస్పర సాన్నిహిత్యం ఉన్నా, ప్రత్యేక వ్యవస్థలున్నై. ఆ వ్యవస్థలను నిరూపిస్తే వ్యవస్థీకరణ విధానం (Stylization) గురించి ఇంకా స్త ఎక్కువ తెలుసుకోవచ్చు. అయితే, ఇదంతా సాహిత్య భాషగానే మనం గుర్తించాలి సాహిత్యేతర రచనాభాష ప్రాచీనకాలంలో దాదాపు లేనట్టే చెప్పాలి. ఆ అవసరాలు కలుగలేదు. ఉన్న అవసరాలకు- అంటే ఉత్తరాలు రాయటానికీ, దేవుళ్ళగుళ్ళో శాసనాలు చెక్కించటానికి గానీ వాడే ఇష్టాన్నిబట్టి ఏదో భాష ఉండేది కాని, కొన్ని సామాన్య లక్షణాలతో ప్రమాణీకాబద్ధమైన రచనా వ్యాస గం ఉండేదికాదు.

బూర్జువా సమాజంలో పాత సమాజంకన్నా భాషతో ఎక్కువ అవసరం. భాషను భిన్నావసరాలకు ప్రయోగించాలి. పాఠ్యగ్రంథాలు, సైన్సు పుస్తకాలు, ఇంతకు పూర్వంలేని కథ, నవలవంటి సాహిత్యరూపాలు, సాహిత్యేతర రాజ కీయాది శాస్త్రాలు మొదలైనవన్నీ ఆధునికావసరాలు. వీటన్నిటికీ అధిక ప్రచారం అవసరం. తాటాకు పుస్తకాల వేగం చాలదు. అందువల్ల అచ్చు యంత్రం రాక తప్పదు అధిక సంఖ్యలో భాష అధిక లిఖిత ప్రయోజనాలకు వాడే అవసరం కలిగింది. పత్రికారచన ప్రారంభమయింది. ఈ మార్పులన్నీ గత శతాబ్ది చివర్లో ప్రారంభమయినై.

ఈ మార్పుల వేగాన్ని, మూలాన్ని, స్వరూపాన్ని గుర్తించి సాంప్రదాయిక విద్యావంతులు సాంప్రదాయిక కావ్యభాషే అన్నిటికీ పనికొస్తుందను కున్నారు. నవలలు, కథలు కావ్యభాషతో రాశారు. పాఠ్యగ్రంథాలు, సైన్సు పుస్తకాలు అదే భాషలో రాశారు. పత్రికారచనకూ అదే భాష పని కొస్తుందను కున్నారు. వాడిందారు. పట్టుపట్టారు భాషలోనూ, సమాజంలోనూ వస్తున్న మార్పులను అర్థం చేసుకున్న విద్యావంతులు ప్రాచీన కావ్య భాష ఇందుకు సరిపోదు, ఆ భాషా నియమాలు ఆధునిక వచన రచన కనర్థదాయకాలని గ్రహించారు. ఇదే గ్రాంథిక, వ్యావహారిక భాషా వివాదాలుగా చరిత్రకెక్కింది.

వ్యావహారిక భాషోద్యమం బూర్జువా సమాజపు అవసరాలకోసం వచ్చింది. ప్రాచీన రచనా నియమాలను ఛేదించి, ఆధునిక అవసరాలకు సరిపోయే రచనా భాషను-నిజానికి భిన్న రచనారీతులను-ఏర్పర్చుకోటానికి ఈ ఉద్యమం సౌకర్యం కలిగించింది. మనలో ఇంకా ఫ్యూడల్ ఆలోచనా విధానం పోవలేదనటానికి, బూర్జువా సంస్కృతి అయినా సంపూర్ణంగా వ్యాపించలేదనటానికి ఈనాటికీ గ్రాంథిక భాషావాదులుండటం ఒక పెద్ద సాక్ష్యం. ఇప్పటికీ కొన్ని పాఠ్యగ్రంథాల రచన ప్రాచీన కావ్యభాషా సన్నిహితమైన భాషలోనే జరుగుతున్నది. అయితే, ప్రజల అభిరుచులు తీవ్రంగా మారిన ఈ కాలంలో కావ్య భాషలో రచించిన వచన రచనలకు ఏ పెట్టుబడిదారుడైనా పెడితే తప్ప ఆదరణ లభించటం లేదు. అందువల్ల వ్యావహారిక భాషోద్యమ ప్రయోజనం నెరవేరినట్లే.

రచనా భాష, వాడుక భాష ఒకేరకంగా ఉండదని ప్రత్యేకంగా వాదించా ల్సిన పనిలేదు. శబ్దజాలంలోను, వ్యాకరణరూపాలు, అంశాల ఎన్నికలోనూ, వాటి విస్తరణలోనూ కొన్ని భేదాలు ఉండక తప్పదు. కావ్యభాష రాసేటప్పుడు ఎక్కడ నియమాలు మారుతున్నాయో అన్న స్పృహ రచయిత ఆలోచనను కట్టివేస్తుంది. కనుక తెలియని వ్యాకరణ సూత్రాలను గుర్తుంచుకొని రాయాలి. ఆధునిక రచనాభాషతో రచయిత వాడే వ్యాకరణం రచయితకు బాగా పరిచితం. మిగతావి అప్రయత్నంగా నేర్చుకునేవి. ఆధునిక రచనా భాష ఆధునిక వ్యవహార భాషా వ్యాకరణ మూలకమై ఉండాలనటంలో సామంజస్యం ఇది. ప్రాచీన కావ్యభాష అన్ని రకాల వచన రచనలకూ సరిపోతుందనుకోవటం సాంప్రదాయిక విద్యావంతులు చేసిన పెద్ద పొరపాటు. దీన్నుంచి ఆధునిక విద్యా వంతులు ఒక గుణపాఠం నేర్చుకోవాల్సి ఉంది.

ఆధునిక రచనా భాషను, ఒకరకమైన ప్రామాణిక భాష అనదగిన భాషను తయారు చెయ్యటంలో పత్రికల పాత్రను తక్కువ అంచనా వెయ్యలేము. నేటి తెలుగు రచన మీద పత్రికల ప్రభావం విపరీతంగా ఉంది. ఎంత విపరీతంగా ఉందంటే, తెలుగు పత్రికలు మాత్రమే చదివే ఈనాటి కొందరు యువకులు తమ అభిమాన పత్రికా భాషనే మాట్లాడుతున్నారు. మళ్ళీ రచన చేస్తే అదే భాష వాడుతున్నారు. అందువల్ల రచనా భాషే పత్రికా భాష అనుకొనే ప్రమాదం ఏర్పడింది. కథలకూ, సైన్సుకూ, రాజకీయాలకీ, కరపత్రాలకూ, భాషా సంబంధి వ్యాసాలకూ, టెక్స్టు పుస్తకాలకూ, విద్యాపోటీ తేలిక వ్యాసాలకూ, సాహిత్య విమర్శలకూ, యూనివర్సిటీ థీసిస్సులకూ ఒకే రకపు పత్రికా భాష పనికొస్తుందనే భ్రమలో నేటి వచన రచయితలున్నట్టు కనిపిస్తున్నది.

మనకు పత్రికలంటే ప్రధానంగా వార్తా పత్రికలే. కొన్ని రకాల వారపత్రికలున్నా అవి కూడా రచనా పద్ధతి విషయంలో వార్తా పత్రికలవంటివే. అందుకు భిన్నమైన పత్రికలున్నా వాటి ప్రభావం తక్కువ. నేటి రచనా భాషను రూపొందించటంలో ఈ వార్తా పత్రికల ప్రభావం విపరీతంగా కనిపిస్తున్నది. అందుకు విచారించాల్సిన పనిలేదు. కాని, అన్ని విషయాలకూ వార్తా పత్రికల శైలి పని కొస్తుందనుకోవటంలోనే వస్తుంది చిక్కు. తెలుగు వార్తా పత్రికలే అన్ని రకాల విజ్ఞాన వ్యాప్తిని కలిగిస్తున్నై. సైన్సు వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు వార్తా పత్రికల ద్వారా అందుతున్నై. ఆ ప్రభావంతో తెలుగులో సైన్సు పుస్తకాలు వచ్చినా, సాహిత్య గ్రంథాలు వచ్చినా, అటు గ్రాంథికంలో [illegible]తున్నై, లేకపోతే ఇటు పత్రికల శైలిలో అయినా ఉంటున్నై. వ్యావహారిక భాషలో రచించిన తెలుగు పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాల్ని కొన్ని గమనిస్తే ఈ విషయం చాలా స్పష్టంగా తెలుస్తుంది.

మనకు కావ్యభాషా సంప్రదాయంనుంచి సంక్రమించిన ఒక దురభ్యాసం ఉంది. ఏది చెప్పినా అలంకారికంగా చెప్పటం. గ్రాంథికంలో రచించిన కొన్ని గ్రంథాల్లో ఈ శైలిని గుర్తుపట్టవచ్చు. ఈ అలంకారిక శైలి ఇటీవల కొత్తగా [illegible] ఆధునిక వచన రచనలో కెక్కింది. ఆకర్షకంగా ఉండటంకోసం పత్రికల్లో [illegible]పూరితమైన శైలి వాడతారు. కాని, విషయ ప్రధాన గ్రంథాల్లో [illegible] [illegible] అలంకారం పనికిరాదు. నిరలంకారంగా తేలికైన మాటలతో చెప్పడమే

ఉచితం. అవసరమున్నా లేకపోయినా కవిత్వంలాంటి శైలి వాడటం నేటి వచన రచనలో అధికంగా కనిపిస్తుంది. అది ఎంత ఎక్కువయిందంటే దీనికోసం మరో ఉద్యమం అవసరమా? అనిపిస్తున్నది.

వ్యావహారిక భాషోద్యమం తన పనిని పూర్తి చేసుకున్నది. ఎవరో కొన్ని పెద్ద తలకాయలను వదిలేస్తే సరిఅయిన ఆలోచనాక్రమంతో ఉన్నవారెవరూ ఇప్పుడు తెలుగువచనం కావ్యభాషలో రాయటంలేదు. ఒకళ్ళిద్దరున్నా వాళ్ళను ప్రాచీన కాలపు అవశేషాలుగా గుర్తించి వదిలెయ్యటం మంచిది.

గ్రాంథిక భాషమీద ఇప్పుడు కత్తిదుయ్యటం లేని శత్రువుమీద యుద్ధానికి సన్నద్ధం కావటం. అభివృద్ధి చెందుతున్న సమాజావసరాలకు అనుగుణంగా భాషాభివృద్ధి చేసుకోటమే నేటి అవసరం. ఇందుకు మనం చేసుకోవాల్సిన పనులను ఒకసారి గుర్తుచేసుకోటం ఈ సందర్భంలో అవసరంగా భావిస్తున్నాను.

1. తెలుగుభాషా లక్షణాలమీద, వాక్య పద్ధతిమీద, శైలీభేదాల మీద పరిశోధనలను ప్రోత్సహించటం.

2. రకరకాల రచనావసరాలకు అనుగుణంగా శైలీభేదాలను రూపొందించుకోవటం.

3 తెలుగు రచనాభాషలో కనిపించే శబ్దాలకు అర్థచ్ఛాయలను నిర్దిష్టంగా వివరించే నిఘంటువును తయారుచేసుకోటం.

4. భాషను గురించి సరిఅయిన ఆలోచనలను ఎక్కువగా వ్యాప్తి చెయ్యటం.

ఇవి భాషాపరంగా మనం చేసుకోవలసిన కొన్ని ముఖ్యమైన పనులు.

# గ్రంథాలయ, గ్రంథప్రచురణోద్యమం

—డి. రామలింగం

తెలుగునాడు చరిత్రలో 1857 నుంచి 1956 వరకుగల నూరేళ్ళకాలాన్ని నేటి ప్రసంగ విషయానికి నిర్ణయించడంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వాహకులు ఒక ముఖ్యోద్దేశంతోనే వ్యవహరించారని నేను అనుకుంటాను. ఈ నూరేళ్ళు దేశంలో చారిత్రకంగా, రాజకీయంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా ఎన్నో మార్పులు వచ్చిన కాలం. 1857 లో జరిగిన తిరుగుబాటుతో ఈస్టిండియా కంపెనీ పాలన అంతరించి బ్రిటిష్ఇండియా నేరుగా ఇంగ్లండు మహారాణి పరిపాలన క్రిందకి వచ్చింది. అంతకుముందు కీకారణ్యంలాటి పరిస్థితి తగ్గి, ఒక విధానం ప్రకారం పాలించే ప్రభుత్వ అజమాయిషీ క్రింద దేశం వచ్చింది. ఇక 1956 అ. బే. కోస్తా ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు మూడూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పడి సువిశాలమైన తెలుగు మాట్లాడే ప్రాంతం ప్రజలు ఒకే ప్రభుత్వం క్రిందికి వచ్చి, ఉమ్మడి కుటుంబీకులు అయ్యారు. ఈ నూరేళ్ళ కాలంలో గ్రంథాలయ, గ్రంథప్రచురణోద్యమాలు తెలుగు జాతి సర్వతోముఖ వికాసానికి ఎంతైనా తోడ్పడింది. ఇవి రెండూ పరస్పర సంబంధంగల ఒకే ఉద్యమానికి బొమ్మా బొరుసుల వంటివి. కలుస్తూ విజ్ఞాన వ్యాప్తికి కారకమయ్యాయి. నవీన వాఙ్మయ సృష్టికి దోహదం చేశాయి. ఆ కాలంలో దేశపరిస్థితుల దృష్ట్యా సంఘ సంస్కరణను వేగిరపరచి, మూఢాచారాల తీవ్రతను క్రమంగా తగ్గిస్తూ, రాజకీయోద్యమాలకు చేయూతనిచ్చి, ప్రపంచ చరిత్రలో విశిష్టమైనదని పేరెన్నికగన్న భారత స్వాతంత్ర్య సమరానికి ఊతం చేసి, ఆర్థిక, వైజ్ఞానిక విషయాలను ప్రజాసామాన్యానికి అందుబాటులోకి తెచ్చి, దేశాన్ని చైతన్యోత్తేజితం చేసి, ప్రజలను మధ్యయుగాల సంకుచిత స్థితినుండి వెలుపలకు తెచ్చి, ఆధునిక నాగరికతలోకి ప్రవేశపెట్టాయి. ఈ విధంగా ఒక మహా పరిణామానికి ఈ ఉద్యమాలు తోడ్పడ్డాయి. ఇవి రెండూ బహుళార్థసాధక ఉద్య

మాలు రావడంవల్ల వీటివల్ల ఇతర రంగాలలో దేశం ముందంజవేసి ప్రగతి పథంలో పయనించగలిగింది.

గ్రంథాలయోద్యమ మనగా పట్టణాలలో, గ్రామాలలో ప్రజలందరూ పత్రికలు, పుస్తకాలు చదువుకొనడానికి వీలుగా సార్వజనిక పౌర గ్రంథాలయాల స్థాపన. దీనికి పెద్దపెట్టున ఒక ఉద్యమం అవసరమైంది. అంతకుముందు పుస్తకాలూ, పత్రికలూ కలవారి ఇండ్లలోనే ఉండేవి. వాటిని చదవాలనుకున్న వారికి అవి అందుబాటులో ఉండేవి కావు. వాటిని అంత సులభంగా కూడా పొందలేకపోయేవారు. ఇందువల్ల ఒక విధంగా విజ్ఞాన వ్యాప్తి ఆటంకపరచబడినట్లుగా ఉండేది. ఇక ముద్రణ యంత్రాలు రాకపూర్వమైతే లిఖిత పుస్తకాలు మహారాజుల ప్రాసాదాలలోనో లేక పండితుల ఇండ్లలోనో ఉండేవి. ఒక కావ్యమంటే అభిమానం గలవారు అది ఉన్నవారి దగ్గరకుపోయి తిరుగవ్రాసి తెచ్చుకోవలసిందే. అయినా ఇప్పటికీ దేశంలో అక్కడక్కడా కొన్ని కావ్యాల ప్రతులు తాళపత్ర గ్రంథాలలో ఉండటం గమనిస్తే పుస్తకమంటే విద్యావంతులకు ఎంత ప్రియమైనదో మనం గమనించవచ్చు. ముద్రణ సౌకర్యాలు వచ్చిన తర్వాత పుస్తకాలు కొనే శక్తిగల వారి అందుబాటులోకి వచ్చాయే తప్ప, 'అవి ప్రజాసామాన్యానికి అందకుండానే ఉండిపోయాయి. ప్రజాసామాన్యానికి వాటిని అందుబాటులోకి తెచ్చినది గ్రంథాలయోద్యమమే.

తెలుగుదేశంలో గ్రంథాలయోద్యమం సరిగా ఎప్పుడు ప్రారంభమైనది అన్న విషయంలో పరిశోధకులమధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. 1886 లో విశాఖపట్నంలో ఒక సామాన్య ఉపాధ్యాయుడు మంథిన ఆదినారాయణ మూర్తిగారు స్థాపించిన శ్రీ సరస్వతీ నిలయం మన మొదటి గ్రంథాలయమని మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు ధ్రువపరచగా, బండి గోపాలరెడ్డిగారి పరిశోధనలనుబట్టి 1880 సంవత్సరంలోనే రాజమండ్రిలో జడ్జిగా పనిచేసిన జేమ్స్ థామస అనే ఆంగ్లేయుడు అక్కడ ఒక రీడింగ్ రూమును (పఠనాలయం) నెలకొల్పి నిర్వహించినట్లూ, దానిలో రోజూ సుమారు నూరు మంది పాఠకులు చేరి చదువుతుంటూ ఉండినట్లూ తెలియవచ్చినది. ఇప్పటికిది సత్యమనుకోవాలి. ఏ రచనలో చదివానో వాకిప్పుడు గుర్తులేదు కాని, 1671 నాటికే మచిలీపట్టణంలో ఒక గ్రంథాలయమున్నట్లూ ఆ సంవత్సరమే అక్కడి ఒక క్రైస్తవ మతాధికారి

హుక్ చనిపోగా అతని పుస్తకాలను ఆ గ్రంథాలయానికి ఇచ్చివేసినట్లూ తెలుస్తున్నది. ఇంకా అంతకుముందే 1661-62 ప్రాంతంలోనే మద్రాసు కోటలో వైట్‌ఫీల్డు అనే పాదర్ ప్రోత్సాహం వల్ల ఒక గ్రంథాలయం స్థాపించ బడిందని తెలుస్తున్నది. అలాగే తెలంగాణా ప్రాంతంలో సికింద్రాబాదులో 1872 లో శంకరాచార్య మఠంలో ఒక గ్రంథాలయం స్థాపించబడినట్లు తెలుస్తు న్నదని ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ నిర్వాహకులొకరు ఒక వ్యాసంలో వ్రాశారు. కాని వాటి చరిత్రలు మనకు నేడు లభించవు. చూడగా ఆంధ్ర దేశంలో గ్రంథాలయ చరిత్రను పరిశోధించి సమగ్రంగా ఒక గ్రంథాన్ని వ్రాయించవలసిన అవసరం వున్నట్టు కనిపిస్తూ ఉంది. ఈ విషయమై ఇంత వరకు సమగ్రమైన పరిశోధన జరగలేదు. ఎన్నో ఆధారాలనుబట్టి ఆ చరిత్రను నిర్మించే ప్రణాళికను సిద్ధం చేయించవలసి వుంటుంది. ఏమైనప్పటికిని భారత దేశంలో అటు బరోడా సంస్థానం, ఇటు దక్షిణాదిన ఆంధ్ర దేశము సార్వజనీన గ్రంథాలయోద్యమం విషయంలో ఒక సువ్యవస్థిత రీతిలో, ఉన్నతమైన ఆదర్శంతో అగ్రశ్రేణిలో నిలిచాయని చెప్పాలి. అయితే బరోడాలో విద్యా వినోది అయిన సంస్థానాధీశ్వరుడు శ్రీ శాయాజీ గైక్వాడ్ పూనికపై అనుస వెచ్చించిన ధనంతో గ్రంథాలయోద్యమం ఆధునిక పద్ధతులపై నిర్మింపబడగా, ఆంధ్ర దేశంలో ఈ పనికి విద్యావంతులైన సామాన్య ప్రజలే స్వయంగా పూను కున్నారు. ఇందుకు ప్రేరణ ఎటువంటిదో తెలుసుకోవాలంటే శ్రీ చిలుకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు 1914 లో ఆంధ్ర దేశ గ్రంథ భాండాగారుల మహాసభలో అధ్యక్షోపన్యాసం చేస్తూ ఇచ్చిన ప్రబోధాత్మక సందేశాన్ని మనం గమనించవలసి వుంటుంది:

> ''వాయువెల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
> జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును;
> ఉదకమెల్లవారికి ఎట్లు సేవ్యమై ఉన్నదో
> జ్ఞానమును అట్లు సేవ్యమై యుండవలయును;
> సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి
> నెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో, జ్ఞానమును
> అట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును.''

మన వేదాలలోని వివేకమును పోలిన ఈ సందేశం మన ఆంధ్ర గ్రంథాలయోద్యమం ముఖ్యాదర్శం, ''తాము బాగై, తమ తోడివారిని బాగు చేయవలెనను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే'' ఈ ఉద్యమాన్ని ప్రేరేపించినట్లు ఆంధ్ర గ్రంథాలయోద్యమ పితామహులు శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారున్నారు. అంతేకాదు, కేవలం మనుజుల మేధాశక్తిని వృద్ధి పొందించడమేగాక, సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు సాధనా విలంబన మంతయు ఆంధ్ర గ్రంథాలయోద్యమంలో చేరి ఉన్నదనీ, దీని ఆదర్శం జ్ఞానాభివృద్ధిని [illegible] చేసి మానవుల జీవయాత్ర పవిత్రవంతముగను, పురుషార్థ సాధకముగను చేయుడం అని చెప్పి, జ్ఞానం ద్వారా ప్రజలలో దాగిఉన్న ఆత్మను ఉద్దీపింపచేసి, పౌరునికి కావలసిన సన్మార్గ జీవితాన్ని ఇచ్చేదిగా ఉండవలెనని నిర్దేశించారు. ఇది ఉన్నతమైన ఆదర్శం.

ఇంతటి ఉత్తమ ఆదర్శాలతో నడుపబడిన ఉద్యమం దేశ రాజకీయ సాంఘిక పరిస్థితులకు స్పందించి, వాటిని అవకాశంగా తీసుకొని, వాటికి ప్రేరేపుగా ఉంటూ దేశ కల్యాణానికి తోడ్పడకుండా ఎలా వుంటుంది ? 1908 లో బెంగాలు విభజన సందర్భంగా ఆరంభమైన వందేమాతరం ఉద్యమం, తిలక్ అనిబిసెంటుల హోంరూలు ఉద్యమం, 1918 లో ఆరంభమైన ఆంధ్ర రాష్ట్రోద్యమం వంటి వాటి వలన బ్రిటిషు ఆంధ్రలో 1914 కే గ్రంథాలయోద్యమం ఒక దృఢమైన ఉద్యమ స్వరూపం దాల్చింది. ఆ యేడే ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభ ఏర్పడింది. దేశమంతటా అక్కడక్కడా గ్రంథాలయాలు, రీడింగ్ రూములు ఏర్పడ్డాయి. ఊరికొక దేవాలయంతో పాటు ఒక గ్రంథాలయం కూడా ఉండవలెనని ప్రజలు కోరుకున్నారు. ఈ సందర్భంలో గ్రంథాలయోద్యమానికి స్ఫూర్తి నిచ్చిన కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి సేవను స్మరించడము అవసరం. వారీ ఉద్యమాన్ని ఎంతగానో ఆదుకున్నారు. 1914 లో వారు ఆంధ్ర పత్రికను దిన పత్రికగా మార్చారు. అవి మొదటి ప్రపంచ యుద్ధము ఆరంభమైన రోజులు. ప్రజలు యుద్ధ వార్తలను తెలుసుకోవడానికి నిత్యము గ్రంథాలయాలకు వస్తూ ఉండేవారు. ఆంధ్రులకు ఏకైక దినపత్రిక అప్పట్లో ఆంధ్ర పత్రికయే. నాగేశ్వరరావు గారు తమ పత్రికను అనేక గ్రంథాలయా లకు ఉచితంగా పంపే ఏర్పాటు చేశారు. కొన్ని గ్రంథాలయాలకు తగ్గింపు రేట్లకూ, అర్ధ చందాకూ కూడా అందజేసేవారు. ''ప్రజలకు విద్యాభివృద్ధియు,

ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మా ముఖ్యాభిప్రాయము'' అని వారు వ్రాసి ఉన్నారు. వారు కొన్ని గ్రంథాలయాలకు విరాళాలు కూడా ఇచ్చారు. స్వయంగా ఎన్నో గ్రంథాలయాలు దర్శించి, గ్రంథాలయ వార్షికోత్సవాలకు అధ్యక్షత వహించి, చక్కని సందేశాలను ప్రజల కొసగి, ఈ ఉద్యమానికి గణనీయమైన సేవ చేశారు. గ్రంథాలయోద్యమాన్ని ప్రజలకు ఆకర్షణీయం చేసినది కృష్ణా పత్రిక. ఆ రోజులలో కొన్ని ఊళ్ళకు ఊరికొక పత్రికగా, గ్రంథాలయానికి ఒక పత్రికగా వచ్చేది. అందులో సంపాదకీయాలూ, వ్యాసాలూ, వ్యాఖ్యలూ, చెణుకులూ చదవాలని లోకజ్ఞానం కల ప్రతి పాఠకుడూ ఆసక్తి చూపేవారు. అందుచేత ఒకరు బిగ్గరగా చదువుతూ ఉంటే తక్కినవారు వింటూ చలోక్తులు విసిరేవారు. ఈ విధంగా గ్రంథాలయాలు ప్రసంగ స్పర్ధలకూ, దేశ రాజకీయాలకూ చర్చావేదికలుగా ఉపకరించేవి. ముఖ్యంగా పెద్ద వారు అభిప్రాయాలను వెల్లడించేవారు. పరస్పరం భావాలు తెలుపుకునేవారు. ఇట్లా నోటి మాటగా ప్రపంచ సమాచారం ప్రతివానికి తెలిసేది. చదువు రానివారు కూడా జాతీయ అంతర్జాతీయ విశేషాలు తెలుసుకొని వ్యాఖ్యానించగల స్థితికి ఆ రోజులలో వచ్చారంటే, ఎక్కడో కొన్ని వేల మైళ్ళ దూరాన బ్రిటీషువారితో, జర్మనీవాడూ పోరుతూవుంటే సామాన్య ప్రజలు మన దేశంలో ఆసక్తి చూపారంటే ఆ చైతన్యం కలుగజేసిన ఘనత పేట పేటకూ, గ్రామ గ్రామానికీ ఏర్పడ్డ గ్రంథాలయాలదే.

ఇట్లా గ్రంథాలయోద్యమం ఆంధ్రుల అభిమాన ఉద్యమమైంది. ప్రజలలో సమాచార, విజ్ఞానకాంక్ష రగిల్చింది. జాతీయభావాన్ని రేకెత్తించింది. భాషాభిమానాన్ని కలిగించింది. దేశంలో గొప్ప ప్రబోధం జరిగింది. సంఘ సంస్కరణలకూ, సాంఘిక సేవకూ ప్రోత్సాహం ఇచ్చింది. గ్రంథాలయాలు నిర్వహించే ఉత్సాహవంతులు దేశాభిమానోద్వేగంతో కారాగారాలకు వెళ్ళితే కొన్ని సంస్థలు తాత్కాలికంగా మూతపడినా, తిరిగి శాంతినెలకొనగానే గ్రంథాలయాలు పనిచేస్తూ ఉండేవి. ఈ విధంగా ప్రబోధోద్యమంగా రూపొందగానే ఉద్యమాభివృద్ధి నిమిత్తం 'గ్రంథాలయ సర్వస్వము' అనే పత్రిక నడుపబడింది. గ్రంథాలయ సేవకుల శిక్షణ తరగతులు నడుపబడ్డాయి. వాటిలో గ్రంథాలయ నిర్వహణ విధానంతో పాటు రాజకీయాలు, అర్థశాస్త్రం, సహకారం, సాంఘికసేవవంటి విషయాలు కూడా బోధింపబడ్డాయి. గ్రంథాలయ ప్రవేశిక, గ్రంథాలయ విశారద తరగతులు

నడుపబడ్డాయి. వీటిలో ఉత్తీర్ణులైనవారు లైబ్రేరియన్‌లుగా పనికివచ్చారు. రాష్ట్ర మహాసభలతోపాటు, జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభలుకూడా జరుపబడ్డవి. జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయ సంఘాలు ఏర్పడ్డవి. గ్రంథాలయ యాత్రలు జరిపే ఆచారాన్ని ప్రవేశపెట్టారు. అందే - ఈ యాత్రలలో గ్రంథాలయ కార్యకర్తలు కాలినడకన పోవు ప్రతి గ్రామంలో గ్రంథాలయ నిర్వహణకు కావలసిన అనుకూలాలు కలుగజేసేవారు. కొనితావున గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసేవారు. వినోద కాలక్షేపాలతో గ్రామీణులలో ఉత్తేజం కలిగించేవారు. వసంతోత్సవాలు, ఊరేగింపులు, ప్రదర్శనములు, బహిరంగసభలు, వార్షికోత్సవాలు, ఆటలు, వైజ్ఞానికమైన పోటీలు, గ్రంథభిక్షలు, దానకలనములు, నాటకాలు, బుర్రకథలు, పురాణ హరికథా కాలక్షేపాలు ఏర్పాటు చేశారు. ఇట్లా సాంస్కృతిక వాతావరణం గ్రామసీమలలో కలిగించారు. గ్రంథాలయాల వ్యాప్తికి అభివృద్ధికి దేశంలోవున్న నిరక్షరాస్యత పెద్ద ప్రతిబంధకం కాబట్టి రాత్రి పాఠశాలలు నడపడంద్వారా అక్షరాస్యతా ప్రచారానికి కూడా మన గ్రంథాలయాలు కొంత కృషి చేశాయి. మదరాసు ప్రభుత్వం 1948 లో పౌర గ్రంథాలయాల శాసనాన్ని రూపొందించింది.

ఇక తెలంగాణాలో గ్రంథాలయోద్యమం సంగతి పరిశీలించవలసి ఉన్నది. హైదరాబాదు సంస్థానంలో నిజాం రాజుల పరిపాలనలో 1891లో అసఫియా లైబ్రరీ అనే పేరుతో పెద్ద ప్రభుత్వ గ్రంథాలయం స్థాపించబడింది. 1936లో దీనికి ప్రస్తుత భవనాన్ని నిర్మించారు. కాని అందులో తెలుగుకు అనాదరణను చూపించేవారు. తెలుగు పుస్తకాలు అందులో ఎప్పటికప్పుడు కొత్తవి చేర్చేవారుకారు. అట్టి అనాదరణమును గర్హిస్తూ, స్టేట్ లైబ్రరీలో తెలుగు వాఙ్మయాన్ని అధికంగా చేర్చవలసిందని కోరుతూ, భారతదేశానికి స్వాతంత్ర్యం రావడానికి ఒక సంవత్సరం ముందు-అనగా 1946 లో క్యాతూరు(తెలంగాణా)లో జరిగిన 28 వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలో కూడా కోరవలసి వచ్చిందంటే హైదరాబాదు సంస్థానపు పరిస్థితులు ఎట్లా ఉండేవో ఊహించుకోవచ్చు. తెలంగాణాలో జాతీయోద్యమ చరిత్రనూ, తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనమునూ గ్రంథములుగా రచించిన మేధావి దేవులపల్లి రామానుజరావుగారు ఇరవయ్యవ శతాబ్ది ఆరంభదశలో తెలంగాణాలో తెలుగు ప్రజల స్థితిని

గూర్చి ఇట్లా చెప్పారు: ''రెండునూర్ల పాతిక సంవత్సరాల ఆసఫ్జాహీ పరిపాలన ఫలితంగా హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్రుడు తౌరల్యాంధ్రుడైనాడు. అతనిది అర్బబీ, పారసీ భాషలతో అక్షరాభ్యాసము కావించు దుస్థితి కలిగినది. ఇక ఉర్దూ రాజభాష. ప్రాథమిక దశ నుండి విశ్వవిద్యాలయ దశవరకూ ఉర్దూ బోధనా భాష అయినందున ఆంధ్రభాషకు కొన్ని శతాబ్దాల అజ్ఞాతవాసము ప్రాప్తించినది. ఈ కాలమున ఆంధ్రుడు అన్ని రంగములందు వెనుకబడినాడు. పరిపాలనా రంగమున అతనికి తగిన స్థానము లేదు. సాంఘిక దురాచారాలు ప్రబలియుండెను. తెలుగు రైతు పన్నుల భారముతో క్రుంగి ఉన్నత వర్గాల పాదాల క్రింద నలిగిపోయెను. చదువుకున్నవారి సంఖ్య నూటికి మూడు నాలుగు దిగజారెను.'' ఇదీ నాటి అసలు పరిస్థితి. బ్రిటిషువారు బ్రిటిషిండియాలో విద్యావ్యాప్తికై జరిగిన కృషిని నిరోధించలేదు. సాహిత్య సభలకు వారు ప్రతిబంధకములు కల్పింపలేదు. రాజకీయాలతో సంబంధంలేని సాహిత్య సృష్టికి బ్రిటిషు ఆంధ్రలో కావలసినంత అవకాశం లభించింది. ఆధునికాంధ్ర వాఙ్మయనిర్మాతలైన కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి పంతులువంటి దిగ్దంతుల సేవ ఇందుకు ప్రబల నిదర్శనం. సర్కారు జిల్లాలలో సాహిత్యకులు అధిక సంఖ్యాకులు రాజకీయాలతో ప్రమేయం కలిగించుకోలేదు. కాని తెలంగాణాలో ఇది సాధ్యం కాలేదు. ఇక్కడి పరిస్థితులు వేరు. ప్రజలలో అధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. తెలుగును అణచివేయడమే నిజాం ప్రభుత్వం వారి అప్పటి ముఖ్యలక్ష్యం. తెలుగుభాషా ప్రచారం జరిగినా, ఆ భాషలో పుస్తకాలు వెలువడినా, అవి నిజాం రాజరికాన్ని కూలద్రోసేవిగా ఉంటాయని ఆ ప్రభుత్వం అనుమానించేది. కేవల సారస్వతోద్యమాలు అనే మాటకే అవకాశం లేని పరిస్థితుల్ని నిజాం ప్రభుత్వం కల్పించింది.

అట్టి స్థితిలో తెలంగాణాలో ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో గ్రంథాలయోద్యమం ద్వారా, ప్రజా విజ్ఞానానికి తోడ్పడే గ్రంథాల ప్రచురణ ద్వారా తెలుగువారిలో జాతీయ చైతన్యాన్ని తీసుకొని రావడానికి ప్రయత్నించిన ప్రముఖులలో అగ్రగణ్యులు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు. ఆయన మహామేధావి. విద్యాధికుడు. చరిత్ర పరిశోధకుడు. అన్నిటి కన్న సాహసవంతుడు. చాలా దూరదృష్టి కలవాడు. ఆయనది విజ్ఞాన దృక్పథము.

బ్రిటిషు ఆంధ్ర ప్రాంతానికీ నిజామాంధ్రకూ వారధి నిర్మించడానికి కలలుగన్న సాహసి ఆయన. ఆయనకు అండదండలు లేవు. ఆయనకు ముఖ్యంగా జమీం దార్లు శ్రీ రాజా నాయని వెంకటరంగారావు, రావిచెట్టు రంగారావుల సహాయ సహకారాలు లభించాయి. సరిగ్గా 1901 లో శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం హైదరాబాదు నగరంలోని రెసిడెన్సీ బజారులో స్థాపించబడింది. అంటే, ఇరవయ్యో శతాబ్ది, తెలంగాణాలో గ్రంథాలయోద్యమమూ ఒక్కసారే ఆరంభమయ్యాయన్నమాట! అప్పట్లో ఈ భాషానిలయం ఇక్కడి తెలుగువారికి ఒక ఆశాకిరణం ఒక వెలుగు రేక. నిజాం రాష్ట్రాంధ్రోద్యమ చరిత్రలో ఈ భాషా నిలయం నిర్వహించిన పాత్ర చిరస్థాయిగా నిలిచిపోతుంది. అదొక విద్వత్ సదస్సు. రాజకీయ సమాలోచనలకు రహస్య స్థావరం. పండితులూ, మేధావులూ, సర్వాంధ్రం నుంచి వచ్చినవారు కలుసుకునే ప్రదేశం. వైజ్ఞానిక వేదిక, సాంస్కృతిక కేంద్రము. దాని వేదికపై యావదాంధ్రము నుంచి వచ్చిన పండితులు ప్రసంగించారో, ఎందరికి గౌరవ మర్యాదలు జరిగాయో లెక్కవేస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అసలు అక్కడ జరిగిన సాహిత్య సభల విశేషాలన్నిటినీ ఉపన్యాసములతో సహా ఏ లేఖకుడైనా వ్రాసిపెట్టి ఉంటే బహుళాంధ్రోద్యమ ప్రపంచమున అది వహించిన పాత్ర తరువాతి తరాలవారికి తెలిసిరావడమే గాక, తెలుగువారి సాంస్కృతిక చరిత్రలో ఒక పెద్ద విభాగం రికార్డు అయి ఉండేది. అన్ని బహుళ ప్రయోజనాలను సాధించిన గ్రంథాలయం తెలుగుదేశంలో అరుదంటే సత్యదూరం కాదేమో! కాబట్టే ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ నిర్మాతలైన గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారు- "హైదరాబాదుకు రెండు కీర్తులు దక్కాయి. మొదటికీర్తి ఆంధ్రుల గ్రంథాలయోద్యమములలోను, ఆంధ్రోద్యమములోను కూడా హైదరాబాదు వారిదే ప్రథమస్థానము. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం 1901 సంవత్సరంలో ఆరంభమైనది. అప్పుడు నేను జూనియర్ ఎఫ్.ఎ. చదువుచుంటిని. కాబట్టి, ఈ ఉద్యమాలను మేము ప్రారంభించామని బడాయి చెప్పుకొనుట సరికాదు" అని ఆ భాషానిలయం ఉత్సవాల సందర్భంగా సందేశమిస్తూ అన్నారు. ఈ నిలయ స్థాపనతో తెలంగాణమున ఆంధ్ర భాషా వికసనోద్యమానికి అంకురార్పణ జరగడమే కాక, దీని స్థాపనతో ప్రారంభింపబడిన గ్రంథాలయోద్యమమే నిజంగా తెలంగాణమునందలి ప్రప్రథమ ఆంధ్రోద్యమమని చెప్పడం అతిశయోక్తి

ఏమాత్రం కాదు. ఎందుచేతనంటే, తెలంగాణా ఆంధ్రోద్యమం దీని స్థాపన తర్వాత ఎప్పుడో 1922 లో ఆరంభమయింది.

తరువాత 1904 లో హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషానిలయం స్థాపించబడినది. అది స్థాపించబడునాటికి మాడపాటి హనుమంతరావు పంతులు గారు వరంగల్లు జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయంలో చిన్న ఉద్యోగంలో ఉండేవారనీ, వారు ప్రజాసేవా రంగంలో ప్రవేశించడానికి ముఖ్యంగా ఉత్తేజం ప్రేరణ కలిగించినవారు కొమర్రాజు లక్ష్మణరావుగారేననీ తెలియవస్తున్నది. రాజరాజనరేంద్ర భాషా నిలయం అప్పట్లో మంచి పఠనాలయంగా ప్రజలను ఆకర్షించిందట. ఉపన్యాస కార్యక్రమాలు, వినోద విజ్ఞాన చర్చా కార్యక్రమాలు గ్రంథాలయంలో జరిగేవట. వంగరాష్ట్ర విభజనవల్ల కలిగిన స్వదేశీ ఉద్యమం, విదేశవస్తు బహిష్కారం, వివిధ రాజకీయ ఆర్థిక నైతిక సమస్యల సమాలోచనం, భారత జాతీయ కాంగ్రెసు కార్యకలాపాలు ఈ గ్రంథాలయం ద్వారా తెలుగు వారికి తెలుస్తూ ఉండేవి. ఆ తర్వాత 1905 లో సికింద్రాబాదులో ఆంధ్ర సంవర్ధినీ గ్రంథాలయం, 1918 లో వరంగల్లులో శబ్దానుశాసన ఆంధ్ర భాషా నిలయం స్థాపించబడ్డవి.

ఇక్కడ మనం ఒక విశేషం గమనించాలి. పైన చెప్పిన ప్రతి గ్రంథాలయం పేరులో ఆంధ్ర శబ్దం వుంది. పైగా తెలంగాణాలో తెలుగువారు ప్రారంభించిన ఉద్యమం పేరు 'ఆంధ్రోద్యమము'. రెండు గ్రంథాలయాల పేరులో ఇద్దరు తెలుగు ప్రభువులున్నారు. ఒకరు విజయనగర రాజ్యాధిపతులు, తెలుగు కవితకు పోషకులు శ్రీకృష్ణదేవరాయలు. రెండవవారు రాజమహేంద్రవరం రాజధానిగా ఏలిన చాళుక్య రాజు రాజరాజనరేంద్రుడు. మూడవ గ్రంథాలయం రాజరాజనరేంద్రుని ఆస్థానంలో కవి, ఆదికవి అయిన నన్నయ పేరిట ప్రారంభింప బడిన గ్రంథాలయం. దీనినిబట్టి ఒక విషయం స్పష్టమవుతున్నది. తెలంగాణా ప్రజలు, మేధావులు 'ఆంధ్ర' శబ్దాన్ని అభిమానించడానికి ముఖ్య కారణం ఆంధ్ర భావయే. తమ భాష ఆంధ్రభాష- దానిని కాపాడుకోవాలన్న కోరిక, పట్టుదల ముఖ్యంగా ప్రేరకములని చెప్పవలసి ఉన్నది. ఆంధ్ర భాషా ప్రచారము, ఆంధ్ర సారస్వత పునరుద్ధరణము ఇక్కడి గ్రంథాలయోద్యమానికి మొదట్లో ముఖ్యాశయాలు, ముఖ్య ప్రేరణలు. కాబట్టే సారస్వత సప్తాహములు, కవిసమ్మేళన

ములు, చక్కని తెలుగువారి ప్రత్యేక సాంస్కృతిక వినోద కాలక్షేపములు, జయంతులు, వర్ధంతులు, కవిపండిత సన్మానములు ఇక్కడి గ్రంథాలయాలలో నిత్య కార్యక్రమాలయ్యాయి.

నిజాం ప్రభువుల పరిపాలన ఉన్నంతవరకూ తెలంగాణాలో గ్రంథాలయాల స్థాపన దుస్సాధ్యంగా ఉండేది. ప్రజల మాతృభాషా వ్యాప్తికి ఏ కొంచెము అవకాశం కలుగజేసినా, స్వతంత్ర భావాలు వ్యాప్తిచెంది రాజకీయంగా తమకు ఎటువంటి కీడు దాపురిస్తుందో ఏమోనని వారి భయం. ఏ చిన్న సభ జరుపుకోవాలన్నా ప్రభుత్వాధికారుల అనుమతి అవసరమై ఉండేది. ఆ అనుమతి దుర్లభం. మతోన్మాదులైన ఫాసిస్టులు అమలు జరిపే వాగ్బంధనం అది. నిజాం రాష్ట్రంలో మొదటి గ్రంథాలయ మహాసభ ఆంధ్ర జన కేంద్ర సంఘము యొక్క మూడవ సమావేశంతో పాటు 1925 మధిరలో జరిగింది. ఇక్కడి గ్రంథాలయోద్యమం వ్యాపించకుండా చేయడానికి నిజాం ప్రభుత్వాధికార్లు ఎట్టి ఆటంకాలు కల్పించేవారో, ఒక్కొక్కప్పుడు వారి ఉత్తర్వులు ఎంత అనాగరికంగా ఉండేవో ఆంధ్ర పితామహులు మాడపాటి హనుమంతరావు పంతులు గారు వారు రచించిన ''తెలంగాణా ఆంధ్రోద్యమము'' అనే గ్రంథంలో చక్కగా వివరించారు. అవి చదివితే ఒకవంక వారి అజ్ఞానంపై నవ్వు వస్తుంది. మరొకవంక ఇటువంటి పాలనను కూడా తెలుగు బిడ్డలు సహించారా అన్న విభ్రాంతి కలుగుతుంది. ఆ గ్రంథం ఇప్పుడు అలభ్యంగా ఉన్నది. దీని రెండు భాగాలనూ కలిపి ఒకే సంపుటంగా అచ్చువేసి ఆంధ్ర మహాజనులకు లభింపజేయవలసిందిగా ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిని అర్థిస్తున్నాను. భారత దేశం స్వాతంత్ర్య సంగ్రామంలో మునిగితేలుతున్న 1946 లో కూడా హైదరాబాదు సంస్థానంలో గ్రంథాలయాలపై పరిశీలనాధికారం విద్యావిషయాలతో ఏ విధంగానూ సంబంధములేని పోలీసు శాఖకు ఉండేదంటే ఇక ఏమి చెప్పగలం? పోలీసు శాఖనుంచి గ్రంథాలయాల అజమాయిషీ అధికారాన్ని తొలగించి విద్యాశాఖకు అప్పగించవలసిందిగా కొత్తూరు గ్రంథాలయ మహాసభలో ఒక తీర్మానం చేయబడింది. 1335 ఫసలీలో సూర్యాపేటలో జరగవలసిన గ్రంథాలయ మహాసభ జరగరాదని నిజాం ప్రభుత్వం ఉత్తర్వు చేయగా హైకోర్టులో వ్యాజ్యం వేసి ప్రజలు దానికి అనుమతి సంపాదించి పట్టుదలతో 1337 ఫసలీలో ఆ సభను జరుపుకున్నారు. ఈ విధంగా సమావేశ స్వాతంత్ర్యం, వాక్ స్వాతంత్ర్యము

రచనా స్వాతంత్ర్యం కోసం తెలంగాణ ప్రజలు ఒక మహా [illegible] సదృశమైన గొప్ప పోరాటం జరుపవలసి వచ్చింది. ఆ పోరాటంలో తెలుగు బిడ్డలు ఎన్ని కష్టాలు కలిగినా తలవంచలేదు. అంతిమ విజయం వారిదే అయింది. గ్రంథాలయోద్యమం, గ్రంథ ప్రచురణోద్యమం, ఆంధ్రోద్యమం— ఈ విధంగా త్రివేణిపరిచి హైదరాబాదు రాష్ట్ర జాతీయోద్యమం సాగి, చివరకు ఒకానొక నిజాం ప్రభుత్వాధికారి శంక వెలిబుచ్చినట్లే హైదరాబాదు సంస్థానాన్ని భాషలవారీగా మూడు ముక్కలుగా విభజించి విశాలాంధ్ర ఏర్పరచవలెనన్న ఉద్యమం కూడా ఇక్కడే ఉద్భవమై, 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటంతో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం అవతరించింది. 1948 సంవత్సరపు మదరాసు ప్రభుత్వ పౌర గ్రంథాలయ శాసనాన్ని, 1955 సంవత్సరపు హైదరాబాదు రాజ్య శాసనాన్ని ఏకంగా చేసి 1960 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల శాసనాన్ని అమలులోకి తెచ్చారు. ఆంధ్ర గ్రంథాలయోద్యమనాయకులు అఖిల భారత గ్రంథాలయోద్యమానికి కూడా నాయకత్వమిచ్చి, అఖిల భారత గ్రంథాలయ సంఘమును స్థాపించడంలో తోడ్పడ్డారు. ఈ సందర్భంగా గాడిచర్ల హరి సర్వోత్తమరావు, అయ్యంకి వెంకట రమణయ్య, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు పంతులు, పాతూరి నాగభూషణం, సూరి వెంకట నరసింహశాస్త్రి, కల్లూరి సుబ్బారావు వంటి ఎందరో గ్రంథాలయోద్యమ నేతలు చేసిన కృషి చిరస్మరణీయమైనది. ఆంధ్రులు విజయవంతంగా ప్రారంభించి ఆదర్శప్రాయంగా నిర్వహించిన మొదటి ఉద్యమం [illegible] ఇండియాలో గ్రంథాలయోద్యమమే. ఆ తర్వాత చెప్పదగిన రెండవ ఉద్యమం భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను ఏర్పరచాలనేది. ఈ రెండింటికీ అఖిల భారత నాయకులు ఆమోదం తెల్పక తప్పలేదు. ఫలితంగా సకల కేరళ, విశాలాంధ్ర, సంయుక్త కర్ణాటక, బృహన్మహారాష్ట్ర, మహాగుజరాతు రాష్ట్రాలు ఏర్పడ్డాయి.

గ్రంథాలయోద్యమాన్ని పోషించేదీ, దానికి పరిపూర్ణత కలిగించేదీ గ్రంథ ప్రచురణోద్యమం. కొత్త గ్రంథాలు రాకపోతే గ్రంథాలయం పాతపడి పోతుంది. కొత్తనీరు ఎప్పటికప్పుడు వస్తూ ఉండాలి. భాష, సాహిత్యం, విజ్ఞానం పెంపొందుతూ పోవాలి. కొత్త పుస్తకాలు రావాలి. అందుకు ముద్రణ యంత్రం తోడ్పడింది. జర్మనీ దేశీయుడైన రెవరెండ్ బెంజమిన్ షుల్జ్ (1689-1760) మొదటి తెలుగు గ్రంథ ముద్రాపకుడని పరిశోధకులు చెప్పుతున్నారు. ఇతను

23 సంవత్సరాలు దక్షిణ భారతదేశంలో ఉండి సేవ చేశాడనీ, తిరిగి స్వదేశం చేరుకున్నాక అక్కడ 17 సంవత్సరాలపాటు తెలుగు పుస్తకాల ప్రచురణలో జీవితం వెళ్ళబుచ్చాడనీ చెబుతున్నారు. జర్మనీలోని హాలే నగరంలో తెలుగు టైపులు పోతపోయించి అతను నాలుగు పుస్తకాలు ప్రచురించాడు. ఇవి ఏసు వాదాలు. క్రైస్తవమత పుస్తకాలు. 48 పేజీల లోపు చిన్న పుస్తకాలు. 1. సత్యమైన వేదంలోవుండే జ్ఞాన ఉపదేశాలయొక్క సంక్షేపం, 2. మోక్షానికి కొంచువొయ్యే దోవ. ఇవి 1746 లో హాలేలో ముద్రింపబడ్డాయి. మూడవది పెద్దస్వామి నాల్గవది సూరు జ్ఞానవచనాలు. ఇవి 1747 లో అక్కడే అచ్చు వేయబడ్డాయి. అయితే, వీటివల్ల తెలుగు ముద్రణ ఆరంభం జరిగిందేకాని, వ్యాపారరీత్యా పుస్తక ప్రచురణకు మరికొంతకాలం పట్టింది. అయితే, దీనితో ఆశాపత్ర గ్రంథాల శకం అంతరించి, కాగితపు పుస్తకాల యుగం ప్రారంభ మైంది. మరొక మిషనరీ రెవరెండ్ విలియం కేరీ కలకత్తాదగ్గర శ్రీరాంపూరు మిషన్ ముద్రణాలయంతో తెలుగులో క్రొత్త నిబంధన, ఎ గ్రామర్ ఆఫ్ ది తెలుగు లాంగ్వేజి అనే పేరుతో ఇంగ్లీషులో వ్రాయబడిన తెలుగు వ్యాకరణం, మరొక పుస్తకం 1814 లో ముద్రించాడు. మాత్యు సువార్త, మార్కు సువార్త, లూకా సువార్త అనే గ్రంథాలు 1812 లోనే శ్రీరాంపూర్ ప్రెస్సులో అచ్చు అయినట్లు తెలుస్తున్నది. 1842 లో హంసవింశతి (వచనం), వేమనగోపాల శతకము, వసు చరిత్ర, రావిపాటి గురుమూర్తి శాస్త్రి ఆంధ్ర శబ్ద రత్నాకరము పుస్తకాలు అమ్మ కానికి ఉన్నట్లు గని 'వర్తమాన తరంగిణి' అనే తెలుగుపత్రిక ఒక ప్రకటన వేసింది. పరవస్తు చిన్నయసూరి 'నీతిచంద్రిక' ముద్రాసులో 1853 లో అచ్చు అయిన పుదూరి సీతారామశాస్త్రి రచించిన 'బాలశిక్ష' 1865 లో మద్రాసు ... ఇండియా బుక్ సొసైటీవారు ప్రచురించిన 'రెండవ ... పుస్తకం' (The Second Telugu Reading Book) విశాఖపట్నం ... ప్రెస్‌లో 1857 లో అచ్చు అయిందట అంటే సిపాయీల తిరుగుబాటు ... విశాఖపట్నానికి తెగలకుండా అక్కడ అంతా శాంతంగా ఉన్నప్పుడన్న ... కాని, రెండవ ప్రపంచయుద్ధంలో విశాఖపట్నం జపానువారి బాంబు దాడికి గురి అయింది. అక్కడవున్న ఆంధ్ర విశ్వవిద్యాలయం పలసకు పోయింది ... ఏమైనప్పటికి ''1857 కు పూర్వం తెలుగులో అచ్చు అయిన పుస్తకాలు ... చేరలేదు. దీనిబట్టి పుస్తకముద్రణ కార్యం ఆ రోజులలో బహు

దినములపాటు జరుగుతూ ఉండేదనీ, కొన్ని సందర్భాలలో ఒక పుస్తకం ముద్రణమును పూర్తిచేయడానికి కొన్ని ప్రెస్సులకు కొన్ని ఏండ్లు కూడా పట్టేవి'' అని డాక్టర్ జె. మంగమ్మగారు వారు రచించిన 'బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో తెలియజేశారు. 1852 నాటికి మద్రాసులో తెలుగు ముద్రణాలయములు ఎనిమిది ఉన్నట్లు బ్రౌన్ ద్వారా తెలియజేశారు. తెలుగు పుస్తకాల అచ్చు విషయంలో మద్రాసు తర్వాత బళ్ళారి రెండవ స్థానంగా ఉండేదట.

తెలుగు గ్రంథ ప్రచురణోద్యమం చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (1798-1884)తో కొంత వేగం పుంజుకుంది. ఇతడు ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి, మద్రాసు సివిల్ సర్వీసుకు చెందినవాడు. బ్రౌన్ చేసినది దేశంలో చెల్లాచెదురుగా పడివున్న మన ప్రాచీన కావ్య పరిరక్షణము, తెలుగు సాహిత్య పునరుద్ధరణము. ఆనాడతడు ఆంధ్ర కావ్యాలను ఉద్ధరించకపోయినట్లయితే చాలా కావ్యాలు మనకు దక్కకపోయేవి. వివిధ ప్రాంతాలనుండి ప్రాత ప్రతులను తెప్పించి, వివిధ పాఠాలను పరిశీలించి, వ్యాఖ్యానాలతో తెలుగు కావ్యాలను పెద్ద ఎత్తున ప్రకటించుటకు పూనుకున్నవారిలో మొదటివాడు బ్రౌన్ దొర. అతడు తెలుగు పండితులతో స్నేహంగా ఉన్నాడు. ఎందరో పండితులను నియమించి ధనసహాయం చేసి పోషించాడు. మనకు అతి ప్రియమైన వసు చరిత్ర, మను చరిత్రలను వ్యాఖ్యలతోసహా వెలయించాడు. వసు చరిత్ర 1844లో, మను చరిత్ర 1851లో, పోతన భాగవతమును 1848లో అచ్చు వేయించాడు. వేమన పద్యములకు తాను స్వయంగా ఆంగ్లానువాదం చేసి, వ్యాఖ్యానం రచించి 1829లో అచ్చు వేయించాడు. ఇక నిఘంటు నిర్మాణం విషయంలో అతడు ఒక విధంగా మార్గదర్శి. వాటిలో ఆయన వ్యావహారిక భాషకు ప్రముఖ స్థానమిచ్చాడు. నిఘంటువులు పండితులకూ పామరులకూ ఉపయోగపడాలనని అతని ఆశయం. 1800 పేజీల ఇంగ్లీషు-తెలుగు నిఘంటువును 1860లో ప్రకటించాడు. దీని ముద్రణకు సుమారు తొమ్మిదేండ్లు పట్టింది. తెలుగు-ఇంగ్లీషు నిఘంటువును 1852లో ముద్రింపించాడు. ఇదికాక జిల్లా నిఘంటువు, మిశ్ర భాషా నిఘంటువు 1852, 1854 ప్రాంతాలలోనే తెచ్చాడు. కొన్ని నిఘంటువులను ఇంకా కొన్ని పదాలు చేర్చుతూ పునర్ముద్రణ సమయంలో ఇంతా పెద్దవిగా enlarged editions గా వేయాలని ప్రయత్నం చేశాడు.

అవి బహుశా లండనులోనే వుండవచ్చు. బ్రౌన్ వేటినీ పారవేసేవాడు కాడు. ఎవరికో ఒకరికి తన కవిలెలు అప్పగించాడు. లండనులో మన పరిశోధకులకు తగినంత పని ఉంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇద్దరిని పంపి లండనులో మన హైకమీషనర్ ద్వారా ప్రయత్నించేట్టయితే తెలుగువారి పెన్నిధి కొంత అక్కడ బైట పడవచ్చు. బ్రౌన్ "ఆంధ్ర సంస్కృత భాషల ఛందస్సు"ను 1827 లో ప్రకటించాడు. తెలుగు సాహిత్యాన్ని గూర్చి అతడు వ్రాసిన సుదీర్ఘమైన ఆంగ్ల వ్యాసం 1839 లోనే ఆంధ్రేతరులకు మన సాహిత్యాన్ని గూర్చి తెలియచెప్పింది. బ్రౌన్ తెలుగు ముద్రణమును విశేషంగా ప్రచారంలోకి తీసుకున్నాడు. తెలుగు అచ్చును వేగంగా కూర్చుటకు వీలుగా కొన్ని మార్పులను ప్రవేశపెట్టాడు. దీనివల్ల మన ముద్రణ కళ అభివృద్ధి చెందింది 1860, 1870 నాటికే పేటీలకు అంకెలు, విరామ చిహ్నములు, పద విభాగములు, ప్రకరణ విభజనలు అతని మూలంగానే అచ్చు పుస్తకాలలోకి వచ్చాయి. ఇందువల్ల ఎందరో తెలుగు ముద్రాపకులు బయలుదేరి తర్వాత పెద్దపెట్టున గ్రంథ ముద్రణకు పూనుకోవడం జరిగింది. అప్పుడు ప్రింటింగు లాభసాటి వ్యాపారమని వర్తకులు గ్రహించారు. అతడు తన డబ్బులు ఖర్చుచేసి తెలుగు భాషా సాహిత్యాలకు ఈ కృషి అంతా చేశాడు. కాని, దానివల్ల తరువాతివారు లాభపడ్డారు. చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ఆంధ్ర దేశంలో వున్న కాలం 1817-1855 సంవత్సరాల నడుమ. 1855 లో శాశ్వతంగా భారతదేశం వదిలి లండను వెళ్ళిపోయాడు. తన మాతృభాష కానట్టి భాషకు ఇంత సేవ చేసిన వ్యక్తి ప్రపంచ భాషా చరిత్రలో వేరొకరు ఉండరా? "1825 లో తెలుగు సాహిత్యం ప్రాణం లేకుండా పడి ఉన్నట్లు నేను గమనించాను. ముప్పయి ఏండ్లలో తిరిగి దానికి జీవంపోసి లేపి నిలబెట్టాను" అని బ్రౌన్ వ్రాసుకున్నాడు. బంగోరె గారు చెప్పినట్లు "తెలుగును సంబంధించి నంతవరకు బ్రౌన్ ఒక అద్వితీయమైన, అప్రతిహతమైన restorer of learning కాగలిగాడు." ఇది పూర్తిగా సత్యం.

తెలుగు ముద్రణ కళ పెంపొంది, పని సులువు అయి ప్రింటింగు ప్రెస్సులు బయలుదేరడంతో తెలుగు వచన వాఙ్మయం వికాసం పొందింది. 1800 సంవత్సరం తర్వాత నుంచి 1850 వరకూ కథారూపంలో గ్రంథాలు కొల్లలుగా రచించి ప్రచురించే కృషి జరిగింది. ఇవి పద్యకావ్యాలు చదవలేని

సామాన్యుల కొరకూ, తెలుగు నేర్చుకునే ఇంగ్లీషు ఉద్యోగుల కొరకూ ఉద్దేశింపబడి ఉంటాయని అనుకుంటాను. వీటిలో వెన్నెలకంటి సుబ్బారావుగారి విక్రమార్క కథలు, రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి విక్రమార్కుని కథలు, పంచతంత్ర కథలు, పాతూరి రామశాస్త్రి శుకసప్తతి కథలు, పురాణం కృష్ణశాస్త్రులు అరేబియన్ నైట్సు కథలు, ధూర్జటి లక్ష్మీపతి హంసవింశతి వచన కథ, తోతినామా లేక చిలుక కథలు, దిలారామకథ, బత్తీసు పుత్రిక కథలు, భేతాళ పంచవింశతి కథలు, కాంభోజరాజు కథలు, చార్ దర్వేషు కథలు లేక నలుగురు ఫకీరుల కథలు, పుష్పగిరి కరుణల చరిత్ర ముఖ్యమైనవి. ప్రజలు వీటిని కొని చదువుతారని, ఇవి లాభసాటి వ్యాపారమనీ కూడా ప్రకాశకులు వీటిని ప్రకటించి ఉండవచ్చు. ఇంచుమించు ఈ కాలంలోనే బ్రౌన్ దొరవారి తాతాచార్యుల కథలు, ఏనుగుల వీరాస్వామయ్య గారి కాశీయాత్రా చరిత్ర, కోలా శేషాచలకవి నీలగిరియాత్ర, గాజుల వేంకట బొర్రయ్యగారి కాంచీపుర మాహాత్మ్యము వచ్చాయి. ఇవి ప్రజల వచనాభిలాషను కొంతవరకు తీర్చగలిగాయి. కుంఫిణీ ప్రభుత్వం వారి గ్రాంధిక క్రిమేణా వచన రచనకు ప్రాముఖ్యం కలుగుతూ వచ్చిందని యీ ఇవి తెలుపుతున్నాయి.

ఈ కాలంలోనే పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించడానికి అనువైన పుస్తకాలు కూడా వచ్చాయి. అనువైన అంటే- అప్పటి ప్రభుత్వాధికార్ల దృష్టి ప్రకారం. 1853 లో చిన్నయసూరి 'నీతి చంద్రిక' రచించి, తానే ముద్రింపజేశారు. ఇదొక రకమైన వచన రచన కృతకంగా కూడా ఉంది. చిన్నయసూరి గారి ఈ శైలిని అనుసరించి కొక్కొండ వెంకటరత్నం పంతులు, చివరకు కందుకూరి వీరేశలింగం గారు కూడా వచన రచన చేశారు. కారణం ఏమిటంటే, అప్పుడు అలాంటి వచన గ్రంథాలు పాఠ్య పుస్తకాలుగా నిర్ణయింపబడుతాయి. తర్వాత వీరేశలింగం గారు తమ వచన శైలిని పూర్తిగా మార్చుకొని, సర్వజన గ్రాహ్యమై, మృదువై, సులభమై, సలక్షణమైన వచన రచనకు నాంది పాట వేశారు. వారు వ్యాప్తిలోకి తెచ్చిన వచనమే ఆధునిక కాలంలో అనేక విషయాలపై పుస్తకాలు రచించడానికి ఉపకరించింది. తాను తీర్చిదిద్దిన గద్యం ద్వారా వీరేశలింగం పంతులుగారు ఆంధ్రభాషను ఒక నవీన యుగంలోకి ప్రవేశ పెట్టారని చెప్పవచ్చు. నిడుదవోలు వెంకటరావుగారు ''చిన్నయసూరి నవీన వచన సృష్టికర్త. ఆధునిక యుగమున వచన రచనకు చిన్నయసూరి ఆద్యుడు''

అన్నారు. ఇది ఆధునిక కాలమంటే సరైన అవగాహనతో, తగిన దృక్పథంతో వెలిబుచ్చిన అభిప్రాయం కాదు చిన్నయసూరి వచనం చదవడానికి ఆకర్షవంతంగా ఉండవచ్చునేమో కాని, భాషనూ సాహిత్యాన్నీ జాతినీ ఆధునిక యుగంలోకి చేయి పట్టుకొని తీసుకు వెళ్ళేది కాదు. ఇంకా యాభై యేళ్ళు వెనక్కి తీసుక వెళ్ళేది. ఏ వచన రచన అయితే సమస్త ఆధునిక విషయాలను గూర్చి భావాలు వ్యక్తం చేయడానికి అనువుగా, సుకోధకంగా, modern concept కి అనుకూలంగా ఉంటుందో అది జాతికి మేలు చేసేది. సరే, అది వేరే విషయం. 1868 లో ముద్రితమైన పరవస్తు చిన్నయసూరి 'హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము' అనే అనువాద గ్రంథం ఇదట పేర్కొనదగింది. ఆంగ్ల వాక్యాలకు తెలుగు అనువాదాలనిచ్చిన వైనం గమనింపదగింది.

ఎవరేమన్నప్పటికీ, ఇక్కడ వావిళ్ళ సంస్థ తెలుగు గ్రంథ ప్రచురణోద్యమానికి చేసిన సేవను ప్రస్తావించక తప్పదు. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ అనే సంస్థ 1854 లో స్థాపితమైనట్లు తెలుస్తున్నది. 125 సంవత్సరాలకు పైగా అవిచ్ఛిన్నంగా, అపారమైన వాఙ్మయ సేవచేసిన తెలుగు సంస్థ ఇది. "చేతివ్రాత పుస్తకములు చదువుకునే రోజులలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు ముద్రణాలయమును స్థాపించి చదువరుల కష్టములను నివర్తింప జేసిరి" అని సి. పి. బ్రౌన్‌దొర అన్నాడు. కట్టమంచి రామలింగారెడ్డిగారు "విలుపైపోవనున్న అనేక పూర్వక విఖ్యాత గ్రంథముల నప్పిచ్చి ఉద్ధరించిన కీర్తి వావిళ్ళ వారిదే" అన్నారు. పీరు బ్రౌన్‌దొర పరిన క్రమపలితాన్ని ఒక వ్యాపార రూపంలో పెట్టి, వ్యాదాసు ప్రోత్సాహంతో గ్రంథాలయ మందలి తెలుగు పుస్తకాలెన్నిటినో ప్రచురణ ప్రారంభించి, మరికొన్ని తాళపత్ర గ్రంథాలు సేకరించి, వాటిన్నిటినీ పండితులచేత పరిశోధింపజేసి, ప్రెస్ కాపీలు సిద్ధం చేయించి, చక్కని పీఠికలతో ముద్రించి, సాహితీ లోకానికెంతో సేవ చేశారు. పద్య కావ్యములు, వచన గ్రంథములు శతకములు, జీవిత చరిత్రలు కథలు, నవలలు, నాటకములు, నిఘంటువులు, ఛందస్సు అలంకారశాస్త్ర వ్యాకరణ గ్రంథములు, వైదిక గ్రంథములు, జ్యోతిషము, ధర్మశాస్త్రము, వైద్యగ్రంథములు, వేదాంతము, స్తోత్రములు, పురాణేతిహాసములు, సంస్కృత పద్య గద్య కావ్యములు, తమిళంలో ఆంగ్లంలో కూడా కొన్ని గ్రంథాలు అచ్చు వేశారు. వావిళ్ళ వారి పుస్తకాలే? ఇల్లా ఉండేదా? తెలుగు కాంపోజిషన్ విషయంలో గురజాడ

అప్పారావుగారి డిసెంట్ పత్రమును వావిళ్ళవారే 1914 లో అచ్చువేశారు. ''వావిళ్ళవారి గ్రంథములు పరమ ప్రమాణములు'' అన్న పేరు తెచ్చుకొని, వావిళ్ళ వారంటే గ్రంథ ముద్రణ ప్రకటనలకు పర్యాయపదముగానున్నట్లుగా వారు వాఙ్మయసేవ చేశారు. 18 సంపుటముల సంస్కృత భారతమును నాగర లిపిలో అచ్చువేయడమంటే మాటలా! ఆంధ్రుల దురదృష్టవశాత్తు ఆ సంస్థ ఇప్పుడు మూతపడి, వ్యవహారం మద్రాసు హైకోర్టువారి పర్యవేక్షణలోకి పోయింది. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కలుగజేసుకుంటే, ఆ సంస్థలోని వారి ఒప్పందమునకు వస్తే, సంస్థ తిరిగి ఒక పబ్లిక్ ట్రస్టు క్రింద పనిచేసే అవకాశం కలుగుతుందేమో! వావిళ్ళ సంస్థ లేకపోయేసరికి ఇప్పుడు తెలుస్తున్నది ఆ సంస్థ వల్ల ఆంధ్ర మహాజనులు పొందిన సేవ. అటువంటి సంస్థలు ఎప్పుడుపడితే అప్పుడు ఎవరిచేతబడితే వారిచేత నిర్మింపబడేవి కావు. అవి కొన్ని సంప్రదాయాల ప్రకారం పనిచేసి పెంపుగాంచిన గ్రంథముద్రణ సంస్థలు. ఉత్కృష్టంగా సలక్షణంగా గ్రంథాలను ముద్రించి పాఠకలోకానికి అందజేయడం వాటి పరమ లక్ష్యం. అయితే అది వారి వ్యాపారం కదా అనవచ్చు. కాని, చాలామంది మూడు 'నాలుగు రెట్లు ధరలు పెట్టిన గ్రంథాలు ... మనకు తెలిసిన విషయమే.

పందొమ్మిదవ శతాబ్దిలో మద్రాసులో నివసించిన ఆంధ్ర ప్రచురణకర్తలు కొందరు స్వయంగా ముద్రణాలయాలను స్థాపించి, అనేక గ్రంథాలను ప్రచురించి తెలుగు భాషాసాహిత్యాలను సుసంపన్నం చేశారు. ఇదిఇల్లా గ్రంథ ప్రచురణ విరివిగా సాగింది. దేశభాషలలో పుస్తకాలను ముద్రించడానికి మొట్టమొదటి ముద్రణాలయం ఎస్.పి.సి.కె. (సొసైటీ ఫర్ ప్రమోటింగ్ క్రిస్టియన్ నాలెడ్జి) అనే పేరుతో స్థాపించబడింది. పురాణం నారాయణశాస్త్రిగారు మద్రాసులో మొట్ట మొదటి తెలుగు ముద్రణాలయాన్ని ప్రారంభించి, పుదూరు శ్రీరామశాస్త్రి రచించిన పెద్ద బాలశిక్షను 1847లో తమ ముద్రణాలయంలోనే అచ్చువేసినట్లు తెలియవస్తున్నది. చిన్నయసూరి 1854లో ఒక ముద్రణాలయం మద్రాసులో నెలకొల్పారు. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు మద్రాసులో సంస్కృత ముద్రాక్షరశాల స్థాపించారు. వెంకటాచలం సుబ్బారావుగారు ఎక్కువగా బడి పుస్తకాలను చాలా అందంగా తయారుచేయించి విక్రయించేవారట. ఆయన స్వయంగా ఒక మంచి నవల వ్రాశారని చెబుతారు. వేదం వేంకటరాయశాస్త్రి

గారు ఒకవైపు గ్రంథ రచన చేస్తూ, కావ్యాలకు వ్యాఖ్యలు వ్రాస్తూ తాము సిద్ధంచేసిన గ్రంథాలను తమ ముద్రణాలయంలోనే అచ్చువేస్తూ ఉండేవారట. ప్రెస్సుపై నష్టంవస్తూ ఉండేది. ఏ దాతయో ఆదుకునేవాడు. గ్రంథ ప్రకటన అలా సాగుతూపోయేది. ఆ కాలంలో కందుకూరి వీరేశలింగం పంతులు, వావిలికొలను సుబ్బారావు వంటివారు ఉద్గ్రంథాలను రచించారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఎన్ని గ్రంథాలు రచించారో ఆలోచించండి. ఈ మహనీయుల వల్లనే శతాధిక గ్రంథకర్తలు అనే మాట వాడుకలోకి వచ్చింది. చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు ఎన్ని విధములైన రచనలు చేశారో గమనిస్తే ఈ పెద్దలందరి జీవితాలు గ్రంథ రచనతోనే వెళ్ళమారిపోయాయా అనిపిస్తుంది. చిలకమర్తి వారి 'గయోపాఖ్యానం' నాటకం ఆ రోజులలోనే లక్షా పాతికవేల ప్రతులు అమ్ముడు పోయిందట! వీరేశలింగం పంతులుగారు తాను "రాజశేఖర చరిత్ర" నవల వ్రాయడమేగాక నవలా రచనను ప్రోత్సహించిన వారిలో ప్రథములు. వారు 'చింతామణి' అను పత్రికలో నవలలు ప్రకటించడమేగాక, నవలా రచనకు పోటీలు నిర్వహించి, ఉత్తమ నవలలకు బహుమానములిచ్చి, నవల అనే ప్రక్రియను తెలుగులో పెంపొందింపజేయడంతో, పాఠకులకు ఉత్తమ నవలలు చదివే అవకాశాన్ని కలిగించడంలో చాలా గొప్ప కృషి చేశారు. బహుమతి పొందిన నవలలు 'చింతామణి' పత్రికలో ప్రకటితములై, తర్వాత వేరే పుస్తకాలుగా వచ్చేవి. వావిలాల వాసుదేవశాస్త్రి, న్యాపతి సుబ్బారావు, వీరేశలింగం పోటీకి బహుమతి నిర్ణేతలు. 1898 సంవత్సరంలో జరిపిన మొదటి పోటీలో ఖండవల్లి రామచంద్రుడుగారి "ధర్మవతీ విలాసము" అను మొదటి బహుమతి వచ్చింది. ఇందులో పాత్రోచిత వ్యవహార భాష వాడబడింది. ఇది సాంఘిక నవలయే వెల అరణాలు. ఆ తర్వాత జరిగిన పోటీలలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నాలుగు నవలలకూ, ఖండవల్లి రామచంద్రుడుగారివి మరి రెండు నవలలకూ, తిల్లా ప్రగడ సూర్యనారాయణరావుగారి ఒక నవలకూ, గోటేటి కనకరాజుగారి నవలకూ, వేకుమళ్ళ రాజగోపాలరావుగారి నవలకూ బహుమతులు వచ్చాయి. ఈ విధంగా ఆంధ్రలో నవలా ప్రక్రియ వ్యాప్తి జరిగింది. ఆ తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయం కూడా 1980లో నవలా రచన పోటీ జరిపింది.

ఇక గ్రంథ ప్రచురణోద్యమంలో గ్రంథమాలలు వహించిన పాత్ర స్మరణీయమైనది. తెలుగు ప్రజలలో గ్రంథ పఠనాసక్తిని పెంపొందించడానికి,

కొన్ని నిర్దిష్ట విషయాలకు సంబంధించిన పుస్తకాలను ప్రకటించి ఆవి లేని కొరతను తీర్చడానికి తెలుగుదేశంలో అప్పుడప్పుడు కొన్ని గ్రంథమాలలు వెలసినవి. గ్రంథమాలలంటే స్వచ్ఛంద ప్రచురణ సంస్థలు. వీరి దృష్టి లాభాలు ఆర్జించడం కాదు. తమకు అభిమానమైన విషయాలను గూర్చి ఉత్తమ గ్రంథాలు ప్రకటించడం. ఇట్టి గ్రంథమాలలలో అన్నిటికన్న ముందట స్థాపించబడింది విజ్ఞాన చంద్రికా గ్రంథమాల దీనిని కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు 1906లో స్థాపించారు. దీని కార్యస్థానం తొలుత హైదరాబాదులోనే ఉండెను. కొన్ని గ్రంథాలు హైదరాబాదు నుండే వెలువడ్డవి. తరువాత ఇది మదరాసుకు మారింది. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశంలో జరిగిన గ్రంథ ప్రచురణ స్వరూపంగా ఎరిగినవారు. తెలుగులో అప్పటివరకు విజ్ఞాన వాఙ్మయము లేదు. చరిత్ర పరిశోధన తగినంత జరగలేదు. నవల రచన వికాసం పొందలేదు. వ్యాసమునకు సరియైన స్వరూపం ఏర్పడలేదు. ఈ లోటులను తీర్చడానికి లక్ష్మణరావుగారు కంకణ బద్ధులైనారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల తరఫున దేశచరిత్రలు, మహాపురుషుల జీవిత చరిత్రలు, పదార్థ విజ్ఞాన, రసాయన, జీవ వృక్ష భూగర్భ అర్థశాస్త్రాలు మొదలగు విషయాలపై మొత్తం 46 గ్రంథాలు ప్రచురించినట్లు తెలియవస్తున్నది.

వీరు వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రను కూడా ప్రకటించారు. చరిత్రాత్మక నవలలు కూడా ప్రచురించారు. ఆంగ్లములోని 'ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా' మాదిరి అకారాదిక్రమమైన ఆంధ్ర భాషలో ప్రపంచ విజ్ఞానమును ఆంధ్రులకందింపవలెనని కొమర్రాజు లక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ప్రకటింప నిశ్చయించారు. దీని ముద్రణ 1912లో ప్రారంభమై 1920 నాటికి మూడు సంపుటములు పూర్తి అయ్యాయి. దాక్షిణాత్య భాషలలో ముద్రితమైన మొదటి విజ్ఞాన సర్వస్వం ఇదే. కాని ఆంధ్రుల దురదృష్టవశాత్తు ఇది అంతటితోనే ఆగిపోయింది. లక్ష్మణరావుగారు దీనిని ''విశ్వవిజ్ఞాన మూర్తికిని, ఆంధ్ర విజ్ఞాన ప్రపంచమునకును సమర్పించుట''ను బట్టి వారి విజ్ఞాన దృక్పథమెంతగాఢమైనదో మనకు తెలియవస్తుంది. ఆ తర్వాత చెప్పుకోదగింది ఆంధ్ర ప్రచారిణి గ్రంథమాల. ఇది 1911లో కొవ్వూరి రామచంద్రారెడ్డిగారిచే స్థాపింపబడింది. రెడ్డిగారి మరణానంతరం దీనిని తెలుగు సాహిత్యంలో నవయుగోదయానికి కారకులలో ఒక జంట అయిన వెంకట పార్వతీశ్వర కవులు నిర్వహించారు.

ఒక విశేషం. దీని కార్యస్థానం నిడదవోలు, రాజమహేంద్రవరం, కాకినాడ, పిఠాపురములకు మారింది. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల 1930 వరకల్లా రమారమి 170 నవలలు, ఇతర కథా వాఙ్మయం ప్రకటించిందని గిడుగు సీతాపతి గారు తాము రచించిన "హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్" అనే గ్రంథంలో తెలిపారు. వీటిలో సాంఘిక నవలలు, చారిత్రక నవలలు, అపరాధ పరిశోధక నవలలు ఉన్నాయి. బంకించంద్ర చటర్జీ, రవీంద్రనాథ టాగూరు, పాంచ్ కడీదేవ్ లాంటి బెంగాలీ రచయితల గ్రంథాలను వీరు తెలుగు వారికి అందచేశారు. వీరి పుస్తకాలవల్ల పాఠకులకు పఠన సామగ్రి పుష్కలంగా లభించింది; బెంగాలీ నవలా తీరు తెన్నులూ, అపరాధ పరిశోధక నవలల పైన మోజూ తెలుగు వారికి తెలిసి వచ్చాయి. ఆ తొలిరోజుల్లో పుస్తక ప్రచురణకార్యం శైశవావస్థలో ఉన్నప్పుడు పాఠకులలో పుస్తకాలు చదివే అలవాటును పెంపొందింపచేయడంలో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల పాత్ర ప్రశంసనీయమైంది.

ఆంధ్రపత్రికాధిపతులైన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1924లో మద్రాసులో - అనగా "భారతి" పుట్టిన యేటనే ఆంధ్ర గ్రంథమాల స్థాపించి, వాఙ్మయ గ్రంథాలు, చరిత్రలు, విమర్శ గ్రంథాలు, తలిసెట్టి రామారావుగారి "భారతీయ చిత్రకళ" వంటి గ్రంథాలు ప్రచురించారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని పునర్ముద్రించారు. ముఖ్యంగా పేర్కొనదగింది వారు వెలుగులోకి తెచ్చిన ఆంధ్ర వాఙ్మయ సూచిక. దానికి వారు వ్రాసిన పీఠిక ఒక మాదిరి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. వాఙ్మయ సూచికలో ఆంధ్రమున ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికను ప్రారంభము నుండి 1927 సంవత్సరం వరకూ శ్రీ వెలిదండ శ్రీనివాసరావుచే సిద్ధం చేయించి ప్రకటించారు. ముద్రితగ్రంథములు 12268. అముద్రిత గ్రంథములు 1672. రమారమి ఆరువేల మంది గ్రంథకర్తల వివరాలు ఇచ్చారు. పీఠిక 108 పేజీలుకాక, గ్రంథము 606 పేజీలు. వెల రెండు రూపాయలు. ఒక ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడైన అదిపిరాల సత్యనారాయణమూర్తి రచించిన సంగీతశిక్షణ గ్రంథాన్ని నాగేశ్వరరావుగారు ప్రచురించగా రాష్ట్రేతర ప్రాంతాలలో, ఖండాంతరాలలో ఆ గ్రంథానికి మంచి ఖ్యాతి వ్యాప్తి రావడంచేత, ఆ రచయిత మరి మూడు గ్రంథాలు రచించడమేగాక, సంగీత నిఘంటువును కూడా రచించడానికి ప్రోత్సాహం కలిగిందట. నాగేశ్వరరావుగారి అనంతరం శంభుప్రసాద్‌గారు పిల్లలు ఎంతో ఇష్టంగా చదువుకునే

క్లాసిక్‌లవంటి ప్రసిద్ధ ఆంగ్ల నవలలను తెనిగింపజేసి ప్రకటించారు. అటువంటి పుస్తకాలు వివిధ భాషలనుంచి తెలుగులోకి రావలసిన అవసరం ఉన్నది.

కవితిలక విద్వాన్ కంచనపల్లి కనకమ్మగారు 1925 లో బెజవాడలో కవితిలక గ్రంథమాలను స్థాపించి కవిత్వము, కథలు, నాటకములు, మహనీయుల చరిత్రములు ప్రకటించారు. ఒక స్త్రీచే నెలకొల్పబడిన యొట్టమొదటి గ్రంథమాల ఆంధ్రలో ఇదేనేమో!

రాయలసీమప్రాంతపు కవిపండితుల గ్రంథాలను ప్రకటించి వాటికి ప్రచారం కలుగజేసే ఉద్దేశంతో కల్లూరు అహోబలరావు, కృష్ణమూర్తి దేసాయిల ఆధ్వర్యాన శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల స్థాపించారు. అభిమానులనుంచి, దాతలనుంచి సేకరించిన విరాళాలే దీని మూలధనం. సంవత్సరానికి మూడు పుస్తకాలు ప్రకటించేవారు. ఆ మూడు పుస్తకాలను ఒక రూపాయి చందా కట్టినవారికి ఇచ్చేవారు. ఈ గ్రంథమాలకు అనుబంధంగా ప్రతి సంవత్సరం ఉగాది కానుకలు ప్రచురించేవారు. రాయలసీమ రచయితల చరిత్రను ఈ గ్రంథమాలవారే వెలువరించారు.

ఈ సందర్భంలో తెలంగాణా ప్రాంతంలో, ముఖ్యంగా హైదరాబాదు నగరంలో విప్లవాత్మకమైన సంచలనం తెచ్చిన రెండు గ్రంథమాలను ప్రస్తావించవలసి ఉన్నది. మొదటిది ప్రసిద్ధ రచయిత కీ॥ శే॥ వట్టికోట ఆళ్వారు స్వామిగారు 1938 లో సికింద్రాబాదు కార్యస్థానంగా దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మృతిచిహ్నంగా నెలకొల్పిన దేశోద్ధారక గ్రంథమాల. అసలు ప్రజల మనిషి అంటే ఆళ్వారు స్వామిగారే. తాను ప్రచురించిన పుస్తకాలను పెద్ద పెద్ద సంచులలో పెట్టుకొని, తెలంగాణలోని మారుమూల పల్లెలకు పోయి, చదువు వచ్చినవారికి వాటిని చూపించి, అలాంటి పుస్తకాలు చదివి విజ్ఞానం పొందాలని చెప్పి, వారిని చందాదార్లుగా చేర్చి, పుస్తకాలు క్రమం తప్పకుండా వారికి అందజేస్తూ ఉండేవారు. ఆయన సామ్యవాది. ఆ ఊరిలో ఎవరైనా భోజనం పెట్టితే క్షుద్బాధ తీర్చుకునేవారు. లేదా ఇన్ని మజ్జిగో, మంచినీరో త్రాగి మరొక గ్రామానికి ప్రయాణం కట్టేవారు. టాల్‌స్టాయి రచన 'ప్రజలు-ప్రభుత్వం', హెచ్. ఎస్. బ్రెయిల్స్ ఫర్డ్ రచన 'నా భారతదేశ

యాత్ర' డా॥ పట్టాభి సీతారామయ్యగారి 'కాంగ్రెసు - సంస్థానాలు - స్థానిక ప్రజల సమస్యలు', సురవరం ప్రతాపరెడ్డిగారి వైజ్ఞానిక గ్రంథాలు ప్రకటించారు. కాళోజీ నారాయణరావు, దాశరథి, వానమామలై వరదాచార్యులు, ఆదిరాజు వీరభద్రరావు, పొట్లపల్లి రామారావు, కె. ఎల్. నరసింహారావు, నేదునూరి గంగాధరం వంటి రచయితల గ్రంథాలనూ, అఖిలాంధ్ర కవుల కవితా సంకలనం 'ఉదయ ఘంటలు'నూ దేశోద్ధారక గ్రంథమాల వారే ప్రకటించారు.

ఇక రెండవది అణా గ్రంథమాల. అంటే, అదే, సైన్సులకు విజ్ఞానదాయకమైన పర్యాని చిన్న పుస్తకం అందచేసిన ఘనత, కీర్తి భారతదేశం మొత్తంలో అణా గ్రంథమాలకే చెందుతుందని నేను అనుకుంటాను. ప్రసిద్ధ రచయిత, వెల్దుర్తి మాణిక్యరావుగారు, కె. సి. గుప్త, గుండవరపు హనుమంతరావుగారల సహకారంతో 1938 లో ఈ గ్రంథమాలను హైదరాబాదులో నెలకొల్పారు. నిజాం రాజు ప్రవేశపెట్టదలచిన బూటకపు సంస్కరణల బండారాన్ని బట్టబయలు చేయడం ఈ గ్రంథమాల ముఖ్య ప్రేరణ. ఈ విధంగా ఒకానొక రాజకీయ ప్రయోజనం కోసం ఈ గ్రంథమాల బయలుదేరడంచేత ఆనాటి హైదరాబాదు ప్రజలలో రాజకీయ చైతన్యం కలుగజేయడంకోసం ఆంధ్రవీరులు, స్వామి దయానంద సరస్వతి, వీరసావర్కార్, జవహర్‌లాల్ నెహ్రూ వంటి ప్రసిద్ధ పురుషుల జీవిత చరిత్రలు ఆ పుస్తకాల నిజాం రాజరికంలోతప్పి ప్రజలలో పంపిణీ చేయగలిగారంటే వీరి సాహసాన్ని కొనియాడవలసిందే. మొగలాయి కథలు, ఇంకోటి కథలుకూడా వీరే అందజేశారు. 'మఖ్దూంకే నగ్మే' అని ప్రసిద్ధ ఉర్దూ విప్లవకవి మఖ్దూం మొహియుద్దీన్‌గారి కవితా సంపుటిని అణా గ్రంథమాలయే ప్రకటించింది. జాగీరు సమస్యలు, సోషలిజం వంటి రాజకీయ, సిద్ధాంతపర పుస్తకాలుకూడా వీరు ప్రకటించారు. ఏదైనా ఒక అణాయే. సుల్తాన్ బజారులో సుబ్బారావు హోటలు ఈ పుస్తకాలకు విక్రయకేంద్రం. అణాకు ఆ హోటలులో టీ త్రాగడం, అణాపెట్టి ఒక పుస్తకం కొనడం ఆనాటి విద్యావంతులు చేసిన పని. నిజాం నవాబును మందుముల నరసింగరావుగారిచే నడపబడ్డ 'రయ్యత్' ఉర్దూ వారపత్రిక యొక్క సంపాదకీయాలు ఎంతగా కలత పెట్టేవో ఈ అణా గ్రంథమాల పుస్తకాలు ఆనాటి హోంశాఖవారికి అంత తలనొప్పిగా ఉండేవి. పిట్టకొంచెం, కూతఘనం అనేవారు ఈ గ్రంథమాలను గూర్చి.

అటు గంజాం మండలం బరంపురంలో భాగవతుల నృసింహశర్మ, లాపి ధర్మారావుగారలు వేగుచుక్క గ్రంథమాల స్థాపించి అపరాధ పరిశోధక నవలలు ప్రకటించారు.

కీ॥శే॥ పిల్లలమర్రి వెంకట హనుమంతరావుగారు గుంటూరులో శారదా పీఠ గ్రంథమాలను స్థాపించి మంచి సాహిత్య గ్రంథాలు ప్రకటించారు.

కృష్ణాజిల్లా మునునూరులో శ్రీమాన్ కె.టి.ఎల్. నరసింహాచార్యులుగారు 1957 లో శ్రీ గోదా గ్రంథమాలను స్థాపించి, వివిధములైన గ్రంథములు చౌక రేట్లకు అందజేశారు.

మాడపాటి హనుమంతరావు పంతులుగారు 1946 ఆంధ్రచంద్రికా గ్రంథమాలను స్థాపించి, చరిత్ర గ్రంథాలు, ఇతర విజ్ఞానదాయకమైన గ్రంథాలు ప్రకటించి, గ్రంథమాలకు వచ్చిన ధనాన్ని బ్యాంకులో వేసి అది రూ. 20 వేలకు పెరిగిన తర్వాత దానిని రాజా బహద్దరు వెంకట రామారెడ్డి మహిళా కళాశాల స్థాపనకు విరాళంగా ఇచ్చి, గ్రంథమాలను నిలిపివేశారు.

ఇచ్చట కొన్ని సాహిత్యసంస్థలు చేసిన గ్రంథ ప్రచురణ కృషిని పేర్కొన వలసి ఉన్నది. **1911** లో జయంతి రామయ్య పంతులుగారిచే స్థాపితమైన ఆంధ్ర సాహిత్య పరిషత్తు 70 కి పైగా అమూల్య గ్రంథాలను ప్రచురించింది, సూర్యరాయాంధ్ర నిఘంటువును ప్రచురించింది.

విజ్ఞాన వర్ధనీ పరిషత్తు ప్రసిద్ధ పరిశోధకులు సురవరం ప్రతాపరెడ్డి గారిచే 1941లో హైదరాబాదు నగరమునందు స్థాపింపబడి, రామాయణ విశేషములు, ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము, ఋగ్వేద విజ్ఞానము మొదలగు గ్రంథములను ప్రకటించింది.

1922 లో కరీంనగర్ జిల్లా వెములకొండలో స్థాపించబడిన విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల సేద్యం, వైద్య విషయాలకు సంబంధించిన ఆసక్తిదాయకమైన గ్రంథాలను ప్రచురించింది.

1943 లో స్థాపించబడిన ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణాలో తెలుగు భాషావ్యాప్తికి చేసిన సేవ చిరస్మరణీయమైనది. పరీక్షలు నిర్వహించి, తెలంగాణమంతటా సాహిత్య సభలు, సమావేశాలు జరిపించి, తెలుగు సాహితీ సంస్కృతుల వికాసానికి అపారమైన కృషి చేసింది. పరిషత్తు నిర్వాహకులలో ముఖ్యులైన దేవులపల్లి రామానుజరావుగారు హైదరాబాదు నగరంలో ఈ సంస్థకు చక్కని భవనమును ఏర్పరిచి, శాశ్వతంగా ఉండే సంస్థగా దీనిని తీర్చిదిద్దారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు చరిత్ర, సాహిత్య విమర్శ, జానపద సాహిత్యం, బాలసాహిత్యం మున్నగు విభాగాలుగా చాలా ఉత్తమ గ్రంథాలు ప్రకటించింది. పరిషత్తు ప్రచురించిన సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' కే తెలుగు భాషకు కేంద్ర సాహిత్య అకాడమీ వారి మొట్టమొదటి బహుమతి లభించడం ఒక విశేషం.

1959 లో నెలకొల్పబడిన సాధన సమితి కవితా సంపుటాలనూ, కథా సంపుటాలనూ ప్రకటించింది.

1947 లో స్థాపించబడిన తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ సంపుటాలను ప్రకటించడమేగాక ఉత్తమ గ్రంథాలకు బహుమతులిచ్చి గ్రంథ రచనను ప్రోత్సహించింది.

1953 లో నెలకొల్పబడిన సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశసమితి సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశమును ప్రకటించింది.

1931 లో ఆవిర్భవించిన శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి "తెలంగాణా శాసనములు'' ప్రకటించింది.

ప్రజాశక్తి ప్రచురణాలయం, విశాలాంధ్ర ప్రచురణాలయంవారు రాజకీయ సిద్ధాంత విజ్ఞానాన్ని ప్రాచుర్యంలోకి తేవడానికి, చక్కని సాహిత్య గ్రంథాలను ప్రచురించడానికీ కొన్నేండ్లుగా చేస్తున్న సేవ చాలా గొప్పది. విశాలాంధ్ర ప్రచురణాలయాన్ని కేవలం ఒక పబ్లిషింగ్ హౌస్‌గా మాత్రమే సాహిత్యకులు ఎంచరు. ఇది ఎందరో రచయితలకు అభిమానమైన సంస్థ. ఎందరికో మార్గదర్శకత్వం వహించింది. ఉత్తమమైన అభ్యుదయ సాహిత్యం ఈ సంస్థ ద్వారా ప్రకాశితమైంది.

ఇక ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న విశ్వవిద్యాలయాలు కూడా గ్రంథ ప్రచురణ విషయంలో తగు కృషి చేసినవి. అయితే వాటి standing దృష్టిలో చూస్తే అవి చేయవలసిన కృషి ఎంతో ఉన్నట్టు మనం గ్రహించగలము. కేవలం ఉపాధ్యాయుల క్లిష్టమైన ఏవో కొన్ని గ్రంథాలు ప్రకటించి ఊరుకోవడం విశ్వవిద్యాలయమంటి సంస్థలకు తగదు. ప్రతి విశ్వవిద్యాలయ స్థాపనకూ ఒక ఉద్దేశం, ఒక ప్రత్యేకతా ఉంటాయి. ఆ ఉద్దేశములు నెరవేర్చే విధంగా ఆయా విశ్వవిద్యాలయాలు ఒక ప్రణాళికను వేసుకొని గ్రంథ ప్రచురణమును కొనసాగించాలి.

నూరేళ్ళ తెలుగునాడులో గ్రంథాలయోద్యమాన్ని సింహావలోకనం చేసుకుంటే ఆ ఉద్యమం అనేక ఇతర ప్రయోజనాలను బాగా ఉపయోగపడినప్పటికీ రాష్ట్రం మొత్తానికీ అత్యంత ఉపయోగకరమైన ఒక పెద్ద గ్రంథాలయాన్ని నిర్మించలేకపోవడం ఒక వెలితిగానే కన్పిస్తుంది. తెలుగులో ఏ పుస్తకం ఏ పత్రిక కావలసివచ్చినా వేటపాలెం లైబ్రరీకి వెళ్ళిచూడండి అని అంటారు. ఇది ఆంధ్రులకు గొప్ప లోపం. ప్రైవేటు లైబ్రరీలు క్రమేణా క్షీణిస్తున్నాయి. వాటి నిర్వహణలో అనేక లోపాలున్నాయి. పూర్వం వ్యక్తులు తమ గ్రంథ సంచయాన్ని సార్వజనిక గ్రంథాలయాలకు విరాళంగా ఇచ్చి, వాటిని వృద్ధిచేస్తూ ఉండేవారు. ఇప్పుడు కొందరు పండితులే తమకు నచ్చిన పుస్తకాలను గ్రంథాలయాలనుండి సేకరించి తమ ఇళ్ళలో భద్రపరచుకుంటున్నట్లు పెద్ద గ్రంథాలయ నిర్వాహకుల ద్వారా వింటున్నాము. ఇది విజ్ఞాన వ్యాప్తికి దోహదం చేయదు. కేవలం స్వార్థం. కనుక, పబ్లిక్ లైబ్రరీలు తమ గ్రంథాలను కాపాడుకోవడానికి తగు చర్యలు గైకొనాలి. ఇక గ్రంథ ప్రచురణోద్యమం విషయంలో మనం ఉన్నతాదర్శాల నుంచి, విజ్ఞానం నుంచి కేవలం వినోదం స్థాయికి దిగజారుతున్నాము. వైజ్ఞానిక గ్రంథాలూ, ఉత్తమ సాహిత్య గ్రంథాలూ అమ్ముడుపోవని చెప్పుతూ చవకబారు కాలక్షేపపు పుస్తకాల ప్రచురణకు కేవలం ఆర్థిక లాభం దృష్ట్యా ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతూవుంది. ఈ ధోరణి జాతి అభ్యుదయాన్ని అరికట్టుతుంది. ఉత్తమ విలువలున్న గ్రంథాలు వెలుగులోకి వచ్చే అవకాశం ఉండాలి. ఒకవంక గ్రంథాలయాలు నానాటికీ సంపన్నమవుతూ, మరొకవంక విజ్ఞానదాయకమైన, సాహితీ మూల్యంగల గ్రంథప్రచురణ నిరంతరం సాగుతూ ఉంటేనే జాతి పురోగమిస్తుంది.

# పత్రికలు

—యం. సుధ

ఈస్టు ఇండియా కంపెనీ, ఆంధ్ర దేశముపై అధికారాన్ని చేజిక్కించుకొన్నది మొదలు, అంటే దాదాపు క్రీ. శ. 1800 సం॥ నుండి, మత, సామాజిక ఆర్థిక రంగాలలో దేశం చాలా మార్పులకు గురైనది. ఎన్నో సంఘర్షణలు, ఎన్నో అనుభవములు—మరెన్నో పరిణామములు! మన జాతి అనుభవమునకు పత్రికలు అద్దము పట్టినవి. మానవ జీవితములో వచ్చిన రకరకములైన మార్పులు పత్రికల ధోరణిలో ప్రతిబింబించినవి. సామాజిక, ఆర్థిక, మత పరిస్థితులు మారుచుండగ, మన జాతి అనుభవమనేది అంతర్వాహిని సాహిత్య ప్రక్రియారూపములలోను, పత్రికలలోను దర్శనమిచ్చినది. సమాజపు తీరుతెన్నులు పత్రికల వలన సరిదిద్దబడిన సందర్భములున్నవి. ఇట్లు దేశచరిత్ర, పత్రికలు పరస్పరము ఒకదాని నొకటి విడదీయలేని బంధముతో అభివృద్ధి అయినవి. క్రైస్తవ మిషనరీల కార్యక్రమములు ఆధునిక విద్యాప్రభావము వలన వచ్చిన సాంస్కృతిక భావములు ఒకవైపు, సనాతన ధర్మ ప్రచారము మరొకవైపు తొలి దశలోని పత్రికల అవిర్భావమునకు దోహదము చేసినవి. ప్రాచీన సాహిత్య పరిచయ కార్యక్రమము, వాసికెక్కిన పురాణేతిహాసములు, కావ్యములు, పత్రికలు ముద్రించ సాగినవి, వ్యావహారిక భాషోద్యమము వచ్చినది. పారిశ్రామిక విప్లవము సరికొత్తగ ఆర్థిక, సామాజిక రంగములలో మార్పులు తెచ్చినది. కుల వృత్తులు మూలపడినవి. జీవిక కొరకు ప్రజలు పల్లెలనుండి పట్టణములకు తరలినారు. [illegible] తో బాటే ఇంగ్లీషు విద్య నేర్వకపోతే, ఉద్యోగావకాశము లేని పరిస్థితులలో సమస్తవారందరూ ఆంగ్లేయ విద్యాభ్యాసముకై పరుగులు తీయసాగినారు. ఉదార భావములు, లౌకిక లక్షణము, వైజ్ఞానిక దృక్పథ ప్రధానమైన పాశ్చాత్య విద్య, సాంప్రదాయ సిద్ధమైన ప్రాచీన విద్యా వ్యవస్థ వెనుకంజ వేసినది, దానితోబాటు సమాజములోని కుల వ్యవస్థలో కొన్ని

మార్పులు అవసరమయినవి పాశ్చాత్య విద్యా ప్రభావితులైనవారు ఆయా కులములలో జాగృతిని తెచ్చుటకై నడుము కట్టుకొన్నారు ఈ పరిణామములో భాగముగా బ్రాహ్మణేతర కులములవారు తమ తమ ఔన్నత్యమును, సామర్థ్యమును వెల్లడించుటకు కొన్ని ప్రత్యేక పత్రికలను స్థాపించసాగినారు. తమ వర్గములో వెనుకబడినవారిని మేల్కొలుపుతూ, అగ్ర కులములతో పోటీ చేయుట, కుల పత్రికల కార్యక్రమము, వీటి కృషివలన అధిక సంఖ్యాకులు వాటి దేశకాల పరిస్థితులను ఆకళింపుచేసికొన్నారు.

క్రీ.శ. 1885 వ సంవత్సరమున జాతీయ కాంగ్రెసు ఏర్పడినది మొదలు భారతీయులలో సంచలనము తీవ్రమైనది. జాతీయోద్యమము మనలోని జాతి, మత, భాషా భేదములను పోగొట్టి, ఒక్క తాటిపై నడపినది. దేశ ప్రజలందరికి ఒకటే లక్ష్యం-స్వాతంత్ర్య సాధన; ఒకటే మార్గము - చిత్తశుద్ధితో శత్రువు నెదిరించుట. వందేమాతరం ఉద్యమము నుండి క్విట్ ఇండియా ఉద్యమము వరకు ఆంధ్రులు అన్ని ఉద్యమముల యందు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ దశలో వెలువడిన తెలుగు పత్రికలు జాతి గర్వకారణములు. జాతీయోద్యమ కాలములోనే ఆంధ్రోద్యమము చోటు చేసుకొన్నది. 'కేవలము దేశ స్వాతంత్ర్యమును సాధించుటవలన సమాజపు దళిత వర్గములకు ఎట్టి మేలు చేకూరదని' కొందరు నాయకులు భావించినారు. కార్మికులు, కర్షకులు, సన్నకారు రైతులు, సాంఘికముగ, ఆర్థికముగ వెనుకబడినవారు వీరి గోడు పట్టించుకొనక, స్వాతంత్ర్యముకై ఉవ్విళ్ళూరుట-దేశ జనాభాలో ఎక్కువ భాగమునకు స్వాతంత్ర్య సౌకర్యము కలిగించినట్లు-ఉండదని వీరి వాదన. ఈ వీరి అభ్యున్నతికై సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలు నెలకొని, పత్రికలను నెలకొల్పినవి. క్రమముగ కొత్త కొత్త అవసరములతో ఏర్పడినట్టి పార్టీలు వెలసినవి వాటితోబాటు మరికొన్ని పత్రికలు. ఇట్లు రాజకీయ చైతన్యము పత్రికలధిక సంఖ్యలో వెలువడుటకు దోహదకారి అయినది. స్వాతంత్ర్య సముపార్జనానంతరము ఆంధ్ర రాష్ట్రసాధన—విశాలాంధ్ర అవతరణ మన చరిత్రలోని ముఖ్య ఘట్టములు. ప్రధాన సమస్య తీరుటవలన సమాజములోని వివిధ వర్గముల వారికై ఉపాధ్యాయులు, విద్యార్థులు, శ్రామికులు, రైతులు, మొ॥ వారికై పత్రికలు ప్రత్యేకముగ ఏర్పడినవి. స్త్రీలకై ప్రత్యేకించిన పత్రికలు, బాలల

పత్రికలతోబాటు, చిత్రరంగమునకు సంబంధించిన ప్రత్యేక పత్రికలు ఆధునిక కాలమున తామరతంపరగా వెలసినవి.

విగ్రహారాధకులైన భారతీయులను మతాంతరీకరణము చేయు నిమిత్తము యూరపు, అమెరికా ఖండముల నుండి వచ్చిన క్రైస్తవ మిషనరీలు భారీఎత్తున కృషి చేసినారు. దేశము నలుమూలలా చేరి, హిందూమతము, సాంఘిక ఆచారములలోని లోపములను ఎత్తిచూపి తీవ్రముగ ఖండించుట మత ప్రచారకుల ప్రధాన కార్యమైనది దీనికొఱకు దేశ భాషలునేర్చి. ఉపన్యాసముల నిచ్చినారు. ముద్రణా యంత్రములను స్థాపించినారు. మత ప్రచారకుల యత్నములకు ప్రభుత్వోద్యోగుల ఆశీస్సులు పుష్కలముగ లభించినవి. దక్షిణ భారతదేశములో ట్రాంకుబారు మిషనరీలు వన్నె కెక్కినారు. వీరు తమిళము, తెలుగు మొదలైన భాషలు నేర్చినారు. మొట్టమొదటి తెలుగు బైబిల్‌ను బెంజమిన్ షూల్జ్, భారతదేశమున ముద్రణా సౌకర్యము లేనందున, జర్మనీలోని 'హాల్' నగరమున ముద్రించినాడు.

[1]క్రీ శ. 1806 వ సంవత్సరము తెలుగులో ముద్రణ ప్రారంభమైనట్లు సి. పి. బ్రౌను అభిప్రాయము. అయితే మొదటి తెలుగు పత్రిక సత్యదూత (?) క్రీ. శ. 1835 వరకు వెలువడలేదు. తెలుగులో కొన్ని పాఠ్యపుస్తకములు, సెయింట్ జార్జి గెజెట్‌లో వార్తలు ప్రకటనలు [2]తెలుగులో ముద్రింపబడినవి. సత్యదూత తెలుగులో మొదటి పత్రిక అనే అంశమును శ్రీ ఆరుద్ర, శ్రీ బంగోరె గార్లు అంగీకరించరు. గవర్నమెంట్ జె. లాంగ్ దొర క్రీ. శ. 1859 వ సంవత్స

1. ఆంధ్ర పత్రిక, మద్రాసు, మే 12 వ తేది, 1920, పుటలు 203 & 203.
2. (A) Arudra 'Beginnings of Telugu Journalism' Appendix studies in Telugu Journalism P. 21 V.R Narla 60th Birthday volume, New Delhi-1968.
2. (B) బం. గో. రె. 'తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుండి 1857 దాక' బ్రౌను జాబులు. పుట 4.

రము బెంగాల్ ప్రభుత్వమునకు సమర్పించిన రిపోర్టునందు క్రీ. శ. 1883 వ సం॥ నాటికే మొదటి తెలుగు, తమిళ పత్రికలు వెలువడినట్లు పేర్కొన్నాడు. క్రీ. శ. 1882 వ సం॥ మదరాసుకు చెందిన కాన్‌స్టాంటియుస్ కాంపి, మరి కొందరు స్వదేశీయులతో చేరి, తెలుగులో 'మద్రాసు క్రానికల్' ద్వైవార పత్రిక స్థాపించుటకు అనుమతించవలసినదిగా నాటి మద్రాసు గవర్నరునకు ఒక దరఖాస్తు సమర్పించినారు. దానిపై గవర్నరు తన అభిప్రాయమును వెలిబుచ్చుట అవసరమని వ్రాసినారు. కాన్‌స్టాంటియుస్ కాంపి, ముద్రణాలయ నిర్వహణలో మంచి అనుభవజ్ఞుడు. కనుకనే జె.లాంగ్ పేర్కొన్న మొదటి తెలుగుపత్రిక 'మద్రాసు క్రానికల్' కావచ్చును. అయితే జె. లాంగ్ రిపోర్టులో కేవలము మొదటి తెలుగు పత్రిక వెలువడిన సంవత్సరమే కాని, దాని పేరు లేకుండుట దోషము!

తెలుగులో తొలి పత్రికగా భావిస్తున్న సత్యదూతను క్రైస్తవ మిషనరీలు బళ్ళారిలో ఎ.డి. కాంపుబెల్ సహాయముతో క్రీ.శ. 1835లో ప్రారంభించినట్లు తెలుస్తున్నది.[3] ఈ పత్రిక, 'కన్నడ సమాచార'తోబాటు బళ్ళారిలోనే ముద్రింపబడేదని శ్రీ వి. లక్ష్మణరెడ్డిగారు అభిప్రాయపడినారు. [4]మదరాసులో తప్ప తక్కిన నగరములలో ముద్రణా సౌకర్యములు అప్పటికి అభివృద్ధి కాలేదు. కనుక 'సత్యదూత' మదరాసులో అచ్చయి, బళ్ళారినుండి వెలువడేదని డా॥ సరోజినీరేగానిగారి వాదం.[5] అయితే జర్మనీ మిషనరీలు క్రీ. శ. 181[illegible] వ సం॥ నాటికి, 'కన్నడ సమాచార' బళ్ళారిలో ముద్రిస్తుండేవారు. [illegible] ప్రయత్నాల అనంతరము, కాంపుబెల్ సహాయముతో తెలుగు ముద్రణాయంత్రమును స్థాపించినారని భావించుట సమంజసమే![6] నెలనెల, చిత్రములతోబాటు, సత్యదూత, [illegible]

3. వి. లక్ష్మణరెడ్డి 'తెలుగు ముద్రణా వికాసము' ఆంధ్రప్రదేశ్ పత్రిక, పుటలు 991, 998. విజయవాడ, 1976
4. డా॥ సరోజినీరేగాని 'The growth of Telugu press' The Indian press, Calcutta, 1967
5. డా॥ వి. ముద్దాచారి 'The Role of the press in Mysore' The Indian press, Calcutta 1967 PP 104-110.
6. డా॥ కె. కె. పిళ్ళై The 'History of Tamil press' Indian press, Calcutta 1967, PP 84-98.

పత్రికకూడా ఒక్కొరి సండి ప్రకటితమయేదట.[7] బ్రిటిష్ పరిపాలనలో మదరాసు నగరాభివృద్ధి పరోక్షముగ ఆంధ్రలోని నూతన పరిణామములకు కారణమైనది. రాజకీయ, విద్యా, వ్యాపార కేంద్రమై, ప్రజలను ఆకర్షించేది. మదరాసు ప్రభుత్వ కార్యాలయములు ఇచ్చటనే ఉండేడివి. కనుక ఎక్కువగా తెలుగులో ముద్రణా కార్యక్రమమయినది మదరాసు కేంద్రమయింది. విద్యా వైజ్ఞానిక వికాసము ఇచ్చట విరివిగా సాగుటవలన, సాంకేతిక నిపుణులు అచ్చట లభించేవారు. కాలక్రమేణా సాంకేతిక విద్యావ్యాప్తి, వివిధ భాగములు అన్ని ప్రధాన కేంద్రములలో లభించుట, రవాణా సౌకర్యములు ఏర్పడుటవలన ఆంధ్రదేశములోని శ్రీకాకుళం, విశాఖపట్టణము, రాజమండ్రి, కాకినాడ, నరసాపురం, హైదరాబాదు, వరంగల్లు, నల్లగొండ, అనంతపురం, నంద్యాల మొదలైన పట్టణాలలో పత్రికలు బయలుదేరినవి.

తెలుగు పత్రికల యందు సత్యదూత అనంతరము పేర్కొన వలసినది, మద్రాసు నుండి వెలువడుచుండిన 'వృత్తాంతిని' దీనిని గురించిన వివరములను శ్రీ ఆరుద్రగారు, శ్రీ బంగోరెగారు తమతమ రచనల్లో వెలయించినారు.[8] క్రీ.శ. 1888 వ సం॥ ప్రారంభింపబడి, మదరాసు నుండి వెలువడుచుండిన ఈ పత్రిక తన ఘాటు విమర్శల వలన డిసెంబరు 1839 సం॥ నాటికే ప్రభుత్వ దృష్టికి వచ్చినది. నాటి తెలుగు అనువాదకుడు జె. పి. మోరిసను ఈ పత్రికపై కన్ను వేసి ఉంచమని ప్రభుత్వము ఆదేశించినది. శ్రీ మండిగల వేంకట రాయశాస్త్రి గారు సంపాదకులుగ ఉండేవారు. వృత్తాంతిని పత్రిక ఆంధ్రలో బహుళ జనాదరణ పొందిన దనుటలో సందేహము లేదు నాటి రాజమండ్రి జడ్జిగారి భార్య జూలియా థామస్. క్రీ శ. 1839 వ సం॥లో లండన్‌లోని తన మిత్రులకు ఉత్తరము వ్రాస్తూ, తన భర్త ఒక రీడింగ్ రూమును రాజమండ్రిలో ప్రారంభించినాడనీ, అచ్చటికి వచ్చు పత్రికలలో 'వృత్తాంతిని' ముఖ్యమైనదని వ్రాసినది.

---

7. stephen Barnett '*Approaches to Changiss in Caste Ideology in South India*' Essays on South India pp 149-176, Vikas publishing House, New Delhi.
8. శ్రీ బంగోరె 'బ్రౌను జాబులు, తెలుగు జర్నలిజం చరిత్ర' పుటలు 1-14 1832 నుండి 1867 దాకా.

ఇందులోని కొన్ని అసమంజస వార్తలను కూడా అవిడ అపహసించినది. ఏది ఏమైనను, వివాహ సమయములలో జరుగు దుర్వ్యయము-భోగము మేళములపై వ్యాసమొకటి ఈ పత్రికలో ప్రకటింపబడినది. సంఘ సంస్కరణ విషయములపై వ్యాసమును ప్రకటించిన మొట్టమొదటి పత్రిక 'వృత్తాంతిని' ఈ పత్రిక 1842 వ సం॥ నాటికి నిలిచిపోయినది.

క్రైస్తవ మత ప్రచారమే ప్రధానోద్దేశము గల పత్రికలలో సత్యదూత తరువాత, క్రీ. శ. 1910 వ సం॥ కాకినాడ నుండి వెలువడిన 'రవి', మద్రాసు నుండి వెలువడిన 'వివేకవతి' క్రీ. శ 1848 నుండి 1867 వరకు [illegible] మచిలీపట్నము నుండి వెలువరించిన 'హితవాది' ముఖ్యమైనవి. క్రీ. శ. 1882 వ సం॥ మరొకసారి పునరుద్ధరింపబడి, కొద్దికాలము 'హితవాది' నడచినది.

మిషనరీలు మన మత సాంప్రదాయములపై చేయుచుండిన దాడి నెదుర్కొనుటకు హిందువులు గట్టి యత్నములు చేసినారు. వీరిలో సనాతనులు బూజుపట్టిన మూఢాచారములు, వర్ణ వ్యత్యాసములు, అనర్థదాయకమైన బాల్య వివాహములు మొదలైన వానిని ప్రామాణ్యప్రదముగ సంరక్షించుటే హిందూమత రక్షణగ భావించినారు. క్రైస్తవ మత ప్రచారకుల వాదములలోని సత్యమును ఆధునికులు గ్రహించారు. మన మత, సాంఘిక రంగములయందు సంస్కరణల ఆవశ్యకతను గుర్తించినారు. హృదయశుద్ధితో నూతన కార్యక్రమమునకై నడుము కట్టి నడచినారు. సంస్కరణవాదులు, ఒకవైపు క్రైస్తవమత ప్రచారకులు, మరొకవైపు ఛాందసులైన సనాతనులు-వీరిరువురి నడుమ సంస్కర్తల స్థితి [illegible]మైనది. సనాతనులు తమ పత్రికలద్వారా ఆధునిక సంస్కరణలపై [illegible]నారు. సనాతనుల పత్రికలయందు, క్రీ.శ. 1881 లో [illegible] వాడనుండి వెలువడిన శ్రీ ధర్మరక్షిణి, మద్రాసునుండి [illegible] వాది, స్వధర్మ ప్రకాశిని, 1899 లో ద్వైమాస పత్రికగా [illegible] శ్రీ ఎ. నరసింహాచార్యులు నడుపు జనరంజని మద్రాసు; క్రీ శ. 1906లో వెలువడిన శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి 'ఆర్యమతబోధిని' ప్రధానమైనవి.

సంస్కరణ పత్రికలయందు ముఖ్యమైనవి. మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారి సకల విద్యాభివర్ధిని (1878-79), శ్రీ రంగ

నాయకులుగారి పురుషార్థ ప్రదాయిని, కందుకూరి వీరేశలింగము పంతులుగారి వివేకవర్థిని, మచిలీపట్నము ప్రార్థనా సమాజము నడపిన సత్య సంవర్థిని, క్రీ.శ. 1906 వ సంవత్సరములో కందుకూరి వీరేశలింగము పంతులుగారు స్థాపించిన సత్యవాదిని, మదరాసునుండి శ్రీ మన్నవ బుచ్చయ్య పంతులుగారి హిందూజన సంస్కారిణి, పింజల సుబ్రహ్మణ్యశెట్టిగారి 'సమదర్శిని' మొదలైనవి.[9] వీటిలో పురుషార్థ ప్రదాయినికి 'దైవ సమాజిని' అను పేరు ఉండెడిదని తెలియుచున్నది. శ్రీ వీరేశలింగము పంతులుగారు దీనికి తమ రచనలు, పంపెడివారట. సంఘ సంస్కరణ పత్రికలయందు పంతులుగారి 'వివేకవర్థిని' తలమానికము. క్రీ.శ. 1874 వ సం॥ అశ్వయుజ మాసములో రాజమండ్రినుండి వెలువడసాగినది. అతిశీఘ్రకాలములో వివేకవర్థిని నాయక స్థానమాక్రమించినది. దాదాపు ఇతర సంస్కరణ పత్రికలన్నియు వివేకవర్థిని ధోరణికి వంతపలికెడివి. నాటి సంస్కరణ పత్రికలన్నియు స్త్రీల దుస్థితి, వరకట్నము, అంటరానితనము, వివాహ సమయములలో అధిక వ్యయము, భోగము మేళములు, అధికారులలోని లంచగొండితనము. మొదలైన అంశములపై వ్యాసములను ప్రకటించెడివి.[10] మదరాసు 'వేద సమాజపత్రిక, తత్త్వబోధిని' స్త్రీ పునర్వివాహాకోపన్యాసములను ప్రకటించి, వితంతు వివాహముల వాదోపవాదములకు నాంది పలికినవి.

క్రైస్తవ మత ప్రచారకుల ప్రభావమువలన దేశమంతట సంస్కరణ మతములు వెల్లివిరిసినవి (బ్రహ్మసమాజము, వేదసమాజము) దివ్యజ్ఞాన సమాజము, ఆర్య సమాజము, ప్రార్థనా సమాజములు హిందూమత, సాంఘిక రంగముల యందలి లోపములను తొలగింప పూనినవి. సంస్కరణ మతముల తరఫున, ఆయా భాషా ప్రచారమునకై పత్రికలు వేనవేలు వెలసినవి. వీటిలో క్రీ.శ. 1886 వ సం॥ మదరాసు వేదసమాజమువారు స్థాపించిన తత్త్వబోధిని, క్రీ.శ. 1909 వ సం॥ నుండి తెలుగు ఫెడరేషన్, దివ్యజ్ఞాన సమాజంవారి హంస

......................................................

9. దిగవల్లి వేంకటశివరావు '*Telugu Journalism, Past & Present*' pp 29, Studies in the History of Telugu Journalism.

10. నిడదవోలు వెంకటరావు '*Literary Journalism* p 53, Studies in the history of Telugu Journalism.

(గుత్తి); దివ్యజ్ఞాన దీపిక (క్రీ.శ. 1910 చిత్తూరు), క్రీ.శ. 1914 వ సం॥ నుండి కాకినాడ బ్రహ్మసమాజ పత్రిక ధర్మసాధని, మదనపల్లె నుండి ప్రకటింప బడుచుండిన దివ్య జీవనము, స్నేహలత మొదలైనవి ముఖ్యమైనవి.

పాశ్చాత్య విద్యాభ్యాసము, క్రైస్తవ మిషనరీల విమర్శల ఫలితముగ, సామాజిక స్పృహగల ప్రతి వ్యక్తియు, నాటి స్త్రీల దుస్థితిని గ్రహించి, స్త్రీజనోద్ధరణకై పూనుకొనినాడు. నాటి స్త్రీల హీనస్థితికి, అతి బాల్యవివాహములు, అవిద్య, అజ్ఞానము, ఆస్తి హక్కు లేకుండుట, వితంతు వివాహములు లేకుండుట ప్రధాన కారణములు. కొద్దిపాటి అక్షరజ్ఞానముగల స్త్రీలు పఠించుటకై వివిధ సంస్కరణముల ఆవశ్యకత, ఇతర దేశముల ప్రాంతముల యందలి స్త్రీల చరిత్రలు, ప్రాథమిక ఆరోగ్య సూత్రములు, కుట్లు, అల్లికలు మొదలైన అంశములపై వ్యాసములను ప్రకటించు పత్రికలు ఆంధ్రదేశమందలి వివిధ ప్రాంతములలో స్థాపింపబడినవి. స్త్రీలకై పత్రికలను స్థాపించినవారి యందు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు అగ్రగణ్యులు. వారి కృషిఫలిత గాల క్రమేణ స్త్రీలు ముందంజవేసి, స్త్రీలకై పత్రికలను నడపసాగినారు. దీనికి వారు ఉత్సాహవంతులైనవారు పాఠశాలల్లో, కళాశాలల్లో ఉన్నత విద్యాభ్యాసమునకు పూనుకొనినారు. క్రీ.శ. 1883 లో రాజమండ్రిలో కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రారంభించిన 'సతీ హితబోధిని' మొట్టమొదటి స్త్రీల పత్రిక. అతి త్వరలోనే శ్రీ నల్లాన్ వెంకటరత్నంగారి 'తెలుగు జనానా'; శ్రీ సింగీతం బాపిరాజుగారి 'బాలిక', శ్రీ రాయసం వెంకటశివుడు, కందుకూరి వారు నడిపిన 'జనానా', శ్రీ సీతారామయ్యగారు, ఏలూరు నుండి వెలువరించిన 'హిందూ సుందరి' పత్రికలు స్త్రీ జనోద్ధరణకు పూనికవి. స్త్రీలు స్థాపించి, నిర్వహించిన వాటిలో, శ్రీమతి పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు కాకినాడలో క్రీ.శ. 1910-1918 మధ్య నడిపిన సావిత్రి; కాకినాడలోనే శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారి 'అనసూయ'; శ్రీమతి పాలపర్తి లక్ష్మీనరసమ్మగారి 'నివేదన'; శ్రీమతి యామినీ పూర్ణతిలకముగారి 'హిందూ యువతి'; శ్రీమతి గాదిచర్ల రమాబాయి గారు మద్రాసు నుండి క్రీ.శ. 1919-1920 మధ్య వెలువరించిన సౌ. దర్బవల్లి ప్రధానమైనవి. అనేకాక నరసాపురం నుండి వెలువడుచుండిన సంస్కారిణి, మచిలీపట్నము నుండి శ్రీ కౌతారామశాస్త్రిగారి 'శారద'; మద్రాసు నుండి వెలు వడిన 'గృహలక్ష్మి' ప్రజాభిమానమును పొందినవి

ఈ తరగతిలో నేర్పడిన సామాజిక స్పృహ బహుళ ప్రయోజనకారి అయినది. ప్రభుత్వేతర పాఠశాలల స్థాపన, నిర్వహణ కార్యక్రమమును వీరు చేపట్టినారు. ఒకటి రెండు సందర్భములలో మినహాయించి, దాదాపు తొలినాటి తెలుగు పత్రికలన్నియు ఈ వర్గమువారు స్థాపించి, నిర్వహించినవి. శ్రీ వీరేశలింగము వంటి ఉపాధ్యాయులు ఆధునిక భావములద్వారా, తమ విద్యార్థులను ప్రభావితులను చేసినారు.

ప్రాచీన సాహిత్యమును ఆధునికులకు పరిచయము చేయించుటకై సుజనరంజని, కొక్కొండవారి ఆంధ్ర భాషా సంజీవని, పూండ్ల రామకృష్ణయ్యగారి అముద్రిత గ్రంథ చింతామణి, పి. ఆనందాచార్యులుగారి శ్రీ వైజయంతి, న్యాపతి సుబ్బారావుగారి చింతామణి, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి, కె. ఆర్. వి. కృష్ణారావుగారు నడిపిన 'సరస్వతి', మహిళలను చైతన్యవంతులుగ చేసినవి. 'తాను - తన ఇల్లు' అను సంకుచిత ధోరణి నుండి విడివడి, దేశకాల పరిస్థితులను గుర్తెరిగి, ప్రవర్తించు దశకు తెచ్చుటలో పై పత్రికల కృషి అనన్యము! స్త్రీల యందు రాజకీయ చైతన్య మేర్పడుటకు వివిధ పత్రికలు, ఒక్కుమ్మడిగా సాంఘిక సంచలనమును సాధించుటే కారణము!

గాంధేయము, స్త్రీపురుషుల వ్యక్తులందరి సమత, సౌభ్రాతృత్వము ప్రధానము లైన ఆధునిక యుగమువైపు చరిత్ర నడుస్తున్నది. దీని మొదటి మజిలీలోనే ప్రాచీన పద్ధతులు వెనుకంజవేయుటను గమనార్హము. మత, సాంఘిక రంగముల యందు సనాతన అభిప్రాయములు మారి నూతన శకమారంభమయినది. సాంఘిక, మత విషయములపై ధనిక వర్గపు అధికారము సడలినది. విద్యావ్యాసంగము సామాన్యునిలోని 'మనిషి'ని మేల్కొలిపినది. దురదృష్టవశాత్తు ఈ నూతన విద్యాప్రకాశము, మధ్య తరగతిని దాటి పోలేకపోయినది. పెత్తనము, ధనికుల నుండి మధ్యతరగతి మహానుభావుల చేతికి వచ్చినది. ఈ వర్గములో సెకండు గ్రేడ్ ప్లీడర్లు, ప్లీడరు గుమాస్తాలు, ప్రభుత్వ కార్యాలయములలోని చిన్నచిన్న ఉద్యోగులు, ఉపాధ్యాయులు, అక్కడక్కడ మిగిలిపోయిన జమీందార్ల ఆశ్రయములో కాలం వెళ్ళదీస్తున్న కవులు, సంస్కర్తలు అగుపిస్తున్నారు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి గౌతమి, ప్రజాయుధము, ఆంధ్రసాహిత్య పరిష

పత్రిక, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి 'భారతి', 'పినాకిని', శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'జయంతి', గిడుగు రామమూర్తిగారి 'తెలుగు' పత్రికలు పుంఖానుపుంఖములుగ వచ్చినవి. వీటిలో కొన్ని ప్రాచీన కావ్యములను ముద్రించి తృప్తి చెందినవి. మరికొన్ని ఆధునిక సాహిత్య ప్రక్రియలను ప్రోత్సహించినవి.

న్యాపతి సుబ్బారావుగారు 'చింతామణి' ద్వారా తెలుగులో 'నవలా రచన'ను ప్రోత్సహించినారు. ప్రత్యేకించి, భాషా విషయక సేవచేసిన పత్రికల యందు శ్రీ కొక్కొండ వెంకటరత్నముగారి 'ఆంధ్రభాషా సంజీవని' పేర్కొనదగినది. ఇది క్రీ.శ. 1871–1878 వరకు, మరల క్రీ.శ. 1883–90 వరకు మదరాసు నుండి వెలువడినది. ఈ పత్రిక ప్రత్యేక లక్షణములను శ్రీ నిడదవోలు వెంకటరావుగారు శ్రీ దిగవల్లి శివరావుగారు, తమ తమ వ్యాసములలో వివరించినారు. వారి అభిప్రాయమననుసరించి, ఆంధ్ర దేశములో ప్రామాణికమైన మొదటి పత్రిక ఆంధ్ర భాషా సంజీవని. దీనిలో నూటికి నూరుపాళ్ళు గ్రాంథిక భాష వాడినారు పంతులుగారు, ఆయన సంస్కృత, ఆంధ్ర, తమిళ, ఆంగ్ల భాషల నెరిగిన వారగుటవలన ఆంగ్లములోని సాంకేతిక పదములకు అతి సులభముగ తెలుగు పదములను కూర్చి, వ్యవహారములోనికి తెచ్చినారు. సాహిత్య వ్యాసములతో పాటుగ, సాంఘిక సమస్యలపై కూడను, వ్యాసములను ప్రకటించెడిది ఈ పత్రిక, కాని పంతులుగారి భావములు సనాతనమ్ములు గనుక సంఘసంస్కర్తలను దుయ్యబట్టినారు. సంపాదకీయము, గ్రంథ విమర్శలను పంతులుగారే ప్రప్రథమముగ ప్రవేశపెట్టినారట. తరచు, అనుబంధ సంచికలతో వెలువడుచుండినది ఆంధ్ర భాషా సంజీవని. ఆ దినములలో పత్రికలు పరిమిత సంఖ్యలో వెలువడినను, దాదాపు అన్నియు అల్పాయుష్కములే! అట్టి పరిస్థితిలో పదమూడు సంవత్సరము లవిచ్ఛిన్నముగ సాగి, పునరుద్ధరణానంతరము ఏడు సంవత్సరములు ఈ పత్రిక నిలచుటకు, దీని స్థాయి కారణమని చెప్పనియే చెప్పవచ్చును!

---

11. (A) Ibid P 59

(B) దిగవల్లి వేంకట శివరావు 'Telugu Journalism; Past & Present' P. 29.

వ్యవహార భాషోద్యమమనగానే మనకు గిడుగు రామమూర్తి పంతులుగారు మద్రాసునుండి క్రీ.శ. 1919-20 మధ్య నడిపిన తెలుగు పత్రిక గుర్తు వచ్చును.[12] వ్యవహార భాషను మొట్టమొదట వాడిన పత్రిక మంజువాణి. దీనిని వెల్ల, లక్కవరము జమీందారులైన శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు గారు స్థాపించినారు. దీని సంపాదకుడుగ శ్రీ నందిరాజు చలపతిరావుగారు వ్యవహరించినారు. ఈ పత్రిక క్రీ.శ. 1898-1904 సం॥ల మధ్య నడచినది. 1904 వ సం॥లో తిరుపతి వేంకట కవుల 'పల్లెటూర్ల పట్టుదలలు' అనెడి ప్రహసనము వ్యవహార భాషలో ఈ పత్రిక ప్రకటించినదట.

[13]శ్రీపాద కృష్ణమూర్తిగారి 'గౌతమి' మొట్టమొదటి దినపత్రిక అని శ్రీ నిడదవోలు వేంకటరావుగారు పేర్కొన్నారు కాని అది సరికాదని తెలియుచున్నది. [14]క్రీ.శ. 1896 వ సం॥లో స్థాపించబడిన దేశాభిమాని (విజయవాడ) తొలి దినపత్రిక.

తొలిదశలోనే, హాస్యము కొఱకై ప్రత్యేకింపబడిన పత్రికలు కొన్ని వెలువడినవి. అటువంటి వానిలో రసికోల్లాసిని, శ్రీ కొక్కొండ వారి హాస్యవర్ధిని (మద్రాసు, 1895 సం॥), కందుకూరి వారి హాస్యసంజీవని (రాజమండ్రి 1876 సం॥) శ్రీ ఎస్. రాజామణి, మద్రాసుగారి మహావినోదిని, అనంతపురము నుండి శ్రీ పప్పూరు రామాచార్యులు, కోలవీడు వెంకటరమణాచార్యులు ప్రారంభించిన 'హాస్య మంజూష' లు చెప్పుకొనదగినవి.

---

12. నిడదవోలు వేంకటరావు Leterary Journlism P 75
13. I bid PP 77.
14. శ్రీమతి కె. రామలక్ష్మి 'తెలుగుపత్రికలు- వివిధ శీర్షికలు.' P 77, మహతి 1947-72, హైదరాబాదు, 1972, పైన పేర్కొన్న దేశాభిమాని పత్రిక దేవగుప్తం శేషాచలపతిరావు గారిచే స్థాపితమై, పక్ష, వార, త్రైవార పత్రికల దశలు దాటి, దినపత్రికగా కొంతకాలము సాగినదని, 'ఆంధ్రపత్రికలు' ఆంధ్రదర్శిని, 1952 అను వ్యాసములో శ్రీ నాదెళ్ళ విజయభాస్కరరావు కూడ వ్రాస్తున్నారు. ఈ వ్యాసము శ్రీ ని. వెంకటరావు గారి దృష్టికి వచ్చి ఉండదు.

పరాయి పాలనను కూల్చివేయుటకు జాతీయ కాంగ్రెస్ నాయకత్వమున పూనుకొనగనే, బ్రిటిష్‌వారు భారతీయులను కుల, మత ప్రసక్తితో విడదీయుటకు యత్నింపసాగిరి. బ్రాహ్మణేతరులు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగముల యందు అగ్రస్థానములకై తహతహలాడుచు, అప్పటికే ఆయా రంగములందు ప్రథమపంక్తిలో నున్న బ్రాహ్మణులను సవాలు చేయసాగిరి. సహజమైన జాగృతికి ప్రభుత్వపు ఆసరా మరింత ప్రోత్సాహమిచ్చినది. సనాతనుల అతిరింపులు మరింత కవ్వించినవి. కులవ్యవస్థ మరింత వెర్రితలలు వేయనారంభించినది. ప్రపంచ చరిత్రలో మన కులవ్యవస్థ వంటి సనాతనము, అనర్థదాయకమైన వ్యవస్థ మరొకటి లేదని భావించినారు. ఒకవైపు దేశభక్తి ఉప్పొంగుచున్నను, తమ తమ కులాధిక్యతను నిలుపడమే ప్రథమ కర్తవ్యముగ భావించినారు. శాసన సభల యందు, ప్రత్యేక స్థానములకై, ప్రభుత్వ కార్యాలయములందు అధిక అవకాశములకై బ్రాహ్మణేతర వర్గముల కృషి ప్రారంభించినవి.

ఆధునిక విజ్ఞానిక పరిశోధనల పుణ్యమా అని, తంతితపాల; రైలు సౌకర్యము ఏర్పడి, కులమునకు కులమునకు గల అగాధము సన్నగిల్లినది. బ్రాహ్మణేతర వర్గములో ఒక్కొక్క వర్గమువారు, ఒక్కొక్క పత్రికను స్థాపించినారు. మద్రాసు నుండి శ్రీ ఎ. పి. పార్థసారథి నాయుడుగారి ఆంధ్ర ప్రకాశిక క్రీ. శ. 1885 నుండి వెలువడసాగినది.[16] ఇది తెలుగులో తొలి వార్తాపత్రిక అని భారతి పేర్కొంటున్నది. దీనిననుసరించి వైశ్య, ఆర్యవైశ్య, కమ్మపత్రిక, క్షత్రియ, ప్రబోధిని, దేవాంగ పత్రిక మున్నగునవి వెలువడినవి. వీని యందు శ్రీ బి. ఎస్. మూర్తిగారు, మదరాసు నుండి ప్రకటించుచుండిన, నవశక్తి; మచిలీపట్టణము నుండి శ్రీ వేమూరి రాంజీరావుగారి 'దీనబంధు' ప్రధానమైనవి. ఈ పత్రికల పరంపరవలన ఆయా కులములలో జాగృతి ఏర్పడి, విద్యాధికులు ఎక్కువయినారు.

---

15. 'విమర్శనము' భారతి, ఫిబ్రవరి 1988. PP 887.

దైనందిన వార్తలను సేకరించి, ప్రకటించిన పత్రికలలో మొట్టమొదటిది వర్తమాన తరంగిణి.[16] దీనిని శ్రీ సయ్యద్ రహమతుల్లాగారు జూన్ 8వ తేది, 1848వ సం॥లో మదరాసులో స్థాపించినారు. ఈ పత్రిక నెలకు మూడు సార్లు వెలువడుతూ, ప్రజల ఆదరాభిమానములను పొందినది. దీని సంపాదకుడు శ్రీ పువ్వాడ వెంకటరావుగారు. ఆయన బ్రౌను దొరవారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతుండేవారు. క్రీ.శ. 1849లో మహాభారత మందలి ఆది పర్వమును ఈ పత్రిక అచ్చువేసినదట. బ్రౌను దొర గారి దయవలన ఈ పత్రిక ప్రతులు ఇప్పటికిని మద్రాసు గ్రంథాలయములో భద్రపరచబడినవి అని శ్రీ బంగోరె, తన రచనలలో పేర్కొన్నారు.

దీని తరువాత పేర్కొనదగినది 'దినవర్తమాని' పత్రిక. దీనిని పీటర్ పెర్సివాల్ క్రీ.శ. 1860-68 మధ్య నడిపినారు. నాటి పత్రికలలో ఇది పేరెన్నికగన్నదని తెలుస్తున్నది. ఈ పత్రికకు డైరక్టర్ ఆఫీసర్లకు ఇన్‌స్పెక్టర్ ద్వారా నెలకు 200/-రూ॥ల గ్రాంటు లభించేది. క్రీ.శ. 1866లో తమిళ పత్రికగా అవతరించి, ప్రభుత్వపు తోడ్పాటు వలన తెలుగులో కూడా వెలువరింపబడసాగినది. దీని ప్రభుత్వ అధికారులు కూడా అత్యంత ఆసక్తితో పఠించెడి వారు.

నెల్లూరు నుండి ఆంధ్ర భాషా గ్రామ వర్తమాని, నెల్లూరు పత్రికలు వెలువడినవి. గోదావరి మండల విద్యాభివర్ధని అను పత్రిక క్రీ.శ. 1870లో బరోడారిగారు రాజమండ్రిలో స్థాపించినారు. శ్రీ వీరేశలింగము పంతులుగారి ఆత్మచరిత్రలో దీనిప్రసక్తి ఉన్నది. మదరాసునుండి వెలువడిన పత్రికలలో స్వదేశీ జన ప్రసిద్ధాభిప్రాయం (1866వ సం॥), లోకరంజని (1876వ సం॥), గట్టుశేషాచార్యులవారి కళారేఖ (1894వ సం॥) ముఖ్యమైనవి.

క్రీ.శ. 1866వ సం॥ బళ్ళారిలో వెంకటరవి, త్యాగరాజ మొదలియారు 'శ్రీయక్షిణి' అనే పత్రిక స్థాపించినారు. 'కృష్ణ వృత్తాంతిని' లేక దేశాభిమాని,

16. ఆరుద్ర Studies in '*Beginnings of Telugu Journalism*' బంగోరె వ్రాసిన లేఖలు-అనుబంధం 2.

విజయవాడలో శ్రీ దేవగుప్తం శేషాచలపతిగారిచే 1896లో స్థాపించబడి, తరువాత గుంటూరునకు మార్చబడినది. క్రీ.శ. 1860 - 1920ల మధ్య కాలములో వెలువడిన రాజకీయ పత్రికలలో కృష్ణాపత్రిక, ఆంధ్ర పత్రిక ప్రముఖమైనవి. కృష్ణా పత్రిక కృష్ణా జిల్లా సంఘము తరపున శ్రీ కొండా వెంకటప్పయ్యగారిచే క్రీ.శ. 1902లో మచిలీపట్నములో స్థాపించబడి. క్రమముగ ముట్నూరి కృష్ణారావుగారి స్వంతమైనది. సంస్కరణ వ్యాసములతోపాటు ప్రభుత్వమును ఘాటుగా విమర్శించుటలో పేరెన్నిక గన్నది.

ఆంధ్ర పత్రిక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారిచే, బొంబాయిలో 1908 ప్రారంభింపబడి, 1914 లో మదరాసుకు మార్చబడినది.[17] ఆంధ్ర పత్రిక ప్రత్యేకించి, ఆంధ్ర ప్రాంతపు వార్తలకు ప్రాధాన్యమిచ్చినదని శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు వ్రాసినారు. తెలుగువారియందు పఠనాసక్తిని పెంచుటకై ఆంధ్ర పత్రిక ప్రతులను, ఎన్నో గ్రంథాలయములకు, ఇతర సంస్థలకు సమాజములకు తగ్గింపు ధరకో ఉచితముగానో పంపెడివారట.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రాజమండ్రి నుండి నడపుచుండిన 'మనోరమ'(స్థాపన 1910 వ సం॥)గాడిచర్లహరి సర్వోత్తమరావుగారి 'స్వరాజ్య' (ఇది వెంకటేశ పత్రిక అను పేరుతో చిత్తూరునుండి శ్రీనివాసాచార్యులచే కొంత కాలము నడుపబడినది), మచిలీపట్నములోని చిల్లరిగె శ్రీనివాసరావుగారి 'నవ యుగ' (1907-1908 సం॥), శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రకేసరి (రాజమండ్రి, 1907-1908 సం॥), భారతమాత మరికొన్ని ముఖ్య పత్రికలు.

వందేమాతరోద్యమానంతరము పత్రికల సంఖ్య ఎక్కువైనది. ఇలాంటి పత్రికలలో శ్రీ అయ్యంకి వెంకట రమణారావుగారు కృష్ణాజిల్లానుండి వెలువరించిన 'ఆంధ్రభారతి' (ఫిబ్రవరి 1910 వ సం॥), గాండీవము, శ్రీ మున్నంగి శర్మగారు ఏలూరునుండి వెలువరించిన 'దేవదత్తం' (1921 వ సం॥), శ్రీ గోవిందరాజుల వెంకట కృష్ణారావుగారి నవయుగము (1921 వ సం॥), మద్రాసు

17. నోరి నరసింహశాస్త్రి 'ఆంధ్రపత్రిక' కాశీనాథుని నాగేశ్వరరావు శత జయంతి పత్రిక. పుట 268, మద్రాసు.

నుండి శ్రీ టంగుటూరి ప్రకాశంగారి 'స్వరాజ్య' (1921 వ సం॥) జన్మభూమి, తాడిపత్రినుండి గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు నడిపిన 'మాతృసేవ', ఏలూరునుండి శ్రీ అత్తలూరి గోవిందాచార్యులవారి 'సత్యాగ్రహి' దేశాన్ని ఉర్రూతలూగించినవి. 1922 లో సీతారామాశ్రయమునుండి శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు కాంగ్రెస్ పత్రికను స్థాపించినారు.

1930 వ సం॥లో శ్రీ రామనాథ గోయెంకాగారు 'ఆంధ్రప్రభ' మద్రాసులో నెలకొల్పిరి. అదినుండి సమర్థులైన సంపాదకులచే నిర్వహింపబడి, ప్రజలను చైతన్యవంతులను చేయుటలో ఆంధ్రప్రభ సాటిలేని పత్రికగా పేరు పొందినది. దాదాపు ఇదే సమయమున, కడపనుండి '[illegible]' పత్రికను సాంబారెడ్డిగారు ప్రవేశ పెట్టినారు.

తెలంగాణా ప్రాంతములో వెలువడిన తొలి తెలుగు పత్రిక 'హితబోధిని'. ఇది మాసపత్రిక. 1913 లో వెలువడిన ఈ పత్రికకు శ్రీ శ్రీనివాస శర్మ సంపాదకుడు. సంవత్సరము మాత్రమే నడచినది. 1920 లో ఇనుగుర్తి అనే వరంగల్లు జిల్లాలోని చిన్న పల్లెనుండి ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారి సంపాదకత్వమున తెలుగు పత్రిక వెలువడినది. ఇది వారపత్రిక. అదే సంవత్సరమున నల్లగొండనుండి 'నీలగిరి' అనే పత్రిక మొదలైనది. ఈ పత్రికా స్థాపకుడు, సంపాదకులు షబ్నవీసు నరసింహారావుగారు. ఇదే కాలమున [illegible] సీతారామశర్మగారి సంపాదకత్వమున 'ఆంధ్రాభ్యుదయము' అను సారస్వత మాసపత్రిక కొంతకాలము నడచినది. ఈ పత్రికలు తెలంగాణా ప్రాంతమున ఆంధ్రోద్యమమునకు, సాంస్కృతిక పునరుజ్జీవనమునకు దోహదము చేసినవి.

1926 వ సంవత్సరములో సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వమున 'గోలకొండ పత్రిక' మొదట ద్వైవారపత్రికగా ప్రారంభమైనది. 1947 తరువాత [illegible] రెడ్డిగారు ఈ పత్రిక బాధ్యతను స్వీకరించినారు. అప్పుడే అది దినపత్రికగా మారినది. గోలకొండ పత్రిక తెలంగాణములో రాజకీయ చైతన్యమును కలిగించిన ప్రప్రథమ రాజకీయ దినపత్రిక. 1937లో పసుమాముల నృసింహశర్మగారి సంపాదకత్వమున 'సుజాత' సాహిత్య మాసపత్రిక ప్రారంభమై 1940 వరకు నడచినది. 1950-53 మధ్య గడియారం రామకృష్ణశర్మగారు దీనిని నడిపినారు.

ఇదే కాలమున 'దేశబంధు' 'ఆంధ్రకేసరి'. పత్రికలు కొద్దికాలము నడచి ఆగిపోయినవి. 1939 లో రాచమళ్ళ సరస్వతీదేవిగారి సంపాదకత్వమున 'తెలుగు తల్లి' అను మాసపత్రిక నడచినది. 'విభూతి', 'దివ్యవాణి' పత్రికలు కూడ వెలువడినవి. 1945 లో హైదరాబాదునుండి తెలంగాణా, మీజాన్ పత్రికలు ప్రారంభమై, కొద్దికాలము నడచినవి. తెలంగాణా పత్రికకు ఒక్క. పట్టాభిరామానుజాచార్యులు, మీజాన పత్రికకు అడవి బాపిరాజు సంపాదకులు. 1947-51 మధ్య దేవులపల్లి రామానుజరావుగారి సంపాదకత్వమున 'శోభ' అను సాహిత్య మాసపత్రిక నడచినది. ప్రగతి, భాగ్యనగర్, జనభారతి, రాయితీయు, సుదర్శన్, పద్మశాలి, నవయుగ, నీతి మొదలైన పత్రికలెన్నో ఆ కాలమున స్వల్పకాలమున నడచిన పత్రికలు. ఆ రోజులలో నిజాం నిరంకుశ పాలనను తట్టుకొని చాలాకాలము స్వల్పకాలము నడచినవైనను పై పత్రికలు ఆంధ్రోద్యమమునకు చేసిన కృషి ప్రశంసించదగినది.

అసంఖ్యాకములైన తెలుగు పత్రికలు, ప్రభుత్వపు ముందు పై బడిని నిర్మొహమాటముగ ఖండించినవి. తెలుగు ప్రజలను జాతీయ ఉద్యమము వైపుకు, ఒక్క తాటిపై నడపినవి. ప్రజలలో పఠనాసక్తి పెరిగింది. ఆంధ్ర ప్రకాశిక, కృష్ణాపత్రిక, లోకోపకారి, స్వరాజ్యయుద్ధము, దేశాభిమాని, బాలభారతి మొదలైన పత్రికలపై విపరీతమైన ఆంక్షలను విధించి, పెద్ద మొత్తం ధరావత్తును కట్టమని ప్రభుత్వం ఆజ్ఞ జారీచేసినది. చెల్లించలేని పత్రికలను నిలిపివేయుటము, యజమానుల నరెస్టుచేయటము సామాన్యమైనది.[18] దేశాభిమాని, గుంటూరు; చంద్రికా ప్రెస్, గుంటూరు; బాల భారతి ముద్రణాలయము, అనంతపురము ఇటువంటి దురాగతములకు గురైనవి. గాడిచర్ల, చిలకమర్తివారిపై ఒత్తిడి తెచ్చి, పలువిధముల బాధించటము జరిగింది. సీతారామాశ్రమముపై మాటిమాటికీ దాడిచేసి, ముద్రణాయంత్రమును పగులగొట్టి, సంపాదకుని అరెస్టుచేసి, బాధలకు గురికావించినది నాటి ప్రభుత్వము. ఎటువంటి కష్టములకైనను ఓర్చి, వెనుదిరుగు వేయక, ప్రజలను త్తేజపరచినవి నాటి పత్రికలు. 1947 వ సం॥ లో

18. G.O. No. 803/804 Public Dept, dated 7th oct. 1922, News Paper Memorandum on 1921 Annexure I.

స్వాతంత్ర్యము సాధించువరకు జరిగిన జాతీయోద్యమ చరిత్రలో పత్రికల పాత్ర ప్రశంసనీయమైనది.

స్వాతంత్ర్య సాధన వరకు మన ధ్యేయమొకటే. ఒకవైపు విదేశీయులతో అహింసా యుద్ధమొనరించుచు, మరొకవైపు దేశములోని వివిధ సమస్యలను పరిష్కరించుట. సమాజములోని దళిత వర్గముల స్థితిని మెరుగుపరచనిచో దేశ స్వాతంత్ర్యము వలన ప్రయోజనము స్వల్పమని కొందరు భావించినారు. సుమారు 1930 వ సం॥ నుండి ఈ భావము తీవ్రమై, ఈ పీడితవర్గపు ఆర్థిక అభివృద్ధి, కనీస విద్యా ఆరోగ్య సౌకర్యములు కల్పించుట, వారి హక్కులను పరిరక్షించుట, తమకు జరుగు అన్యాయము నెదిరించుటకై, రాజకీయచైతన్య మేర్పరచుట మొదలైన లక్ష్యములతో వామపక్షపు పార్టీలు ఏర్పడసాగినవి. ప్రతిరాజకీయపార్టీ ఏదో ఒక పత్రికను స్థాపించి, తన భావ ప్రచారమునకు పూనుకొన్నది.

వివిధ పార్టీ పత్రికలలో 1941 వ సం॥లో వెలకొల్పబడిన కమ్యూనిస్టు వారపత్రిక 'ప్రజాశక్తి' 1945 లో దినపత్రికగా రూపొందినది. 1948 తరువాత కొంతకాలము, దీనికి అంతరాయమేర్పడి, మరల 1951 సం॥లో మద్దుకూరి చంద్రశేఖరరావుగారి సంపాదకత్వమున 'విశాలాంధ్ర'గా నడపబడు చున్నది. 1948-1957 వ సం॥ల మధ్య గోరాశాస్త్రి 'తెలుగు స్వతంత్ర'ను నడపినారు. విజయవాడనుండి వెలువడుచున్న 'ప్రజాశక్తి', 'జనశక్తి' వామపక్షపు పత్రికలే 'ప్రజాశక్తి' మార్క్సిస్టు పత్రిక.[19] 1956 లో శ్రీ పల్లూరి బసవరాజుగారు, బుద్ధుల రామబ్రహ్మాచారావుగారు 'ఆంధ్ర జనత'ను స్థాపించారు. ఇది అధికార కాంగ్రెస్ పత్రిక.

ఎదుగుచున్న సమాజములో అన్ని వర్గముల వారికి, వారి వారి సమస్యలను గూర్చి ప్రత్యేకముగ గుర్తింపగా, ప్రచార వ్యాప్తికి, ప్రభుత్వదృష్టికి తేగల పత్రికల ఆవశ్యకత హెచ్చినది. సాంఘిక గౌరవము, ఆర్థిక వికాస మందుకొనుటకు పత్రికలను ప్రబల సాధనములుగ ప్రజలు గుర్తించినారు. నేడు ఒక్కొక్క వర్గపు సమస్యల ప్రత్యేక రీతి నుండుటవలన, వర్గ పత్రికలు అధికమయినవి. వెలువడుచుండి వస్తున్న ఆమీన్ రైతు, కిసాన్, మోటారు, ట్రాన్సుపోర్టు, సహకారం, విద్యార్థి, ఉపాధ్యాయ వంటి పత్రికలు ఆయా వర్గపు దృష్టినిష్ఠురము లను

---

19. మహతి 1947-72. హైదరాబాదు 1972.

వినోదించి, వారికి అవసరమైన వార్తల నందించగలుగుచున్నవి. స్వాతంత్ర్యా నంతరము ఏర్పడిన పారిశ్రామికాభివృద్ధి, వైజ్ఞానిక వికాసము వివిధ వర్గములు బలపడుటకు హేతవు.

పెరుగుచున్న పసివారిలో సహజ గుణవికాసము కొఱకు ప్రత్యేక విద్యా విధానములతో బాటు, వారికై ఉద్దేశింపబడిన పత్రికలు అవసరము. దీనిని గుర్తించి, రేడియో అన్నయ్య, అక్కయ్యలుగా ఖాసిద్ధికెక్కిన శ్రీ న్యాయపతి రాఘవరావు, కామేశ్వరమ్మగార్లు 1946 లో మద్రాసులో 'బాల'ను స్థాపించినారు. అనంతరము, పాపాయి, బాలమిత్ర, చందమామ, బాలప్రభ, బాలభారతి వంటి పత్రికలు పసివారిని పలకరిస్తున్నవి.

ఆంధ్రులలో వైజ్ఞానిక తృష్ణ రగిలించుటకు వైజ్ఞానిక విషయ పరిచయ మునకు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు పూనుకొన్నారు. అటుతరువాత శ్రీ సింహాద్రినరసింహ శర్మగారు 1908-1905 మధ్య 'కల్పలత' అను వైజ్ఞానిక పత్రికను నడిపారు. ఇది ఆంధ్రుల తొలి వైజ్ఞానిక పత్రిక. దీనికి రచయిత కేవలము శ్రీ శర్మగారొకరే. దీనిని మరల 1921 లో పునరుద్ధరించి, కొంత కాలము నడిపినారు.

వైజ్ఞానిక అభివృద్ధివలన పత్రికల జీవన విధానమున మార్పు చేర్పులకు వని పగలెల్ల పనిచేసి, అలసిన జనులకు చలన చిత్రములు తగు వినోదమును కూర్చి నవి. ఈ రంగమునకు సంబంధించిన వార్తలు జనుల నాకర్షించసాగినవి. నమ కాలీన పత్రికలన్నియు ఆయా వార్తలనందింప సాగినవి.[20] శ్రీ ఇటూరి వెంకటేశ్వరరావు గారు ప్రత్యేక పత్రికను 'చిత్రకళ' అన్న పేరుతో 1997లో ప్రారంభించినారు. నాటి సభకు చిత్రరంగంలో ప్రముఖులయిన బి.ఎన్. రెడ్డి గారు అధ్యక్షత వహించగా, గూడవల్లి రామబ్రహ్మంగారు తొలి సంచికను విడుదల చేశారు. నాటినుండి నేటివరకు అసంఖ్యాకములైన పత్రికలు ఈ చలన చిత్ర వార్తలందించుచున్నవి.

---

20. తుర్లపాటి కుటుంబరావు '*Film Journalism*' P 129.
Studies in the History of Telugu Journalism.

1882 లో 'మద్రాసు క్రానికల్'ను స్థాపించుటకు జరిగిన యత్నము మొదలు, తెలుగులో శతాధిక సంఖ్యలో పత్రికలు వెలువడినవి.[21] ఆంధ్ర రాష్ట్రము సిద్ధించునాటికి 8 దిన పత్రికలు, 77 వారపత్రికలు, 82 పక్ష పత్రికలు, 108 మాసపత్రికలు 21 ఇతర పత్రికలు-మొత్తం 251 పత్రికలున్నట్లు తెలియుచున్నది. ప్రస్తుతం, స్థానిక పత్రికలు కూడా పెంపొందినవి. రాజమండ్రి, కాకినాడ, గుంటూరు, నెల్లూరుల స్థానిక పత్రికలు పేర్కొనదగినవి.[22] ప్రథమ తెలుగు మహాసభలు జరుగునాటికి (1972 వ సం॥ నాటికి) ఆంధ్రలో 14 దిన పత్రికలు, పక్ష, వార, మాసపత్రికలన్నియు కలిపి 670 ఉన్నవి.

తొలినాటి పత్రికలకు, ఆధునిక పత్రికలకు కొన్ని విషయములలో తేడా లున్నవి. దాదాపు నాటి పత్రికలన్నియు, ఏదో ఒక ఆశయసిద్ధికై స్థాపించబడినవి. ఆగర్భను నెరవేర్చుటకు, అవకాశము ననుసరించి పక్ష, వార, ద్వైవార, దిన పత్రికలుగ రూపొంది అభివృద్ధి పొందటమో, లేక ఆర్థిక సౌకర్యంలేక మూల పడటమో జరిగినది. అవి కొద్దిపాటి ఆదాయముగల మధ్యతరగతివారిచే నడప బడినవి. సాధారణముగా ఏదో ఒక వ్యక్తి ఉత్సాహ, శక్తులపై ఆధారపడి ఉండె డివి. నాటి పత్రికలు ఆదాయముకంటె, ఆశయసిద్ధికై ప్రాకులాడెడివి. కనుకనే తగ్గింపు ధరలకు, కొన్ని వర్గాలవారికి (స్త్రీలు, విద్యార్థులు ఉపాధ్యాయులు మొద లగు వారికి) స్థానికులకు నాటి పత్రికలు లభించేవి నాటిధర స్వల్పమే. ఆనాటి పత్రికల స్వరూపము చిన్నదే. రాజకీయ వార్తలకు ఎక్కువగ ప్రాధాన్యత ఉండెడిదికాదు.

ఆధునిక పత్రికలు భిన్నపరిస్థితుల్లో, విభిన్న పద్ధతులలో నడపబడు తున్నవి. నేటి పత్రికలు ఏదో ఒక సంస్థచే నడపబడుచున్నవి. ఒక వ్యక్తి ఆస్తి పాస్తులతో, ఆయురారోగ్యములతో సంబంధములేదు. నేడు ప్రతి పత్రిక అన్ని వర్గాలవారిని ఆకర్షించుటకై ప్రయత్నించుచున్నవి. కనుక వివిధ శీర్షికలు చోటు చేసికొంటున్నవి. తమ పత్రికల ప్రతులను అధికము చేయుటయందే నిర్వా హకుల దృష్టి నిలిచిపోవుచున్నది. పత్రికల స్థాయిని పెంచి, ప్రజలలో సాహి త్యాభిలాష పుట్టించు యత్నములు తక్కువ. ప్రకటనల సంఖ్య పెరిగి, పాఠకు లకు వినోద, విజ్ఞానములను కూర్చు అవకాశము సన్నగిల్లినది.

---

21 ఆంధ్రదర్శిని 1954. విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

22. డి. ఆంజనేయులు. 'పత్రికారచనా' తెలుగువాణి హైదరాబాదు. పుటలు 253, 254. [illegible] 1976.

# అనుబంధము

## 1835-1955 వరకు వెలువడిన పత్రికల పట్టిక

### మత పత్రికలు

| క్రమ సంఖ్య | పత్రిక పేరు | వ్యవస్థాపకులు/ సంపాదకులు | వెలువడిన ప్రదేశం, సంవత్సరం |
|---|---|---|---|
| 1. | సత్యదూత | క్రైస్తవ మిషనరీలు | బళ్ళారి, 1835 (1888?) |
| 2. | తత్త్వబోధిని | వేద సమాజం | మద్రాసు, 1865 |
| 3. | హితవాది | రెవరెండ్ శర్మా | మచిలీపట్నం, 1848-1862 ని) మళ్ళీ 1882లో |
| 4. | శ్రీ ధర్మరక్షిణి | — | విజయవాడ, 1891 |
| 5. | సద్ధర్మరక్షిణి | — | మద్రాసు, 1891 |
| 6. | రవి | క్రైస్తవ మత ప్రచారకులు | కాకినాడ, 1910 |
| 7. | వివేకవతి | ,, | మద్రాసు |
| 8. | ఆర్యమతబోధిని | కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి | కాకినాడ, మార్చి 1905 |

| | | | |
|---|---|---|---|
| 9. | స్వధర్మ ప్రకాశిని | బ్రహ్మశ్రీ కోపల్లె శర్మ | క్రీ. శ. 1910 సం॥ నాటికే ఉండెడి, మచిలీపట్నము |
| 10. | ఈశ్వరవాది | — | (1978-76) (1924-32) |
| 11. | హంస | తెలుగు ఫెడరేషన్, దివ్యజ్ఞాన సమాజం | గుత్తి, 1905 |
| 12. | దివ్యజ్ఞాన దీపిక | ,, | చిత్తూరు, 1910 |
| 13. | ధర్మసాధని | బ్రహ్మసమాజము | కాకినాడ, 1914 |
| 14. | దివ్యజీవనము, స్నేహలత | — | మదనపల్లె |
| 15. | విభూతి | వీరశైవమతం వీరభద్రరావు | 1940 |
| 16. | విశ్వవాణి | చివుకుల అప్పయ్యశాస్త్రి | 1937 |

## సంస్కరణ పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | పురుషార్థప్రదాయిని (వైదికసమాజిని) | శ్రీ రంగనాయకులు నాయుడుగారు | మచిలీపట్నము, 1872 |
| 2. | వివేకవర్ధని | శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు | రాజమండ్రి, 1874, అశ్వయుజ |
| 3. | సత్యసంవర్ధని | ప్రార్థనా సమాజం | మచిలీపట్నం, 1892 |
| 4. | సత్యవాదిని | శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు | రాజమండ్రి, 1905 మార్చి |
| 5. | హిందూజన సంస్కారిణి | శ్రీ మన్నవ బుచ్చయ్య పంతులుగారు | మదరాసు, 1885 |
| 6. | హితబోధిని | శ్రీనివాసశర్మగారు | మహబూబ్‌నగర్, 1913 |
| 7. | సమవర్తిని | పింజల సుబ్రహ్మణ్యసెట్టి | మద్రాసు |

## స్త్రీల పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | సతీ హితబోధిని | శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు | రాజమండ్రి, 1883 |
| 2. | తెలుగు జనానా | శ్రీ మల్లాది వెంకటరత్నంగారు | మదరాసు, 1893 |
| 3. | వారిక | శ్రీ సింగీతము బాపిరాజుగారు | శ్రీకాకుళం, 1896 నుండి 1897వరకు |
| 4. | జనానా | 1. రాయసం వెంకటశివుడుగారు | నెల్లూరు, 1901 |
| | | 2. వీరేశలింగంపంతులుగారు | రాజమండ్రి, 1906–1907 |
| 5. | హిందూ సుందరి | శ్రీ సీతారామయ్యగారు | ఏలూరు, 1902 |
| 6. | సావిత్రి | శ్రీమతి పులగుర్తి నరసమాంబగారు | కాకినాడ, 1910 నుండి 1918 వరకు |
| 7. | అనసూయ | శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు | కాకినాడ, 1914 |
| 8. | నివేదన | శ్రీమతి [illegible] నరసమ్మగారు | కాకినాడ |
| 9. | సంస్కారిణి | — | నరసాపురం |
| 10. | హిందూ యువతి | శ్రీమతి యామినీపూర్ణతిలకంగారు | — |
| 11. | గృహలక్ష్మి | శ్రీమతి [illegible] రమాబాయిగారు | మద్రాసు 1919 నుండి 1920 వరకు |
| 12. | హిందూ సుందరి | శ్రీమతి మొసలికంటి రమాబాయిగారు | కాకినాడ, 1920 |
| 13. | [illegible] | శ్రీ [illegible] శాస్త్రిగారు | మచిలీపట్నం, 1928 |

## కుల పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | ఆంధ్ర ప్రకాశిక | శ్రీ ఎ.పి. పార్థసారథి నాయుడుగారు | మదరాసు, 1885 |
| 2. | ప్రబోధిని | — | 1910 సం॥ నాటికి ఉండేది |
| 3. | ఆర్యవైశ్య | — | — |
| 4. | వైశ్య | — | — |
| 5. | కమ్మ పత్రిక | — | — |
| 6. | దేవాంగ పత్రిక | — | — |
| 7. | క్షత్రియ పత్రిక | — | — |
| 8. | నవజీవన | శ్రీ ఎ.ఎస్. మూర్తిగారు | మద్రాసు |
| 9. | దీనబంధు | శ్రీ వేమూరి రాంజీగారు | మచిలీపట్నం, 1920 తరువాత |

## రాజకీయ పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ యక్షిణి | వెంకటరమణకవి, త్యాగరాజ మొదలియారు | జనవరి, 1863 |
| 2. | స్వదేశీయ ప్రసిద్ధాభిప్రాయము (Native Public Opinion) | Anglo-Varnacular | మద్రాసు, 1865 |
| 3. | లోకరంజని | — | మద్రాసు 1874 |

| | | | |
|---|---|---|---|
| 4. | శశిలేఖ | శ్రీ గట్టు శేషాచార్యులు | మదరాసు, 1894 |
| 5. | కృష్ణా వృత్తాంతిని (లేక) దేశాభిమాని | శ్రీ దేవగుప్తం శేషాచలపతిగారు | విజయవాడ, 1896 (తరువాత గుంటూరు నుండి) |
| 6. | కృష్ణాపత్రిక | కృష్ణాజిల్లా సంఘము, శ్రీ కొండా వెంకటప్పయ్యగారి అధ్వర్యం, పిమ్మట శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు స్వంతదారులైరి | మచిలీపట్నం, 1902 |
| 7. | మనోరమ | శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు | రాజమండ్రి, 1906 |
| 8. | స్వరాజ్య (కొంతకాలము వెంకటేశ పత్రిక అను పేరుతో చిత్తూరు నుండి శ్రీనివాసాచార్యులు ప్రకటించినారు) | 1. గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, 2. బోడి నారాయణరావు, 3. అక్షయపల్లి నారాయణరావు | విజయవాడ, మద్రాసు, 1907 |
| 9. | నవయుగ | శ్రీ పిల్లారిసెట్టి శ్రీనివాసరావుగారు | మచిలీపట్నం, 1907 నుండి 1908 వరకు |
| 10. | ఆంధ్రకేసరి | శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు | రాజమండ్రి 1907 నుండి 1908 వరకు |
| 11. | ఆంధ్రపత్రిక | శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు | బొంబాయి 1908, మద్రాసు 1914 |
| 12. | [illegible] | — | మద్రాసు 1914, 1910 నాటికి ప్రచురింపబడెను. |

| | | | |
|---|---|---|---|
| 13. | ఆంధ్ర భారతి | శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు | కృష్ణాజిల్లా 1910, పత్రిక |
| 14. | బాల భారతి | — | అనంతపురం |
| 15. | సాధన | శ్రీ పప్పూరి రామాచారిగారు | అనంతపురం, 1930 |
| 16. | నవయుగము | శ్రీ గోవిందరాజుల వెంకట కృష్ణారావుగారు | 1921 |
| 17. | గాండీవము, దేవదత్తము | మున్నంగి శర్మగారు | ఏలూరు |
| 18. | స్వరాజ్య | టంగుటూరి ప్రకాశం పంతులుగారు | మద్రాసు, 1921 |
| 19. | కాంగ్రెసు | సీతారామాశ్రమం తరపున శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు | సీతారామాశ్రమము, 1922<br>రాజమండ్రి, 1921 |
| 20. | మాతృసేవ | శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు | తాడిపత్రి, 1922 |
| 21. | సత్యాగ్రహి | శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు | ఏలూరు, 1922 |
| 22. | ఆంధ్రప్రభ | గోయెంకా | మద్రాసు, 1938 |
| 23. | ఆజాద్‌హింద్ | ఎస్. సాంబిరెడ్డి | కడప |

## సారస్వత పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | సుజన రంజని | 1. వి. కృష్ణమాచార్యులుగారు<br>2. బహుజనపల్లి సీతారామాచార్యులు | మద్రాసు, 1864 నుండి<br>1867 వరకు |
| 2. | ఆంధ్ర భాషా సంజీవని | శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు | మద్రాసు 1871-1883<br>1892-1899 |

| | | | |
|---|---|---|---|
| 3. | అముద్రిత గ్రంథ చింతామణి | శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు | నెల్లూరు 1885–1904 |
| 4. | చింతామణి | శ్రీ న్యాపతి సుబ్బారావుగారు | రాజమండ్రి 1891–1595 |
| 5. | శ్రీ వైజయంతి | ఆనందాచార్యులు | మద్రాసు, 1594–1899 |
| 6. | సరస్వతి | శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, కె. ఆర్. వి. కె. రావుగారు | రాజమండ్రి, 1898 |
| 7. | గౌతమి | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు | రాజమండ్రి, 1911 |
| 8. | వజ్రాయుధము | ,, | రాజమండ్రి, 1911 |
| 9. | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక | పిఠాపురం రాజాగారు | కాకినాడ, 1911 |
| 10. | గోష్ఠి | దేవులపల్లి రామానుజరావుగారు | హైదరాబాద్, 1947 |
| 11. | తెలుగు | శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు | మద్రాసు, 1919–1920 |
| 12. | భారతి | శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు | మద్రాసు, 1921 |
| 13. | పినాకిని | పి. రామానుజాచార్యులుగారు | నంద్యాల, 1922 |
| 14. | జయంతి | శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ కొంపెల్ల రామకోటేశ్వరరావుగారు | — 1938 |
| 15. | కౌమోదకి | కైపా సుబ్రహ్మణ్యశర్మగారు | నంద్యాల |

## హాస్య పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | రసికోల్లాసిని | — | — |
| 2. | హాస్యవర్ధిని | శ్రీ కొక్కొండ వెంకటరత్నంపంతులుగారు | మద్రాసు, 1875 |

| | | | |
|---|---|---|---|
| 3. | హాస్య సంజీవని | శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు | రాజమండ్రి, 1876 |
| 4. | మహావినోదిని | శ్రీ ఎస్. రాజమణిసెట్టిగారు | మద్రాసు |
| 5. | హాస్య మంజూష | వద్దూడ రామాచార్యులు, కంచపీడు వెంకటరమణాచార్యులు | అనంతపురం |

## ఇతర పత్రికలు

| | | | |
|---|---|---|---|
| 1. | వృత్తాంతి (?) | మండిగల వెంకటరాయశాస్త్రి, కడప (?) | మద్రాసు, 1835–1842 |
| 2. | వర్తమాన తరంగిణి | సయ్యద్ రహమతుల్లా<br>సం॥ పువ్వాడ వెంకటరావు | మద్రాసు, 1842–50 |
| 3. | దినవర్తమాని | పెర్సీ పెర్సివాల్ | మద్రాసు, 1860–1866 |
| 4. | సకల విద్యాభివర్ధని | పరవస్తు రంగాచార్యులుగారు | విశాఖపట్టణం, 1878–79 |
| 5. | సుదర్శని | — | — |
| 6. | నెల్లూరు పత్రిక | — | నెల్లూరు |
| 7. | ఆంధ్రభాషా గ్రామ వర్తమాని | — | ,, |
| 8. | గోదావరి మండల విద్యాబోధిని | భరో | రాజమండ్రి, 1870 |
| 9. | దర్పణ్ | — | గుంటూరు |
| 10. | కల్పలత | సాంఖ్యాయనశర్మ | రాజమండ్రి, a) 1902-1905<br>b) 1921 |
| 11. | నీలగిరి పత్రిక | శ్రీ షబ్నవీసు నరసింహారావు | నల్గొండ, 1920 |

| | | | |
|---|---|---|---|
| 12. | తెనుగు పత్రిక | శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావు<br>శ్రీ రాఘవ రంగారావుగారు | ఇనుగుర్తి (వరంగల్ జిల్లా)<br>1920 |
| 13. | జ్ఞానోదయము | శ్రీ దాసు కేశవరావు | ఏలూరు |
| 14. | గోల్కొండపత్రిక (ద్వైవార) | సురవరము ప్రతాపరెడ్డి | హైదరాబాదు, 1926 |
| | ,, (దిన) | నూకల నరోత్తమరెడ్డి | 1947 |
| 15. | సుజాత | పి.ఎన్. శర్మ | హైదరాబాదు, 1927 |
| | ,, | గడియారం రామకృష్ణశర్మ | 1950 |
| 16. | ఆంధ్రవాణి | బి.ఎన్. శర్మ | తెలంగాణ 1937–38 |
| 17. | తెలుగుతల్లి | రావమ్మ సత్యవతిదేవి | సికిందరాబాద్, 1938 |
| 18. | చిత్రకళ | ఇంటూరి వెంకటేశ్వరరావు | మద్రాసు–1937 |
| 19. | బాల | న్యాపతి రాఘవరావు, న్యాపతి కామేశ్వరమ్మ | మద్రాసు, 1944 |
| 20. | తెలంగాణ | బుక్కపట్టణం రామానుజాచార్యులు | తెలంగాణ, 1945 |
| 21. | మీజాన్ | అడవి బాపిరాజు | తెలంగాణ, 1945 |
| 22. | తెలుగు స్వతంత్ర | గోరాశాస్త్రి | 1948–1957 |
| 23. | విశాలాంధ్ర<br>(ప్రజాశక్తి, 1941–45) | మద్దుకూరి చంద్రశేఖరరావు | 1952 నుండి |
| 24. | ఆంధ్రజనత | 1. వల్లూరి బసవరాజు<br>2. బూర్గుల రామకృష్ణారావు | హైదరాబాదు 1955 |

## Bibliography

### Official Reports & Abstracts

1. Selected Extracts from Madras Police Abstracts-intelligence, 1910.
2. Extracts from the Madras Political Abstracts of intelligence, Vol XXVI dated 13-2-1910.
3. Selected Extracts from the Confidential Reports in the Native News Paper, 1901, 1902.
4. G.O. No 803/804 Public Dept. dated 7th oct. 1903 Anexure II.

### Books *English*

1. Dr. J Mangamma 'Book Printing in India', Nellore, 1976.
2. Dr. P J. Thomas 'The Growth of Higher Education in Southern India', New Delhi.
3. Wash Brook, David. Essays on South India Politics & Political changes. New Delhi
4. Stephen Barnett 'Essays on South India', New Delhi.
5. The Indian Press-Calcutta, 1967.
6. Chronicles 'Telugu Journalism', Halfway, V. R. Narla 61 Birthday volume, New Delhi.
7. 'Studies in the History of Telugu Journalism' V.R Narla 60th Birthday volume, New Delhi, 1968.

## Telugu

1. ఆంధ్ర దర్శిని 1954, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ
2. ఆంధ్రప్రదేశ్ దర్శిని, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1976.
3. మహతి, 1947-72, హైదరాబాదు 1972.
4. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మద్రాసు.
5. కందుకూరి వీరేశలింగం 'స్వీయచరిత్ర' రాజమండ్రి.
6. చిలకమర్తి లక్ష్మీనరసింహము 'స్వీయచరిత్ర', రాజమండ్రి, 1944.
7. బ్రౌను జాబులు-తెలుగు జర్నలిజం చరిత్ర-'1832-1857 దాకా' బంగోరె.

### వ్యాసములు

1. ఎమ్. వీరభద్రాచారి 'విశ్వబ్రాహ్మణులు' ఆంధ్ర పత్రిక 1914, బొంబాయి.
2. విమర్శనము, ఫిబ్రవరి 1933, మద్రాసు.
3. విస్సా అప్పారావు 'ధన్యజీవి - శ్రీ చిలమర్తి లక్ష్మీనరసింహంగారు', భారతి, జూలై 1946.
4. జె. సత్యనారాయణ 'ఆంధ్రకేసరి ప్రకాశము', భారతి, అక్టోబర్, 1935.
5. అడవి శంకరరావు 'పూండ్ల రామకృష్ణయ్యగారు', భారతి, నవంబర్, 1931.
6. రాయసం వెంకటశివుడు 'గడచిన ముప్పది ఏండ్లలో శ్రీ విద్యాభివృద్ధి', భారతి, ఉగాది 1910.
7. నిడదవోలు వెంకటరావు, 'ప్రాచీనాంధ్ర వార్తా పత్రికలు' భారతి, జూన్ 1933.
8. కొడాలి రామకృష్ణారావు, 'ఆంధ్ర వార్తాపత్రికలు', ఆంధ్రపత్రిక, ఉగాది 1926.
9. నోరి నరసింహశాస్త్రి 'కాశీనాథుని నాగేశ్వరరావు', ఆంధ్రపత్రిక, మద్రాసు.
10. డి. అంజనేయులు 'పత్రికారచన' తెలుగు వాణి హైదరాబాదు, 1976.

లిజం, ఇంప్రెషనిజం యూరోపులో తలెత్తాయి. ఇరవయ్యవ శతాబ్దం మొదటి భాగంలో ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ఫ్యూచరిజం, ఎక్స్‌ప్రెషనిజం, డాడాయిజం, సర్రియలిజం, ఇమేజిజం, ఫార్మలిజం మొదలైన ధోరణులు చిత్రకళలో మొదలై తరువాత సాహిత్యంలోని, ఇతర కళలలోకి వ్యాపించాయి. ఈ ధోరణు లన్నీ ఆధునికత పేరిట పెట్టుబడిదారీ దేశాల కళలను, సాహిత్యాన్ని ఏలాయి. సోషలిస్టు దేశాలలో రియలిజం సోషలిస్టు రియలిజంగా అభివృద్ధిచెందింది.

వలస దేశమైన భారతదేశంలో ప్రధాన వైరుధ్యం భూస్వామ్య, పెట్టుబడిదారీ శక్తుల మధ్యకాక వలసవాద, వలస వ్యతిరేకతల మధ్య కనిపిస్తుంది బ్రిటిష్ వలస విధానానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో భూస్వామ్య శక్తులు, సంస్థానాధీశులు, అప్పుడే అభివృద్ధి చెందుతున్న బూర్జువా మధ్యతరగతి వర్గం కలసి పాల్గొన్నారు. 1857 సిపాయీల తిరుగుబాటుకు కారణం ఏదైనా దానికి సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావం ఉంది. సామాన్య సిపాయీలు దీనిలో ఎక్కువగా త్యాగాలు చేసినా నాయకత్వం వహించినవారు సంస్థానాధీశులు వారికి ఆధునిక దృష్టి కాని దృష్టిలేదు. సిపాయీల తిరుగుబాటు విఫలం కావటం, విశ్వవిద్యాలయాల స్థాపనతో ఆంగ్ల విద్యా విధానం భారత దేశంలో ప్రవేశించింది. పాశ్చాత్య దేశాలలోని విజ్ఞాన శాస్త్రాభివృద్ధి, పారిశ్రామి కాభివృద్ధి ఈ దేశంలో లేదు. పద్దెనిమిదవ శతాబ్ది చివరినాటికే స్థానిక పరిశ్రమ కేంద్రాలు దెబ్బతిని యూరోపు వర్తక సంఘాలు అభివృద్ధి చెందాయి. భారతదేశం లోని వృత్తి పరిశ్రమలైన నూలు, పట్టు వస్త్రాలు, చక్కెర, సుగంధ ద్రవ్యాలు మొదలైన వాటిని ఎగుమతి చేసి యూరోపు వర్తకులు బాగుపడ్డారు. తరువాత బ్రిటిష్ పారిశ్రామిక ఉత్పత్తులకు భారతదేశం వినియోగదారు కావటంతో కళలుగా అభివృద్ధి చెందిన భారతీయ చేతి ఉత్పత్తులు దెబ్బతిన్నాయి. ఒకప్పుడు ఉన్నత స్థితిలో ఉన్న శిల్ప, చిత్రకళలు క్షీణ స్థితికి దిగజారాయి. వాస్తు కళ వంటి విగ్రహ నిర్మాణానికి మాత్రమే పరిమితం అయ్యాయి. వృత్తి పరిశ్రమలు దెబ్బతినటం, బ్రిటన్‌కి భారతదేశం ఆర్థిక వలసగా తయారు కావటంతో దేశం ఆర్థికంగా చితికిపోయింది. దానికితోడు కులవ్యవస్థ, మూఢనమ్మకాలు, స్త్రీ, పురుష భేదం, బాల్య, వృద్ధ వివాహాలు, సతీసహగమనం మొదలైన రుగ్మతలు సమాజాన్ని పట్టి పీడిస్తున్నాయి. ఆనాటి విద్యావంతులైన మధ్య తరగతి మేధావులు ఈ రుగ్మతలను తొలగిస్తేగాని భారత సమాజం పురోగమించదని,

ఆధునికతా దృష్టి ఏర్పడదని భావించారు. సామాజికంగా పురోగమించిన బ్రిటిష్ మొదలైన ఐరోపా దేశాలు భారతీయ మేధావులకు ఆదర్శం అయ్యాయి. సంస్కరణోద్యమాలు వచ్చాయి. తెలుగు నాట వేమన, వీరబ్రహ్మం మొదలైన వారి సంస్కరణ భావాల అభివృద్ధి క్రమంగా కాక ఆధునికంగా పురోగమిస్తున్న పాశ్చాత్య దేశ సమాజాలు ఆదర్శంగా ఆధునిక సంస్కరణోద్యమాలు వచ్చాయి.

భారతదేశాన్ని తమ పారిశ్రామిక ఉత్పత్తులకు వినియోగదారుగా చేసుకోవటమే కాని ఈ దేశాన్ని పారిశ్రామికంగా ఆధునిక మార్గంలో పెట్టాలన్న దృష్టి బ్రిటిష్ వారికి లేదని తెలుసుకోవటం ప్రారంభించారు. దానితో స్వాతంత్ర్యోద్యమం మొదలైంది. జాతీయోద్యమంగా అది దేశమంతా వ్యాపించింది. స్వేచ్ఛా, ప్రజాస్వామ్య భావాలు కళా, సాహిత్య రంగాలలో కాల్పనిక వాదం ప్రవేశించటానికి కారణం అయ్యాయి. ప్రత్యేక భాషా రాష్ట్రోద్యమాలు, ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రోద్యమం ప్రారంభమయింది. ఈ సందర్భంగా సమకాలీనంగా గర్వించదగ్గ చరిత్రలేని వలస దేశంగా భారత దేశం గుర్తింపుకోసం, ప్రేరణకోసం గతంమీద ఆధారపడవలసి వచ్చింది. గతాన్ని తవ్వి కీర్తించవలసి వచ్చింది. పారిశ్రామిక సంస్కృతిలో తోవతప్పిన పాశ్చాత్యుల్లో కొందరు ఆధ్యాత్మిక సంస్కృతి పేరిట భారతదేశ సంస్కృతిని పొగడటం దీనికి మరింత దోహదం చేసింది. సాంస్కృతిక రంగంలో పూర్తిగా పాత ధోరణుల స్థానంలో అధునాతన ధోరణులు వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా పురోగమించిన ఐరోపా దేశాలలో వ్యాపిస్తూ ఉంటే భారతదేశంలో ప్రాచీన సంస్కృతీ, సాహిత్య వైభవాలను మననం చేసుకొని వాటి గొప్పదనాన్ని కీర్తించటం, తిరిగి వాటిని పునః ప్రతిష్ఠాపించాలనే ధోరణులు పెరిగాయి. వలస వ్యతిరేక పురోగమనాంశంగా స్వాతంత్ర్యోద్యమ కాలంలోనే సాంస్కృతికంగా తిరోగమనానికి దారి పడింది. సాంస్కృతిక పునరుజ్జీవనంతో ప్రారంభమైన నూతన చరిత్ర పునరుద్ధరణోన్ముఖం కూడా అయింది. ఇరవయ్యో శతాబ్దిలో కూడా పదకొండవ శతాబ్దంలో లాగా సాహిత్య సృష్టి చేయాలనే ప్రత్యేక ప్రయత్నం చేయటం సుదీర్ఘ చరిత్ర కలిగి వలసదేశమైన భారతదేశంలోనే సాధ్యం. ఇదే కాలంలో ప్రాచీన సంస్కృతిలోని, సాహిత్యంలోని విరుద్ధమైన అంశాలలోని [illegible] వెలికి తీస్తూ, వాటి ప్రామాణికతను ప్రశ్నిస్తూ

హేతువాద భావాలు కూడా వ్యాపించాయి. క్రమంగా ఆర్థిక సమస్యలను గురించి ఆలోచించటం ప్రారంభమైంది. రష్యన్ కమ్యూనిస్టు విప్లవం దీనికి దోహదం చేసింది. సామ్యవాద సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి. సామ్యవాద సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి. సామ్రాజ్యవాద వ్యతిరేకతతో పాటు దేశంలో ఆర్థిక, సామాజిక వర్గాలవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు కూడా సాహిత్యానికి, కళలకు వస్తువులయ్యాయి. భూస్వామ్య, వలస సంస్కృతుల మిశ్రమంగా కళారంగం వ్యాపిస్తున్న దశలో అచ్చం దేశీయమైన, సంప్రదాయమైన కళారూపాల ద్వారా జాతీయ, అంతర్జాతీయ, స్థానిక సమస్యలను, ఫాసిస్టు వ్యతిరేక, వలస వ్యతిరేక భూస్వామ్య వ్యతిరేక భావాలను ప్రజలలో ప్రచారం చేయటం ప్రారంభమైంది.

మరొకవైపు పుంజుకుంటున్న పెట్టుబడిదారీ వ్యవస్థ కారణంగా కళ వ్యాపారంగా కూడా మారింది. పెట్టుబడిదారీ వ్యవస్థ ఫలితమే మధ్య తరగతి ఒక తరగతిగా నిలదొక్కుకోవటం. రచయితలు, ఔత్సాహిక కళాకారులు మధ్య తరగతి వారే కావటంవల్ల స్వాతంత్ర్యం వచ్చిన అనంతరకాలంలోనే సాహిత్య, కళారంగాలలో వారి ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

నూరేళ్ళ ఆర్థిక, సామాజిక, రాజకీయ చరిత్రలోని అన్ని దశలు, భావాలు, ఆలోచనల ప్రభావం తెలుగుదేశపు కళా, సాంస్కృతిక రంగాలలో కనిపిస్తాయి. పునరుజ్జీవనం, సంస్కరణ, కాల్పనిక, జాతీయోద్యమం, రాష్ట్రోద్యమం, దేశభక్తి, గతచరిత్ర, పునరుద్ధరణ, హేతువాదం, సామ్యవాదం, మధ్యతరగతి సమస్యలు అన్నీ కళారంగంలో కనిపిస్తాయి. సాహిత్యకళ కూడా అయిన దృశ్యకళ నాటక రంగంలో వీటి ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. నాటక కళతో పోలిస్తే చిత్రకళ ఈ కాలంలో ఎక్కువగా అభివృద్ధి చెందలేదు. ఐరోపా దేశాలలో ఆధునిక ధోరణులు చిత్రకళలోనే ప్రధానంగా ప్రారంభమయ్యాయి. సంగీత, నృత్యకళలు సంప్రదాయ కళలుగానే నిలబడ్డాయి. లలిత సంగీతంవంటి మిశ్రరూపాన్ని సంగీతం సంతరించుకుంది. ప్రాచీన, మధ్య యుగాలలో బాగా అభివృద్ధి చెందిన శిల్పకళ ఈ కాలంలో అంతంత మాత్రంగానే కనిపిస్తుంది. కలంకారీ, కొండపల్లి బొమ్మలవంటి హస్తకళలు వ్యాపార దృష్ట్యా కొంత నిలదొక్కుకున్నాయి. రాజుల, సంస్థానాధీశుల పోషణ

నశించిన కళలు సంస్థలు, సంఘాలు, సమాజరూపంలో ఉద్యమాలుగా వ్యాపించాయి.

ఆంగ్ల సాహిత్యం, ఆంగ్ల సాహిత్య ప్రక్రియలతోపాటుగానే నాటక రచన, ప్రదర్శన, నిర్మాణం, నటన మొదలైనవి భారతదేశంలోని ఇతర భాషా ప్రాంతాలతో పాటు తెలుగునాట కూడా ప్రారంభమయ్యాయి. తెలుగుదేశంలో దేశీయ దృశ్య కళలైన యక్షగానాలు మొదలైనవాటి పరిణామ క్రమంలో ఆధునిక నాటకాలు రూపొందలేదు. స్వతంత్రంగా బ్రిటిష్ నాటక కళకు అనుసరణగా, ప్రాచీన సంస్కృత నాటక లక్షణాల మేళవింపుతో మిశ్రరూపంలో తెలుగు నాటకాలు ప్రారంభం అయ్యాయి. నాటక ప్రదర్శనకు, నాటక రచనకు సమకాలీన ప్రేరణమాత్రం ఆంగ్ల సాహిత్యం, ఆంగ్ల నాటకాలు. ఇంగ్లీషు వ్యాపారులు, ఇంగ్లీషు అధికారుల వినోదం కోసం యూరోపు దేశాలనుండి నాటక ప్రదర్శన దళాలు వచ్చేవి. భారతదేశంలోని ఉన్నత వర్గానికి, చదువుకున్న వర్గానికి అవి ఆదర్శం, అనుసరణీయం, ఆమోద యోగ్యం అయ్యాయి. ఆంగ్ల నాటకాలకు సంబంధించి షేక్స్‌పియర్ నాటకాలు ఎక్కువగా ప్రదర్శించబడేవి. మొదటి దశలో సంస్కృత నాటకానువాదాలు, ఇంగ్లీషు నాటకానువాదాలు వచ్చాయి. మొదటి నాటక కర్త అయిన కోరాడ రామచంద్రశాస్త్రి భట్ట నారాయణుని సంస్కృత నాటకం 'వేణీసంహారాన్ని', కొక్కొండ వెంకటరత్నంపంతులు ధర్మభట్టు, నరకాసుర వ్యాయోగాన్ని (1911) పరవస్తు వెంకట రంగాచార్యులు కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని (1912) అనువాదం చేశారు. కందుకూరి వీరేశలింగం మొదలైనవారు కూడా సంస్కృత నాటకాలను అనువాదం చేశారు. భవభూతి 'ఉత్తరరామచరితా'నికి, కాళిదాసు 'అభిజ్ఞానశాకుంతలా'నికి, శూద్రకుని 'మృచ్ఛకటికా'నికి అనేక అనువాదాలు వచ్చాయి. కాళిదాస, భవభూతుల ఇతర నాటకాలు, భాస, విశాఖదత్త, హర్ష, కృష్ణమిశ్ర మొదలైన వారి నాటకాలు తెలుగులోకి వచ్చాయి. వావిలాల వాసుదేవశాస్త్రి షేక్స్పియర్ నాటకం 'జూలియస్ సీజర్'కి 'సీజరు చరిత్రము' (1876) పేరిటచేసిన అనువాదం తొలి ఆంగ్ల నాటకానువాదం; తొలి విషాద రూపకం కూడా. కందుకూరి మొదలైనవారు కూడా ఇంగ్లీషు నాటకాలను అనువదించారు.

ధార్వాడ కంపెనీ వారి నాటకాల ప్రదర్శన తరువాత హిందీ నాటకాను వాదాలు కూడా వచ్చాయి. బందరులోని నేషనల్ థియేట్రికల్ సొసైటి వారి కోసం నాదెళ్ళ పురుషోత్తమ కవి సుమారు 32 హిందీ నాటకాలను రచించారు. తొలిదశలో తెలుగులోని స్వతంత్ర నాటకాలు మాత్రం ప్రాచ్య, పాశ్చాత్య నాటక పద్ధతుల మిశ్రమరూపంలో వచ్చాయి. నాందీ, ప్రస్తావనలు, అంక విభజన, పాత్రోచితభాష మొదలైన ప్రాచ్య నాటక లక్షణాలు, రంగ విభజన, ఉత్తర రంగం (Epilogue), అకస్మికాదంతం మొదలైన పాశ్చాత్య నాటక లక్షణాలు కలిసి ఈ రచనలలో కనిపిస్తాయి. అంతకుముందు సంస్కృత నాటకాలలో గాకుండా ఆధునిక నాటకాలలో కనిపించే లక్షణాలు విషాదాంత రూపకాలు సమకాలీన సమస్యల్ని అవసరాన్నిబట్టి చొప్పించడం, భావ సంఘర్షణ, మనస్తత్వచిత్రణ, సున్నితమైన హాస్యం, వ్యంగ్య(satire), విషాదభరిత హాస్యం మొదలైనవి. వాస్తవికత నాటకాలకు ఆధునికతను సంతరించే మరొక ముఖ్య లక్షణం. వీటితోపాటు ఆధునిక ప్రదర్శన శిల్పం కూడా సాంకేతికంగా బాగా అభివృద్ధి చెందింది. ప్రత్యేక ప్రయత్నంగా, ఉద్యమంగా తెలుగు నాటకాలు అభివృద్ధి చెందాయి. సంస్కరణోద్యమ నేతలు, రాజకీయ నాయకులు నాటక ప్రదర్శనోద్యమానికి కూడా నేతృత్వం వహించారు.

నాటక ప్రదర్శన కళ, సాహిత్యకళ కూడా. ప్రదర్శనగా ప్రదర్శన పద్ధతులలో, సాంకేతికులలో తెలుగు నాటక రంగంలో వచ్చిన మార్పుల్ని విడిగా పరిశీలించవలసి ఉంటుంది. తెలుగుదేశంలో నాటక ప్రదర్శన ఇంగ్లీషు, సంస్కృత నాటక ప్రదర్శనలతోనే ప్రారంభమైనట్లు మొదట తెలుస్తున్నది. మద్రాసులో నాటకాలు కూడా ప్రదర్శింపబడ్డాయి. విజయనగరంలోని బాలసరస్వతీ విలాసిని సభ (1874), మద్రాసులోని 'ఓరియంటల్ డ్రమెటిక్ కంపెనీ' (1879-80) సంస్కృత నాటకాలను ప్రదర్శించేవి. మద్రాసులోని 'ద మాడర్న్ డ్రమెటిక్ సొసైటీ' (1875), విశాఖపట్టణంలోని జగన్మిత్ర నాటక సమాజం, నెల్లూరులోని అమెచ్యూర్ నాటక సభ ఇంగ్లీషు నాటకాలను ప్రదర్శించేవి. తెలుగులో నాటక సమాజాలు, ఆధునిక నాటక ప్రదర్శన 'ధార్వాడ నాటక సమాజం' ప్రభావంతో మొదలయ్యాయి. తెలుగులో నాటక రచన 1860 లో మొదలయింది. నాటక ప్రదర్శన మాత్రం 1880 లో మొదలైంది. కొందరు రచయితలు, పండితులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు ఔత్సాహికంగా నాటకా

లను ప్రదర్శించటంతో తెలుగునాట నాటక ప్రదర్శన ప్రారంభమయింది. ఆ తదుపరి దశలో నాటక సమాజాలు ఏర్పడ్డాయి. రచయితలు, పండితులతోపాటు రాజకీయ నాయకులు కూడా నాటక ప్రదర్శనలో పాల్గొన్నారు. పురుషులు స్త్రీ పాత్రలు ధరించారు. పార్శీ నాటక సమాజం, ధార్వాడ నాటక సమాజాల ప్రభావంతో నాటక ప్రదర్శనలో అనేక అంశాలు ప్రవేశించాయి. తెరలు, రక రకాల దృశ్యాలు, ట్రిక్కులు, ఆడంబరమైన మేకప్, మృదంగం ఫిడేల్ మొదలైన అర్కెస్ట్రా ప్రవేశించాయి. ఇదేకాలంలో పద్యాలు, పాటలు నాటకంలో ప్రవేశించాయి. సురభి నాటక సమాజం అవతరణతో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించటం ప్రారంభమైంది. కొందరు నటులుగా ఎదిగారు. నాటకం వినోద సాధనం అయింది. కాంట్రాక్టు నాటకాల వ్యాపారంగా పరిణమించింది.

ఈ దశలో మళ్ళీ ఔత్సాహిక నాటక సంఘాలు వెలిశాయి. ఇదే కాలంలో నాటకాన్ని ప్రజల దగ్గరకు తీసుకొని వెళ్ళి ప్రజా కళగా నాటకాన్ని తీర్చిదిద్దింది ప్రజా నాట్యమండలి. పద్యాలు, పాటలుపోయి వాస్తవాన్ని ప్రతిబింబించే సంభాషణలు నాటకంలో ప్రవేశించాయి. భాష గ్రాంథికం నుండి, సరళ గ్రాంథికానికి, శిష్ట వ్యావహారికానికి, సహజ లేక మాండలిక వ్యవహారానికి మారింది. కాల్పనికమైన నటనా రీతులు నుంచి మానసిక సంఘర్షణను చిత్రించే నటనను, తరువాత వాస్తవికమైన నటనను, ఆడంబరమైన ప్రదర్శనా పద్ధతుల నుంచి నిరాడంబర, ప్రతీక ప్రదర్శనా పద్ధతులను, కొత్త ప్రయోగాలను నాటక ప్రదర్శ పరిణతి చెందింది. రంగ ప్రదర్శనకు, నటనకు ప్రత్యేక శిక్షణ కేంద్రాలు ఏర్పడ్డాయి. 1924 లో బి. టి. రాఘవాచార్యులు, గుడివల్లి రామబ్రహ్మం బెజవాడలో, 'భరతకళా ప్రపూర్ణులు' అన్న నాటక పాఠశాలను స్థాపించి నటనలో శాస్త్రీయమైన శిక్షణను గరిపారు. తరువాత కాలంలో విశ్వవిద్యాలయాలలో కూడా 'థియేటర్ ఆర్ట్స్' శాఖలు ఏర్పడి నాటకప్రదర్శన, నటనఅధ్యయనాంశాలుగా రూపొందాయి.

తెలుగుదేశం ఆధునిక యుగంలో ప్రవేశించటానికి కారణమైన కందుకూరి వీరేశలింగం తెలుగులో నాటక ప్రదర్శనకు కూడా మొదటి వారు. 1880 లో రాజమండ్రిలో ధార్వాడ నాటక సమాజం నాటక ప్రదర్శనచేసిన రంగస్థలం పైననే విద్యార్థులు కొందరు కందుకూరి వారి సంస్కృత, ఆంగ్లనాటకానువాదాలైన 'రత్నావళి', 'చమత్కార రత్నావళి' నాటకాలను ప్రదర్శించారు. అదే

సంవత్సరం వీరేశలింగం గారి మిత్రులు, విద్యార్థులూ కలిసి రాజమండ్రిలోని మహారాజా బాలికోన్నత పాఠశాలలో కందుకూరి వారి ప్లీడర్ నాటకం అని ప్రసిద్ధిపొందిన 'వ్యవహారధర్మ బోధిని'ని ప్రదర్శించారు. సమకాలీనమైన సామాజిక ఇతివృత్తం, వ్యావహారిక భాషల కారణంగా సామాన్యులను ఈ నాటక ప్రదర్శన ఆకర్షించింది. కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి ఆధ్వర్యంలోని గుంటూరు హిందూ నాటక సమాజం చాలా చోట్ల నాటక ప్రదర్శనలు చేసింది. దేశభక్త కొండా వేంకటప్పయ్యగారికి ఈ సమాజంతో ప్రత్యక్షసంబంధముండేది. ఆయన స్త్రీ పాత్రలు ధరించేవారు. వడ్డాది సుబ్బరాయ కవి స్థాపించిన రాజమండ్రిలోని హిందూ నాటకోజ్జీవన సమాజము (1884), కాశీనాధుని నాగేశ్వర రావు స్త్రీ పాత్రలు ధరించిన బందరులోని హిందూ థియేటర్ (1884), టంగుటూరి ప్రకాశం పంతులు స్త్రీ పాత్రలు ధరించిన ఒంగోలు నాటక సమాజము (1884-86) తెలుగునాట తొలినాటి ఔత్సాహిక నాటక సమాజాలు.

తరువాత కాలంలో విస్తృత ప్రాతిపదికపైన నాటక సమాజాలేర్పడ్డాయి. సుమారుగా అన్ని ప్రధాన పట్టణాల్లోను నాటక సమాజాలేర్పడ్డాయి. ఈ దశలో ముఖ్యంగా పేర్కొనదగిన నాటక సమాజం బళ్లారిలో ధర్మవరం కృష్ణమాచార్యులుగారి 'సరస వినోదినీ సభ' (1888). క్రమశిక్షణతో కూడిన ఆదర్శ నాటక ప్రదర్శనకు ఈ నాటక సమాజం పేరుపొందింది. ధర్మవరం స్వయంగా నాటకాలను రచించటమే కాదు, నటించేవారు కూడా. ధర్మవరం వారే నాటకాలలో పాటలను ప్రవేశ పెట్టారు. ఆ తరువాత నాటకాలలో పాటలు తప్పనిసరి కావటం, పద్యాలను సుదీర్ఘంగా రాగం తీసి చదవటం ప్రారంభమైంది. బళ్ళారిలోనే 1900లో 'సుమనోరమ సభ' ప్రారంభమైంది. కోలాచలం శ్రీనివాసరావు ఈ సమాజానికి రచయిత. వీరు కట్టించిన 'వాణీవిలాస' నాటకశాలను 1905లో బాల గంగాధర తిలక్ ప్రారంభించారు. ఆ తరువాత 1907లో 'సరసవినోదినీ సభ' వారు కూడా 'రామకృష్ణ విలాస్' అనే నాటకశాలను నిర్మించుకున్నారు. బళ్ళారి రాఘవాచార్యులు సుమనోరమ సభలో ప్రముఖ నటుడు. 1889లో [illegible] హనుమంతరావు, టంగుటూరి ప్రకాశం పంతులు రాజమండ్రిలో హిందూ నాటక సమాజాన్ని స్థాపించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు ఈ సమాజానికి నాటకరచయిత. శ్రీ వేదం వేంకటాచలయ్య నాటకకర్తగా మద్రాసులో 'సుగుణ విలాససభ'(1891), మారేపల్లి రామచంద్రకవి, సెట్టి లక్ష్మీనరసింహం స్థాపించిన

విశాఖపట్టణం 'కళ్యాణీలాస నాటక సమాజం' (1895) నాటక సమాజాలకి పేరొన్నదగ్గవి. మారేపల్లి రామచంద్రకవి వేశ్యా స్త్రీలకు జీవనాధారం కల్పించటానికి విశాఖపట్టణంలో 'సంగీత మానిని సమాజం' (1902) అన్న ప్రత్యేక స్త్రీ నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో స్త్రీలే పురుష వేషాలు ధరించేవారు. ఆ తరువాత స్త్రీ నాటక సమాజాలు చాలా ఏర్పడ్డాయి. మొత్తం మీద సంస్కరణోద్యమంలో భాగంగా ప్రయోగాత్మకంగా సాంస్కృతికరంగం ఆ రోజుల్లో వికసించింది.

తెలుగుదేశంలో సురభి నాటక సమాజం (1901) అనంతరం తో కంపెనీ లాంటి నాటక సమాజాలు తెలుగుదేశంలో ఏర్పడ్డాయి. స్త్రీలే స్త్రీవేషాలను ధరించడం మొదలైంది. "సురభి నాటక సమాజం" ఒకే కుటుంబానికి సంబంధించిన నాటక సమాజం రాపతంపల్ల కులస్త్రీలు ఏ అభ్యంతరం లేకుండా నాటకాలలో నటించేవారు. 1910 తరువాత ఇది సలభై శాఖలుగా విస్తరించింది. రాప్తింటి సుబ్బారావు ఈ సమాజానికి పాటలు, నాటకాలను రచించారు. విశ్వనాథ కవిరాజు, కొప్పరపు సుబ్బారావు, మల్లాది వేంకట కృష్ణశర్మలు కూడా ఈ సమాజాలకు నాటకాలు రాసి ఇచ్చేవారు. స్వయంసమృద్ధమైన నాటక సమాజాలుగా సురభి నాటక సమాజాలు అభివృద్ధి చెందాయి. రంగాలంకరణ, దృశ్యాల్లోని మార్పు వేగ, ఘంటలు అప్పు సురభి నాటక సమాజాలలో సర్వ సమగ్రంగా సంతరించుకొన్నాయి. వల్లూరి ... నాటకసమాజాలు ఆధునికతతో, అంగికాలతో ప్రయోగదశను చేరుకున్నాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారితో ప్రారంభమైన రాజమండ్రిలోని హిందూ నాటక సమాజాన్ని కృత్తివెంటి నాగేశ్వరరావు, సత్యవోలు గున్నేశ్వరరావులు లక్షల సంపెంయల పెట్టుబడితో, ఆధునిక రంగస్థల పరికరాలతో సంపూర్ణమైన నాటకరంగంగా తీర్చిదిద్దారు. నటులకు జీతాలు ఇచ్చేవారు. ఎంపట్ల గొంతయ్య నాటకాలకు ప్రత్యేకంగా పాటలు రాసేవాడు. ఎ. ఎస్. రామ్ తెరలపైన రంగులు, బొమ్మలు వేసేవాడు. దీనితో నాటకంలో చిత్రకళ ప్రకాశించింది. నాటకంలో డాన్సులు కూడా ప్రవేశించాయి. హార్మోనియం మొదలైన ఆర్కెస్ట్రా పెరిగింది. హైదరాబాదు నివాసి ఎ. టి రామానుజులు హార్మోనిస్టుగా పేరుపొందారు. యడవల్లి సూర్యనారాయణ, గోవిందరాజుల వెంకట్రామయ్య, నిపిలవాయి రామనాథ శాస్త్రి, అద్దంకి శ్రీరామమూర్తి, కడియాల రత్తయ్య, డి. వి. సుబ్బారావు,

పి. సూరిబాబు, పీసపాటి నరసింహమూర్తి, స్త్రీ పాత్రధారులుగా స్థానం నరసింహారావు మొదలైనవారు నటులుగా ప్రసిద్ధి పొందారు. శ్రీమతి రామతిలకం, కన్నాంబ, రాజేశ్వరి మొదలైన నటీమణులు కూడా ప్రసిద్ధికెక్కారు. నటులను బట్టి నాటకాలను చూడటానికి జనం వచ్చేవారు. నాటకాలను చూడటం ఒక కాల్పనికలోకంలోకి వెళ్ళినట్లుగా ఉండేది ఆ రోజుల్లో. 1925 తరువాత కాంట్రాక్టు నాటకాలు వచ్చాయి. ఒక పట్టణంలోనో మరొకచోటో నాటక ప్రదర్శనకు ఒప్పుకొని ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క ప్రసిద్ధ నటుణ్ణి పిలిపించి అడ్వ ఇచ్చి కాంట్రాక్టర్లు నాటకాలాడించటం మొదలైంది. అంతకుముందు నాటక సమాజాలలో పనిచేసిన వృత్తినటులు చాలామంది కాంట్రాక్టర్లమీద ఆధారపడ్డారు. సామూహిక కృషిగాని, రిహార్సల్‌గాని లేకుండా నటులు ఎవరికి తోచిన పద్ధతిలో వారు సంభాషణలు చెప్పటం, పద్యాలు చదవటం చేస్తుండేవారు. పద్యాలను మళ్ళీ చదవమనే ప్రేక్షకుల వన్స్‌మోరులతో రంగస్థలం మారుమ్రోగేది. రాత్రి మొత్తం ప్రదర్శించే నాటకాలలో ఒకే పాత్రను ముగ్గురు, నలుగురు నటులు ధరిస్తూ ఉండేవారు. నాటకాలు మోటు వినోద సాధనాలుగా పరిణమించాయి. 1921 లో బెజవాడలో బళ్ళారి రాఘవాచార్యులు పద్యాలు లేకుండా చేసిన నాటక ప్రదర్శనం మొదట అంతగా ప్రేక్షకులను ఆకర్షించలేదు.

1928 లో బళ్ళారి రాఘవాచార్యులు ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్, ఇటలీ మొదలైన యూరోపు దేశాలు తిరిగి వచ్చిన తరువాత సహజ ప్రధానమైన సరికొత్త నాటక ప్రదర్శన తెలుగుదేశంలో ప్రచారం చేసి జాపు సిద్ధపరిచారు. సంభాషణా విధానానికి, మానసిక సంఘర్షణను వ్యక్తీకరించే నటనా విధానానికి ప్రాధాన్యం ఇచ్చింది. అంతకుముందు నాటకాలలో ఒక పాత్రధారి సంభాషణలు చెప్తున్నప్పుడు, పద్యాలు చదువుతున్నప్పుడు ఇతర పాత్రధారులు తమకేమీ సంబంధం లేనట్టు ఉండేవారు. బళ్ళారి తాను సంభాషణలు చెప్పేటప్పుడేకాక, ఇతరులు సంభాషణలు చెప్పేటప్పుడు, ఇతర సందర్భాలలో కూడా నటుడు ప్రవర్తించే తీరుకి ప్రాధాన్యం ఉందని ఆయన తెలియజెప్పారు. రాఘవాచార్యులతో నాటక ప్రదర్శనలో నూతన ప్రయోగాలు ప్రారంభమయ్యాయి. స్త్రీలే స్త్రీ పాత్రలను ధరించాలని ఆయన గట్టిగా నమ్మాడు. వేదిక మీద పురుషులు స్త్రీ పాత్రను ధరించటాన్ని బెర్నార్డ్ షా అసహ్యమన్నాడట. శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవి, మాడపాటి సరోజిని మొదలైన మహిళలు నాటకాలలో స్త్రీ పాత్రలు ధరించటం ప్రారంభించారు.

1929 జూన్‌లో ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఆవిర్భావంతో వ్యాపార నాటకరంగానికి ప్రత్యామ్నాయంగా ఔత్సాహిక నాటకరంగానికి ప్రోత్సాహం లభించింది. పూర్తిగా ఆధునికమైన నాటకాలు రూపొందటానికి నాటక కళా పరిషత్తు దోహదం చేసింది. నాటికలు ఎక్కువగా బయలుదేరాయి. వ్యక్తులుగా కొందరు నటులకు గల ప్రాధాన్యం పోయి, సమిష్టి కృషికి ప్రాముఖ్యం లభించింది. పండితులు, కవులు, ఉద్యమకారులు నాటక కళాపరిషత్తు సభలలో పాల్గొన్నారు. ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మ, చిట్టిబొమ్మ పూర్ణయ్య పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు మొదట పరిషత్తు సభలలో పాల్గొన్నారు. నాటకాలను గురించిన చర్చలు, తరువాత నాటక ప్రదర్శనలు జరిగేవి. హరీంద్రనాథ చట్టోపాధ్యాయ వంటివారు పరిషత్తు వార్షికోత్సవాలలో పాల్గొని, నాటకరంగంలో వినూత్న ప్రయోగాలకు దోహదం చేశారు. రంగస్థలం, తెరల విషయంలో కొత్త ప్రయోగాలు వచ్చాయి. అడవి బాపిరాజు వంటి చిత్ర కళాకారులు నాటక రంగస్థల అలంకరణలో ప్రధాన పాత్ర వహించారు. కోపానికి, యుద్ధానికి ఎరుపురంగు, శాంతికి తెలుపు- ఇలా భిన్నభావాలకు సంకేతంగా రంగు తెరలను ఉపయోగించి నాటకాలను ప్రదర్శించటం జరిగేది. ఈ ప్రయోగంలో మొదటి సారిగా 1941 లో ఆత్రేయ రచించిన 'శాంతి' నాటక ప్రదర్శన జరిగింది. ప్రేక్షకుల మధ్యనుండి పాత్రలను ప్రవేశపెట్టే కొత్త ప్రయోగం కూడా ఆత్రేయ 'ఎవరు దొంగ?' నాటకంతో మొదలైంది.

1944 నుండి నాటక పోటీలు మొదలయ్యాయి. సాంఘిక ఇతివృత్తమే ఉండాలనీ, పద్యాలు ఉండకూడదనీ, స్త్రీపాత్రను స్త్రీలే ధరించాలని పోటీలో పాల్గొనే నాటకాలకు నియమాలుండేవి. పోటీలో పాల్గొనే నాటకంగానీ, నాటిక గానీ అయిదేండ్ల లోపలచేసిన రచనే అయి ఉండాలి. దీనివల్ల కొత్త నాటకాలు రావటానికి అవకాశం లభించింది. నాటక ప్రదర్శనలో దర్శకుడి ప్రాధాన్యం పెరిగింది. నాటక ప్రదర్శనకు, నటనకు, రచనకు కూడా బహుమతులు ఉండాయి. ఔత్సాహిక నాటక సంఘాలకు నటీమణులు దొరకటం ఇబ్బందిగా ఉండటం వల్ల స్త్రీపాత్రలులేని నాటకాల రచన ప్రారంభమైంది. ఔత్సాహిక నాటక సంఘాలలో మధ్యతరగతి ఉద్యోగులు, విద్యార్థులు ఎక్కువగా ఉండేవారు. ఎక్కువగా మధ్యతరగతి సంసారాలు, మధ్యతరగతికి చెందిన ఇతర సమస్యలు ఈ నాటి నాటకాలలో వస్తువులుగా ఉండేవి. 1955 అక్టోబరులో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన

సమగ్రమైన కళోద్యమం అని చెప్పదగ్గ లక్షణం ప్రజానాట్య మండలికే ఉంది. 1943 లో బొంబాయిలో అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభల సందర్భంగా ప్రోగ్రెసివ్ రైటర్స్ కాన్ఫరెన్స్ జరిగింది. కె. ఏ. అబ్బాస్, అనిల్ డిసిల్వా, గరికిపాటి రాజారావుల ఆధ్వర్యంలో ఇండియన్ పీపుల్స్ థియేటర్స్ అసోసియేషన్ అన్న సంస్థ ఏర్పడింది. దానికి తెలుగుదేశపు శాఖ ప్రజా నాట్యమండలి ఏర్పడింది. రెండవ ప్రపంచ మహాయుద్ధం తీవ్రదశలో ఉన్న కాలం అది. ఫాసిజాన్ని ఖండిస్తూ, వలస వాదాన్ని వ్యతిరేకిస్తూ, తెలంగాణాలో భూస్వామ్య వర్గానికి వ్యతిరేకంగా సాగుతోన్న పోరాటాన్ని ప్రతిఫలిస్తూ, సామ్యవాదాన్ని ప్రబోధిస్తూ ప్రజా నాట్యమండలి విజృంభించింది. అభ్యుదయ సాహిత్యంతో పాటు ఎదిగి, మధ్యతరగతి మేధావులకు పరిమితమైన అభ్యుదయ ఆలోచనా ధోరణులను సామాన్యుల దగ్గరికి తీసుకొని వెళ్లింది ప్రజా నాట్యమండలి కాంట్రాక్టు వ్యాపార నాటకాల ఊబిలో కూరుకుపోయిన తెలుగు నాటకరంగాన్ని ఉద్ధరించి, నాటకమే పల్లెపల్లెను వెళ్లేట్టు చేసింది ప్రజా నాట్య మండలి అనుకరణను, అనుసరణను వదలిపెట్టి, నిజమైన దేశీయ కళలను, ప్రజాకళలను పునరుద్ధరించింది. సైద్ధాంతికమైన అవగాహన, క్రమశిక్షణ, పట్టుదల, త్యాగం ఇవి ప్రజా నాట్య మండలి ప్రత్యేకతలు. డా॥ గరికిపాటి రాజారావు, కోడూరి అచ్చయ్య మొదలైనవారు తమ ప్రాక్టీసులను, వృత్తులను వదలిపెట్టి ప్రజానాట్య మండలికే తమ పూర్తి కాలాన్ని అంకితం చేశారు. దృశ్య కళారంగంలో ప్రజా నాట్య మండలితో అభ్యుదయ యుగం ప్రారంభమౌతుంది. బుర్రకథ, జముకుల కథ, పిచ్చిగుంటుల కథ, వీధి భాగవతం, హరికథ, కోయవేషం, డప్పుల కోలాటం, పడవ పాటలు, చిరతల కోలాటం, చెంచు వేషాలు, ఫకీరు వేషాలు, గొల్ల సుద్దులు మొదలైన జానపద కళా రూపాల ద్వారా సమకాలీన రాజకీయాలను బోధిస్తూ ప్రజలను నిత్య చైతన్య వంతుల్ని చేసే ఉద్యమంగా ప్రజానాట్య మండలి రూపుదిద్దుకుంది. పద్యాలరాగాల హోరుతోంచి నాట్యం, నాటక కళ ప్రజల దగ్గరకి వెళ్ళింది. పల్లెపల్లెలలో అపూర్వమైన రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది. కళకుగల సామాజిక స్వభావం, ప్రయోజనం అత్యున్నత స్థితికి చేరింది.

ప్రజా నాట్యమండలి రాష్ట్రదపు జిల్లాలలో శిక్షణ శిబిరాలను నిర్వహించింది. గ్రామగ్రామాన ప్రజానాట్యమండలి శాఖలు ఏర్పడ్డాయి. 1947 నాటికి

'పరివర్తన'ను కూడా ప్రజా నాట్యమండలి ప్రదర్శించింది. అభ్యుదయ సాహిత్య సంస్కరణ యుగానికి చెందిన కందుకూరి, గురజాడల కొనసాగింపుగా పరిణమించినట్టుగానే, సంస్కరణ ప్రధానమైన వాస్తవిక నాటకం 'కన్యాశుల్కం' కొనసాగింపుగా ఆర్థిక సమస్యలు ప్రధానమైన 'ముందడుగు', 'మాభూమి' నాటకాలను ముందుకు తీసుకొని వచ్చింది ప్రజానాట్యమండలి. సాంస్కృతికమైన, స్వతంత్రమైన గుర్తింపు (cultural identity) ను ప్రజానాట్యమండలి తెలుగువారికిచ్చింది. భూస్వామ్య, వలస సంస్కృతుల సమ్మిళితంగా తెలుగునాట కళారంగం రూపొందుతున్న దశలో ప్రజాకళల పునరుద్ధరణ ద్వారా ప్రజా సంస్కృతిని, అచ్చమైన దేశీయతను నిలబెట్టింది. ఈ కాలంలో పాశ్చాత్య నాటక కళలో వస్తున్న రీతులను అనుసరిస్తున్న భారతీయ నాటక రంగంలో ప్రజానాట్యమండలి స్థానిక కళలను ఉద్ధరించింది. ఇటీవలి కాలంలో కన్నడంలో గిరీష్ కర్నాడ్ యక్షగాన నాటకాల నుంచి, బెంగాల్‌లో ఉత్పల్ దత్ జాత్రా ప్రక్రియ నుంచి, మరాఠీలో పి.ఎల్. దేశ్‌పాండే తమాషా ప్రక్రియ నుంచి ఆధునిక నాటకాలను అభివృద్ధి పొందించారు.

వస్తుపరంగా అనువాద నాటకాలతో పాటు నూరేళ్ల తెలుగు దేశచరిత్రలో భాసిల్లిన ధోరణులు, ఉద్యమాలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలతో పాటు తెలుగు నాటకం మలుపులు తిరిగింది. సంస్కరణ, కాల్పనికత, దేశభక్తి, పౌరాణిక, చారిత్రక జాతీయోద్యమ, రాష్ట్రోద్యమ, హరిజనోద్యమ, హేతువాద, అభ్యుదయవాద, వాస్తవికతా ధోరణులన్నీ తెలుగు నాటకాలలో కనిపిస్తాయి. తెలుగులో తొలినాటకమైన కోరాడ రామచంద్రశాస్త్రిగారి 'మంజరీ మధుకరీయము' తప్పిస్తే తెలుగులో తొలి స్వతంత్ర నాటకాలు సుమారుగా సంఘ సంస్కరణకు సంబంధించినవే. 'మంజరీ మధుకరీయము' శాస్త్రిగారి స్వకపోల కల్పిత జానపదగాథ. వావిలాల వాసుదేవ శాస్త్రిగారి నందక రాజ్యము (1880) తొలి తెలుగు సాంఘిక నాటకం. కృష్ణా గోదావరి జిల్లాలలో బ్రాహ్మణుల మధ్య తగాదాలు, వైషమ్యాలు, అధికారుల దుర్నీతి ఈ నాటకంలో ఉన్నాయి. స్త్రీ విద్య, నాటక రచన మొదలైన విషయాలను గురించిన చర్చ ఇందులో ఉంది.

కందుకూరి వీరేశలింగం 'బ్రాహ్మ వివాహము', 'వ్యవహార ధర్మబోధిని' నాటకాలను 1880లోనే రచించారు. కందుకూరిది పూర్తిగా సంస్కరణ దృష్టి. బ్రాహ్మ వివాహ నాటకానికి పెద్దయ్యగారి పెండ్లి పుస్తకమని కూడా పేరు. వ్యవహార ధర్మబోధినికి ప్లీడరు నాటకం అని కూడా పేరు. న్యాయస్థానాలు, న్యాయవాదులు న్యాయాధిపతుల దురాచారాలు ఇందులోని వస్తువు. ఈ రెండు నాటకాలు వచనంలో పాత్రల సహజ సిద్ధమైన వ్యావహారిక భాషలో ఉన్నాయి. సంస్కరణ నాటకాలలో గురజాడ అప్పారావు 'కన్యాశుల్కము' మైలురాయి. ఇది తొలి వాస్తవిక నాటకం కూడా. నాటికీ నేటికీ కన్యాశుల్కం ఒక్కటే నాటకం అనే వారు కూడా ఉన్నారు. ఒక సమగ్రమైన సమాజం, జీవితం వాస్తవికంగా అద్దంపట్టిన నాటకం ఇది. గురజాడ చెప్పుకున్నట్టు 'బ్రహ్మవివాహము' హాస్య సంభాషణా రూపంలో బాల్య వివాహ, కన్యాశుల్కం మొదలైన దురాచారాలను ఎత్తిచూపిన నాటకం- కాని కన్యాశుల్కం జీవితమంత పెద్దది. పకడ్బందీ కమైన నిర్మాణం, పాత్ర వైవిధ్యం, పాత్ర స్వభావాల సహజ చిత్రణ, హాస్యం, వ్యంగ్యం, కన్యాశుల్కం ప్రత్యేకతలు. పాత్రలు సజీవాలు; అవి సహజంగా మట్లాడతాయి. కట్టమంచి రామలింగారెడ్డి మాటలలో చెప్పాలంటే అది ఒక సోషల్ సెటైర్. కన్యాశుల్కం మొదటి అత్యాధునిక నాటకం. అభ్యుదయ ధ్వజం, ప్రజా నాట్యమండలితోనే మళ్ళీ వాస్తవ నాటకాలు వచ్చాయి. గురజాడ కవిత్వం తరువాత అభ్యుదయ సాహిత్యం వచ్చేంతవరకు మధ్యకాలంలో వచ్చిన కవిత్వానికి క్లాసికల్ స్పర్శ ఉన్నట్లుగానే కన్యాశుల్కం తరువాత ప్రజా నాట్య మండలి, నాటక కళాపరిషత్తు కాలంవరకు వచ్చిన నాటకాలలో క్లాసికల్ స్పర్శ కనిపిస్తాయి. 1892లో తొలి కన్యాశుల్క నాటకాన్ని విజయనగరంలోని జగన్నాథ విలాసినీ నాటక సమాజం ప్రదర్శించింది. 1886లో ఆంచల వేంకట సాంఖ్యాయన శర్మ 'మనోరమ' అన్న నాటకంలో స్త్రీ విద్య వస్తువు. కాళ్ళకూరి నారాయణరావు గారి 'వరవిక్రయం' (1923), 'చింతామణి' (1921), 'మధు సేవ' (1926) వరుసగా వరశుల్కం, వేశ్యాలోలత, మద్యపాన దురాచారాలు, దురలవాట్లను గురించి రాసిన నాటకాలు.

జాతీయోద్యమ కాలంలో కాల్పనిక ధోరణుల్లో నాటకాలు వచ్చాయి. వాటిల్లో ముఖ్యమైనవి పౌరాణిక నాటకాలు. పౌరాణిక ఇతి వృత్తాలతో నాటకాలు రాయటం ద్వారా జాతీయాభిమానాన్ని, దేశభక్తిని ప్రేరేపించే ప్రయత్నం

జరిగింది. ఒకే వస్తువుతో చాలామంది పౌరాణిక నాటకాలు రచించారు. కందుకూరి వారి 'సత్యహరిశ్చంద్రము' (1886), కొండుభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి 'గయోపాఖ్యానము', 'వస్త్రాపహరణము' (1886), ధర్మవరం రామకృష్ణమాచార్యులు 'పాదుకా పట్టాభిషేకము', 'ప్రమీలార్జునీయము' (1905), చిలకమర్తి లక్ష్మీనరసింహం 'ద్రౌపదీ పరిణయము' (1889), 'గయోపాఖ్యానము'(1889), 'శ్రీరామ జననము' (1889), బలిజేపల్లి లక్ష్మీకాంతం వారి 'సత్య హరిశ్చంద్రీయము' (1912), కాళ్ళకూరి నారాయణరావు 'పద్మవ్యూహం', ముత్తిరాజు సుబ్బారావు 'శ్రీకృష్ణ తులాభారము' (1920-22), పానుగంటి లక్ష్మీనరసింహారావు 'పాదుకాపట్టాభిషేకము', కొప్పరపు సుబ్బారావు 'తారాశశాంకము' తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగ విజయాలు' చాలా ప్రదర్శనలు జరిపి ప్రచారం పొందిన నాటకాలు. ఈ నాటకాలలో మధ్య మధ్యలు దేశభక్తిని గురించి ప్రబోధాలుంటాయి. కాళ్ళకూరి వారి 'పద్మవ్యూహం' లో కృష్ణుడు అర్జునుడికి స్వరాజ్యోద్యమం గురించి బోధించటం, తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగ విజయాలు'లో మాతృదాస్య విమోచనకు సంబంధించిన భావాలున్నాయి. భక్తి ప్రధాన నాటకాలలో కాల్పనికత ఎక్కువగా చోటు చేసుకుంది. పానుగంటి 'రాధాకృష్ణ', 'విప్రనారాయణ', ధర్మవరం గోపాలాచార్యులు 'రామదాసు', జయంతిభావ నారాయణ 'ప్రత్యక్ష నారసింహం' ఈ కోవకు చెందిన విశిష్ట నాటకాలు.

ఈ శతాబ్ది మొదటిదశలో బ్రిటిష్ వాళ్లపైన భక్తిని ప్రకటించే నాటకాలు కూడా వచ్చాయి. జార్జి పట్టాభిషేకోత్సవ సందర్భంగా శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి 'రాజభక్తి', తిరుపతి వేంకటకవుల 'శ్రీమదేడ్వర్డు పట్టాభిషేక' నాటకం వచ్చాయి.

జాతీయోద్యమ సందర్భంగా అంతకుముందూ చారిత్రక నాటకాలనేకం వచ్చాయి. వేదం వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయ' నాటకం 1897లో వచ్చింది. గురజాడ అప్పారావు ఈ నాటకాన్ని గురించి "మనదేశ చరిత్రలో గుండెలను కదలించే వృత్తాంతాన్నొక దాన్ని తీసుకొని దానిని నాటకంగా వెలయించేటప్పుడు యీ కవి సాహిత్యాత్మక దేశభక్తి పూరిత కాల్పనిక వాతావరణాన్ని సృష్టించుకొని, దానిని నేర్పుతో జయప్రదం చేశాడు". అని వ్యాఖ్యా

రించాడు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి 'బొబ్బిలి యుద్ధము', 'కళ్యాణి', 'రంగరాయచరిత్ర సమవాకారము', కేతవరపు రామకృష్ణశాస్త్రి 'శివాజీ విజయము', కొప్పరపు సుబ్బారావు 'రోషనార', దేవినేని వీరరాఘవకవి 'పృథ్వీరాజు విజయము', అవసరాల శేషగిరిరావు 'రాణి సంయుక్త', యలమర్తి శ్రీనివాసరావు 'పీష్వానారాయణరావు', కోలాచలం శ్రీనివాసరావు 'కర్ణాట రాజ్యపతనము లేక రామరాజు చరిత్రము' మొదలైన చారిత్రక నాటకాలు ప్రచారం పొందాయి. తిరుపతి వేంకటకవుల 'పండితరాజము' నాటకంలో లవంగియవని కాదని పూర్వజన్మలో బ్రాహ్మణ యువతి అని అంతవరకు ప్రచారంలో ఉన్న కథని మార్చి పండిత రాయల చరిత్రను చిత్రించారు. జాతీయోద్యమ కాలం నాటి వస్తువునే తీసుకొని అనేక నాటకాలు వచ్చాయి. వాటిల్లో ముఖ్యమైనవి దామరాజు పుండరీకాక్షుడు 'గాంధీ మహోదయము' లేక 'నవయుగారంభము', 'గాంధీ విజయము' లేదా నవయుగం', 'పాంచాల పరాభవము లేక పంజాబు దురంతము', శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి 'తిలక్ మహారాజ నాటకము', 'స్వరాజ్యోద్యమము', 'గాంధీ విజయధ్వజ నాటకము', ఆంధ్యాల అయ్యవారిశాస్త్రి 'బలీ ప్రభృతుల నిర్బంధము', బుద్ధవరపు పట్టాభిరామయ్య 'మాతృదాస్య విమోచనము'. గ్రంథి వేంకట సుబ్బయ్యగుప్త 'ఆంధ్రమాత', ద్రోణంరాజు సీతారామయ్య 'ఆంధ్ర పతనము', మసాన రామశాస్త్రి 'ఆంధ్ర మహానాటకము', గుళ్ళపల్లి నారాయణమూర్తి 'ఆంధ్రజ్యోతి', నందూరి బంగారయ్య 'ఆంధ్రతేజము' ఆంధ్ర రాష్ట్రోద్యమ ప్రతీకలుగా వచ్చిన నాటకాలు. ప్రథమ ప్రపంచ మహాయుద్ధం వస్తువుగా 'కలియుగ దుర్యోధన నాటకము'ను ధర్మవరం గోపాలాచార్యులు రచించారు.

సంప్రదాయాన్ని, మూఢ విశ్వాసాలను, పర్దాక్రమ ధర్మాలను, గత పౌరాణిక విశ్వాసాన్ని ప్రశ్నిస్తూ హేతువాద నాటకాలు వచ్చాయి. 'సంప్రదాయములను పురాణములు చరిత్రవంటివి కాన వాని యాధార్థ్యమును రూపుమాప వలయును'ను అని పురాణాలకు కొత్త వ్యాఖ్యానాలతో ఈ నాటకాలు వచ్చాయి త్రిపురనేని రామస్వామి చౌదరి 'కురుక్షేత్ర సంగ్రామము', 'శంబూక వధ', 'ఖూని' వంటి నాటకాలు హేతువాద దృష్టితో వచ్చిన నాటకాలు. హేతువాద నాటకాలలో పురుషాధిక్యతను నిరసించడం, నాస్తికత, స్త్రీ స్వేచ్ఛ, స్వేచ్ఛాప్రేమ మొదలైనవి కూడా వస్తువులయ్యాయి. ముద్దుకృష్ణ 'అశోకం' నాటకానికి పురుషులను పాలిస్తారు, స్త్రీలను వేరేసిరి అన్న విషయాన్ని ప్రతిఘటించటం ప్రధానమైనది,

ఆ మంచర్ల గోపాలరావు 'హిరణ్యకశిపుడు' నాటకంలో నాస్తికతా ప్రతిఘోషం ఉంది. గుడిపాటి వెంకటచలం 'చిత్రాంగి', 'శశాంక', 'జయదేవ', 'పురూరవ' మొదలైన నాటకాలు స్త్రీ స్వేచ్ఛ, అచ్ఛమైన ప్రేమ మొదలైన అంశాలను దృష్టిలో పెట్టుకొని రచించిన నాటకాలు. ఆత్మ సమర్పణ రూపమైన ప్రేమకు ప్రాధాన్యం ఈ నాటకాలలో ఉంది. తన భావాలకు అనుగుణంగా పాత్రలను మలిచాడు చలం. 'ప్రపంచంలోని అందానికి, ఆనందానికి కళ్ళు తెరవడం' అని ఆధ్యాత్మికతను నిర్వచించాడు.

1935 తరువాత ఆర్థికమాంద్యం, కొత్త సాంఘిక సమస్యలు, మధ్య తరగతి గృహస్థ జీవితం, అప్పులు, స్త్రీ సమస్యలు, దాంపత్య జీవిత సమస్యలు, దారిద్ర్యం, కరువు కాటకాలు మొదలైనవి నాటకాలకు వస్తువులయ్యాయి. ఆంధ్ర నాటక కళాపరిషత్తులో ప్రదర్శించిన నాటకాలలో ఇలాంటి వస్తువులే ఎక్కువ. ఆత్రేయ, పి. వి. రాజమన్నార్, భమిడిపాటి కామేశ్వరరావు, నార్ల వెంకటేశ్వర రావు, అనిసెట్టి సుబ్బారావు, పినిశెట్టి శ్రీరామమూర్తి, ప్రఖ్య శ్రీరామమూర్తి మొదలైన నాటక కర్తల్లో ఈ కాలంలో ప్రసిద్ధిపొందారు. ప్రజానాట్య మండలి కాలంనాటికి కార్మిక, కర్షక సమస్యలు, భూస్వాముల క్రౌర్యాలు, తిరుగుబాట్లు, వర్గ సంఘర్షణ మొదలైన సమస్యలతోపాటు నిజాం నిరంకుశ పాలన, ప్రపంచ మహాయుద్ధం, ఫాసిజం నాటకవస్తువులయ్యాయి. స్వాతంత్ర్యానంతర కాలంలో సుమారు 1950 తరువాత మధ్యతరగతి సమస్యలే నాటకాలలో ఎక్కువ కనిపిస్తాయి. నాటక ప్రదర్శన, నటన, పాత్రల సంభాషణా ప్రాధాన్యం—వీటిని సూత్రమే దృష్టిలో పెట్టుకొని ఎక్కువగా నాటకాలు రాయటం [illegible]. సాహిత్యంలో భాగంగా నాటకాలను చూడటం, సాహిత్య పత్రికలలో నాటకాల ప్రచురణ, సాహిత్యరంగంలో ఒక ప్రక్రియగా నాటకానికి సంబంధించిన ఎన్నిక తరువాతి కాలంలో పూర్తిగా తగ్గిపోయింది.

ప్రాచీన చిత్రకళతో పోల్చినప్పుడు ఆధునిక చిత్రకళ భారతదేశంలో అంతగా ఉన్నత స్థితికి చేరుకోలేదు. పందొమ్మిది, ఇరవయ్యవ శతాబ్దాల్లో ఫ్రాన్స్, ఇటలీ మొదలైన యూరోప దేశాల్లో ఆధునిక చిత్రకళా రూపాలు క్యూబిస్ట్, సర్రియలిస్ట్, అబ్స్ట్రాక్ట్ చిత్రకళా రూపాలు విస్తరించాయి. సి[illegible], నాగిన, దాలీ, పికాసో మొదలైన చిత్రకారులు ప్రపంచ ప్రసిద్ధి పొందారు. భారత

దేశంలో ఆంగ్ల విద్యా విధానంతోపాటు పాశ్చాత్య చిత్ర కళారీతులలో శిక్షణ మొదట కలకత్తాలో తరువాత మద్రాసులో ప్రారంభమయ్యాయి. ఉన్నంతలో చిత్రకళా విషయంలో బెంగాల్ ఆ తరువాత తెలుగు దేశాన్ని చెప్పుకోవలసి ఉంటుంది. మొదట పౌరాణిక, ఇతిహాస పాత్రలను, వ్యక్తులను చిత్రించిన రాజా రవివర్మవంటి వారి చిత్రాలలో పాశ్చాత్య శైలి కనిపించటం ఇ.బి.హావెల్ లాంటి పాశ్చాత్య కళాకారులకు నచ్చలేదు. 'భారతీయ చిత్రకళ - [illegible]' అన్న గ్రంథంలో ప్రాచీన, మధ్య యుగీన చిత్రశిల్ప కళల ప్రాశస్త్యాన్ని ప్రశంసించాడు. భారతీయ కళాకారులు పాశ్చాత్య శైలులను అనుసరించటాన్ని విమర్శించాడు. కలకత్తాలో హావెల్ వద్ద శిక్షణ పొందిన అవనీంద్ర నాథ్ ఠాగూరు పాశ్చాత్య శైలిలోని కళా సృష్టి చేశాడు, హావెల్ భారతీయ శైలిలో చిత్రకళలో శిక్షణ ఇవ్వటం ప్రారంభించింది ఆ తరువాత దేవీ ప్రసాదరాయ్ చౌదరీ లాంటి కొందరు ప్రాచ్య. పాశ్చాత్య శైలులను సమన్వయం చేసుగా చాలా మంది జాతీయ దృష్టితో భారతీయ శైలికే ప్రాధాన్యం ఇచ్చారు. హావెల్ మద్రాసులోని ప్రభుత్వ కళాశాలలో ప్రధానోపాధ్యాయుడుగా పనిచేశాడు. 1906 తరువాతనే ఏదో ఒక రూపంలో తెలుగు దేశంలో చిత్రకళ ప్రారంభమైంది. శిల్ప కళ నూరేళ్ల కాలంలో నామమాత్రా వశిష్టంగానే ఉంది. చిత్రకారులలోను కొందరు శిల్ప కళాకారులు కూడా ఉన్నారు.

తెలుగుదేశంలో నాటకకళ అంతగా చిత్రకళా ప్రచారం పొందలేదు. దానికి కారణం చిత్రకళ జనసామాన్యానికి సామూహికంగా అందుబాటులోనికి వచ్చే కళ కాకపోవటం కావచ్చు. అయినా ఉన్నంతలో చిత్రకళలో నూరేళ్ళ సామాజిక, రాజకీయ పరిణామాల ప్రభావం స్థూలంగానైనా గోచరించకపోదు. [illegible] మొదలైన ప్రకృతిని, సూర్యోదయ సూర్యాస్తమయాలను, చిత్రించి [illegible] రణ సాధనాలుగా వాటిని బ్రిటిష్ అధికారులకు అమ్ముకోవటం, వారి మూర్తి చిత్రాలనువేసి బహుమానాలు పొందటం ప్రారంభమైన చిత్రకళలో పునరుజ్జీవనంలో భాగంగా ప్రాచీన శిల్పాల, చిత్రాల ప్రతికృతుల తర్జుమా, పురాణేతిహాసాల వ్యక్తుల, సన్నివేశాల చిత్రణ, చారిత్రక పురుషుల నాయకుల మూర్తి కాల్పనిక దశలో భాగంగా ప్రకృతి చిత్రాలు, భావచిత్రాలు, [illegible] స్త్రీ చిత్రాలు, జానపదశైలిలో చిత్రణ, గ్రామీణ చిత్రణ పద్ధతులలో తెలుగుదేశపు చిత్రకళ

విస్తరించింది. నాటకకళను కూడా దృశ్య చిత్రణ రూపంలో అడవి బాపిరాజు లాంటివారు తోడ్పడ్డారు. నూరేళ్ళ చరిత్రలోని చివరి దశలో ఆధునిక పాశ్చాత్య చిత్రకళారీతులను అనుసరణగా నైరూప్య వైరూప్య బాతిక, గ్రాఫిక కళలు వచ్చాయి. నాటక కళలో, చలనచిత్రాలలో చిత్రకళ కూడా భాగం అయింది. స్వాతంత్ర్యానికి ముందు చిత్రకళా రంగంలో జాతీయోద్యమంతో భాగంగా భారతీయ కళాదృష్టి ఎక్కువగా కనిపిస్తుంది. దీనిని పోతెత్ పంతివారు తోడ్పడ్డారు. తెలుగుదేశంలో బందరు జాతీయ కళాశాల, మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ రాజమండ్రిలోని దామెర్ల రామారావు కళాశాల కళా శిక్షణ కేంద్రాలుగా ఉన్నాయి. 1941 నుంచి హైదరాబాద్‌లో కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ కూడా కళారంగంలో శిక్షణ ఇస్తూంది. స్వాతంత్ర్యానికి పూర్వం పత్రికలు కూడా చిత్రకళను ప్రోత్సహించాయి. ముఖ చిత్రాలుగా ప్రసిద్ధచిత్రాలు ఉండేవి. 'శిల్పి' 'తూలిక' లాంటి ప్రత్యేకంగా చిత్రశిల్ప కళలకు సంబంధించిన పత్రికలు చిత్ర, శిల్పకళలను ప్రోత్సహించాయి. మద్రాసు స్కూలు ప్రిన్సిపాల్‌గా ఉండిన దేవీప్రసాద రాయ్ చౌదరి దగ్గర దేవప్రసాద నారాయణరావు, ఎస్.ఎ.ఎస్. రామారావు మాధవపెద్ది గోఖలే, ముక్కాపాటి కృష్ణమూర్తి, హెచ్.వి. రామగోపాల్, వేలూరి రాధాకృష్ణ దశరథరామలింగేశ్వరరావు అరిటాకుల పైడిరాజు మొదలైనవారు, బందరు జాతీయ కళాశాలలో ప్రత్యేకాహ్వానితులైన ప్రమోదకుమార్ ఛటోపాధ్యాయునొద్ద అడవి బాపిరాజు, గుర్రం మల్లయ్య, కౌతా రామమోహనశాస్త్రి, ఆనంద మోహనశాస్త్రి, నేటూరి రామమూర్తి మొదలైనవారు చిత్రకళారంగంలో ప్రత్యేక శిక్షణపొందారు. 'భారతి' పత్రికకు శిష్యులతోనే బొమ్మలు వేయించేవాడు ప్రమోద్‌కుమార్ ఛటోపాధ్యాయ నందలాల్ బోస్ శిష్యులైన వి.ఆర్. చిత్ర ఆపాస్ కురేర పరిశ్రమ దశలో ప్రత్యేక శిక్షణ పొందారు.

బ్రిటిష్ పాలకులు ప్రాచీన శిల్పకళా కేంద్రాలైన దేవాలయాలను అజంతా, అమరావతి, నాగార్జునకొండ, లేపాక్షి, హంపీ విజయనగరం మొదలైన వాటిని పరిశోధించి, త్రవ్వకాల ద్వారా ఉద్ధరించి, శుభ్రపరచి పరిరక్షిత కేంద్రాలుగా చేసిన తరువాత అక్కడి కుడ్య చిత్రాలను, చిత్రఫలకాలను, శిల్పాలను తర్జుమా చేయటంగా చిత్రకళలో పునరుజ్జీవనం ప్రారంభమైంది. అజంతా చిత్రాలు, ఎల్లోరా శిల్పాల తర్జుమాలు చాలావచ్చాయి. అవనీంద్రనాథ్ ఠాగూర్, ఆయన శిష్యుడు నందలాల్ బోస్‌లతో తర్జుమాయుగం ప్రారంభమైంది. హోతా

అష్మకర్మ పాషాణ్యాలు రూపశిల్పాలను తయారు చేసేవారు. పి.టి.రెడ్డి లాంటి చిత్రకారులు కూడా ఆధునిక శిల్పాలు తయారుచేశారు.

పందొమ్మిదవ శతాబ్దంలో జానపద కళా, లలిత కళగా ఉన్న చిత్రకళ చేతి పనిగానూ, వర్తక కళగా మారిపోయింది. యూరోపా వర్తక సంఘాల ప్రోత్సాహంతో వ్యాపార కళగా ఏలూరు, బందరులలోని కలంకారీ పరిశ్రమ నిలదొక్కుకుంది. పట్టుపై బంగారు జలతారుతో లతలూ, బొమ్మలూ వేయటం వ్యాపారానికి బాగా పనికి వచ్చింది. కొండపల్లి బొమ్మలూ, విశాఖలో ఏనుగు దంతపు బొమ్మలు కూడా ఈ రూపంలోనే అభివృద్ధి చెందాయి. గ్రామీణ ప్రాంతాల్లో చేనేతల బొమ్మలు, కర్ర బొమ్మలు, మట్టి బొమ్మలు, లక్క-పిడతలు చేతిపని పరిశ్రమలుగా కనిపిస్తాయి. జానపద కళారూపాలలో తోలు బొమ్మలాటను ఉపయోగించే బొమ్మలలో చిత్రకళా నైపుణ్యం తొంగిచూస్తుంది. తోలు బొమ్మలాటలో ప్రత్యేకమైన దీపాలను వాడుతారు. తోలుబొమ్మలుగా చిత్రించిన పౌరాణిక వ్యక్తి చిత్రాలను దీపానికి అడ్డంగా పెట్టినప్పుడు ఆ పాత్రల రూపాలు మనకు స్పష్టంగా గోచరిస్తాయి. దృశ్య, చిత్రకళ సమన్వయ రూపమైన జానపద కళగా ఈ తోలుబొమ్మలాటలు సామాన్యుల వినోద సాధనంగా నిలిచింది.

సంగీత, నృత్య కళలు పునర్వికసనం సంప్రదాయ కళల పునరుద్ధరణ రూపంలో జరిగింది. త్యాగయ్యలాంటి భక్త కవులు అభివృద్ధి చెందిన శాస్త్రీయ సంగీతం, రాజుల పోషణలేని నూరేళ్ళలో సంస్థానాధీశుల ద్వారా, సమాజాల ద్వారా పునరుద్ధరింపబడింది. వీణలాంటి సంప్రదాయ సంగీత సాధనాలతో పాటు ఫిడేలు, హార్మోనియం మొదలైన పాశ్చాత్య వాద్య సాధనాలు కర్ణాటక సంగీత రూపంలోని శాస్త్రీయ సంగీతంలో చోటు చేసుకున్నాయి. మతపరమైన ఉత్సవాలలో, వివాహాలలో, ఇతర సామూహిక ఉత్సవాలలో శాస్త్రీయ సంగీతజ్ఞులు పాల్గొనేవారు. పందొమ్మిదవ శతాబ్ది చివరి భాగంలో మద్రాసులో సంగీత శాస్త్ర పండితునిగా ప్రసిద్ధుడైన తచ్చూరి సింగరాచార్యులు తెలుగువాడు. 1919 లో విజయనగరంలో సంగీత కళాశాల స్థాపన జరిగింది. ప్రసిద్ధ వయొలినిస్టు ద్వారం వెంకటస్వామి నాయుడు గాయకుడు, హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు ఈ కళాశాలలో పని చేశారు. బొబ్బిలి కేశవయ్య, వీణ వేంకట

రమణదాసు, తుమురాడ సంగమేశ్వరశాస్త్రి గాయకులుగా, వైణికులుగా పేరు పొందారు. హరి నాగభూషణం ప్రఖ్యాత హార్మోనిస్టు సంగీత శాస్త్రజ్ఞులైన రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ అన్నమాచార్య కీర్తనలకు స్వర కల్పన చేశారు. పర్వతనేని వీరయ్య చౌదరి క్షేత్రయ్య పదాలకు వ్యాప్తి చేశారు. స్వాతంత్ర్యోద్యమంతోపాటు జాతీయ గీత, గేయ రచనలు రావటంతో శాస్త్రీయ సంగీతంతో పాటు లలిత సంగీతం వ్యాపించింది. రేడియో, సినిమా, విద్యాలయాల సాంస్కృతికోత్సవాలు లలిత సంగీతం వ్యాప్తికి దోహదం చేశాయి. జానపద, శాస్త్రీయ సంగీతాల సమ్మేళనమే లలిత సంగీతం. ఛందోబద్ధ కవిత్వం నుంచి భావ ప్రధానమైన కవిత్వంలోకి మార్పు వచ్చినట్లుగానే సూటిగా హాయిగా సులలితంగా సాగే లలిత సంగీతం ప్రోత్సాహిక కళగా వ్యాపించింది. తెలుగు దేశపు సంప్రదాయ కళ కూచిపూడి నృత్యానికి ప్రచారం ఉద్యమంగా సాగింది. చింతా వెంకట్రామయ్య, వెంపటి వెంకటనారాయణ, వేదాంతం లక్ష్మీనారాయణ నాట్య నిర్వాహకులుగా పేరుపొందారు. జానపద కళారీతులు, లలిత నృత్య గీరీతులు కూడా ప్రోత్సాహిక కళలుగా వ్యాపించాయి ఒకప్పుడు దేవదాసీలకు, వేశ్యలకు పరిమితమైన నృత్య కళను అందరూ నేర్చుకుని ప్రదర్శించడం ఈ కాలంలో జరిగిన మార్పు. సంగీత, నాట్యకళలతోపాటు నాదస్వరం, డోలు వాద్యం కూడా అభివృద్ధి చెందాయి. లలిత సంగీతం, జానపద నృత్య రీతులు తప్పిస్తే తక్కినవి మతాన్ని ఆధారం చేసుకొనే వ్యాపించాయి.

మతాన్నే ఆధారంచేసుకొని ఈ కాలంలో విస్తరించిన మరొక కళారూపం 'హరికథ'. గ్రామాలనుంచి పట్టణాలవరకు అన్ని వర్గాలవారిని ఆనందపరిచే అన్ని ప్రాంతాలలో వ్యాపించిన కళాప్రక్రియ హరికథ. సాహిత్యం, సంగీతం, పురాణ కాలక్షేపానికి పర్యాయంగా కథా కథనం, కొంతనృత్తం కలిసిన కళల సమాహారరూపం హరికథ. హరికథలోని వస్తువు సాధారణంగా పౌరాణికమో, ఇతిహాసికమో అయి ఉంటుంది హరికథ పితామహులుగా పేరుపొందిన శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గొప్ప గాయకుడు, స్వరశిల్పి కూడా ధ్రువచరిత్ర, అంబరీష చరిత్రము, గజేంద్ర మోక్షము, జానకీ శపథము, వసిష్ఠ చరిత్ర, భీష్మ చరిత్ర, మార్కండేయ చరిత్రము, రుక్మిణీ కళ్యాణము, హరిశ్చంద్రోపాఖ్యానము మొ॥ హరికథలను స్వయంగా రచించి, హరికథా రూపంలో పురాణ కథల ప్రవచనాలే ఎక్కువగా జరిగినా సమకాలీన ఇతి

వృత్తాలు ప్రపంచ రాజకీయాలు, జాతీయోద్యమం మొదలైన ఇతివృత్తంతో కూడా హరికథలు వచ్చాయి. పుట్టపర్తి నారాయణాచార్యులు గాంధీ జీవిత చరిత్రను, బోస్ జీవితచరిత్రను హరికథగా మలిచారు. గాంధీ, శివాజీ, సుభాస్ చంద్రబోసులు వస్తువుగా చాలా హరికథలుగా వచ్చాయి. నెపోలియన్, హిట్లరులను గురించిన హరికథలు కూడా వచ్చాయి. తుకారాం, రామదాసు, గోరాకుంభార్, కుచేల మొదలైన భక్తుల కథలను చాలామంది హరికథలుగా రాసారు. వేమన, వీరబ్రహ్మంలు రాణీ సంయుక్తలాంటి చారిత్రక పాత్రలు కూడా హరికథా వస్తువులుగా కనిపిస్తారు. క్రైస్తవ మతానికి సంబంధించిన హరికథ లనేకం వచ్చాయి. ఆశు కవిత్వం అవధాన కవిత్వంలాగే ఆశు హరికథ కథనం, నాట్యావధానం కూడా ఈ కాలంలో వచ్చాయి.

1857–1956 మధ్య నూరేళ్ళకాలంలో ప్రాచీన భారతీయ, పాశ్చాత్య విధానాల మిశ్రణరూపంలో మొదలై తరువాత పూర్తిగా ఆధునికతను సంతరించుకున్న కళలు, జనసామాన్యం దగ్గరికి వెళ్ళగలిగిన కళలు, జానపద కళలు ఇతర సామాజిక, రాజకీయ ఉద్యమాలతో ముడిపడి పరిణామం చెందాయి. సంగీతం, నృత్యం మొదలైన కళలు సంప్రదాయరీతుల పునర్వికసనంగా నిలదొక్కుకోగా, చిత్రకళలాంటి కళలు ఆధునిక లక్షణాలతో రూపుదాల్చాయి.

## సంప్రదించిన గ్రంథాలు, సంపుటాలు, సంచికలు

| | |
|---|---|
| అప్పారావు, పి.ఎస్.ఆర్.<br>23-12-1967 | తెలుగు నాటక వికాసము, హైదరాబాదు :<br>రచయిత |
| నాగభూషణశర్మ, మొదలి (సం.)<br>1980 | నూరేళ్ళ తెలుగు నాటకరంగం,<br>హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సంగీత<br>నాటక అకాడమీ |
| రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని<br>20-11-1969 | ఆంధ్ర నాటకరంగ చరిత్ర మద్రాసు :<br>రచయిత |
| ప్రసాదరావు, చ. సాసి (సం.)<br>1970-71 | కళ, 3,4 సంపుటాలు, హైదరాబాదు :<br>భారత నాటక కళా పరిషత్,<br>తెలుగు విజ్ఞాన సర్వస్వము. 3, 4 భాగాలు<br>హైదరాబాదు : తెలుగుభాషా సమితి |

# ముఖ్యమైన తప్పొప్పుల పట్టిక

| పేజీ | పం_క్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| 7 | 21/20 | Social Darvionism | Social Darwinism |
| 17 | 23 | Home Rule reague | Home Rule League |
| 21 | 15 | రా జకీయాలలో | రాజకీయాలతో |
| 22 | 16 | భయంరరవాదులై | భయంకరవాదులై |
| 22 | 22 | విప్లవకారులు | విప్లవగారుల |
| 23 | 9 | దేశంమీద | దేశంలోని |
| 26 | 5 | [ఫాసిస్టులకు | ఫాసిస్టులకు |
| 27 | 8 | [illegible] | [illegible] |
| 32 | 2 | ఉన్నవ లక్ష్మీనారాయణ | ఉన్నవ లక్ష్మీనారాయణ |
| 36 | 21 | వరహాల[illegible] | వరహాలకి |
| 38 | 1 | [illegible] | [illegible] |
| 39 | 7 | [illegible] | [illegible] |
| 39 | 22 | [illegible] | [illegible] |
| 40 | 28 | [illegible] | [illegible] |
| 49 | 2 | Dufunttons | Definitions |
| 49 | 3 | Phylosophy | Philosophy |
| 49 | 5 | Random Dictionary | The Random House Dictionary |
| 50 | 3 | [illegible] | [illegible] |
| 53 | 21 | [illegible] | కలిగించటం |
| 57 | 21 | [illegible] | తెలుగు పరిశోధకులకు |
| 57 | 24 | సాస్త్రిగారి | శాస్త్రిగారి |
| 61 | 6/7 | మాలిక | [illegible] |

